# శివానందలహరి



వివరణము

**డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి,** M.Sc., M.Phil., Ph.D.
(రిటైర్డ్) రీడర్ & భౌతికశాస్త్ర విభాగాధ్యక్షులు
టి.జె.పి.యస్. కళాశాల, గుంటూరు




జగద్గురు పీఠము - గుంటూరు శాఖ
(The World Teacher Trust - Guntur Branch)
గుంటూరు - 522 002
ఫోన్ : 233995

# శివానందలహరి

ప్రథమ ముద్రణ డిశెంబర్ 2001



ప్రతులకు

1. దీ వరల్డ్ టీచర్ ట్రస్ట్
   H/o. డా.జి.ఎల్.ఎన్.శాస్త్రి
   5-10-4, 2/9, బ్రాడీపేట
   గుంటూరు - 522 002
   ఫోన్ నెం. (0863) 233995

2. దీ వరల్డ్ టీచర్ ట్రస్ట్
   45-40-36/1, అక్కయ్య పాలెం
   విశాఖపట్టణము - 530 016
   ఫోన్ నెం (0891) 565291

**వెల : రు.95/-**

డి.టి.పి. : క్రియేషన్ గ్రాఫిక్స్,
2/11, బ్రాడీపేట, గుంటూరు-2 ఫోన్ :250885

ముద్రణ : విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్,
గుంటూరు -2, ఫోన్ : 242345

# విషయ సూచిక

# ముందుమాట

వాస్తవానికి ఈ శివానందలహరి వివరణ 2001 జనవరి నాటికే పూర్తయి ఆవిష్కరణ కావల్సింది. కాని, ఎందుకనో అలా అలా వాయిదాపడుతూ పడుతూ ఒక సంవత్సరం కాలం ఆలస్యమైంది. మొదటి ఇరవై శ్లోకాలకు వివరణ పూర్తయిన తరువాత రచన ఆగిపోయింది. '2001 సంవత్సరం అక్టోబర్ 17న ప్రారంభమయ్యే శ్రీలలితాదేవ్యారాధనోత్సవాలు, 4.11.2001న గుంటూరులో జరిగే గురుపూజా మహోత్సవం పూర్తవంగానే శివానందలహరి వివరణ పూర్తిచేసి 2002 జనవరి సింహాచలంలో జరిగే గురుపూజలలో ఆవిష్కరణ జరగాలి' – అనే సంకల్పం కలిగింది. కరపత్రం మీద ఈ విషయం 'కమిట్' అయితే గాని వేడి పుట్టి దీక్షగా కూర్చొని పుస్తకం పూర్తి చెయ్యడం జరగదని – కరపత్రం ప్రచురించి, WTT నా వాణి మాసపత్రికలో గూడా ప్రకటించడం జరిగింది.

## శుభాంతం

4.11.2001న గుంటూరులో గురుపూజామహోత్సవం పూర్తయిన తరువాత 8.11.2001 నుండి జ్యోతిర్విద్యాలయ సంబంధిత వ్యవహారాలను, ఉపన్యాసాలను, ప్రయాణాలను తాత్కాలికంగా రద్దుచేసి దీక్షగా కూర్చొని వ్రాయడం ప్రారంభిస్తే – సరిగ్గా 30.11.2001 కార్తీక పూర్ణిమ నాటికి వివరణ పూర్తయింది. ఆ రోజే అక్కయ్యగారు (అస్మద్గురువరేణ్యులైన, మాస్టర్ EK గారి సతీమణి) గూడా మా ఇంటికి వచ్చి ఆశీర్వదించారు. ఆరోజే – అభిషేకం, పూర్ణిమాధ్యానం గూడా జరిగాయి. రచనా కార్యక్రమం ఈవిధంగా శుభాంతం అయింది. ఈ రచనాకాలంలో చాలా అనుభూతులు కలిగాయి. 'అశనంగరళం...' (87వ శ్లోకం) 'యదాకృతాంభోనిది....' (88వ శ్లోకం) లాంటి వాటికి వివరణ వ్రాస్తున్నప్పుడు, కార్తీక పూర్ణిమనాడు 'పీఠిక'

వ్రాస్తున్నప్పుడు గూడా వెనుక ఎవరో ఉండి వ్రాయించిన అనుభూతి కలిగింది. ఈ విధమైన అనుభూతులు తెల్లవారుఝామున 4.00 నుండి 5.30 మధ్యకాలంలోనే కలిగాయి. అవి పూర్తిగా వ్యక్తిగతం - కాబట్టి వాటి వివరాలు వ్రాయడం లేదు.

## సౌందర్యలహరి, శివానందలహరి

1972 సంవత్సరంలో సౌందర్యలహరి శ్లోకాలకు తెలుగు అనువాద పద్యాలు వ్రాయడం జరిగింది. ఆ పద్యాల్లో కొన్నింటిని గురుదేవులు ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు చూచి బాగాన్నాయని అభినందించి, ఆశీర్వదించి - 'ఇలాగే ముందు ముందు శివానందలహరి గూడా అనువదించు' అని ప్రోత్సహించారు. సౌందర్యలహరిలోని శ్లోకాలన్నీ శిఖరిణీ వృత్తాల్లోనే వుంటాయి. అందుకని నేను గూడా ఆ శ్లోకాలన్నిటిని వృత్తపద్యాల్లోనే అనువదించాను. కాని, శివానందలహరిలోని అన్ని శ్లోకాలు ఒకే ఛందస్సులో ఉండవు, కొన్ని శిఖరిణీ వృత్తాల్లో, కొన్ని ఆర్యావృత్తాల్లో, మరి కొన్ని శార్దూల వృత్తాల్లో ఇలా వేరు వేరు ఛందస్సుగల వృత్తాల్లో ఉంటాయి. అందుకే నేను గూడా సీస పద్యాల్లోను, చంపక, ఉత్పల, మత్తేభాది వివిధ ఇతర వృత్తపద్యాల్లోను అనువదించాను. పెద్ద పెద్ద శ్లోకాలను సీసపద్యాల్లో అనువదించాను. సీసపద్యంలో ఒక సదుపాయం ఉంటుంది. శ్లోకంలో సంక్షిప్తంగా చెప్పిన విషయాలను చాలా విడమరచి విపులంగా చెప్పగల అవకాశం ఉంటుంది. దానికి తోడు పద్యం చదవంగానే శ్లోకభావం తేలిగ్గా అర్థమయే రీతిలో వ్రాయడం జరిగింది. కావాలనే చాలా సరళమైన భాషలోనే వ్రాయడం జరిగింది. ఈ సంగతి పద్యాలను చదువుతుంటే మీకే తెలుస్తుంది.

మొదటి ఇరవై శ్లోకాలకు వివరణ ముందు సరళగ్రాంథిక భాషలో వ్రాశాను. మధ్యలో దాదాపు సంవత్సరకాలం అవరోధం కలిగిన తరువాత చివరి 80 శ్లోకాలకు వివరణ వ్రాశాను. ఈ 80 శ్లోకాల వివరణ తేలిగ్గా

అర్థమయే శిష్ట వ్యవహారిక భాషలో (పత్రికల భాష) వ్రాశాను. అటుపైన ముందు వ్రాసిన 20 శ్లోకాల వివరణ భాషను గూడా వ్యావహారిక భాషలోకి మార్చేశాను. గ్రాంథిక భాషలో కన్న వ్యావహారిక భాషలో ఒక ఊపు, వేగము, సూటితనము ఉంటాయి. ఈ లక్షణాలు గల భాష అధునిక పాఠకుణ్ణి తొందరగా ఆకట్టుకుంటుంది. 'చదవడం ఇబ్బందిగా ఉండి పుస్తకం చదవలేకపోయాను' అనే విమర్శ, ఫిర్యాదు రాకుండా వుండేందుకు ఇలా వ్రాశాను.

## మౌళికమైన భేదం

సౌందర్యలహరి ఒక మంత్ర యంత్ర తంత్ర యోగ శాస్త్ర సమన్వయమైన గ్రంథం. ఎన్నో సాంకేతిక శాస్త్ర జ్ఞాన కుండలినీయోగ విశేషాలుంటాయి. కాని, శివానందలహరిలో అటువంటివి వుండవు. పూర్తిగా భక్తిపరమైనవిషయాలే వుంటాయి. అయితే ఆలంకారికమైన కావ్యలక్షణాలు మాత్రం ఉంటాయి. యోగశాస్త్ర జ్ఞానసముపార్జనకు స్వప్రయత్న కృషి, దీక్ష, జిజ్ఞాస, పట్టుదల చాలా అవసరం - అందుకే సౌందర్యలహరి కొంత జటిలమైనది. ఇది మన బుద్ధి నైశిత్యానికి పని చెప్పే స్తోత్రం. భక్తికి సమర్పణభావం శరణాగతి వుంటే చాలు. అందుకనే శివానందలహరి సరళంగా ఉంటుంది. అన్నీ సూటిగా భక్తిని గూర్చి చెప్పే శ్లోకాలే వుంటాయి. దీన్లో స్వప్రయత్నకృషి కంటె దైవానుగ్రహానికి ఎదురు చూడ్డమే ఎక్కువ వుంటుంది.

## ప్రస్తుతవ్యాఖ్య ప్రత్యేకతలు

శివానందలహరికి తెలుగు అనువాదాలు చాలా వుండి ఉండవచ్చు. ఎందుకంటే - శివుడంటే ఆంధ్రులకు ఎక్కువ ఇష్టం. అయితే అన్ని అనువాదాలను నేను చూడలేదు, చదవలేదు. రెండు వ్యాఖ్యానాలను నేను చదవడం జరిగింది. ఆ వ్యాఖ్యానకర్తల పేర్లను నేను కృతజ్ఞతల శీర్షికలో వ్రాసి కృతజ్ఞతాపూర్వక వందనాలు సమర్పించుకున్నాను.

జగన్నేతకు సంబంధించిన ఈ శివానందలహరిలో 100 శ్లోకాలు వివిధ వృత్తాల్లో ఉంటాయి. వ్యాఖ్యానంలో 1) సంస్కృత శ్లోకం, 2) అనువాద పద్యం, 3) టీక, 4) తాత్పర్యము, 5) వివరణ, 6) మళ్లీ వివరణలో కొన్ని

శ్లోకాలకు ఉపశీర్షికలుగా సందర్భోచిత వివిధ విషయాలు – సరళమైన వచనంలో వుంటాయి. విషయసూచికలో ప్రతిశ్లోకానికి శ్లోకసంఖ్య, దానికి ఎదురుగా ఆ శ్లోక వివరణ ప్రారంభమైన పుటసంఖ్య గూడా తెలుపబడింది. పుస్తకం చివర 'అకారాది శ్లోక సంఖ్యానుక్రమణిక పట్టిక' గూడా తెలుపబడింది. పుస్తకం అంతా వెదుక్కోవలసిన పనిలేకుండా – శ్లోక ప్రథమాక్షరాన్ని బట్టి వెంటనే – ఆయాశ్లోక వివరణ ఏ ఏ పుటలలో ప్రారంభఅయ్యేది తేలిగ్గా తెలుసుకునేందుకు – ఈ పట్టిక ఉపకరిస్తుంది.

**ఆశీస్సులు**

ఈ శివానందలహరి అనువాద పద్యాలు కొన్ని నేను వృత్తి ధర్మాన్ని నిర్వర్తించిన గుంటూరులోని టి.జె.పి.యస్. కళాశాల ద్వితీయ వర్ష (1973) మాగజైనులో ప్రచురింపబడ్డాయి. మా నాన్నగారు దేవతలందరినీ ఆరాధించినా ఆయనకు శివపరమైన భక్తి కొంచెం ఎక్కువగా ఉండేది. నేను 1973 సంవత్సరములో వ్రాసిన అనువాద పద్యాలను చదివి ఆనందించి, 'ఒరేయ్ ! ఈ పద్యాలు చాలా సులువుగా, సూటిగా ఉన్నాయిరా' అని అభినందించి ఆశీర్వదించారు. ఇది జగత్పితకు సంబంధించిన స్తోత్రం అవడం వల్ల, మా నాన్నగార్కి శివుడంటే ఇష్టం అవడం వలన – ఈ శివానందలహరి వివరణ గ్రంథాన్ని మా నాన్నగారికే అంకితం చేశాను. కేవలం శంకరుల కృప, గురుదేవుల అనుగ్రహపూర్వక ఆశీస్సులు, పితృపాదుల వాత్సల్యపూర్వక ఆశీర్వాదం, అన్నింటినీ మించి శివానుగ్రహం – ఇవన్నీ నన్నీ పనికి పురిగొల్పి నన్ను కృతకృత్యుణ్ణి చేశాయి. చివరకు ఒకే ఒక్కమాట. "పీఠిక" చదివిన తర్వాతనే వివరణ చదవండి. శివానుగ్రహాన్ని పొందండి. ఈ వివరణలో ఏవైనా దోషాలుంటే పెద్దలు వాటిని తెలిపితే ముందు ముద్రణలో సవరించు కుంటానని సవినయంగా తెలియజేసుకుంటున్నాను.

గుంటూరు
26-12-01
వైకుంఠ ఏకాదశి

ఇట్లు
–జి.ఎల్.ఎన్. శాస్త్రి

# కృతజ్ఞతలు

సత్కార్య నిర్వహణకు సానుకూలమైన శరీరాన్నిచ్చిన మాతృమూర్తికి, సంప్రదాయ సంస్కృతీ సంస్కారాలనిచ్చి మానసిక వికాసాన్ని కలుగజేసిన పితృపాదులకు, ఈ తెలుగు వ్యాఖ్యానానికి మూలమైన సంస్కృత శివానందలహరి స్తోత్రకర్త అయిన ఆదిశంకరభగవత్పాదుల చరణకమలాలకు, – అద్వైత దృష్టితో శివకేశవ లలితాదేవ్యాదులను అర్చించి వారి స్తోత్రాలను రచించి వివరించి, తరించిన, నాకు వివేక జ్ఞానాలనిచ్చి బుద్ధిని వికసింపచేసిన – గురువరేణ్యులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి పాదారవిందములకు సభక్తి ప్రణామములు.

సంస్కృత శ్లోకాలకు నేను అనువదించిన తెలుగు పద్యాలను కూలంకషంగా చదివి అవసరమైన మేరకు సవరణలను సూచించి సరిదిద్దడంలో సహకరించడమే కాకుండా, ఈ వివరణపై తమ అభిప్రాయాన్ని గూడా "శాస్త్రీయం సశాస్త్రీయం" అనే శీర్షికతో అతి తక్కువకాలంలోనే వ్రాసి ఇచ్చిన శ్రీ పరమాత్ముని దత్తప్రసాద్‌గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు, ధన్యవాదములు.

కీర్తిశేషులు నారాయణభట్ల శ్యామసుందర్ – సుశీల పుణ్యదంపతి జ్ఞాపకార్థం వారి కుమారులు చి.సుభాష్ చంద్ర, చి.రవికిరణ్ ఈ పుస్తక టైటిల్ పేజీ ముద్రణ ఖర్చుకు విరాళాన్ని భక్తితో సమర్పించారు. సుభాష్ గోదావరిఖని పట్టణంలో ఇంజనీరింగ్‌గా పనిచేస్తున్నాడు. చి.రవికిరణ్ దుబాయ్‌లో ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. వీళ్లిద్దరూ క్రిందటిసారి 'సౌందర్యలహరి' పుస్తకానికి గూడా టైటిల్ పేజీ ముద్రణకు సహకరించారు. ఈవిధంగా తల్లిదండ్రులను సంస్మరిస్తూ, సహకరించిన ఈ ఇరువురి సోదరులకు, వీరి కుటుంబ సభ్యులకు జగజ్జననీ జనకుల అనుగ్రహం, పరమగురువుల శుభాశీస్సులు నిరంతరము వుండుగాక !

మా జగద్గురుపీఠం గుంటూరుశాఖ నిర్వహించే ప్రధానమైన కార్యక్రమా లన్నిటిలోను అత్యంత శ్రద్ధాభక్తులతో పాల్గొంటూ, గురుపూజా మహోత్సవాల నిర్వహణ, పుస్తకముద్రణాది సత్కార్యాలకు ఆర్థికంగా దోహపడుతూ, అన్ని విధాలా ఆదుకుంటున్న శ్రీదేశిరాజు పార్థసారధి - శ్రీమతి శ్రీలక్ష్మి దంపతికి, శ్రీ కె.వెంకుబాబు - శ్రీమతి లక్ష్మీకాంతం దంపతికి - వారి వారి కుటుంబ బంధుమిత్రులకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు, కృతజ్ఞతలు.

ఈ శివానందలహరి పుస్తకం మా నాన్నకు అంకితం చేస్తున్న సందర్భాన్ని పురస్కరించుకొని - మా వంశం గుఱించి, మా తాత ముత్తాతల గుఱించి, మా నాన్నగారి గురించి నాకు తెలియని విషయాలను తెలియపరచి సహకరించిన మా అన్నయ్యలకు, వదినలకు, తమ్ముళ్లకు, అక్కయ్యలకు, బావలకు, చెల్లెలికి పుస్తక ముద్రణకు ఆర్థికంగా గూడా సహకరించిన మా పెద్దతమ్ముడు చి.ప్రభాకరశర్మకు, పెద్దన్నయ్య ద్వితీయ కుమారుడు చి.రమాకాంత్‌కు - వారి వారి కుటుంబసభ్యులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా జగద్గురుపీఠం గుంటూరుశాఖ కార్యక్రమాలను అభిమానిస్తూ ఆదరిస్తూ ఈ పుస్తకప్రచురణకు ఆర్థికసహాయాన్ని అందించిన - గుంటూరు పట్టణ వాస్తవ్యులు శ్రీ ఐనంపూడి వెంకట్రామయ్య గారికి, నకిరేకల్ వాస్తవ్యుడు చి.ఎమ్.ఆంజనేయులుకు, హైదరాబాదు వాస్తవ్యులు - శ్రీ కె.వి.ఎల్.ఎన్. రావు గారికి, చి.పి.మురళీకృష్ణకు హైదరాబాద్‌లోని కనకదుర్గా సేవాసమితివారికి, గుంటూరు వాస్తవ్యులు వేదాంతం వేంకటేశ్వర్లు గారికి, ఆర్.వి.బి. రామలింగేశ్వరరావు గారికి, గురిజాల లక్ష్మీనరసమ్మ గారికి, ఒంగోలు వాస్తవ్యులు శ్రీ ఎమ్.హృషీకేశరావు - శ్రీమతి సులోచనదంపతికి, చినఓగిరాల వాస్తవ్యురాలు చి.ఓగిరాల దుర్గామహాలక్ష్మికి, పశ్చిమబెంగాల్ ఖరగ్‌పూర్ వాస్తవ్యులు శ్రీ జి.ఎస్.ఎన్. మూర్తి గారికి, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర బచేలీ పట్టణ వాస్తవ్యురాలు శ్రీమతి వై. రమాదేవికి, Chiltern Drive (Fremont) విదేశ వాస్తవ్యులైన

శ్రీ ప్రభాకర్ నెప్పల్లి, శ్రీమతి పద్మానెప్పల్లి దంపతికి – నా తరపున, మా సంస్థ తరపున కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు.

ఈ పుస్తక ప్రచురణ పూర్వ మూల్యాలను డిశెంబర్ 10వతేదీలోపుగా అందజేసిన వారికి, వాటిని స్వీకరించి నాపై ఎంతో అభిమానంతో అందజేసి, ప్రేమతో సహకరించిన శ్రీ పి.వి. రమణయ్య (హైదరాబాదు), శ్రీ ఎస్.ఎస్.ప్రసాద్ (హైదరాబాద్), శ్రీ జె.రఘునాథశాయి (రాజమండ్రి), శ్రీ ఆర్. కోటేశ్వరరావు (మచిలీపట్నం), శ్రీ జి.ఎస్.ఎన్.మూర్తి (ఖరగ్‌పూర్), శ్రీమతి బి. సీత (విజయవాడ), శ్రీ గోగినేని కనకయ్య గారు (గుంటూరు) – వీరందరికీ నా హృదయపూర్వక శుభాకాంక్షలు, కృతజ్ఞతలు.

నేను ఈ పుస్తకానికి వ్యాఖ్యానం వ్రాస్తుంటే – దానికి వెంట వెంటనే స్పష్టమైన అందమైన అక్షరాలతో శుద్ధప్రతిని తయారుచేస్తూ, ప్రూఫులు దిద్దడంలో సహకరిస్తూ 'సహధర్మచారిణి' అన్నపదాన్ని సార్థకం చేసుకుంటున్న నా శ్రీమతి చి.సౌ. విష్ణుప్రియకు (మీనాక్షికి), చక్కని టైటిల్ పేజీ నమూనా తయారు చెయ్యడంలోనే కాక, దాని ముద్రణలోను, చక్కని జ్ఞాపికలను ఎప్పటికప్పుడు తయారు చేసి ఇవ్వడంలోను లోగడ సూరపరాజు హనుమాన్ ప్రసాద్ సహకరించిన విధంగానే – తనవంతు బాధ్యతను నిర్వహిస్తున్న చి.ఎమ్.వి. రమణకుమార్‌కు, ముఖ్యంగా అతని స్నేహితుడు చి.టి. శ్యామ్‌నారాయణకు, సకాలంలో గ్రంథప్రతిని డి.టి.పి. చేసి ఇచ్చిన చి.సౌ. ఇందిరకు, పుస్తకాన్ని చక్కగా ముద్రించి ఇచ్చిన విజయసాయి ఆఫ్‌సెట్ ప్రాసెస్ అండ్ ప్రింటింగ్ వారికి నా శుభాభినందనలు, శుభాశీస్సులు.

పైన తెల్పిన విధంగా ఈ శివానందలహరి పుస్తకముద్రణకు సహకరించిన వారందరూ – వారికి కుటుంబపరమైన సమస్యలు ఏమైనా ఉంటే – అచిరకాలంలోనే అవి పరిష్కరింపబడి – ఆయురారోగ్యైశ్వర్యాలతో వర్ధిల్లాలని పరమేశ్వరుణ్ణి హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను.

ఈ పుస్తక రచనకు ముందుగా శంకర భగవత్పాదుల సంస్కృత శివానందలహరికి వ్రాసిన

1) 'ముముక్షు జనసేవక' - శుద్ధ చైతన్య స్వామివారి ఆంధ్ర వ్యాఖ్యానాన్ని, 2) 'విద్యానంద' శ్రీశ్రీపాద నరసింహశాస్త్రి గారి 'మరందనిష్యంద'మనే ఆంధ్ర వ్యాఖ్యానాన్ని నేను చదివాను. నా పుస్తకంలో టీకా తాత్పర్యాలను వ్రాయడంలో నరసింహశాస్త్రి గారి వ్యాఖ్యానాన్నే ఎక్కువగా అనుసరించాను.

ఈ ఆంధ్రవ్యాఖ్యానకర్త లిరువురికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు

-జి.ఎల్.ఎన్.శాస్త్రి

# "శాస్త్రీయం సశాస్త్రీయం"

సమర్పణ

**పరమాత్ముని శ్రీదత్తప్రసాద్**

ప్రస్థానత్రయ భాష్యంలో అడుగడుగునా బ్రహ్మ నిరాకార స్వరూపాన్ని శ్రుతిసమ్మతమైన తర్కంతో నిరూపించిన శంకరులు – సాకారశివస్వరూపాన్ని, ద్వైతతత్త్వ ప్రతిపాదకమైన భక్తితత్త్వాన్నీ ప్రపంచించేఈ 'శివానందలహరి'ని, ఈ ప్రకరణ గ్రంథాన్ని ప్రవచించటమేమిటన్న శంకవిజ్ఞులకు కలగక పోదు. 'భక్త్యర్థం కల్పితం ద్వైతం అద్వైతాదపి సుందరమ్' అనగా, భక్తి కోసం ద్వైత కల్పన చేయబడినా, ఆ కల్పితమైన ద్వైతం పరమార్థమైన అద్వైతానికన్నా సుందరమైనదన్నారు శంకరులు. 'జ్ఞానాదేవతు కైవల్యం' అనగా, అద్వైత జ్ఞానం వల్లనే కైవల్యమనే వాస్తవాన్నంగీకరిస్తూనే – భక్తిమార్గాన్ని ఉదాత్తసుందరమైన బ్రహ్మరథ మెక్కించిన శంకరుల భావ ప్రకటీకరణ అనన్యసామాన్యం, అనితరసాధ్యం. అందుకే శంకరుని గళం నుండి ఈ 'శివానందలహరి' ఆవిర్భవించింది.

శ్రీ శివానందలహరి భక్తిరసప్రధానమైన స్తోత్రము. 'పూజకోటి సమం స్తోత్రం' అన్నది ఆర్యోక్తి. పూజ – కరణాద్యంగాల చాలనం మాత్రంతోనే సాగవచ్చును, కానీ – స్తుతి యందు అర్థభావన చేసే వేళల్లో కొంతవరకైనా ఆ భావనలో లీనమయ్యే అవకాశమున్నది. అందుకనే పూజాదికాలకంటే స్తోత్రానికి ప్రాధాన్యత ఇవ్వబడినది. అంతేకాక స్తోత్రంలో మనసు అంతర్ముఖమయ్యే అవకాశమెక్కువ. అందులకే కోటి పూజలతో సమాన మీ స్తోత్రమన్నారు ఆర్యులు. అట్టి స్తోత్రగ్రంథాలలో 'శివానందలహరి' అత్యుత్కృష్టమైనది. శ్రేష్ఠమైన ఈ శివానందలహరికి వ్యాఖ్యానం చేయ సంకల్పించారు డా. జి. యల్. యన్. శాస్త్రి గారు. శాస్త్రిగారు కవిగా, వక్తగా, పరిశోధకునిగా, బోధకునిగా, ఆధ్యాత్మిక

చింతకునిగా, విద్వాంసునిగా లబ్ధప్రతిష్ఠులు. సునిశితమైన, అతిగంభీరమైన తాత్త్విక చింతనలను సులభసుందరమైన రీతిలో జనసామాన్యానికి సైతం గ్రాహ్యమయ్యేరీతిలో వ్యాఖ్యానం చేయటం ఆయన శైలీ విన్యాసంలోని ప్రత్యేకత. శివానందలహరికి ఇప్పటికే అనేక ఆంధ్రవాఖ్యానాలున్నాయి. మళ్ళీ డా.శాస్త్రిగారీ పనికెందుకు పూనుకున్నారంటే, విశ్వనాథవారి 'మరల ఇదేల రామాయణంబన్న', 'తనదైన భక్తి రచనలు తనవి కాన, తనదైన అనుభూతి తనదికాన' అన్న సమాధానమే కాకుండా, డా.శాస్త్రిగారిలో ఒక అనిర్వచనీయమైన ఆర్తి ఉన్నది. ఆయనలో ఒక సత్యాన్వేషి నిత్యం మేల్కొనే ఉంటాడు. వారిది విచారణశీలమైన అంతరంగం. అసలు ఆలోచించకుండా, ఆలోచించినదాన్ని మననం చేయకుండా, మననం చేసుకున్న దానిని ధ్యానం చేయకుండా, ధ్యానించిన దాన్ని లోకానికందించకుండా, ఆయన మిన్నకుండలేరు. అట్టి నిత్య సత్యాన్వేషి ఆధ్యాత్మిక యాత్రలో ఈ శివానందలహరి వ్యాఖ్య మరో మధురఘట్టం.

కవి కూడా మామూలు మనిషే ఐనా, కవిత్వం వ్రాసే వేళల్లో సృజనాత్మకతకు ప్రతీకయైన చతుర్ముఖ బ్రహ్మమౌతాడు. గాయకుడు కూడా మిగతావేళల్లో ఎలా ఉన్నా గానాన్ని సాధన చేసే వేళల్లో గంధర్వుడౌతాడు. అలాగే వ్యాఖ్యానం చేసే వేళల్లో శాస్త్రి గారిని ఏ వ్యాసమహర్షో, ఏ ఆదిశంకరులో ఆవహించి ఆయనకు గ్రంథంలో ఎవ్వరూ చెప్పని, ఎవ్వరూ విప్పని కొత్త దృక్పథాన్నందిస్తారేమోననిపిస్తుంది. వారి వాఖ్యానాలు నిత్యనూతనమై, నవనవోన్మేషమై అలరారుతాయి. ఇంతకు ముందు చెప్పిందే చెప్పటం ఆయన ప్రవృత్తికాదు. కొత్తదిశలో, సరిక్రొత్తకోణంలో, విషయాన్ని అందించాలన్న తపన ఆయనలో పడగెత్తిన త్రాచులా బుసలుకొడుతూ ఉంటుంది. ప్రస్తుతమైన శివానందలహరీ వ్యాఖ్యానంలో డా.శాస్త్రిగారు స్పందించిన, అందించిన, స్పందించి అందించిన, అందించి స్పందించిన కొత్తకోణాలను కొన్నింటిని పరిశీలిద్దాము.

**నాలం వా సకృదేవదేవ భవతస్సేవా నతిర్వా నుతిః**
**పూజా వా స్మరణం కథాశ్రవణ మప్యాలోకనం మాదృశామ్,**
**స్వామిన్నస్థిర దేవతానుసరణాయాసేన కిం లభ్యతే**
**కావా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదా.**

నూరుశ్లోకాలు గల శివానందలహరిలో ఇది 33వ శ్లోకం. 'నమస్కారం, నుతి, పూజ, స్మరణ, కథాశ్రవణం, ఆలోకనం. ఇవన్నీ ముక్తికి సాధనాలు. ఈ మార్గాలను విడచి అస్థిరులైన ఇతర దేవతలను ఆశ్రయించినచో ప్రయోజనం శూన్యం' - ఇదీ ఈ శ్లోక తాత్పర్యం.

ఈ తాత్పర్యాన్ని అందిపుచ్చుకుని, సూత్రం విడవకుండా డా. శాస్త్రిగారు ఈనాడు భక్తిపేరిట, ఆధ్యాత్మికతపేరిట, జరుగుతున్న సంకుచిత ధోరణులపై ధ్వజమెత్తారు. గ్రామఫోను రికార్డుల వంటి సంకీర్తనలు, యాంత్రికమైన నామ జపాలు, పూజలు, హోమాలు, అభిషేకాలు చెల్లవు పొమ్మన్నారు డా. శాస్త్రిగారు. హృదయ పూర్వకమైన నిష్ఠకు, ఏకాగ్రతకు, మానసిక తాదాత్మ్యతకు పెద్దపీట వేయాలంటున్నారు శాస్త్రిగారు. పటాటోపాలకు, ప్రదర్శనలకు, తద్వారా ఐహిక లబ్ధినాశించే పూజలు, పునస్కారాలు వ్యర్థమంటున్నారు శాస్త్రిగారు. 'కర్‌మే మాలాఫిరై, జీభ్‌ఫిరై ముఁహ్‌మాహి, మనువా దశదిశా ఫిరై, యహ్‌తో సుమరిన నాహి' చేతిలో మాల తిరుగుతున్నది. నోట్లో నాలుక నామస్మరణం చేస్తున్నది. మనస్సు మాత్రం దశదిశల్లో తిరుగుతున్నది. అంటే శబ్ద స్పర్శ రూప రస గంధాదుల పరిభ్రమణంలో పరిక్రమిస్తున్నది. ఇది చెల్లనే చెల్లదని ఢంకా బజాయించి చెప్పిన కబీర్ చెప్పినదైనా డా. శాస్త్రి గారు సూచించినదైనా మనసే ప్రధానమని. అసలు నాకో అనుమానం వస్తుంటుంది. ఒక ఆదిశంకరుల నుంచి, ఒక కబీర్‌దాస్ నుంచి. ఒక పోతన నుంచి మన డా. శాస్త్రిగారి వరకు ఇలా ఒకరేమిటి, ఇద్దరేమిటి ఈ జాతిలో జన్మించిన మహానుభావులు తమ మనసులను తాము పరాత్పరునిపై లీనం చేసుకుని, తామెన్నుకున్న మార్గంలో

తాము ముక్తిని పొందకూడదూ ? ఇలా నెత్తీ నోరు కొట్టుకుని లోకానికెందుకు చెప్పాలి ? వాళ్ళు చెప్పకుండా ఉండలేరేమోననిపిస్తుంది. వారిది లోకానుగ్రహదృష్టి. అందుకే డా. శాస్త్రిగారు కూడా ఈ శ్లోకాన్నాధారంగా చేసుకుని, మనసే ప్రధానమని, ఆ మనసు, ఆ మనసులోని సంస్కారాలూ, వాసనలే జీవస్వరూపని, జీవుని దేవునిగా మార్చాలంటే మనస్సు నరికట్టటం ద్వారా, అమనస్కస్థితికి చేరటమే మార్గమనీ వక్కాణించారు.

అడ్డబొట్లలో, నిలువు బొట్లలో అడ్డదిడ్డమైన కుసంస్కారాలను, పరదేవతా విముఖత్వాన్నీ, పరమతవిద్వేషాన్నీ రెచ్చకొట్టే కుహనా విద్వాంసులు, పీఠాధిపతులు, మఠాధిపతులు ఈ శ్లోక వ్యాఖ్యానంలో తప్పించుకోలేక పోయారు. వారి దురాలోచనలను నిరసిస్తూ డా. శాస్త్రిగారు ఆదిశంకరుల అద్వైత భావనను అందించారు. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' అన్న ఛాందోగ్యోపనిషద్వాణిని ప్రకటించారు. త్రిగుణాతీతమైన లలితమ్మవారిని – తామసశక్తిగా అభివర్ణించి, అమ్మనెత్తణుస్తుందని చెప్పేవారి నైజానికి నివ్వెరపోయారు డా. శాస్త్రిగారు. తత్త్వమర్థస్వరూపిణియై, తత్త్వమస్యాది మహావాక్యాల జీవబ్రహ్మైక్యభావనా రూపిణియై విరాజిల్లే – పరబ్రహ్మ తత్త్వం నెత్తణుస్తుందని కొందరు గురువులు చెప్పగా విన్నపుడు సమ్యగ్దర్శనుడైన డా. శాస్త్రిగారిహృదయం ఆర్ద్రం కాకుండా ఎలా ఉంటుంది ? తమ ఆర్ద్ర హృదయాన్ని, తమ అంతర్దర్శనాన్నీ శ్లోక వ్యాఖ్యలో వ్యక్తం చేస్తూ డా. శాస్త్రిగారు భక్తిమార్గం, కర్మమార్గం, జ్ఞానమార్గం, యోగమార్గం, ఇలా మార్గాల పేరుతో వాదోపవాదాలతో సమయాన్ని కుతర్కాలతో వ్యర్థం చేయక, బహిర్ముఖమై, పంచేంద్రియవశమై, విషయాసక్తమై ఉన్న మనసును అంతర్ముఖం చేయమని, ఆ ప్రక్రియలో ఆలంబన శివుడైనా, విష్ణువైనా, లలితాదేవియైనా ఒకటేనని దిశానిర్దేశం చేసారు. ఇక్కడ ఇంకో విషయముంది. 'పరోపదేశ వేళా సర్వే వ్యాసపరాయణా', ఇతరులకు ఉపదేశం చేసే వేళల్లో అందరూ వ్యాసమహర్షులే అన్నట్లు కాక, ఇతరులకు చెప్పినా, తానాచరించినా,

డా. శాస్త్రిగారి దృక్పథమొక్కటే. అందుకనే ఆయన సౌందర్యలహరికి వ్యాఖ్యానం చేసి అమ్మను స్తుతించారు. తైత్తిరీయోపనిషత్తుకు వ్యాఖ్యానం వ్రాసి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశాతీతమైన పరబ్రహ్మ తత్త్వాన్ని నుతించారు. లలితాసహస్రనామావళికి వ్యాఖ్యానం చేసి అన్ని జీవులూ నేను నేననుకొనే, ఆ 'నేనే' నంశోధింపబడితే 'అమ్మ' అని ఆ 'ఆబాలగోపాలవిదిత'ను ప్రస్తుతించారు. మరి ఇప్పుడీ శివానందలహరి వ్యాఖ్యానాన్ని సంకల్పించారు. రండి మరో శ్లోక వ్యాఖ్యానాన్ని పరిశీలిద్దాము.

శ్లో. ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః,
వేద్యః కిం నభవస్యహో ఘనతరం కీదృగ్భవేన్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ.

ఇది శివానందలహరిలోని 58వ శ్లోకం. లలితాసహస్రనామావళిలోని తల్లితత్త్వమైనా, సౌందర్యలహరిలోని అమ్మతత్త్వమైనా, శివానందలహరిలోని శివయ్య తత్త్వమైనా ఒకటేనని డా. శాస్త్రిగారు ఈ శ్లోకవ్యాఖ్యారంభంలో సూచిస్తూ లోతుకుపోయే వేదాంతతత్త్వమైన కార్యకారణ సంబంధాన్ని వివరించారు. బాహ్యదృష్టికి కార్యం మాత్రమే కనబడుతుంది. అంతర్దృష్టికి కారణం ద్యోతక మవుతుందన్నారు డా. శాస్త్రిగారు. లోకంలోని తిమిరాన్ని తొలగించే సూర్యుడు కన్పిస్తున్నాడు కానీ, మూలావిద్యను, మూలాజ్ఞానాన్ని నిర్మూలించే హృదయాంతర్గతుడైన శివుడెందుకు కనబడడన్నది ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం చెప్తూ డాక్టర్ శాస్త్రిగారు కార్యకారణ సంబంధాన్ని ఉటంకించారు. కంటికి మృత్కార్యరూపమైన కుండ కన్పిస్తుందికానీ, ఆ కుండకు కారణమైన మట్టి – మనకు కుండమీద మనస్సుంత సేపూ – స్ఫురించదు. ఎందుకంటే – నామరూపాలపట్ల ద్వైతం పట్ల మనకున్న వ్యామోహం వలన. మసకచీకట్లో తాడును చూచి పామనుకుని పారిపోయి, ఆ భయంపోగొట్టుకొనటానికి

తాయెత్తులు కట్టించుకుంటాము కానీ, మంత్రాలను తంత్రాలను ఆశ్రయిస్తాము కానీ – అసలది పామా తాడా అని విచారణ చేయము. అవిచారరమణీయమైన ప్రపంచమనే కార్యంలో కొట్టుమిట్టాడుతామేకానీ, ఈ ప్రపంచానికి కారణమైన అభిన్ననిమిత్తోపాదాన కారణమైన బ్రహ్మస్వరూపాన్ని తెలుసుకొనలేము. అసలు తెలుసుకొనవలెననే ప్రయత్నమే చేయము. అందుకనే కారణం కనిపించదు. అందుకే హృదయగుహలో ఉన్న శివుడు దర్శనమీయడు. అందుకనే సాధకుడు అంతర్ముఖుడు కావాలనీ, లేనిచో – ఎన్ని యుగాలైనా జన్మలైనా గడచిపోతాయి గాని, బహిర్ముఖునకు ఆత్మతత్త్వం గోచరింపదనీ, శివతత్త్వం స్ఫురింపదనీ ఈ శ్లోక వ్యాఖ్యలో డా.శాస్త్రిగారు తెలిపారు. డా.శాస్త్రిగారు ఔపనిషదులు. వారి దర్శనం వేదాంత దృక్పథం. అందుకనే కార్యకారణ సంబంధమును అజ్ఞాన కారణమైన కార్య ప్రపంచదృష్టిని జ్ఞానకారణమైన కారణదృష్టిని ఈ శ్లోక వ్యాఖ్యానంలో సూచించారు.

**గభీరే కాసారే విశతి విజనే ఘోర విపినే**
**విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,**
**సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే**
**సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో.**

ఇది శివానందలహరిలోని 9వ శ్లోకం. పూజకు పుష్పాల కోసం మనుష్యులు అడవులలో, గుట్టలలో, చెరువులలో వెదుకుతారే కానీ, తమ మనస్సనే పద్మాన్ని శివునకు సమర్పించాలని వీరికెందుకు తోచదో ? అని శ్లోకార్థం.

డా.జి.యల్.యన్.శాస్త్రి గారు పుష్పానికి గల ఐదనే గూఢార్థాన్ని స్వీకరించి, శివుని పాదాల చెంత పంచ జ్ఞానేంద్రియాలతో కూడిన అంతః కరణ అనే పుష్పాన్ని సమర్పించాలని చెప్పారు. ఇదే శాస్త్రీయమన్నారు. ఔను, శాస్త్రీయమైన అర్థమిదే, శాస్త్రిగారు చెప్పినందువల్ల కూడా ఇది శాస్త్రీయమే.

'పరాంచిఖాని వ్యతృణత్ స్వయం భూః' అన్నది కఠోపనిషత్తు. చిక్కల్లా ఇక్కడే ఉన్నది. ఈ ఇంద్రియాలను పరమాత్మ పరాన్ముఖం చేసి శిక్షించాడట. అంటే పరాన్ముఖం కావటమే వీటి లక్షణము. వీటి స్వభావము. అట్టి వీటి స్వభావానికి వ్యతిరేకంగా ఈ ఇంద్రియాలనం తర్ముఖం చేసి పరాత్పరుని పాదాల వద్ద సమర్పించుకొనవలెనని శాస్త్రిగారి తాత్పర్యం. ఎవడో ఒక ధీరుడు మాత్రమే అలా చేయగలడన్నది శ్రుతి. మనందరినీ అట్టిధీరులుగా మార్చాలన్నదే శాస్త్రిగారి సంకల్పము. మార్చగలనన్నదే వారి నిశ్చల విశ్వాసము.

అంతేకాక డా. శాస్త్రిగారిక్కడ మరో గహన సత్యాన్ని కూడా మనముందు నుంచారు. భక్తులు తమ మనస్సులనే పుష్పాలను సమర్పించకుండా, ఈ పుష్పాలకై ధనాన్ని కాలాన్ని వెచ్చించి ఈ పుష్ప సమర్పణను తమ తమ అహంకార ప్రదర్శనగా మార్చుకుంటున్నారు. ఎన్ని వందల రూపాయల పుష్పాలను ఎంత ఘనంగా సమర్పిస్తే అంతఘనంగా మనకహంకార తృప్తి కలుగుతుంది. ఆ పుష్పాల సమర్పణలో మమత్వాన్ని మనం దర్శిస్తున్నాము. నా సమర్పణ, నా సమర్పణ అనుకుంటూ నా గొప్ప సమర్పణ అన్న తృప్తిని పొందుతాము. ఈ తృప్తి ద్వారా 'అహమిదమ్, మమేదమ్' ఇది నేను, ఇది నాది అన్న ద్వైతభావనను, పరిచ్ఛిన్నమైన అహమ్ భావనను నిత్యం పోషిస్తున్నాము. అంటే భగవదారాధనలో కూడా దేన్నయితే త్యజించాలో, దాన్ని వదులుకొనకుండా మరింత పెంచి పోషిస్తున్నాము. అందులకే ఈ పూజలకర్థమేమిటని ప్రశ్నించారు డా. శాస్త్రిగారు. మనఃపుష్పాన్ని సమర్పించి అమనస్కస్థితికి చేరుకొనవలెనని ఈ శ్లోక వ్యాఖ్యానం ద్వారా ముక్తికి మార్గాన్ని చూపుతున్నారు శాస్త్రిగారు.

**యావద్యావదహంకారో విస్మృతోఽభ్యాసయోగతః**

**తావత్తావత్సూక్ష్మ దృష్టేర్నిజానందోఽనుమీయతే.**

ఎంతెంతగానైతే 'అహంకారాన్ని' మనం త్యజిస్తామో, అంతంతగా సూక్ష్మదృష్టి కలిగి నిజానందం, ఆత్మానందం దక్కుతుంది. ఇదే శాస్త్రిగారి వక్కణం.

ఇలా డా.జి.యల్.యన్.శాస్త్రిగారు అంతస్సూత్రాన్ని విడువకుండా, తాత్త్విక దృక్పథానికి దూరం కాకుండా, భక్తి భావ సమన్వితమై, జ్ఞానానంద సంభరితమై అలరారే శంకరుని హృదయాన్ని ఈ వ్యాఖ్యానం ద్వారా మనకందించారు. ఈ నూరు శ్లోకాలలోని ప్రతిశ్లోకం యొక్క వ్యాఖ్యానమూ అవశ్యపఠనీయమే. ప్రతి వ్యాఖ్యానంలో ఒక మెరుపు, ప్రతిభావంలో ఒక తళుకు. ఔపనిషత్తత్త్వాన్ని ఆపోశన పట్టిన వారికి మాత్రమే ఈశైలి సాధ్యమవుతుంది. అందుకనే డా.శాస్త్రిగారి వ్యాఖ్యానం శాస్త్రీయమై అలరారింది.

ఆధ్యాత్మిక చింతనాసక్త మతులైన పాఠకులకు, చింతనశీలురైన జిజ్ఞాసువులకు డా.శాస్త్రిగారు, మన అనంతమైన ఆర్షవిజ్ఞానంలోన మరిన్ని గ్రంథాలకు వ్యాఖ్యలనందించగలరనీ,వారికాశక్తిని, స్ఫూర్తిని వారు నిత్యం ఆరాధించే పరమేశ్వరి ప్రసాదించగలదని ఆశిస్తున్నాను, ఆకాంక్షిస్తున్నాను.

"ఆసుప్తేరామృతేః కాలం నయేత్ వేదాంత చింతనే" - డా.శాస్త్రిగారి వ్యాఖ్యానాల వల్ల ఉత్తేజితులైన సాధకులు జాగ్రద్దశ నుండి సుషుప్త్యవస్థకు చేరే దాకా, ఇలా నిత్యం, యావజ్జీవితం, శరీరపాతం వరకు వేదాంత చింతనలో కాలం గడుపుతారని, ముముక్షువులై శివసాక్షాత్కారానికి, ఆత్మాపరోక్ష సాక్షాత్కారానికీ ప్రయత్న శీలురవుతారని విశ్వసిస్తున్నాను. నా హృదంతర్గతమైన ఈ భావప్రకటీకరణకు అవకాశమొసంగిన డా.శాస్త్రిగారి 'మనీష'కు నా నమస్సులు.

"నమామి భవగత్పాద శంకరమ్ లోక శంకరమ్"

# అంకితం

తే॥గీ॥ శంకరాచార్య మదిలోన జన్మనంది
సుందరమ్మైన సురభాషనందునున్న
మహిమగలదౌ శివానందలహరి నేను
అందమైనట్టి తెలుగులో ననువదించి
శివపరమ్మైన విషయాలవివరణమును
అంకితమ్మిచ్చుచుంటిని హనుమ తండ్రి
నీదు పదసరోజములకు నిర్మలాత్మ
భక్తి నిండిన ప్రేమ సంయుక్తుడగుచు

-జి.ఎల్.ఎన్.శాస్త్రి

## నాన్న

మా అన్నదమ్ములు అక్కచెల్లెలందరికీ మా నాన్నగారి దగ్గర చనవు చాలా ఎక్కువ. అందుకే ఆయన్ని 'నాన్నా' అనిపిలిచేవాళ్లం గాని 'నాన్నగారూ' అని ఎవరో బయట వ్యక్తిని పిలిచినట్లు పిలిచేవాళ్లం కాదు. అంటే - అమ్మని ఎంతో చనవుగా 'అమ్మా' అని పిలిచినట్లే నాన్నను గూడా 'నాన్నా'అని పిలిచేవాళ్లమన్నమాట ! అయితే - ఎవరికైనా మా నాన్నగారి గురించి చెప్పాల్సివచ్చినా, ఎవరైనా మానాన్నగారి గురించి ఏదైనా ప్రశ్నవేసినా - మేము మళ్ళీ 'మా నాన్నగారు' అనే (అడిగినావారితో) అనేవాళ్లం.

### గోత్రాదులు (Genealogy)

మాది - వసిష్ఠుడు, మైత్రావరుణుడు, కౌండిన్యుడు ఋషుల ప్రవరతో కూడిన 'కౌండిన్యగోత్రం'. కృష్ణ యజుశ్శాఖకు సంబంధించిన వాళ్లం. ఆపస్తంబ గృహ్య సూత్రాలను అనుసరించి మా ఇళ్లల్లో వివాహాది షోడశ సంస్కారాలు నిర్వహింపబడతాయి. ఎవరికైనా తనను తాను ముందుగా పరిచయం చేసుకునేటప్పుడు ఈ విషయాలన్నిటినీ ('వాసిష్ఠ మైత్రావరుణ కౌండిన్య త్రయార్షేయ ప్రవరాన్విత, శ్రీమాన్ కౌండిన్యసగోత్రోద్భవస్య, లక్ష్మీనారాయణ శాస్త్రి శర్మ నామధేయః, కృష్ణయజుశ్శాఖాధ్యాయీ, ఆపస్తంబసూత్రః' అని కలిపి చెప్పడాన్నే 'ప్రవర' చెప్పడం అంటారు. (ఒక వ్యక్తి మనకు ఎదురుగా వున్నప్పటికీ, ఇంకొకరు ఎవరన్నా ఆ వ్యక్తిని పరిచయం చేసేదాకా వాళ్ళతో మాట్లాడటం ప్రారంభించని 'సంస్కృతి'ని అనుసరించే వారికి ఇది పాతచింతకాయ పచ్చడి పద్ధతిలాగా ఉండవచ్చు అది వేరే సంగతి).

### ఇంటిపేరు (Surname)

ఇంటిపేరు అనగానే మనం ఉండే ఇంటికి పెట్టుకునే పేరు కాదు. (మన ఆంధ్రులకు ఈ విషయం తెలుసనుకోండి !) మనదేశంలో ఇంటిపేర్ల

ప్రసక్తి మన ఆంధ్రప్రదేశ్‌లోనే ఎక్కువ. మిగతావాళ్లందరికీ వాళ్ల వాళ్ల తండ్రి లేదా (ఆడవాళ్లైతే) భర్తల పేరే తమ పేర్ల ప్రక్క చేరతాయి. మన ఆంధ్రప్రదేశ్‌లో మన పేరుకు ముందు మన ఇంటిపేరు ఉంటుంది. ఇంటిపేర్లు వాళ్లకు సంబంధించినవిగా సమాజంలో చెల్లిపోడానికి ముందు చాలా చరిత్ర వుంటుంది. మా ఇంటిపేరు 'గొర్తి'. ఈ పేరు వినంగానే చాలా తమాషాగా ఉన్నట్లనిపిస్తుంది. మా ముత్తాల కంటె ఇంకా ముందు తరాల వాళ్లు ఆంధ్రప్రదేశ్‌కు విదర్భదేశం నుండి వలస వచ్చారుట. ఆ వచ్చేటప్పుడు తమతో పాటు 'గొర్రు' పట్టుకు వచ్చారుట. 'గొర్రు' అంటే 'నాగలి' అని అర్థం. అంటే - నాగలి పట్టి భూమిని దున్ని, దున్నించి వ్యవసాయం చేయడంలో చాలా ప్రావీణ్యం, దక్షత గలవారన్న మాట! 'నుయ్యి' తాలూకు వాళ్లు 'నూతి' వారైనట్లు, 'నెయ్యి' తాలూకు వాళ్లు 'నేతి' వారైనట్లు 'గొర్రు' తాలూకు వాళ్లు 'గొర్తి' వారయారన్నమాట! ఇలా ఈ 'గొర్తి' అనేది మా ఇంటిపేరుగా సమాజంలో స్థిరపడిపోయింది. అలాగే విదర్భదేశం నుండి వచ్చామన్న సంగతి 'దర్భల వినియోగం బాగా తెలిసిన వారు' అనే విషయాన్ని స్ఫురింపజేస్తుంది. కాబట్టి మా పూర్వీకులు ఉత్సాహంగా బాగా యజ్ఞయాగాదులు చేసినవారే, చేయించిన వారే, అలా చేసేవారిని, ప్రోత్సాహపరిచినవారే గూడా ! అయితే కాలక్రమేణా అవన్నీ తగ్గిపోయి వుండచ్చు - అది వేరే సంగతి.

## తాతముత్తాతల వైభవం

మా తాతముత్తాతలు కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా వెంకటాపురం గ్రామానికి చెందినవారు. మా నాన్నగారు వాళ్లు బాగా ఖర్చు మనుష్యులు. దాన ధర్మాలకు, గుళ్లు గోపురాలకు, దైవకార్యాలకు, పేరు ప్రతిష్ఠలకు - ఉదారంగా, ఆడంబరంగా డబ్బు ఖర్చుపెట్టే తత్త్వం గలవారు. వాళ్లు 'స్తపసంతానాలు' చేశారు. అయితే సప్త సంతానాలు అనంగానే వెంటనే ఏడుగురు ఏడుగురు చొప్పున పిల్లల్ని కనేవారేమో! అని 'సంతాన' పదాన్ని

బట్టి అర్థం చేసుకోకండి ! 'సప్త సంతానా'లంటే - పిల్లల్ని కనడం కాదు. గ్రామానికి, సమాజానికి ఎక్కువగా వినియోగపడే ఏడురకాల పనులు చేయడం. మావాళ్లు చేసిన సప్త సంతానాలు ఏవంటే - 1) గుడిని కట్టించడం 2) బడిని ఏర్పాటు చేయడం 3) బావి త్రవ్వించడం 4) మంచినీటి చెరువు త్రవ్వించడం 5) కోనేరు త్రవ్వించడం 6) సత్రం కట్టించడం 7) పిల్లనిచ్చి పౌరోహిత్యం అప్పచెప్పడం. వెంకటాపురం గ్రామంలో వీటన్నిటినీ మా తాతముత్తాతలు ఏర్పాటు చేశారు. అవి ఇప్పటికీ అక్కడ అందరికీ వినియోగపడుతున్నాయి.

## తాతయ్య

మా తాత ముత్తాతలు బాగా కండపుష్టి, తిండి పుష్టి కలిగినవారు. మా తాతయ్య రామ్మూర్తిగారంటే ఊళ్లో వాళ్లందరికీ హడల్! ఆయనది అంతా ఎదురెత్తు వ్యవహారం. అర్థం - పర్థం; వేళా-పాళా; సమయం - సందర్భం లేకుండా అన్నిటికీ పోటీలు - పందాలు; కోపాలు - తాపాలు; చిరాకులు - చికాకులు. తీపి - బాగా ఇష్టం. అరిశెల్లో బెల్లం నలుచుకునే వాడు. 'అరిశె వడ్డించనా?' అని అడిగితే - 'అరిశా ? అరిశెలు' -అని కసురుకునేవాడు. మా వూళ్లో పూజారి రత్తయ్యతో వీశెడు బెల్లం తింటానని పందెం కట్టి 1 బస్తా వడ్లు గెల్చుకున్నాడు. ఒకసారి మేనమామ కొడుకుతో పందెంకట్టి బంగారు మురుగులు గెల్చుకున్నాడు. అప్పుడు మేనమామ మా తాతయ్యను బుజ్జగించి ఆ మురుగుల్ని మళ్ళీ తిరిగి తన కొడుక్కి ఇప్పించేశాడు. భోజనం చేస్తున్నపుడు 'వంకాయబజ్జి - వళ్లంత గజ్జి' అన్నాడని తినే అన్నం విస్తరి అలా అన్నవాడి నెత్తిపై రుద్ది చక్కాపోయాడు. "దొంగలు దోచుకుపోతారు" అని అందరూ ఎంతవద్దన్నా వినకుండా ఊరికి 'చాలా దూరంగా వుండే తోటలో' - ఎవడొస్తాడోరమ్మను' అంటూ కాపురం పెట్టాడు. అటువంటి తాతయ్యకు జ్యేష్ఠపుత్రుడే మా నాన్నగారు.

## నాన్నగారి బాల్యం

మా బామ్మ మేనమామలు జలసూత్రం వారు. ('పారడే కింగ్' 'జరుక్‌శాస్త్రి' అని జనాదరణ పొందిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారు మా నాన్నకు మేనమామ కొడుకు) వీళ్లు బందరులోని ఘంటసాల వారి సత్రంలో ఉండేవారు. అందుకని మా నాన్నగారు ఆ సంత్రంలోనే పుట్టారు. (పుట్టినతేదీ వివరాలు లభించలేదు). మా బామ్మ ఆంజనేయస్వామికి ప్రదక్షిణాలు చేస్తే పుట్టినందువల్ల 'హనుమచ్ఛాస్త్రి' అని పేరు పెట్టారు. కాని, అందరూ ఎక్కువగా 'హనుమంతరావు' అనే అంటూండేవారు

మా బామ్మ రెండో కొడుకును కన్న కొద్ది రోజులకే స్వర్గస్థురాలైంది. మా ముత్తాత గారైన రంగయ్య గారి పేరే మా బాబాయికి పెట్టారు. మానాన్నగారు, బాబాయి ఇద్దరూ బాగా అల్లరి చేస్తూ కొట్టుకుంటూ ఉండేవారు. వీళ్లిద్దర్ని వాళ్ల మేనమామ తాలుకు వాళ్లు 'వేధింపు' 'సలపాది' అని పిలుస్తూ ఉండేవారు. నాన్నగారు, బాబాయి ఇద్దరూ తాతగారి దగ్గటే హిందూపూర్‌లో కొన్ని రోజులు పెరిగారు. పెద్దైంతర్వాత నాన్నగారికి బాబాయికి ఏదో చిన్న అభిప్రాయ భేదం వచ్చి బాబాయి హిందూపూర్‌లోను, నాన్నగారు వెంకటాపురం లోను స్థిరపడ్డారు.

## కుటుంబం

ఉపాధ్యాయుల లక్ష్మయ్యగారు – వంటినిండా నగలు పెట్టి తన కూతురు నిచ్చి నాన్నగారి పెళ్లిని చాలా ఘనంగా 5 రోజులు జరిపించారు. 20 ఎకరాల పొలం గూడా ఇచ్చారు. పరమశాంత స్వభావం సౌశీల్యం గల సాధ్వీశిరోమణి మాఅమ్మ 'శేషారత్నం' (నేను వివరించిన సౌందర్యలహరి పుస్తకంలో 'అమ్మ'ను గురించి చదవండి). మేము ఐదుగురు అన్నదమ్ములం. అప్పచెల్లెళ్లు ముగ్గురు. 1930 సంవత్సరంలో మా పెద్దన్నయ్య పుట్టాడు. మా ఇంటి ఇలవేలుపు అయిన సుబ్రహ్మణ్యస్వామి పరంగా 'వేంకటశేషావతారం' అని పేరు పెట్టారు.

1932లో పుట్టిన చిన్నన్నయ్యకు 'రామమూర్తి' అని మా తాతగారి పేరు పెట్టారు. 1934లో పుట్టిన మా పెద్దక్కయ్యకు 'సర్వమంగళాంబ' అని బామ్మగారి పేరు, అమ్మవారి పేరు కలిసి వచ్చేట్లుగా పెట్టారు. తర్వాత 1937లో పుట్టిన మా చిన్నక్కయ్యకు సీతామహాలక్ష్మి అని మా అమ్మమ్మ పేరు పెట్టారు. 1942లో పుట్టిన మా చెల్లెలికి స్వరాజ్యలక్ష్మి అని, 1950లో పుట్టిన మా పెద్ద తమ్ముడికి సూర్యుని పరమైన 'శివ ప్రభాకర శర్మ' అని పేరు పెట్టారు. చిలకలపూడి పాండురంగని మ్రొక్కు పరంగాను, మా ముత్తాత పేరు కలిసి వచ్చేట్లుగాను 1954లో పుట్టిన మా చిన్న తమ్మునికి 'పాండురంగారావు' అని పేరు పెట్టారు.

## పాడిపంటలు

నాన్నగారిది మంచి ఒడ్డూ పొడవూ గలిగిన దృఢమైన శరీరం. వ్యవసాయంలో ఆయనతో బ్రాహ్మణేతరులు గూడా పోటీకి రాలేకపోయేవారు. 25 ఎకరాల మాగాణి పొలం, బంగారంలాంటి మెట్టతోట, 3 గేదెలు, 2 ఆవులు, పెద్దగాదె (ధాన్యాగారం) రెండు బళ్ల వ్యవసాయంతో మాకు పాడిపంటలు పుష్కలంగా ఉండేవి. నాన్నగారు నాగలి పట్టి దున్నగలరు, దున్నించగలరు. ఈత కొట్టడంలో మంచి ప్రావీణ్యం గలవారు. కాళ్ళపాలెం గ్రామానికి మా వూరికి మధ్య ఉన్న కాలువలో నన్ను భుజంమీద ఎక్కించుకుని రెండు చేతులా సామాన్లతో నిలువు ఈత కొట్టుకుంటూ దాటేవారు. పొలం గట్ల మీద ఎన్నో రకాల కాయగూరలు పండించి ఊళ్లోవాళ్లందరికీ విస్తృతంగా పంచిపెట్టేవారు. తోటలో ఎన్నో రకాల పూలు పూచేవి, కాయలు కాచేవి, పళ్లు పండేవి. వేసవికాలం అన్ని రోజులు ఇంట్లో కావుపెట్టిన ఎన్నో రకాల తాజామామిడి పళ్లుండేవి.

తెల్లావుపాలు పితుకుతున్నపుడు ముందుగా రోజూ నాకు ఒక గ్లాసెడు గుమ్మపాలు ఇచ్చి – 'త్రాగితే తెలివితేటలువస్తాయి' అని చెప్పి త్రాగించేవారు. బందరునుండి శెలవులకు వెంకటాపురం వెళ్తే రోజూ వాసినకుదుం వేయించి పెట్టేవారు. ఎరువులు వాడని కూరగాయలు, నీళ్లు కలపని చిక్కటి పాలు, గడ్డ

పెరుగు, కమ్మని నెయ్యి, పుష్కలంగా పళ్లు - ఇలా పాడిపంటలతో కొదవలేని ఆ రోజులు నాకు బాగా గుర్తు. వీటికి బాగా అలవాటు పడిన వారికి ఇప్పటి రోజుల్లోని పాలు పెరుగు నెయ్యి కూరలు ఏమాత్రం రుచించవని చెప్తే అది ఆడంబరమూ గాదు, అతిశయమూగాదు అని అర్థం చేసుకోవాలి.

## స్వభావం

నాన్నగారు తిండిపుష్టిగలవారు. సుష్టుగా భోజనం చెయ్యాలి. చివరి దాకా కూర ఉండాలి. చేమదుంపల వేపుడు చాలా ఇష్టం. పులిహోర పదునులో అన్నం ఉండాలి. మెత్తగా వుంటే విసుక్కుంటూ, సణుక్కుంటూ భోజనం చేసే వారు. ఏదో ఒక పండు లేందే భోజనం ముగించేవారు కాదు. ఇంట్లో నిలువ పిండివంటలు చేస్తే 'రేపటి సంగతి రేపు చూసుకుందాం. ఆ చేసినవేవో ఇలా పట్టుకురా !' అని వాటిని అందరికంటే ముందు కటకట లాడించేవారు. ఆయనకు చివరిదాకా పన్ను కన్ను చెక్కు చెదరలేదు. నాకు తెలిసినంతవరకు కళ్లకు, కాళ్లకు జోడు వాడలేదు. చెప్పుల్లేకపోయినా ఎంతదూరం అయినా యమాస్పీడుగా నడిచేవారు. ఆయన్తో నడవలేక పోయేవాళ్లం. రాత్రి నక్షత్రాలు చూసి టైం చెప్పేవారు. ఇంట్లో వాళ్ళకు వంట్లో బావుండకపోతే తానే అడ్డసరం, పంచతిక్త కషాయం, శీతాంశురసం, మిరియాల కషాయం, సొంఠి మొదలైన వాటితో వైద్యం చేసి తగ్గించేవారు.

ప్రాతఃకాలం రకరకాల స్తోత్రాదులు చదివేవారు. భోజనానికి ముందు నమకం చమకం ఇతర శివస్తోత్రాలు, కాళహస్తీశ్వర మాహాత్మ్యం, పద్యాలు, అన్నపూర్ణాష్టకం, పాతూరి వారి శివానుభూతి పద్యాలు చదువుతూ ఎంతసేపటికీ భోజనానికి లేచేవారు కారు. "రామదర్శన్" పుస్తకాలు తెప్పించుకుని చదువుతూ ఉండేవారు.

## విద్యా సంస్కారాలు

నాన్నగారు పంచవాక్యాలు చదువుకున్నారు. దస్తూరీ బావుండేది.

అందరికీ దస్తావేజులు వ్రాసి పెట్టేవారు. మద్దెల వాయించడం నేర్చుకున్నారు. గ్రామగ్రంథాలయాన్ని కొన్నిరోజులు నిర్వహించారు. ఎక్కడా లభించని ఎన్నో విలువైన గ్రంథాలు ఆ గ్రంథాలయంలో ఉండేవి.

సంస్కృత శ్లోకాలన్నా తెలుగు పద్యాలన్నా చాలా ఇష్టం. చాలా చక్కగా చదివేవారు. మాచేత చదివించేవారు. మా అక్కయ్యల చేత రుక్మిణీ కళ్యాణం, గజేంద్ర మోక్షణం, సుమతీ శతకం మొదలైన వాటిని క్షుణ్ణంగా చదివించారు. అక్కయ్యలకు ఆ పద్యాలన్నీ – 'అదిమరియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాత......' అనే వచనం (గజేంద్రమోక్షణం), 'ఇట్లు మేఘమధ్యంబు నుండి వెలువడి విలసించు క్రొక్కారు మెఱంగు తెఱంగున....' (రుక్మిణీకళ్యాణం) లాంటి వచనాలతోసహా నోటికి వచ్చు. పెళ్లిచూపులప్పుడు గూడా ఆ పద్యాలను చదివించారు. (ఆ రోజుల్లో – కన్యలు రుక్మిణీకళ్యాణం చదివితే త్వరగా పెళ్ళవుతుందనే నమ్మకం వుండేది. చదివితే వాళ్లకు పెళ్లిగూడా అలాగే జరిగేది. ఇప్పటివారికి ఆ నమ్మకమూలేదు, చదవడమూలేదు, లేత వయస్సులో వాళ్లకు పెళ్ళిళ్లు జరగడమూ లేదు.) మా ధర్మకర్తృత్వంలో నడిచే శివాలయ నిర్వహణను, తత్సంబంధమైన ఉత్సవాలను అమితోత్సాహంతో నిర్వహించేవారు.

ఈ రోజుల్లో మనం టి.వీల్లో చూసే 'అంత్యాక్షరి', 'పద్యాలతోరణం లాంటి వాటిని ఆ రోజుల్లోనే మా చేత మానాన్నగారు ఆడించేవారు. భాగవతం లోని ' అడిగెదనని కడువడి జను... " అనే పద్యాన్ని ఒక్కగుక్కలో ఎక్కువ సార్లు చెప్పినవారికి బహుమతులిచ్చేవారు. భాగవతంలోని – 'త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప ....' అనే పద్యాన్ని – దీపింప, వుద్దీపింప, తను వుద్దీపింప, కాంతి తనువుద్దీపింప, నీలకాంతి తనువుద్దీపింప.... ఇలా వెనుకనుండి విశేషణాలు కలిపి పెంచుకుంటూ చిట్టచివరకు మొత్తం ఆ పద్య పాదాన్ని చదివేవారు.

ఒకసారి నన్ను అమరకోశంలోని శ్లోకాలు రోజుకొకటి చొప్పున అప్పజెప్ప

మన్నారు. అందుకు నేను 'అప్పచెప్పితే ఎంతిస్తావ్' అన్నాను. శ్లోకానికి 'పావలా ఇస్తానన్నారు' నేను ఆలోచించి – 'అప్పచెప్పితే పావలా ఇస్తావా, అప్పచెప్పకపోతే బేడ (పావలాలో సగం) ఇవ్వ చాలు' అన్నాను. 'ఒరేయ్ అప్పచెప్పినా అప్పచెప్పకపోయినా నేనే ఇవ్వడం న్యాయం కాదురా, అప్పజెప్పకపోతే నువ్వే నాకు బేడ ఇవ్వచాలు.' అన్నారు. 'నా దగ్గఱ డబ్బుల్లేవుగా' అన్నాను. 'ఎన్ని శ్లోకాలు అప్పజెప్పితే అన్ని పావలాలు వస్తాయిగా. ఒకవేళ 10 శ్లోకాలు అప్పజెప్పి, 10 శ్లోకాలు అప్పచెప్పక పోయావనుకో – అప్పుడు నీకు పదిపావలాలు వస్తాయి. అప్పచెప్పనందుకు పదిబేడలు పోయినా ఇంకా నీకు పది బేడ లుంటాయి. అసలు అన్ని శ్లోకాలూ అప్పచెప్పేస్తే పదిపావలాలూ నీకే వుంటాయి, నాకివ్వక్కర్లేదు గూడా !'అని చెప్పి ఒప్పించారు. ఆనాడు మా నాన్నగారు అలా అమరకోశం, బాల రామాయణం శబ్దమంజరీ ఇంకా ఇతర శ్లోకాలు చదివించి ఇచ్చిన శిక్షణ ఇప్పటికీ నాకు ఉపయోగపడుతోంది. దానికి తగ్గట్లు మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు ఆ నా సంస్కారాన్ని మరింత తీర్చిదిద్దారు.

మావూర్లో ఏదైనా గ్రామీణాభ్యివద్ధికి సంబంధించిన బహిరంగ సభ జరిగితే నన్ను మాట్లాడమనేవారు. ఒకసారి మా వూళ్లో ఉన్నతపాఠశాల ఏర్పాటు చేయాలి అని మాట్లాడినందుకు నాకు అర్థరూపాయి ఇచ్చారు.

నేను చదువు బందరులో కొనసాగించడానికి వెళ్ళేముందు – నాకు చదువుచెప్పిన బండారు సూర్యనారాయణ గారిని భోజనానికి పిలిచి భోజనానంతరం నా చేత బట్టలు పెట్టించి – దీవెన లిప్పించారు. ఆయన సంతోషించి వీడికి చదువుబాగా వస్తుంది. 'బి.ఎ.'పాస్పవుతాడు అని దీవించారు. అందుకు మా నాన్నగారు చాలా ఆనందపడ్డారు. (ఆరోజుల్లో బి.ఎ.అంటే చాలా పెద్ద చదువు క్రిందే లెక్కమరి!)

## వైదిక చమత్కారాలు

'నాన్నా నాకో పావలా ఇవ్వవా ?' అంటే – నాదగ్గరేముందిరా 'అశ్మాచమే...' అని ఊరుకునేవారు (రుద్రచమకంలో 'అశ్మాచమే' తర్వాత 'మృత్తికాచమే' వస్తుంది. 'మృత్తిక' అంటే 'మట్టి' అని అర్థం. అంటే 'నా దగ్గరేముంది మట్టి' అని నాన్నగారి మాట కర్థం).

ఎవరన్నా ఇంట్లో పగటి పూట మంచంమీద పడుకుని ఉంటే – 'చూసి కళ్లు వ్రేళ్లూ త్రిప్పుతూ – 'సుఖంచమే' అనేవారు. (చమకంలో 'సుఖంచమే' తర్వాత 'శయనంచమే' వస్తుంది. అంటే 'సుఖంగా నిద్రపోతున్నారన్నమాట!' అని నాన్నగారి మాట కర్థం.)

'ఏం నర్సిమ్మూర్తీ ! ఇవాళ ఇంత ఆలస్యమైంది హస్తోదకం కొట్టావా?' అనే వారు బావమరిదివరసైన నర్సిమ్మూర్తి మామయ్యతో ('హస్తోకందత్వా' అనే మంత్రం తద్దినానికి సంబంధించినది. అంటే – 'ఇవాళ తద్దినంభోజనమా?' అని నాన్నగారి మాట కర్థం).

అలాగే ఆ నర్సిమ్మూర్తి మామయ్యతోనే – ఏం ఇవాళ 'వయందేవస్య..... ఎక్కడ ? అనేవారు ('వయం దేవస్య భోజనం శ్రేష్ఠగ్ం సర్వధాతమమ్' అని అరుణ మంత్ర పాఠంలో వస్తుంది. అంటే – 'వయందేవస్య' తర్వాత 'భోజనం' అన్నపదం వచ్చింది కాబట్టి – 'భోజనం ఎక్కడ' అని నాన్నగారి మాటకర్థం అన్నమాట!).

'నాన్నా నా పుస్తకం ఎక్కడుందోనీకు తెల్సా ?' అని అడిగితే – 'ఉండరా నన్ను నేనే ఎఱుగను, నిన్ను నేనే మెఱుగుదును' అనే వారు.

అప్పుడప్పుడు 'ఇదమిదమన్నంతదిగిణతోం' అనేవారు అదేమిటో మా కర్థమయేది గాదు (పెద్దైం తర్వాత 'ఇది గూడా తద్దినమంత్రాల్లో వచ్చే 'ఇదమిద మన్నం' తాలూకు చమత్కారమే అని తెలిసింది).

ఒకసారి ఊళ్లో కట్టిన 'సుస్వాగతం' బోర్డులు చూసి, 'ఎవరి తద్దినం పెట్టడానికి ఈ బోర్డులు' అనేవారు. (స్వాగతం – సుస్వాగతం; సంపన్నం –

సుసంపన్నం; గంధం – సుగంధం ఇల్లాంటి జంట పదాలు ఆశీర్వచన మంత్రాల్లో వస్తాయి. ఈ విషయాలు ఆశీర్వచనాలు పెట్టే పెద్దవాళ్ళకే తెలుస్తాయి. (అసలు 'స్వాగతం' అనే మాట 'సు + ఆగతం' అని రెండు పదాలు కలిస్తే ఏర్పడుతుంది. అలా అయినప్పుడు మళ్ళీ 'సు + సు + ఆగతం' అనే మూడు మాటల కలయికగా 'సుస్వాగతం' చెప్పడం విచిత్రం అనిపిస్తుంది. బహుశా ఇదేవిధంగా షేక్స్‌పియర్ తన జూలియస్ సీజర్ నాటకంలో 'Most unkindest cut of all' అని Double Superlativeలో చెప్పాడేమో !

## అస్తవ్యస్తమైన ఆర్థిక పరిస్థితి

పాడిపంటలతో సుఖంగా గడిచిపోయిన నాన్నగార్కి – సంసారం, సంసార బాధ్యతల భారం పెరిగిన తర్వాత – పిల్లల చదువులకు వేరే వేరే ఊళ్ళల్లో రెండవ కాపురం పెట్టాల్సిరావడం; పిల్లల పెళ్ళిళ్లు; కలిసిరాని వ్యాపారాలు; అతి వృష్టి అనావృష్టులవల్ల దెబ్బతిన్న పంటలతో వృథా అయిన భారీ పెట్టుబడులూ, వాస్తుదోషాల గృహనివాస ప్రభావం, ఉన్న డబ్బును సరిగా ఖర్చుపెట్టుకోవడం తెలియక అప్పులుచేయవలసి రావడం – అన్నీ ఒక్కుమ్మడిగాను, ధారావాహికంగాను రావడంతో ఆస్తిపాస్తులన్నీ క్షీణించాయి. అమ్మవంటిమీద పుస్తెలతాడు మిగిలింది. మాగాణి పొలాలు, మెట్టతోటలు కనుమరుగైపోయాయి. కొడుకులు పెద్ద చదువులు చదవడానికి స్తోమత లేక చిన్న చిన్న ఉద్యోగాల్లోనే స్థిరపడాల్సి రావడం కూడా ఆర్థికరంగాన్ని మెరుగు పరచలేకపోయింది. అటువంటి పరిస్థితుల్లో గూడా – ఎక్కువమంది సంతానం గల మా బాబాయి భార్య చనిపోతే – వాళ్ళ పిల్లల్లో అశ్వత్థనారాయణను, ప్రబోధ సరస్వతిని తీసుకువచ్చి కొంతకాలం పోషించి పెద్ద చేసి బాధ్యతాయుతంగానే ప్రవర్తించారు.

ఆస్తి అంతా మైనరు ఆస్తిగాబట్టి పిల్లల చేత 'మైనరుదావా' వేయిస్తే మొత్తం ఆస్తి వస్తుందని కొందరు సలహా ఇచ్చారు. నాన్నగారు అందుకు ససేమిరా ఇష్టపడలేదు. నాకు మిగిలిన నా పిల్లలే నా ఆస్తిపాస్తులు అని చిట్ట చివరి

దాకా నీతిగాను, నిజాయితీగాను బ్రతికారు. అలా చేశారు కాబట్టే ఈనాడు మా అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు అందరం సుఖంగా ఉన్నాము. (మైనరు ఆస్తి వస్తే ఏమైపోయేవాళ్లమో !)

కొడుకులకు ఎలాగైనా ఒక స్వంత ఇల్లు ఏర్పడాలని నాన్నగారు పడిన శ్రమ ఇంతా అంతా గాదు. చివరకు బందరులోని గాంధీనగరంలో ఒక చిన్న ఇల్లు ఏర్పడినప్పుడు ఆయనకు కలిగిన తృప్తి ఆనందం ఇంతా అంతాకాదు.

**అవసానదశ**

1976 సంవత్సరంలో నాన్నగారి ఆరోగ్యం బాగా క్షీణించింది. బందరులో అన్నయ్యలున్న స్వంత ఇంటిలో ఉన్నప్పుడే 1976 ఫిబ్రవరి నెలలో మాఘ బహుళపంచమి నాడు చివరి క్షణాలు వచ్చాయి. అందరికీ తెలియబరచారు. గుంటూరు నుండి మేం వెళ్ళేటప్పటికే ఆయన తుదిశ్వాస విడిచి దేహత్యాగం చేశారు. ఏడాది తర్వాత 1977 జూలైలో మా అబ్బాయిగా మానాన్నగారే పుట్టారనుకున్నాను.

మా అమ్మకైనా ఏదో ఒక ఫొటో సంపాదించగలిగాం గాని, నాన్నగారి ఫొటో ఎక్కడా దొరకలేదు. అది మా దురదృష్టమే! ఎంతో ప్రేమానురాగాలతో పెంచి, సుసంస్కార విద్యా సంస్కృతులను పెంపొందింపచేసి, మా అందరినీ తీర్చిదిద్దిన మా నాన్నగారిని హృదయంలోనే స్మరిస్తూ – ఈ 'శివానందలహరి' పుస్తకాన్ని నిండు భక్తితో అంకితం ఇచ్చుకుంటున్నాను.

మ. సిరులన్ గోరక, ధర్మమార్గముననే జీవించి, సంతానమే
స్థిరమౌ సంపద యంచు నెంచి, తన యాస్తిన్ శక్తినర్పించి, సు
స్థిర విద్యా సుగుణమ్ములున్ కలుగురీతిన్ పెంచి పోషించి, ఈ
శ్వరునిన్ జేరిన తండ్రియైన హనుమచ్ఛాస్త్రిన్ సదా గొల్చెదన్.

–జి.ఎల్.ఎన్.శాస్త్రి



వివరణ కర్త్ర వంశవృక్షము
గొర్తి రంగయ్య గారు
(భార్య - బుచ్చెమ్మ)
1. రామమూర్తి
(భార్య - మంగళాంబ)
2. శేషమ్మ
(భర్త -రేమణి నర్సావధాన్లు)
3. సుబ్బారావు
(భార్య - సత్యవతమ్మ)
4. సత్యనారాయణమూర్తి
(భార్య - శేషారత్నమ్మ)
5. కనకమ్మ
(భర్త - మంత్రాల ముక్తేశ్వరరావు)
6. శివకామమ్మ
(భర్త - పరిమిశేషయ్య)
1.హనుమచ్ఛాస్త్రి
(భార్య - శేషారత్నం)
2. రంగయ్య
(భార్య - సీతారత్నమ్మ)
1. సుబ్బమ్మ
(భర్త - దర్భావెంకట కృష్ణమూర్తి)
2. రామలక్ష్మమ్మ
(భర్త - రేమణి వేంకటనారాయణ)
1. సుబ్బారావు
(భార్య - సత్యవతి)
2. రంగయ్య
(భార్య - భవాని)
3. ఆదినారాయణశర్మ
(భార్య - బాలాత్రిపురసుందరి)
1. వెంకట శేషావతారం
(భార్య - లలితాకుమారి)
2. రామమూర్తి
(భార్య - లక్ష్మి)
3. సర్వమంగళాంబ
(భర్త - మంత్రాల సీతారామశర్మ)
4. సీతామహాలక్ష్మి
(భర్త - జొన్నవిత్తుల ఆనందరామశాస్త్రి)
5. లక్ష్మీనారాయణశాస్త్రి
(వివరణకర్త)
(భార్య -విష్ణుప్రియ)
6. స్వరాజ్యలక్ష్మి
(భర్త - పిల్లలమఱ్ఱి నాగేశ్వరరావు)
7. శివప్రభాకరశర్మ
(భార్య - సూర్యశ్రీ)
8. పాండురంగారావు
(భార్య - విజయలక్ష్మి)



గురుదేవులు

శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్య

# ప్రార్థన

## జగన్మాత

శ్లో॥ శర్వాణి శారదారాధ్యే, శరచ్చంద్ర నిభాననే।
శరణ్యే త్ర్యంబకేదేవి, శాతోదరి నమోఽస్తుతే॥

## ప్రణవ బ్రహ్మము

మ॥ 'కణ' రూప 'ప్రథమంబు' నవ్య 'నవ' సంఖ్యల్ తెల్పు 'బ్రహ్మా'దులున్
'అణు' 'కేంద్రాం' తర 'సూక్ష్మమున్' - 'సుఘన' దివ్యంబైన 'బ్రహ్మాండము'న్
'క్షణ - కల్పా' న్విత 'బీజ - వృక్ష' విధ విజ్ఞానమ్ము నిక్షిప్తమౌ,
'ప్ర-ణవ' బ్రహ్మమునుచ్చరింతు మొదటన్, ప్రజ్ఞావికాసార్థమై

## గణపతి

కం॥ అక్షర గణపతి - వాక్స
ల్లక్షణ గుణ, సిద్ధి, బుద్ధి, లబ్ధికరుండున్,
అక్షరకుక్షి, వినాయక,
నిక్షిప్తాధార చక్రనిలయుని గొల్తున్

## కులదైవము - సుబ్రహ్మణ్యస్వామి

సీ॥ దేహపార్వతికి నాత్మేశునకును యోగ
సారమై పుట్టు కుమారుడెవరు ?
శుక్రధాతువు యొక్క సూక్ష్మతేజమ్ముగా
నార్యుడెవరు సుషుమ్నాగ్నియందు ?
షట్చక్రకృత్తికా స్వచ్ఛసారసుధల
నందుచు పెరుగు షడాస్యుడెవరు ?
ఆధార చక్ర పదార్థతత్త్వమ్మును
సత్త్వమ్ముగా మార్చు శక్తుడెవరు ?

గీ॥ సర్పవాలము నుండి శీర్షమ్ముదాక
వ్యష్టికుండలినీవల్లి కధిపు డెవరు ?
అట్టి స్కందుండు కులదైవమగును మాకు
ముందు ప్రార్థింతు వానినే ముక్తి కొఱకు

## గాయత్రి

శా॥ ఆయుర్దాయ గుణాభివృద్ధికిని ధన్యత్వమ్ము చేకూరగా,
సాయంత్రోదయ మధ్యకాలములలో సంధ్యా జపమ్మందునన్,
ధ్యేయమ్మందున ప్రజ్ఞ గూర్చి, పెడబుద్ధిన్ తీరుగా దిద్దు, శ్రీ
గాయత్రీ పరదేవతన్ కొలిచెదన్ కైవల్య సంసిద్ధికై

## తల్లి

మ॥ నవమాసమ్ములు నన్ను మోసి, తన ప్రాణస్పందనమ్మిచ్చి, యీ
నవరంధ్రముల కాయమున్ కనుచు నానందాబ్ధిలోమున్గి, నా
లవరూపమ్మును పెంచగా తన తనూలావణ్యమర్పించి, న
న్నవనిన్ నిల్పిన మాతృమూర్తియగు – శేషమ్మన్ సదా కొల్చెదన్

## తండ్రి

మ॥ సిరులన్ గోరక, ధర్మమార్గముననే జీవించి, సంతానమే
స్థిరమౌసంపద యంచునెంచి, తన యాస్తిన్ శక్తి నర్పించి, సు
స్థిర విద్యాసుగుణమ్ములున్ కలుగురీతిన్ పెంచి, పోషించి, ఈ
శ్వరునిన్ జేరిన తండ్రియైన – హనుమచ్ఛాస్త్రిన్ సదా కొల్చెదన్.

## గురువు

మ॥ స్థిరచిత్తుండును, బుద్ధిశాలి, ఘనసౌశీల్య స్వభావుండు, సా
దరహాసద్యుతిమంతుడున్, సకల విద్యా సారచిద్రూపుడున్,
నరరూపాచ్యుత పుణ్యమూర్తి, భవచింతల్ దీర్చు సౌజన్య సుం
దరుడౌ, శ్రీగురు వెక్కిరాలకుల కృష్ణస్వామినే గొల్చెదన్.

## పరమ గురువు

మ॥ భవరోగార్త జనాళిబాధలు హరింపన్ జేసి రక్షించగా,
నవమంత్రమ్ములు సృష్టిజేసి తన జ్ఞానమ్మున్ ప్రసాదింపగా,
అవనిన్ తిండికి లోటు లేనటుల యోగార్థాదులన్సాకగా
శివధాత్రచ్యుత తత్త్వమూర్తియగు శ్రీ సీవీవినే గొల్చెదన్.

## బ్రహ్మ

మ॥ అన్నియు లీనమై, ప్రళయమందుననున్న విశాల విశ్వమున్
తిన్నగ పూర్వ రూపముగ తీరుగ తెచ్చెడి సృష్టిలోన, తా
నెన్నడు సృష్టికర్తనను నించుక భావము పొందకుండగా,
"తన్ను" ననుగ్రహింపుమని – తండ్రిని కోరిన బ్రహ్మగొల్చెదన్

## విష్ణువు

శా॥ ఆరాధింతును చిత్తశుద్ధిగ ఘనశ్యామప్రభాదేహునిన్,
క్షీరాబ్దిస్థిత శేషతల్పశయనున్, శ్రీ సేవితాంఘ్రిద్వయున్,
స్మేరాస్యద్యుతిమత్క పోలయుగళున్, శ్రీభూపతిన్, స్వర్ణకే
యూరాలంకృత బాహునిన్, ప్రబలరమ్యోరోలసత్ కౌస్తుభున్

## మహేశ్వరుడు

మ॥ శశిరేఖామర వాహినీకలిత శీర్ష స్థానసంశోభితున్,
శశిసూర్యానలనేత్రునిన్, విమలభస్మ శ్రీ సుసంపన్నునిన్,
విశదప్రాభవ నీలకంఠపరితోవేల్లత్ సమీరాంధసున్,
దశకంఠార్చిత దివ్యమూర్తి, శివునిన్ – ధ్యానించి పూజించెదన్.

## సరస్వతీ దేవి

గీ॥ పలుకు "సంకల్ప"మై "పరా" వాక్కుగాను,
చలిత "భావము" – వాక్కు "పశ్యంతి" గాను,
భావ "రూపమున్" "మధ్యమా" వాక్కుగాను
వ్యక్తభా "షోచ్చరణము"గ "వైఖ"రగుచు,
నాల్కపైనాడు "వాణికి" నతులు శతము.

## లక్ష్మీదేవి

కం॥ పద్మముఖి, పద్మగంధిని,
పద్మాక్షిని, పద్మధాత్రి, పద్మవికాసన్,
పద్మిని, పద్మనివాసిని
పద్మప్రియ, పద్మనాభపత్నిని గొలుతున్.

## పార్వతీదేవి

కం॥ "ఊ" అనిన నాపకుండగ,
"మా" యనిననుగూడ తపము మానక చేయన్,
ధ్యేయార్ధ దేహమందిన-
"మాయమ్మ" "నుమను" గొలుతును మానస మందున్

## శ్రీరాముడు

మ॥ నతులన్ జేయుచు మ్రొక్కెదన్ - శుభకరజ్ఞాన ప్రకాశాన్వయున్,
పితృవాక్పాలన ధీరునిన్, సదయగంభీరాస్య సంశోభితున్,
స్మితభాషిత్వ సువర్తనున్, క్షితి సుతాసీతైక పత్నీ వ్రతున్,
మితభాషిత్వ ఋతవ్రతున్, సుగుణసమ్మిశ్రుండు - శ్రీరామునిన్.

## శ్రీ కృష్ణుడు

గీ॥ బహుళ భార్యలు గల్గిన బ్రహ్మచారి,
భోగ భాగ్యమ్ములందిన యోగవిభుడు,
బుల్లినోటను విశ్వమ్ము చెల్లువాడు,
నెమలి ఈకతో భ్రమ పెట్టునేర్పు గలిగి
గుల్లపుల్లతో గుండెలన్ కొల్లగొట్టు-
నల్లనయ్యకు నర్పింతు నతులు శతము.

## జగత్పిత

కం॥ శుక, పశు, ఝుర, నిర్జర, నర,
పిక, గిరి, తరు, నిధులతోడ విరియును జగమున్,
శకలములుగ కనబడు నీ
సకలము నొక దేహమైన స్వామిని గొల్తున్.

కం॥ దేవాలయ దేహములో
దేవతలందఱును దేహ దివ్యాంగములై,
ఈ విశ్వ దేహమందున
దేవునిగా చెల్లునట్టి దేహిని గొలుతున్

- జి. యల్. ఎన్. శాస్త్రి

## పీఠిక

పంచ భూతాత్మకమైన ఈ ప్రపంచంలో ఋతుధర్మాలు; గ్రహ తార గతులు; పదార్థ వస్తు లక్షణాలు; వివిధ జీవరాశుల - కీలక లక్షణాలు, గుణాలు; కాలధర్మాన్ని సూచించే రేయింబవళ్ళు, శుక్లపక్ష, కృష్ణపక్ష తిథులు, మాసాలు, సంవత్సరాలు - మొదలైనవన్నీ సృష్ట్యాది నుండి ఇప్పటివరకు క్రమబద్ధంగా వుండటం సృష్టి ప్రణాళిక యొక్క 'తత్త్వాన్ని' సూచిస్తుంది. సృష్టికి పూర్వం ఇవన్నీ ఒక 'తత్త్వము'గా వున్నట్లు ఊహిస్తే - ఆ తత్త్వం నుండి వేరైన సృష్టి భాగాన్ని - 'ప్రకృతి' గాను, వేరు కాని భాగాన్ని 'పురుషుడు'గాను చెప్పుకోవాలి. అంటే - ఈ ప్రకృతి పురుషులిద్దరూ ఆ ఒకే తత్త్వానికి చెందిన రెండు భాగాలన్నమాట! (ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాది ఉభావపి' - భగవద్గీత). అంతరిక్షంలో అనాదిగాఉన్న ఈ విశ్వసత్యాన్ని (Universal truth) దర్శించినపుడే - 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి' అన్న తైత్తిరీయోపనిషద్వాక్యానికి సరియైన అర్థం తెలిసి, అవగాహన కలుగుతుంది. ఈ విషయాన్ని భారతీయ ఋషులే కాదు, ఇతర మతాలకు చెందిన పెద్దలు కూడా దర్శించారు. 'తత్త్వం' యొక్క రెండు భాగాలను భారతీయులు - 'ప్రకృతి - పురుషులు' అని, లేదా 'అర్థనారీశ్వరులు' అని; క్రిష్టియన్లు - 'జిహ - వహ్ (జిహోవా) అనీ; చైనీయులు 'ఇన్ - యాన్' అనీ - పేర్లు పెట్టుకున్నారు. దీనిని బట్టి ఉన్నతత్త్వం ఒక్కటే అనీ, పేర్లు మాత్రమే వేరు అనీ గ్రహించాలి.

భారతీయుల్లో వివిధ రకాల భక్తి మార్గాలకుచెందినవారు మళ్ళీ పైన తెల్పిన జంటకు వేరు వేరు పేర్లు పెట్టుకున్నారు. కొందరు 'శివ - పార్వతు'లని, కొందరు 'లక్ష్మీ-నారాయణు'లని కొందరు 'శక్తి - శక్తుడు' అని - మరికొందరు 'రాధా-కృష్ణులని' - ఇలా ఎన్నో రకాల పేర్లతో పిలుచుకుంటారు. వీరి ద్వారా జరిగే సృష్టి ప్రణాళికలోని వివిధ అంశాలనే వాళ్ళు వారి వారి లీలలుగా

చెప్పుకుంటారు. అంటే వున్న తత్త్వం ఒక్కటే గాని, పేర్లు మాత్రం తేడా అన్నమాట ! అయితే అలా వేరు వేరు పేర్లు పెట్టుకుని వాళ్ళ వాళ్ళ పద్ధతుల ప్రకారం త్రికరణశుద్ధిగా ఆరాధించుకుని తరించిన వారు అన్ని పద్ధతుల వారిలోను ఉన్నారు. రాముణ్ణి, శివుణ్ణి, కృష్ణుణ్ణి, విష్ణువును, రాధను, పాండురంగని, లలితాదేవిని ఇలా ఎందరినో ఆరాధించి తరించిన వారున్నారు. ఇలా ఆరాధించి తరించడం వల్ల ఎవ్వరికీ నష్టం లేదు, ఎవ్వరూ తప్పు కూడా పట్టరు. కాని, ఎవరికి వారు – "వాళ్ళు అనుసరించే పద్ధతే గొప్పదని, మిగతా వారు అనుసరించే పద్ధతులు అర్థంలేనివనీ, మాపద్ధతిలో దేవుణ్ణి ఆరాధిస్తేనే తరిస్తారని చెప్పడం' – "మా దేవుడొక్కడే దేవుడు, మిగిలిన దేవుళ్లను ఆరాధించేవారు – 'పాపులు' అన్నట్లు ఉంటుంది". ఇంకా అర్థమయేట్లు చెప్పాలంటే 'పోలీసులు కాని వారందరూ దొంగలు' అన్నట్లుంటుంది. అసలు ఇలా అనడం ప్రారంభమయితేనే 'రగడ' ప్రారంభమౌతుంది, వైరుధ్యాలు పెరుగుతాయి. ధ్యేయం దూరమై, ద్వేషం దగ్గరౌతుంది. వైషమ్యాలు తీవ్రమై ఒకరి నొకరు తిట్టుకోవడం, కొట్టుకోవడం దాకా కూడా వెళ్తాయి. వెళ్తాయి ఏమిటి ? వెళ్ళాయి, ఇప్పటికీ వెళ్తున్నాయి గూడా ! లలితాదేవి తామసశక్తి అని– అటువంటి తామస శక్తిని ఆరాధిస్తే నెత్తణుస్తుందని చెప్పే ప్రబుద్ధులూ, ప్రళయానికి అధిపతి అయిన శివుణ్ణి ఆరాధించడం మంచిది కాదని చెప్పి విభూతిని, కుంకుమబొట్టును తీయించి వారికి 'నామాలు' పెట్టే వైష్ణవ పీఠాధిపతులు, విష్ణ్వారాధన మంచిది కాదని నామాలు తీయించి విభూతిని ధరింపజేసే శైవాభిమానులు కూడా వున్నారు. ఇది వారి మొండితనాన్ని – అజ్ఞానాన్ని తెలియచేస్తుంది, తప్పితే వారి భక్తిని, ఆరాధనా వైశిష్ట్యాన్ని పెంచదు. ఏదో అదృష్టం కొద్దీ భక్తి పుట్టి ఆరాధన మొదలుపెట్టేవారిని చెడగొట్టే వీళ్ళనేమనాలో, ఏం చెయ్యాలో ఆభగవంతుడే నిర్ణయించాలి.

ఎవరినో ఆరాధిస్తే ఎవరికో ఏదో కలసి వచ్చిందట – అనివారి భక్తి మార్గాన్ని ఆవేశంతోను, ఉద్వేగంతోను, ఆత్రంగాను అనుసరించి తామూ భక్తులమనిపించుకుని, కలిసి రావడానికి ఎదురు చూసే వారుంటారు. కలిసి

రాకపోతే మెటికలు విరిచి, ఇంకొకరి మార్గాన్ని ఎన్నుకుంటారు. ఇలా ప్రతి వ్యక్తి కొంతకాలం భక్తునిగా వుంటాడు. పెద్దల బోధలు వినగా వినగా, మంచి పుస్తకాలు చదవగా చదవగా సృష్టితత్త్వాన్ని తెలుసుకుని దానిపట్ల అవగాహన పెరిగి 'జ్ఞాని' అవుతాడు. ఈ జ్ఞాని స్థితికి వచ్చినవాడు కూడా – తాను వున్న స్థితి అత్యున్నత స్థితి అని, అత్యుత్తమ మైనది – అని అనుకుని అహంకారపడే అవకాశం వుంటుంది. దీన్ని దాటి అన్ని మార్గాల్లోను, అన్నిటా – ఒకే సర్వాంతర్యామిని దర్శిస్తూ 'అనన్యచింతతో' – ('అన్యము' – అంటే ఇతరము, 'అనన్యము' – అంటే ఇతరములేనిది – అని అర్థం. కాబట్టి, 'అనన్యచింత' – అంటే 'అందరిలోనూ, అన్నిటా సర్వాంతర్యామి తప్ప ఇతర మనేది లేదనే భావన' – అంతేగాని 'అందరిలోను, అన్నిటా తాను నమ్మిన దైవం తప్ప ఇతరులు నమ్మినవారు లే'రనే భావన కాదు) ఏదో ఒక ఆరాధనా పద్ధతిని అనుసరించి మళ్ళీ భక్తుడౌతాడు. ఇలా జ్ఞాని అయి – అటు తర్వాత భక్తుడైన వానికి వైషమ్యబుద్ధి, వైరుధ్యబుద్ధి వుండదు. ఈ భక్తుడే నిజమైన భక్తుడు. ఇతడు జ్ఞానంతో కూడివున్న పరిపూర్ణ భక్తుడు. ఇంతకు పూర్వం చెప్పిన భక్తుడు అపరిపూర్ణుడే !

రకరకాల పేర్లతో ఎవరి పద్ధతిలో వారు ఏర్పరచుకునే విధానానికి ఒక విధంగా వ్యాసులవారి పురాణాలే కారణం అని చెప్పుకోవచ్చు. లింగపురాణం లోను, శివసహస్రనామస్తోత్రంలోను – శివుడే అందరికంటే (Supreme) గొప్పఅని; భాగవతంలోను, విష్ణుసహస్రనామ స్తోత్రంలోను – నారాయణుడు లేదా విష్ణువే అందరికంటే గొప్పవాడు అని; దేవీ భాగవతంలోను, శ్రీలలితా సహస్రనామ స్తోత్రంలోను అమ్మవారే అందరికంటే అధికురాలు – విశ్వ సామ్రాజ్య మహారాజ్ఞి అని చెప్పినట్లుంటుంది. దీని వల్ల వీరశైవం, వీరవైష్ణవం, వీర శాక్తం పుట్టుకు వచ్చి, ఇంతకు ముందు తెలిపినట్లుగా వేరు వేరు ఆరాధనా పద్ధతులు పుట్టుకొచ్చి కొట్టుకున్నారు. ఇంకా కొట్టుకుంటూనే వున్నారు కూడా!

పైన తెల్పిన వాళ్ళందరూ ఒక్కవిషయాన్ని అర్థం చేసుకోలేదు. ఇలా శివుడే గొప్పఅనీ, విష్ణువే గొప్పఅని, అమ్మవారే గొప్ప అని చెప్పింది ఒకే వ్యక్తి అయిన వ్యాసులవారే గాని వేర్వేరు వ్యక్తులు కాదు. వేర్వేరు వ్యక్తులు అలా చెప్పారంటే అర్థం చేసుకోవచ్చుగాని, వ్యాసుడే అలా చెప్పి అందరి మధ్య వైషమ్యాగ్నికి ఆజ్యం పోయడమేమిటా అని అనిపిస్తుంది. ఇక్కడే జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. వీళ్ళందరి వాదనలకు ప్రామాణికమైన వ్యాసుడు విభూతి పెట్టుకుని లింగపురాణాన్ని, నామం పెట్టుకుని భాగవతాన్ని, కుంకుమ పెట్టుకుని లలితోపాఖ్యానాన్ని వ్రాసి ఆయన ఏ బాధా లేకుండా బాగానే వున్నాడు. ఆయన చెప్పిన విషయాలు విన్న మనకే 'వైషమ్యరోగం' పుట్టింది. సర్వాంతర్యామి ఒక్కడే వుంటాడు గాని ఎక్కువమంది వుండరు గదా! అలాటప్పుడు 'ఒకే తత్త్వానికి చెందిన ఆ సర్వాంతర్యామిని వేరు వేరు నామాలతో, వేరు వేరు రూపాలతో శివుడు, నారాయణుడు, లలిత మొదలైనవారిగా చెప్పి, ఎవరి అభిరుచిని బట్టి వారు ఆరాధించి, తరించమని వ్యాసుల వారు చెప్పివుండవచ్చు నేమో !' – అనే భావన కలగాలి. సమన్వయం కుదరనంత వరకు – 'వెఱ్ఱితీరింది రోకలి తలకు చుట్టమన్నట్లుం'టుంది. దురభిమానాలు పోవు, వక్రబుద్ధులు, వక్రభాష్యాలు తప్పవు.

ఒక మహానుభావుడు – ఒకసారి శివుడు గొప్ప. ఒకసారి విష్ణువు గొప్ప, ఒకసారి అమ్మవారు గొప్ప అన్నాడంటే – ఆ 'ముగ్గురూ' ఒక్కటేనేమో, ఒకే తత్త్వానికి వేరు వేరు పేర్లేమో అన్న దర్శనం జరగాలి గాని, ఇలా చ్పెపడంలో మహానుభావుడైన వ్యాసునికి కొంత 'తిక్కదనం' ఉందేమోనని అనుకోకూడదు. మరైతే వ్యాసుడు ఎందుకు ఇలా చెప్పాడన్న దాని క్కూడా ఆలోచిస్తే సమాధానం ఉంది.

ఒక్కొక్క పురాణం ఒక్కొక్క పెళ్ళి సంబరం లాంటిది అనుకోండి. ఆ పెళ్ళిలో ఎవరికి అత్యున్నత స్థానం ఇవ్వబడుతుంది ? పెళ్ళి ఎవరికి

జరుగుతుందో ఆ పెళ్ళి కొడుక్కి లేదా పెళ్ళికూతురికి అంతేగదా! ప్రిన్స్‌పాల్ గారు, కలెక్టరు గారు, మంత్రిగారు కూడా పెళ్ళికొడుక్కంటే గొప్పే కావచ్చు. కాని, పెళ్ళిసమయంలో వీళ్ళందరి కంటె పెళ్ళికొడుక్కే ప్రాముఖ్యం ఎక్కువ. పెళ్ళి కొడుకు మాటకే విలువ ఎక్కువ. అయితే ఇదే పెళ్ళికొడుకు ఇంకొకరి పెళ్ళికి వెళ్ళాడనుకోండి – అక్కడ ఆ క్రొత్త పెళ్ళి కొడుక్కి ప్రాధాన్యం వుంటుంది కాని మొదటి పెళ్ళికొడుక్కి ప్రాధాన్యం వుండదు. ఎవరెవరి పెళ్ళి జరుగుతున్నపుడు వాళ్ళ వాళ్లకి ప్రాముఖ్యం ఎలా ఎక్కువ ఇవ్వబడుతుందో – ఎవరెవరి పురాణం వ్రాస్తున్నపుడు వారి వారికి మిగతావారి కంటె ప్రాముఖ్యం అలా ఎక్కువ ఇవ్వబడుతుంది. వివిధ పురాణాలు వ్రాసిన వ్యాసుల వారు ఇదే విషయాన్ని పాటించారు. ఈ సమన్వయం అవగాహన కలగకపోతే అజ్ఞానంతో అవరోధాలు కల్పించుకుని – అర్థం లేని జీవితాలు గడపవలసి వస్తుంది. (ఈ విషయాలన్నీ ఇలా విపులంగా వ్రాయకపోతే ఈ శివానందలహరిని కూడా ఏకపక్షంగా చెప్పిన గ్రంథమే అనుకునే ప్రమాదం వుందని పై విషయాలన్నీ వ్రాశాను.)

వ్యాసులవారి మార్గాన్ని అనుసరించిన వారెవరన్నా వున్నారంటే ఆయన ఆదిశంకర భగవత్పాదులే ! శంకరులు శివునిపరంగా, విష్ణువుపరంగా, లక్ష్మీనరసింహస్వామిపరంగా, లక్ష్మీదేవిపరంగా, లలితాపరమేశ్వరి పరంగా, శ్రీరాముని పరంగా – ఇలా ఎందరో దేవతల పరంగా స్తోత్రాలు వ్రాశారు. అందరిలోను వున్న ఒకే ఒక సర్వాంతర్యామిని చూడగలిగిన 'అద్వైత' దృష్టి గలవారు మాత్రమే ఇలా త్రికరణశుద్ధిగా, నిష్పక్షపాతంగా సర్వదేవతాస్తుతులను వ్రాయగలరు. మా గురువుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారు గూడా శివకేశవ గణేశ సూర్య శ్రీలలితా దేవతలందరినీ అర్చించి వారి స్తోత్రాలను రచించి, వివరించారు. ఇటువంటివారి రచనలు చదివితే – పరమత సహనమే గాదు పరదేవతా సహనం, పరగురు సహనం గూడా ఉండాలని అందరిలోను ఒకే సర్వాంతర్యామిని చూడాలని తెలుస్తుంది.

ఇంతకు ముందు తెల్పిన వివిధ ఆరాధనా మార్గాల్లో ఒకటైన శివారాధన విషయం ప్రస్తుత గ్రంథమైన 'శివానందలహరి'లో చెప్పబడింది. శాస్త్రము, జ్ఞానము, తర్కము మొదలైన వాటితో సంబంధము లేకుండా సంపూర్ణంగా శరణాగతిద్వారా తరించే మార్గాన్ని పరమోపదేశంగా

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః'.**

అని భగవద్గీతలో భగవానుడైన కృష్ణుడు చెప్తాడు. ధర్మాధర్మనిర్ణయాలను భగవంతునికి వదిలి, విధ్యుక్తధర్మాలను, బాధ్యతలను నిర్వహిస్తూ - తనకు శరణాగతి చెందితే అటువంటివారిని తాను ఉద్ధరిస్తానని, దుఃఖించవలసిన పనిలేదని భగవంతుడు ఈ శ్లోకంలో అర్జునునికి పరమోపదేశంగా చెప్పినట్లు వ్యాసుల వారు భగవద్గీతలో తెలియపరిచారు. సరిగ్గా ఆది శంకరులు కూడా ఇదేవిధంగా 'నహినహిరక్షతి డుకృఞ్ కరణే - గోవిందంభజ' - లాంటి భజగోవింద శ్లోకాల్లో చెప్తారు. ప్రస్తుత శివానందలహరిలో కూడా ఇదే విషయాన్ని నొక్కి వక్కాణిస్తారు. ఎన్నో విధాలుగా ఈ 'శరణాగతి' సమర్పణ భావాలను విశదీకరిస్తారు. అంటే - 'శివానందలహరి'లో - పూర్తిగా భక్తికి, సమర్పణకు సంబంధించిన విషయాలే వుంటాయి గాని, 'సౌందర్యలహరి'లో లాగా సాంకేతిక పదాలతో వివిధ శాస్త్ర జ్ఞాన విషయాలుండవు.

ఎన్నో రకాలుగా ప్రపంచంలో శివుడు వ్యక్తమౌతాడు. రుద్రసూక్తాలు చదివితే ప్రపంచంలో ఎన్ని రకాల జీవులుగా, పదార్థాలుగా, పాత్రధారులుగా - శివుడు వ్యక్తమౌతాడో కొంతవరకు తెలుస్తుంది. అన్ని రకాలుగాను శివుణ్ణి ధ్యానించి తరించవచ్చున్నట్లు - ఈ శివానందలహరిలో చెప్పబడినట్లుంటుంది.

ఒకసారి శివుణ్ణి మేఘంతో పోల్చి - హృదయమనే క్షేత్రాన్ని పండించుకోమంటారు. శివుణ్ణి వేటగానితో పోల్చి తన మనస్సనే అరణ్యంలో వున్న కామక్రోధాది వన్యమృగాలను వేటాడి ఆనందించమంటారు. తన

మనస్సును మోహారణ్యంలో తిరిగే కోతితో పోల్చి ఆదిభిక్షువుగా భిక్షానికి వెళ్తున్నపుడు దాన్ని వెంటతీసుకువెళ్ళమంటారు. తన చిత్తమనే గుడారం చాలా సదుపాయంగా వుంటుందని, దాంట్లో స్థిర నివాస మేర్పరచుకోమని శివుణ్ణి వేడుకుంటారు. తన బుద్ధి అనే కన్యను పెళ్ళిచేసుకుని - తన హృదయమనే ఇంట్లో సుఖంగా ఇల్లరికపుటల్లుని లాగా ఉండిపోరాదా' అని అంటారు. తన మనస్సును పక్షితో పోల్చి శివుని పాదమనే గూటికి చేరమంటారు. ముసలిఎద్దును వదిలి తన మనస్సనే శ్రేష్ఠమైన గుఱ్ఱాన్ని ఎక్కి తిరగమంటారు. ఇలా ఎన్నో రకాలుగా శివుణ్ణి ప్రార్థిస్తారు.

శివుణ్ణి మంచి చేసుకోడంలో సామదానభేద దండోపాయాలన్నీ అనుసరిస్తారు. మొదట బ్రతిమాలి ప్రార్థించి నయానా ప్రయత్నించిన శంకరులు తర్వాత – 'నువ్వే ఆలోచించుకో నన్ను నీ దగ్గరకు తీసుకుంటే, నీవాణ్ణి చేసుకుంటే నీకే లాభం' అని దానోపాయాన్ని అవలంబిస్తారు. అటుపైన – 'అవునులే దోషాలు అవగుణాలు వున్న చంద్రుడి లాంటి వాళ్లనైతే నువ్వు నెత్తి కెక్కించుకుంటావు – నీకు మంచి లక్షణాలు గల వాళ్ళెందుకు ? నేనూ అలాంటి వాణ్ణే అయితే నీ వాణ్ణి చేసుకుంటావేమో చెప్పు' – అంటారు. ఇక చివరకు సౌమ్యమైన పద్ధతులు పనిచెయ్యకపోతే – అర్జునుడిలా తిరగబడి కలియబడి పోరాడి నీ మెప్పు పొందాలంటే ఆ ప్రయత్నం చేస్తాను చెప్పు నీ 'ఇష్టం' – అంటారు. చివరకు ఇంక 'నా మనస్సును అరికట్టే శక్తి నాకు లేదు గాని నువ్వే ఎలాగో నీ వశంలో పెట్టుకో – అని సంపూర్ణ శరణాగతి చెంది, తన్ను తాను శివునికి సమర్పించుకుంటారు.

చివరకు ఇంకో ముఖ్యమైన విషయం. శంకరాచార్యుల వారు ఆంధ్రదేశంలో పర్యటిస్తున్నపుడు శ్రీశైల క్షేత్రాన్ని సందర్శించారు. ఆ క్షేత్రంలోనే కొన్ని రోజులు తపస్సు చేశారు. ఆ రోజుల్లోనే శ్రీశైల మల్లికార్జున స్వామిని దర్శించి ఆ స్వామినుద్దేశించి రెండు అద్భుతమైన శ్లోకాలు చెప్పారు. ఆ రెండు

శ్లోకాలను - 100 శ్లోకాల ఈ శివానందలహరిలో ప్రాణప్రదంగా 50, 51 శ్లోకాలుగా మధ్యలో కూర్పుచేశారు. అవే 'సంధ్యారంభవిజృంభితం..' 'భృంగీచ్ఛానట...' అనే శ్లోకాలు.

కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందంటారు. 'శ్రీ శైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' - అంటారు. ('శ్రీశైల గోపుర శిఖరం చూస్తే చాలు పునర్జన్మ వుండదు' అని దీని అర్థం) అంటే, కాశీలో మరణించిన తరువాత సాధించేదాన్ని - శ్రీశైల శిఖరం చూస్తూ బ్రతికి ఉన్నప్పుడే సాధించవచ్చన్నమాట! దీనిని బట్టి శ్రీశైలం ఎంత గొప్ప పుణ్యక్షేత్రమో అర్థం చేసుకోవచ్చు. ఆ క్షేత్రస్వామిపై శంకరులు వ్రాసిన పైన తెల్పిన శ్లోకాలకు వివరణ గూడా ఈ పుస్తకంలో చదువుకుని ఆనందించండి.

ఈ శివానందలహరిలో కేవలం భక్తుడు, భక్తి, భగవంతుడు - ఈ మూడు ప్రధానాంశాల ప్రసక్తే వుంటుంది. ఇతర ప్రసక్తి వుండదు. ప్రతిజీవి తరించడానికి చెయ్యవలసిన అన్ని ప్రయత్నాలు చెప్పడం జరుగుతుంది. 'విశ్వదాభిరామ వినురవేమ' అని వేమన తనకు తాను చెప్పుకున్నట్లు - శంకరులు తన మనస్సుతో తాను చెప్పుకుంటున్నట్లు వున్నా - అదంతా మనకోసమే అని గ్రహించాలి. ఆచరించి, తరించాలి.

వృషకార్తీకపూర్ణిమ
30-11-2001

-జి.ఎల్.ఎన్.శాస్త్రి



శ్రీ ఆదిశంకర భగవత్పాదులు

శ్లో॥ శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం।
నమామి భగవత్పాదం శంకరం లోక శంకరమ్॥

శ్రీరస్తు

శ్రీ గణేశాయ నమః

శ్రీ భవానీశంకరస్వామినే నమః

# శివానందలహరి

## సంస్కృత శ్లోకము - 1

శ్లో. కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే ।
శివాభ్యా మస్తోక త్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానందస్ఫురదనుభవాభ్యాం నతి రియమ్.

## అనువాద పద్యము

సీ॥ తమ తపః ఫలముచే తాదాత్మ్యమును బొంది
అర్ధనారీశ్వరులగుచు నిలచి,
త్రిభువనంబుల కెల్ల శుభదాయకులు నౌచు
కర్మఫలములన్ని కలుగజేసి,
భక్తకోటి హృదయ భావనా జగతిలో
మరల మరల వారి గరుణ జూచి,
హృదయారవిందాల నుదయింపజేయుచు
తత్త్వవిదులనెల్ల దయను జూచి.

గీ॥ చంద్రరేఖను శిఖలలో చక్క నిల్పి
సకల విద్యాస్వరూపులై జ్ఞానమొసగు,
శివశివారూపులకు నాదు చిత్తమందు -
కోరి చేయుదు శత నమస్కారములను.

## టీక

కలాభ్యాం = మహావిద్యాస్వరూపులును, చూడాలంకృత = శిఖలచే నలంకరింపబడిన, శశికలాభ్యాం = చంద్రరేఖలు గలవారును, నిజతపః =

(ఒకరికొకరు) తమతమ నిరాహారాది వ్రతముల యొక్క, ఫలాభ్యాం = ఫలమైన వారును, భక్తేషు = భక్తులయందు, ప్రకటిత = చూపబడిన, ఫలాభ్యాం = కర్మఫలములు గలవారును, అస్తోక = కొలదిలేని, త్రిభువన = ముల్లోకముల యొక్క శివాభ్యాం = శుభములుగలవారును, హృది = మనస్సునందు (ధ్యానించునప్పుడు), పునర్భవాభ్యాం = (అప్పటికప్పుడు) మరల మరలదోచుచుండువారును, ఆనంద = పరమానందంతోగూడ, స్ఫురత్ = తోచుచుండెడు, అనుభవాభ్యాం = స్వరూపసాక్షాత్కారము గలవారును అగు, శివాభ్యాం = ఉమామహేశ్వరుల కొఱకు, ఇయం = ఈ, మే = నా యొక్క; నతిః =నమస్కారము, భవతు = అగుగాక !

## తాత్పర్యము

సకలవిద్యా స్వరూపులును, సిగలచే అలంకరింపబడిన చంద్రరేఖలు గలవారును, తమతమ తపః ఫలములుగా ఒకరికొకరు పొందబడినవారును, భక్తులకు కర్మఫలాదులను ప్రసాదింప జేయువారును, ముల్లోకములకు అత్యంత శుభదాయకులుగానుండువారును, తలచినంతనే హృదయమందు మరల మరల ప్రసన్నులగువారును, ఆనందముతోపాటు స్వరూప సాక్షాత్కారానుభవమును గూడా కలుగ జేయువారును అగు - (ఆది దంపతులైన) పార్వతీ పరమేశ్వరుల కొరకు ఇదే నా నమస్కారము.

## వివరణము

ఈ 'శివానందలహరి' జగత్పిత అయిన శివునికి సంబంధించిన స్తోత్రమే అయినప్పటికి, ఈ ప్రథమ శ్లోకం - జగత్తుయొక్క ఆవిర్భావానికి కారణంగా ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులిద్దరినీ ఉద్దేశించి చేసిన ప్రార్థన. వాస్తవానికి 'శివానందలహరి' అనే సమాసం 'శివ + ఆనంద + లహరి' అనే విధంగానేగాక, 'శివా + ఆనంద + లహరి' అనే విధంగాకూడా విడదీసి అర్థాన్ని గ్రహించవచ్చును. శివునికి సంబంధించిన విషయాలన్నీ పార్వతికి

గూడా ఆనందాన్నికలుగజేసేవే కాబట్టి - 'శివా = పార్వతికి, ఆనంద = ఆనందమును గూర్చు, లహరీ = (ఆనంద తరంగ) ప్రవాహము'గా గూడా ఈ స్తోత్రానికి అర్థాన్ని చెప్పుకోవచ్చును.

'శ్ + ఇ + వ్ + అ = శివ', 'శివ + ఆ = శివా' అవడాన్ని బట్టి 'శివ' పదంలో 'శివా' పదం ఉండకపోవచ్చును కాని, 'శివా' పదంలో 'శివ' పదం ఇమిడి ఉంటుంది అనే విషయం సుస్పష్టం. ఈ శివాశివులిద్దరూ ఒకరిని ఆశ్రయించి ఒకరుంటారు. భౌతికంగా వ్యక్తమవడానికి అయ్యవారు అమ్మవారిపైనే ఆధారపడతారనీ, ఆ అమ్మవారిగా భౌతిక దేహంతో ఏర్పడడానికి ఆ అయ్యవారి సంకల్పమే కారణమనీ అర్థం చేసుకుంటే - వీళ్ళిద్దరి మధ్య వుండే పరస్పరాధార సంపూరక సంబంధం (Inter dependent complimentary relation) అర్థమౌతుంది.

కనబడేది, కదిలేది, నడిచేది - అమ్మవారి తత్త్వం. కనబడనిది, కదిలించేది, నడిపించేది - అయ్యవారి తత్త్వం. అంటే - గుడ్డిభార్య భుజాలపైన కుంటి భర్త కూర్చుని చేరవలసిన గమ్యాన్ననుసరించి ఆ భార్యను నడిపించే రీతిగా ఈ ప్రకృతిపురుషుల దాంపత్యాన్ని, వారి విశ్వ ప్రణాళికను అర్థం చేసుకోవాలి. ఈ ప్రకృతి పురుషులు లేదా పార్వతీ పరమేశ్వరులను ఉద్దేశించి చేసిన ప్రార్థన అయిన ఈ ప్రథమ శ్లోకంలో వాళ్ళిద్దరి గురించి కొన్ని విశేషాలు చెప్పబడుతున్నాయి. ఈ చెప్పబడే విషయాలన్నీ అనుప్రాస శబ్దాలంకారాలతో చెప్పడం మరొక విశేషం. దీని వలన శ్లోకాన్ని చదువుతుంటే ఒక విధమైన అనురవం (Rythm) శ్రవణ పేయంగావుండి హృదయాన్ని రంజింప చేస్తుంది.

**కలాభ్యాం**

ప్రపంచ తత్త్వానికి, పరమాత్మ తత్త్వానికి సంబంధించిన ఏ విద్య అయినా, ఏ శాస్త్రమైనా ప్రకృతి పురుషులకు చెందినదే ! ప్రకృతిలోని రహస్యాలను శాస్త్రజ్ఞులు దర్శించి కనుగొని శాస్త్రంగా నిర్ధారిస్తారు. కాబట్టి సకలవిద్యల స్వరూపంగా ప్రకృతి పురుషులైన పార్వతీపరమేశ్వరులిద్దరినీ కలిపి ధ్యానించే

ఉద్దేశ్యంతో శంకరాచార్యులవారు ఆ ఇద్దరినీ 'కలాభ్యాం' అని సంబోధించారు. ఆమె - 'జ్ఞాన ప్రసూన' అయితే ఆయన - 'జ్ఞాన మూర్తి' కాబట్టి ఈ ఇద్దరూ జ్ఞాన ప్రదాతలే అని ఈ 'కలాభ్యాం' పద ప్రయోగం సూచిస్తుంది.

## చూడాలంకృత శశికలాభ్యాం

భార్యా భర్తలకు సర్వసాధారణంగా ఎవరి అలంకరణాలు వారికి ఉంటాయి. కాని, పార్వతీపరమేశ్వరుల విషయంలో కొంత వైచిత్ర్యం వుంది. ఈ ఇద్దరూ తమ తమ సిగలపైన నెలవంకను అలంకారంగా ధరిస్తారు. 'నెలవంక' అంటే 'చంద్రరేఖ'. చంద్రుడు మనస్సును సూచిస్తాడు (చంద్రమా మనసో జాతః - పురుషసూక్తం). తలకట్టు (బుఱ్ఱ) మెదడును సూచిస్తుంది. మెదడు వేరు మనస్సు వేరు. మెదడును ఆంగ్లంలో 'Brain' అని, మనస్సును 'Mind'అనీ అంటారు. మెదడు మనస్సు కాదు. తలకాయలో మనస్సు ఉండే భాగాన్ని మెదడు అనాలి (Brain is the seat for mind but not mind). కలెక్టర్‌గారు వేరు, కలెక్టరు గారు కూర్చునే కుర్చీ వేరు. కలెక్టరు అనే మనస్సు కూర్చునే కుర్చీ వంటిది మెదడు. శివునితలకట్టుపై చంద్రుడు అలంకారంగా ఉన్నాడనే విషయం - జీవుని మెదడులో మనస్సు ఉంటుందనే సూత్రాన్ని సూచిస్తుంది. అయ్యవారి సంకల్పం నుండి బయలుదేరిన భావ ప్రణాళికా కిరణాలన్నీ అమ్మవారి ద్వారా ప్రసారమై, కల్పలోకంలో వ్యక్తమౌతాయి. అయ్యవారి భావకిరణాలు అమ్మవారి ద్వారా పరావర్తనం చెంది ప్రతిఫలించే ప్రక్రియనే ఆంగ్లంలో 'The principle of reflection'గా చెప్పుకోవచ్చును. ఈ విధమైన పరావర్తన ప్రక్రియకు చంద్రుడు అద్దంలాంటివాడు. అమ్మవారి తలకట్టుపై చంద్రుని అలంకారం ఈ విషయాన్ని సూచిస్తుంది. ఇలా ఇద్దరికీ వారి వారి తలలపై చంద్రుణ్ణి అలంకారంగా ఒకే అభిరుచిని కలిగి ఉండడం - వారి దివ్యదాంపత్య పటుత్వాన్ని గూడా సూచిస్తుంది.

**నిజతపః ఫలాభ్యాం**

పార్వతి శివునికోసం తపస్సు చేసింది. శివుడు గూడా సతీ వియోగానంతరం ఆమెను పొందాలని తపించాడు. ఈ ఇరువురి తపస్సుల ఫలితంగా ఒకరి నొకరు పొందారు. ఎన్ని యుగాలైనా, కల్పాలైనా ఈ జంటను విడదీయలేనంతగా ఒకరిశరీరంలో ఒకరు సగభాగమై ఇమిడిపోయారు. (ఇద్దరూ విడివిడిగా తపస్సు చేసి చిక్కి సగమై పోయారు. అప్పుడు రెండు సగాల దేహాలతో కలిసి అర్ధనారీశ్వర రూపంగా స్థిరపడిపోయారు.) ఏ లక్ష్యాన్ని ఉద్దేశించి తపస్సు చేశారో ఆ లక్ష్యాన్ని పొందటమే కాకుండా, ఆ లక్ష్యంలోనే సగమై పోవడం అత్యంత ఆశ్చర్యకరము, అద్భుతము అయిన విషయం అని - నిజతపః ఫలాభ్యాం' అనే సంబోధన సూచిస్తుంది.

**భక్తేషుప్రకటీకృ ఫలాభ్యాం**

భక్తులు కోరేవికాకుండా వాళ్లకు అవసరమైనవాటిని భగవంతుడు ఇస్తాడు. శక్తి, ఆసక్తి, ఆయుష్షు, అందము, సంపద, సౌభాగ్యము పదవి, అధికారము, రక్తి, భక్తి - ఈ విధమైనవాటిని భక్తులకు వారి వారి పూర్వ కర్మలను బట్టి కర్మఫలాలుగా అవసరమైనవాటిని అవసరమైనంత మేరకు అవసరమైనంత కాలానికి ప్రసాదిస్తాడు. భక్తుల నిష్కల్మష నిష్కామ భక్తికి మెచ్చి చివరకు ముక్తిని గూడా ప్రసాదిస్తాడు. నిష్కామంగా జనన మరణాతీతమైన స్థితిలో ఒకే స్థిరమైన స్థాయిలో ఉండగలగడమే ముక్తికి కావలసిన అర్హత. వాస్తవానికి ఇలా ఉండగలిగే స్థితినే 'ముక్తి' అని గూడా అనవచ్చును. జననమరణాతీతమైన స్థితిని పొందాలంటే ఆ జననాన్ని మరణాన్ని జయించిన వారిని ఆరాధిస్తే వారి అనుగ్రహ ఆశీస్సుల వలన పొందవచ్చు. జననానికి కారణం స్త్రీ పురుషుల మధ్య కామం - ఈ కామం మన్మథ ప్రేరితం. కామప్రేరకుడైన ఆ మన్మథుని జయించిన వారొక్కరే ! ఆయనే పరమేశ్వరుడు. తన మూడవకంటితో పంచశరుడైన మన్మథుణ్ణి మంట పాలుచేశాడు. కాబట్టి, జననాతీతమైన స్థితిని పొందాలంటే పరమేశ్వరుణ్ణి ఆరాధించాల్సిందే !

ఇక మరణాతీతమైన స్థితి రావాలంటే మరణమంటే భయం ఉండకూడదు. ఆ మరణాన్ని జయించగలిగిన వారికే మరణమంటే భయం ఉండదు. బ్రహ్మ లెక్క ప్రకారం మార్కండేయునికి పదహారు సంవత్సరాలే ఆయుష్షు. పరమేశ్వర లింగాన్ని భక్తి పారవశ్యంతో ఆలింగనం చేసుకొన్నపుడు యముడు గూడా అతని ప్రాణాలను తీయలేక పోయాడు. అంతేకాదు ఎదురు రొమ్ముపై శివుని ఎడమకాలితాపుకు గూడా గురిఅయాడు. కాని, శివునిలో ఆ ఎడమపాదం అమ్మవారిది. అందువలన మరణాతీతమైన స్థితి రావాలంటే అమ్మవారిని ఆశ్రయించాల్సిందే !

పైన తెల్పిన రెండు విషయాలను చెప్పడానికి కంచిపరమాచార్య అయిన శ్రీచంద్రశేఖర సరస్వతీ స్వామి వారు –

"కంటితో కాముని కాల్చి వేశాడట!

కాలితో కాలుని తన్నివేశాడట !!

అని సంక్షిప్తంగా చెప్పారు (జగద్గురు బోధలు). ఇలాంటి విషయాల్నే 'భక్తేషుప్రకటిత ఫలాభ్యాం' అన్న సంబోధన సూచిస్తుంది.

## అస్తోక త్రిభువన శివాభ్యాం

మనల్ని, మన ఇంటిని, మనక్కావలసిన వారిని చక్కబెట్టకోవడమే మనకు ముఖ్యం అనుకుంటాం. కాని, ముల్లోకాలకు ప్రభువైన ఆ ఆదిదేవునికి ముల్లోకాల యోగక్షేమాలు ముఖ్యమే ! జగత్ప్రళయంలో గూడా సమస్త సృష్టిని తన కుక్షిలో ఉంచి రక్షించే భద్రమూర్తి ఈ శివుడు. అందుకే ఆయన 'లయకారుడు'. తన యందు లయము చెందించి రక్షించే వాడే (Merger) గాని వినాశం చేసేవాడు (Distroyer) కాదు. నీటిలో కరిగి ఉన్న సమస్త లవణాలకు ఆ నీటి సాన్నిధ్యంలో ఉండే స్థితి మరణంకాదు. ఆ నీటిని తిరిగి వేడి చేస్తే అన్ని రకాల లవణాలు కొన్ని కొన్ని నిర్దిష్ట ఉష్ణోగ్రతల వద్ద పునః స్ఫటికీకరణ చెందుతాయి. వేసవి కాలం శెలవుల్లో అధ్యాపకులు, విద్యార్థులు, హాజరు పట్టీలు, నౌకర్లు, గంటలు, పాఠాలు, ఇవన్నీ చనిపోయి ఉండవు.

మరల విద్యాలయాలను తెరచినపుడు వెంటనే అందరూ ప్రత్యక్షమవుతారు గదా ! అల్లాగే ప్రళయానంతరం సమస్త సృష్టికి సంబంధించిన అన్ని జాతుల జీవరాశులు బయటపడతాయి. కాబట్టి, శివుడు భద్రమూర్తే గాని ఛిద్రమూర్తి కాడు. రక్షకుడే గాని భక్షకుడు కాదు. సృష్టి వ్యక్తమైనప్పుడు సృష్టి స్వరూపిణి జగన్మాతగా అమ్మవారు తన జీవజాలాన్ని పెంచి పోషించి రక్షిస్తూ శుభాలను చేకూరుస్తుంది. కాబట్టి, ముల్లోకాలకు ఈ పార్వతీ పరమేశ్వరులు తరుగులేని శుభాదాయకులేఔతారనేది' 'అస్తోక త్రిభువన శివాభ్యాం' అన్న సంబోధన సూచిస్తుంది.

**హృదిపునర్భవాభ్యాం**

మనం సమన్వయించుకోలేక పోతే తప్ప పార్వతీ పరమేశ్వరులు, వారి తత్త్వము మనలోనే ఉన్నట్లు మనం గుర్తించవచ్చు, దర్శించవచ్చు. ఎందుకంటే - ఈ శివపార్వతులు మన ఆత్మకు దేహానికి ప్రతీకలే కాబట్టి. వారి స్మరణ ద్వారా మాత్రమే మనలో వారిఉనికిని మనం గుర్తించగలం. ఎన్నిసార్లు మనం స్మరిస్తే అన్నిసార్లు మనం వారి సాన్నిధ్యంలో వుంటాం. మరుపే మరణం (Forgetfullness is Death) అని ఒక మహనీయుడు చెప్పిన మాటను ఇక్కడ సమన్వయపరచుకోవాలి. "స్మరిస్తే హృదయాన్ని స్పృశిస్తారు, బుద్ధికి స్ఫురిస్తారు. ఈ విషయంలో వాళ్లకు విసుగు, చిరాకు, పరాకు ఉండదు" అని ఆదిశంకరులు ఈ 'హృది పునర్భవాభ్యాం' అన్న సంబోధన ద్వారా నిర్ధారిస్తున్నారు.

**స్ఫురదనుభవాభ్యాం:**

నిద్రాణమై జడస్థితిలో ఉన్న మనస్సు ఒక్కసారి శివాశివులను స్మరిస్తే - వెంటనే మేఘంలోని మెఱపులాగా వర్ణనాతీతమైన ప్రకాశ ప్రమోదాలతో- హృదయంలోనే దర్శించగలిగే స్వరూపాలతో - సాక్షాత్కరించగలిగే వారే ఈ పుణ్యదంపతులు. వారి పట్ల మనస్మరణ, అందుకు ప్రతిఫలంగా మన పట్ల ఆయన స్ఫురణ ఈ రెండూ కాలయాపన లేకుండా మెఱపు తీగలాగా తక్షణంలో

(Instantaneous) జరుగుతాయని ఈ 'స్ఫురదనుభవాభ్యాం' అన్న సంబోధన సూచిస్తుంది.

**శివాభ్యాం**

ఎన్నో రకాలుగా యావత్ప్రపంచానికి శుభాలను చేకూర్చే వారు కాబట్టి ఈ పార్వతీపరమేశ్వరులిద్దరూ మంగళ స్వరూపులు.

అందుకే -

"యశ్శివోనామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోః సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్"

అన్నది స్మృతివాక్యంగూడా అయింది. 'నామరూపాలను బట్టి ఏ దేవుడు శివుడో, ఏ దేవి సర్వమంగళయో అటువంటి ఇరువరి స్మరణ సర్వత్ర జయకరము, మంగళకరము' అని ఈ శ్లోకానికి అర్థం.

ఏ శుభకార్యానికైనా ప్రప్రథమంలో చేసే విఘ్నేశ్వర పూజకు ఆరంభంలోనే ఈ శ్లోకం ద్వారా ఆది దంపతులైన ఆ శివపార్వతులను స్మరించడం అందుకే!

ఒకే నామంతో ఉండి, ఒకే రూపంలో ఉండి, ఒకే పదంలో పిలువబడే ఆదిదంపతులును, జగజ్జననీజనకులును - జగన్మాత, జగన్నేతలును అయిన పార్వతీపరమేశ్వరులను ఉద్దేశించి శుభసూచకంగా. 'శివాభ్యాం' అనే పదప్రయోగంతో నమస్కరిస్తూ ఈ శివానందలహరీ స్తోత్రాన్ని ఆదిశంకరులు భక్తితో ప్రారంభించారు.

**సంస్కృత శ్లోకము - 2**

**శ్లో. గళంతీ శంభో త్వచ్చరిత సరితః కిల్బిష రజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్ ।
దిశంతీ సంసారభ్రమణ పరితాపోపశమనం
వసంతీ మచ్చేతోహ్రదభువి శివానందలహరీ ॥**

## అనువాద పద్యము

సీ॥ శంభోమహాదేవ ! శంకరా ! భవదీయ
చరితామృతమ్మున జనన మంది
బుద్ధియనెడి పూర్ణ శుద్ధ మార్గంబైన
కుల్య వెంబడి వడిగొనుచునుండి,
ప్రవహించు వేళల పాపజన్యంబైన
ధూళినెల్లను చేసి క్షాళనమ్ము
జననమరణ రూప సంహార జన్యమౌ
సంతాపమున కుపశాంతి నిచ్చి,

గీ॥ మంచిలోతైన నాయెద మడుగులోని
కందుచుండెడి యీ శివానందలహరి –
అన్ని వేళల నానంద మంద జేయ
విజయ మందుచు నచటనే వెలయుగాక !

## టీక

హేశంభో = సుఖమునకు గారణమైనవాడా ! త్వత్ = నీ యొక్క, చరిత = చరిత్రమనియెడు, సరితః = నదినుండి, గళంతీ = స్రవించి పాఱుచున్నదియు, కిల్బిష = పాపములనియెడు, రజః = ధూళిని, దళంతీ = ఖండించు (అణచివేయు) చున్నదియు, ధీ = బుద్ధులనియెడు, కుల్యా = పిల్లకాలువల యొక్క, సరణిషు = త్రోవలయందు, పతంతీ = ప్రసరించుచున్నదియు, సంసారభ్రమణ = జననమరణరూపమైన సంసారచక్రమందు తిరుగుటచే గలిగిన, పరితాప = అత్యంత సంతాపముల యొక్క, ఉపశమనం = ఉపశాంతిని, దిశంతీ = ఇచ్చుచున్నదియు, మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, హ్రదభువి = మడుగునందు, వసంతీ = నిలచియుండు నదియునగు, శివానందలహరీ = పార్వతీ పరమేశ్వరుల వలనగలిగిన యానందప్రవాహము, విజయతాం = సర్వోత్కర్షముగా నుండుగాక !

## తాత్పర్యము

శాంతి సుఖములకు ఉత్పత్తి స్థానమైన ఓ శివా ! నీ చరిత్రమనెడి నదినుండి స్రవించి ప్రవహించుచు, పాపములనెడు ధూళిని అణచుచున్న ఈ శివానందలహరి-బుద్ధి అను పిల్లకాలువగుండావచ్చి, సంసారతాపమును చల్లార్చుచూ, నా హృదయము అను మడుగులో పడినది. ఈ ఆనంద ప్రవాహము ఇక ఈ మడుగును వదలి పోకుండా స్థిరముగానుండునట్లు అనుగ్రహింపుము.

## వివరణము

చైతన్యవంతమైన శాంతిని – 'ఆనందమ'ని, నిలకడగా ఉండే ఆనందాన్ని – 'శాంతి' అని అనవచ్చును (Peace dancing is joy and joy at rest is peace). స్థితి భేదం వల్ల 'ఆనందము,' – 'శాంతి' పదాలను రెండు వేరు వేరు పదాలుగా చెప్పుకోవలసిన అవసరం ఏర్పడింది గాని లేకపోతే ఈ రెంటి అంతర్లక్షణం ఒకటే ! ఈ రెంటి వలన వచ్చేది శాంతి, సుఖము అనుకుంటే – అటువంటి 'సుఖశాంతులకు ఉత్పత్తి స్థానమైనవాడు' అని "శంభు" పదానికి, ఆ "సుఖశాంతులను మనవరకు తీసుకునివచ్చి ఇచ్చువాడు లేదా కలుగజేయువాడు" అని 'శంకర' పదానికి అర్థాలు చెప్పుకోవచ్చును. ఈ రెంటినీ తనకు నామాలుగా చెల్లే శివునికి సంబంధించిన ఈ శివానందలహరీ స్తోత్ర ఉత్పత్తి స్థానం గురించి, దాని వలన తనకు (జీవికి) కలుగు ఉపయోగం గురించి ఈ రెండవ శ్లోకంలో చెప్పబడుతోంది.

### త్వత్ చరిత సరితః కిల్బిష రజోదళంతీ

మంచి చరిత్ర ఉన్నవారిపై చేసే స్తుతులు గూడా సార్థకాలౌతాయి. శివుని చరిత్ర శివుని లీలలు మంచి మహిమాన్వితమైనవి, అందరికి మహోపకారకములైనవి, మంగళకరమైనవి. అట్టి శివుని చరిత్ర అనే మహానదీ ప్రవాహం – అది ప్రవహించే ప్రదేశాలలోని ధూళి ధూసరములనే పాపాలను కడిగేస్తుందిట! అంటే అంతకు పూర్వం జీవుడు ఆశ్రయించిన కపట వ్యక్తులను, అనుసరించిన

వృథా విధానాలను, అందువల్ల ఏర్పడిన కష్టనష్టాలను పరిష్కరించడంతో బాహ్యారంగ ప్రక్షాళన జరుగుతుందనే విషయం ఇక్కడ సూచింపబడింది.

**ధీకుల్యాసరణిషుపతంతీ**

బాహ్యారంగం చక్కబడిన తరువాత జీవునికి అంతరంగం చక్కబడటం రెండవ మెట్టు. ఈ రెండవ మెట్టును గూర్చి ఇక్కడ చెప్పబడుతోంది. ఏ విషయమైనా పంచ జ్ఞానేంద్రియాల ద్వారా మనస్సుకు చేరుతుంది. మనస్సు గ్రహించిన విషయాల్లోని మంచి చెడ్డలను వివేక జ్ఞానంతో బుద్ధి నిర్ణయిస్తుంది. ఇటువంటి బుద్ధి అనే పిల్లకాలువద్వారా శివానందలహరీ స్తోత్రమనే మహానది ప్రవహించి అంతరంగ ప్రక్షాళనం చేస్తుందనే విషయం. ఇక్కడ సూచన ప్రాయంగా చెప్పబడింది.

**దిశంతీ సంసార భ్రమణ పరితాపోపశమనం**

బాహ్యారంగ, అంతరంగ ప్రక్షాళన వలన జీవుని యొక్క సాంసారిక పరితాపాలకు ఉపశమనం కలుగుతుందనే విషయం ఈ పాదంలో చెప్పబడుతోంది. "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్న స్థితి – "వికాసకాలే సవివేక బుద్ధిః" గా మారి ఈ ఉపశమనం లభిస్తుంది.

**వసంతీ.... హ్రదభువి**

మన బాహ్యారంగ అంతరంగ క్షాళనం జరిగిన తరువాతనే శాశ్వత సుఖానికి ఉత్పత్తి స్థానమైన శివుని సాన్నిధ్యం లభించడం, శివునితో సాయుజ్యం చెందటం జరుగుతుంది. ఇది హృదయంలోనే జరగవలసిన ఒక అనుభూతి ప్రదమైన ప్రక్రియ.

"దహ్రం విపాపం పరమేశ్మభూతం
హృత్పుండరీకం పురమధ్య సగ్గ్‌స్థమ్
తత్రాపిదహ్రం గగనం విశోకః
తస్మిన్ యదస్తదు పాసితవ్యమ్"

అన్న శ్రుతి (త్తైత్తిరీయోపనిషత్తు - నారాయణీయం) వాక్యాలను ఇక్కడ సమన్వయించుకోవాలి.

ఈ శివానందలహరీ స్తోత్రమనే మహానదీ ప్రవాహం చివరకు మన హృదయమనే మడుగులోనికి ప్రవేశించి మనకు శాశ్వతమైన, స్థిరమైన ఆనంద స్థితిని కలుగజేస్తుందనే విషయం ఈ చివరి పాదంలో సూచింపబడింది. అంటే శివనామస్మరణం, శివచరితపఠనం, శివపాదభజనం మహదానందస్థితిని పొందడానికి ఉత్తమమైన సులువైన మార్గాలని పరోక్షంగా చెప్పడం అన్నమాట! శివుడంటే మనలోని ఆత్మకుప్రతీక కాబట్టి ఈ మహదానందమే ఆత్మానుభూతికి సంబంధించిన బ్రహ్మానందం గూడా ఔతుంది.

## సంస్కృత శ్లోకము - 3

శ్లో. త్రయీవేద్యం హృద్యం త్రిపురహరమాద్యం త్రినయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరమ్ ।
మహాదేవందేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివమతివిడంబం హృది భజే ॥

## అనువాద పద్యము

సీ॥ మూడు వేదములలో చూడబడెడు వాని,
హృదయ కమలమందు నెఱుగు వాని,
ముప్పురంబులడించు మూడు కన్నులవాని,
అన్నిటికిని ముందు నున్నవాని,
జటల ముడులలోన చటుల గంగను దాల్చి
ఉరగహారములతో నున్నవాని,
లేడిఁ దాల్చిన వాని, వాడి వెలుగువాని,
ఆనందమునకు పునాది యౌచు

గీ॥ సదయ భావంబు నాపైన జల్లువాని,
అతి విడంబ సాంబుని, పశుపతిని, జ్ఞాన
సాధనమగు వాని, శివుని చక్కగాను
హృదయమందున సేవింతు ముదముతోడ.

### టీక

త్రయీ = ఋగ్వేదయజుర్వేదసామవేదములు మూటి చేతను, వేద్యం = తెలిసికొన దగినవాడును, హృద్యం = హృదయ కమలమున వ్యక్తమగువాడును, త్రిపురహరం = స్థూలసూక్ష్మ కారణ శరీరములు మూటిని నశింపజేయువాడును, అద్యం = సృష్టి కంతకు మొదటనయున్న వాడును, త్రినయనం = మూడు కన్నులవాఁడును, జటాభారోదారం = జటాజూటముచేత గంభీరమైనవాడును, ఇచలత్ = కదలుచున్న, ఉరగ = పాములనియెడు, హారం = పేరులుగలవాడును, మృగధరం = లేడిని దాల్చినవాడును, మహాదేవం = గొప్పదేవుడును, (స్వప్రకాశరూపుడు), దేవం = ఆనంద స్వరూపుడును, మయి = నాయందు, సదయభావం = దయతో గూడిన యభిప్రాయము గలవాడును, పశుపతిం = బ్రహ్మాదిలోకపాలకుడును, చిదాలంబం = స్వరూపజ్ఞానమునకు సాధనమైన వాడును, అతివిడంబం = సమయానుసరణము గలవాడును, సాంబం = పార్వతీ సమేతుడునుఅగు, శివం = పరమేశ్వరుని, హృది = మనస్సున; భజే = సేవింతును.

### తాత్పర్యము

మూడువేదములలో తెలియుబడువాడును, హృదయమునందు స్ఫురించువాడును స్థూల సూక్ష్మ కారణశరీరములను నియంత్రించి నిర్మూలించు వాడును, సృష్టికిముందేనుండువాడును, మూడు కన్నులు గలవాడును, జటాజూటసర్పహారములు గలవాడును, చేతిలో వేడిని ధరించినవాడును, ప్రకాశానందములు తన రూపముగా వెలుగొందువాడును, నాయందు

దయగలవాడును, స్వ స్వరూప జ్ఞానమునకు ముఖ్య సాధనమైన వాడును సకలలోక పాలకుడును, సమయావసరములను బట్టి ప్రవర్తించువాడును, పార్వతీ సమ్మోహుండును అగు-పరమేశ్వరుని హృదయములో సేవించుచున్నాను.

## వివరణము

హృదయాన్ని స్పృశించి, హృదయంలోకి ప్రవించిన ఈ శివానందలహరి వలన పొందిన పరమానంద స్వరూపుడైన పరమశివుని యొక్క కొన్ని ప్రత్యేక లక్షణాలు ఈ శ్లోకంలో చెప్పబడుతున్నాయి.

### త్రయీవేద్యం

'త్రయీ' అంటే 'మూడింటి చేత' అని అర్థం. సాధారణంగా 'త్రయీ' శబ్దాన్ని ప్రధానమైన మూడు వేదాల పరంగానే అన్వయిస్తారు. అవే - సామవేదం, ఋగ్వేదం, యజుర్వేదం. 'ప్రాణః సామవేదః' అన్నదాన్ని బట్టి మనలో ప్రాణమే సామవేదం. ప్రాణం శ్వాసాధారం కాబట్టి సామవేదాన్ని శ్వాసతో సమన్వయ పరచుకోవాలి. ఈశ్వాస ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో కూడినది. శ్వాసను జాగ్రత్తగా గమనిస్తే - ఉచ్ఛ్వాసంలో 'సో' అక్షర ఉచ్ఛారణ ధ్వని, నిశ్వాసంలో 'హం' అక్షర ఉచ్ఛారణ ధ్వని ఉంటాయి అని తెలుస్తుంది. ఈ 'సో'-'హం' అక్షారలలోని హల్లుల భాగాలను తీసివేస్తే 'సో'లో 'ఓం', 'హం' లో-'మ్' మిగుల్తాయి. ఈ రెంటి కలయికతో 'ఓం' అనే ఏకాక్షరం ఏర్పడుతుంది. ఈ 'ఓం' అనే అక్షరాన్నే 'ప్రణవం' అంటారు. కాబట్టి సామవేదం ద్వారా తెలియబడేవాడు అంటే 'ఓం' ద్వారా తెలియబడేవాడు అని అర్థం. పతంజలి గూడా పరమాత్మకు సంబంధించిన వాచక రూపం ప్రణవమనే విషయాన్ని - 'తస్యవాచకః ప్రణవః' అనే సూత్రం ద్వారా చెప్పాడు.

'వాగేవఋక్' అన్నదాన్నిబట్టి, మన వాక్కుతో ఋగ్వేదాన్ని సమన్వయపరచుకోవాలి. మనం ఉచ్చరించే అక్షరాలు లేదా మాటలలో పదాలు

వాటి అర్థాలు ఇమిడి ఉంటాయి. ఈ పదాలను అర్థాలనే 'వాగర్థాలు' అంటారు. పార్వతీ పరమేశ్వరులిద్దరినీ ఈ వాగర్థాలతో పోలుస్తారు.

శ్లో. వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ

(రఘువంశం - ప్రథమశ్లోకం)

కాబట్టి, శివుడు వాక్కు ద్వారా అనగా ఋగ్వేదం ద్వారా తెలియబడేవాడు అనే విషయం ఇక్కడ నిర్ధారణ అవుతోంది.

'మనోయజుర్వేదః' అన్న దాన్ని బట్టి మనస్సుతో యజుర్వేదాన్ని సమన్వయించు కోవాలని తెలుస్తోంది. సంకల్పానికి సంబంధించినది మనస్సు. 'మనశ్శివసంకల్పమస్తు' - అని మహన్యాసరుద్రాభిషేకంలో వస్తుంది. అంటే మనలో మనస్సు ద్వారా సంకల్పించే వాడు శివుడన్న మాటే గదా ! కాబట్టి అటువంటి శివుణ్ణి మనస్సుకు సంబంధించిన యజుర్వేదం ద్వారా తెలియబడువాడు అని చెప్పడం సమంజసమే గదా!

## హృద్యం-

'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జునతిష్ఠతి' అన్నది గీతవాక్యం హృదయంలోనే వుండి హృదయంలో స్ఫురించే శివుణ్ణి - 'హృదయానందానికి కారకుడైనవాడు' అనే అర్థంలో 'హృద్యం' అనే విశేషణంతో ఇక్కడ చెప్పడం జరిగింది.

## త్రిపురహరం

'పురీశయనాత్ పురుషః' అని పురుషశబ్దానికి వ్యుత్పత్తి అర్థం. పురుషుడంటే - పురము నందు ఉండువాడు' - అని దీని అర్థం. జీవుని శరీరమే ఈ పురం. అని అనుకుంటే ఈ శరీరం మూడువిధాలుగా వుంటుంది. 1) స్థూల (Physical or Gross) శరీరం 2) సూక్ష్మ (Subtle) శరీరం 3) కారణ (Casual) శరీరం. మనలోని భౌతిక పదార్థాన్ని స్థూల శరీరంగాను,

ఇటువంటి స్థూలదేహన్ని ఆసరాగా చేసుకుని వ్యక్తమయే జీవుణ్ణి సూక్ష్మ శరీరంగాను, జన్మజన్మల లోను వివిధ జీవుల ద్వారా వ్యక్తమవడానికి కారణమైన దాన్ని, కారణశరీరంగాను అర్థం చేసుకోవాలి. ఈ మూడు శరీరాల్తో వ్యక్తమయే వారినే భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తియోగంలో వరుసగా – 'క్షరపురుషుడు', 'అక్షర పురుషుడు', 'పురుషోత్తముడు' – అనే సంకేత భాషలో భగవానుడే చెప్పాడు. ఇటువంటి త్రిపుర సంబంధమైన జీవుని తత్త్వాన్ని తెలిపే ముడిని విప్పి అసలు విషయాన్ని అవగతం చేసేవాడు' – అనే అర్థంలో శివుణ్ణి ఒక విధంగా 'త్రిపుర హరుడు' అని అనవచ్చును. ఈ త్రిపురాలనే వరుసగా భౌతిక దేహము (Material body), మానసిక దేహము (Mental body), ఆధ్యాత్మిక దేహము (Spiritual body) అనీ, వీటినే వరుసగా – గ్రహ సంబంధమైన (planetary), మనో సంబంధమైన (Lunar), సూర్యసంబంధమైన (Solar), దేహములుగాను కూడా సమన్వయించు కోవచ్చును. ఈ మూండింటి విషయాలే భగవద్గీత జ్ఞానయోగంలో –

శ్లో. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్
వివస్వాన్ మనవేప్రాహ మనురిక్ష్వాకవే బ్రవీత్

అన్న మొదటి శ్లోకంలోనే గూఢంగా చెప్పబడింది. ఈ శ్లోకంలోని వివస్వంతుడు – సూర్యుడు, ఆత్మలను; మనువు – చంద్రుడు, మనస్సులను; ఇక్ష్వాకువు – భూమి, భౌతిక దేహాలను సూచిస్తారు.

## త్రినయనం

సాధారణంగా అందరికీ రెండు కళ్ళుంటాయి. కాని, శివుడికి మూడు కళ్ళు. ఫాలనేత్రం ఒకటి అదనంగా వుంటుంది. వామనేత్రం – చంద్రునికి, ఫాలనేత్రం – అగ్నికి, దక్షిణ నేత్రం – సూర్యునికి ప్రతీకలు. ఇవి వరుసగా రాత్రిని, సాయం సంధ్యను, పగటి కాలాలను సూచిస్తాయి. ఎడమ, కుడి కన్నులు – అనుగ్రహానికి; ఫాలనేత్రం – అగ్రహానికి, తెలియవలసిన జ్ఞానానికి ప్రతీకలు. మామూలు కన్నులు ఎదుటివారి భౌతిక రూపాన్ని మాత్రమే

చూడగలిగితే, ఫాలనేత్రం - ఎదురుగా కనబడని వారిని, వారి మనోగతాన్ని, భవిష్యత్తును గూడా చూడగలుగుతుంది. ఆ విధంగా చూడగలిగిన ఆ కన్ను అవసరమైనపుడు తదనుగుణమైన ప్రతిఫలాన్ని ప్రాప్తింప చేస్తుంది. ఇది ఆజ్ఞా చక్ర కేంద్ర స్థానం వద్ద వుంటుంది. అందుకే దీనిని 'జ్ఞాన నేత్రం' అని గూడా అంటారు.

## జటాభారోదార

మన 'బుఱ్ఱ'లోని కోరికలు మనః క్లేశాలకు దారి తీస్తాయి. ఆ క్లేశాలకు ప్రతీకలే కేశాలు. మనం శివుడికి సమర్పితమైతే మన క్లేశభారాన్ని తన నెత్తి కెత్తుకుంటాడు. వాటిని అక్కడ ఉన్న గంగలో క్షాళనం చేస్తాడు.

ఆకాశంలోని మేఘాల కూటమి - శివుని జటాజూటాన్ని, సర్పం - నిరంతరగమనం గల కాలాన్ని సూచిస్తాయి. అందరూ కాలానికి ఆహారమైతే - కాలం ఆయనకు హారం, కాలకూట విషం ఆహారంఔతాయి. అంటే - శివుడు 'కాలాతీతుడు', 'సదాశివుడు' అన్నమాట ! అంటే శివుడు ఎప్పుడూ పుణ్యమూర్తి, మంగళమూర్తి అన్నమాట !

## మృగధరమ్

'మృగ' శబ్దం నుండి 'మార్గ' శబ్దం ఉత్పత్తి అయింది. మార్గాన్ని సూచించేది మృగం. (వేటకానికన్న ఎప్పుడూ ముందుండి, మార్గాన్ని సూచిస్తూ పరుగెత్తేది కాబట్టి లేడిని, దుప్పిని కూడ మృగం అన్నారు) 'అందరి మార్గాలను, గమ్యాలను తన చేత ధరించిన వాడు ఈ 'శివుడు' అనే సూచన ఈ పదప్రయోగం సూచిస్తుంది.

మృగశబ్దం నుండి 'మృగ్యం' శబ్దం ఉత్పన్నమైంది. 'మృగ్యం' అంటే - 'శూన్యం' - అంటే ఏమీలేకపోవడం. ఏమీ లేకపోయినా ఏదో ఉన్నట్టు భ్రాంతిని కలుగచేసేది కాబట్టే - ఎండమావిని 'మృగతృష్ణ' అంటారు. ఏమీలేనట్టుగా కనబడేది ఆకాశం. (ఆకాశం గగనం శూన్యం) అలాంటి ఆకాశాన్ని ప్రళయంలో

తాను ముందు చేతిలోకి తీసుకుంటాడు, అటుపైన మిగిలిన నాలుగు భూతాలు ఆ ఆకాశాన్ని అనుసరించి శివుని చేతిలో లీనమౌతాయి

మనలో గూడా ఏమీ లేకుండా మనం మాత్రమే వుంటే మనలను తన చేతిలోకి తీసుకుని సాయుజ్యాన్నిస్తాడు అని గూడార్థం.

## మహాదేవం

గొప్ప దేవుడు అనే అర్థంలో విశేషణ పూర్వపద కర్మధారయ సమాసంగా కాక, షష్ఠీతత్పురుష సమాసార్థంలో 'గొప్పతనానికి దేవుడు' అని శివుని విషయంలో చెప్పుకోవాలి. హరి బ్రహ్మ ఇంద్రాది దేవతలకు గాయత్రీ ఛందస్సులో మంత్రాలుంటాయి. ఒక్క శివునికే 'తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్' అని, 'పురుషస్యవిద్మ సహస్రాక్షస్య మహాదేవస్యధీమహి, తన్నోరుద్రః ప్రచోదయాత్ – అనీ రెండుసార్లు 'మహాదేవ' శబ్దంతో శివునికి గాయత్రీ ఛందస్సుతో మంత్రాలు (మహానారాయణీయంలో) వుంటాయి. ('దేవం' అంటే 'దివ్యమైన' అనిగూడా అర్థం.) అందుకే శివుడు – మహాదేవుడు.

## సదయభావం

శివుడు దయామయుడు. భోళాశంకరుడు, భక్త సులభుడు. ఉద్దరిణె నీళ్లు నెత్తినపోస్తే ఉబ్బిపోయే ఉబ్బులింగడు – అని చెప్పడం కోసం 'సదయభావం' అనే విశేషణాన్ని ప్రయోగించారు.

## పశుపతిం

జీవులందరూ కట్టుగుంజకు కట్టబడిన పశువుల లాంటివారే ! పొడవైన త్రాడుతో గుంజకు కట్టబడిన పశువు ఏదో స్వేచ్ఛగా వున్నట్లు సంచరిస్తుంది గాని, ఆ స్వేచ్ఛకు పరిమితి ఉందని తెలియదు. జీవులందరూ అలాంటి పశువుల వంటివారే ! ఇటువంటి పశువులకు నాథుడు అయిన వాడు 'పశుపతి' అని ఈ పద ప్రయోగం సూచిస్తుంది.

**చిదాలంబం**

'చిత్' - అంటే జ్ఞానము, ఎఱుక, తెలివి - మొదలైన అర్థాలున్నాయి. జ్ఞానానికి ఆలంబనమైన వాడు, లేదా జ్ఞానమూర్తి - అని ఈ సమాసానికి అర్థం.

**సాంబం**

'సాంబం అంటే - అంబతో కూడినవాడు. చిత్ స్వరూపమే జగనాత్మ అయిన పార్వతి. ఎప్పుడూ అట్టి పార్వతితో కూడి వుండే అర్ధనారీశ్వరుడని ఒక అర్థం. తన ఎఱుక తనకు ఎప్పుడూ తెలిసిన వాడని అంటే స్వ స్వరూప జ్ఞానం కలవాడని మరో అర్థం.

**శివమ్**

'శివమ్' అంటే మంగళకరుడని అర్థం. శ్మశానంలో ఉన్నా, గజచర్మం కట్టుకున్నా, విషము, విషసర్పాలు తన వద్ద వున్నా, ఆయన మంగళకరుడే ! ఇవన్నీ ఆయనకు మంగళకర భూషణాలే కాని మాలిన్యాలు కావు.

**అతివిడంబం**

సమయానుసారంగా అవసరాన్ని బట్టి వివిధములైన ఆకారాల్లోను, రూపాల్లోను ఉండగలవాడని అర్థం. అంటే 'మోసం చేసేవాడ'ని అర్థం కాదు. భక్తుల్ని పరీక్షించడానికి ఎన్నో రకాల వేషాలు వేస్తాడు. రుద్రనమకం చదివితే విశ్వంలో వున్న అన్ని రకాల పాత్రలన్నీ ఆయన ధరించినట్లు తెలుస్తుంది. వడ్రంగి, కుమ్మరి, కమ్మరి, బోయ, కుక్కల కాపరి, దొంగలకు దొంగ, వంచకుడు వంచకులకు వంచకుడు ఇలా చెప్పలేనన్ని పాత్రలన్నీ ఆయనవే అని నమకం చెబుతుంది. (శివుడు 'సర్వాంతర్యామి' అని చెప్పడమే ఈ నమకం యొక్క లక్ష్యం. మా గురుదేవులు శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు రచించిన 'రుద్రసూక్త' వివరణ చదవండి).

## సంస్కృత శ్లోకము - 4

శ్లో. సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదాః
న మన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృతఫలమ్ ।
హరిబ్రహ్మాదీనామపి వికటరాజా మసులభం
చిరం యాచే శంభో శివ తవ పదాంభోజ భజనమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ స్వల్పకాలమునకు అల్ప సుఖమునిచ్చు
వేల్పు లెందరొ లేరె వేల కొలది ?
వారి సేవలనైన వాని ఫలములైన
కలలోన సైతము తలచలేను.
సన్నిధానమ్ములో నున్న దొడ్డ దొరలు
హరి ధాతలకు కూడ దొరకనట్టి -
దివ్య సుందరమైన భవ్య చరణపుణ్య
సేవ సతము నేను చేయునట్లు -

గీ॥ కోరి, యాచించు చుంటిని, కోర్కె దీఱ
కలుగ జేయుము నాయందు కరుణ జూపి
సకల సుఖశాంతి కారక ! సాంబమూర్తి !
సకల శుభకర ! శంకర ! శంభుదేవ !

## టీక

జగతి = లోకమునందు, క్షుద్రఫలదాః = తుచ్ఛమైన ఫలముల నొసగునట్టి, విబుధాః = (ఇతర) దేవతలు, సహస్రం = వేలకొలది, వర్తంతే = ఉన్నారు. (అహం =నేను), స్వప్నేవా = కలలో నైనను, తదనుసరణం = ఆ దేవతలను భజించుటగానీ, తత్కృతఫలం = ఆ దేవతలు కలుగజేయు ఫలమునుగానీ, నమన్యే = తలచను (కోరను) శంభో, శివ = సుఖకారణుడును,

మంగళస్వరూపుడును అగు శంకరా !, నికట భాజాం = సన్నిధిని చేరియున్న, హరిబ్రహ్మాదీనామపి = విష్ణుమూర్తి, బ్రహ్మదేవుడు మొదలగు వారలకు సైతము, అసులభం = దుర్లభమైన, తవ = నీయొక్క పదాంభోజభజనం = పాదపద్మసేవను, చిరం = ఎల్లవేళలను, యాచే = యాచించుచున్నాను.

## తాత్పర్యము

కొంచెము కొంచెము ఫలమిచ్చు దేవతలెందఱో కలరు. వారిసేవ, వారిచ్చు ఫలములు నాకు కావలయునను కోరిక కలనైనలేదు. శివా! ఎల్లప్పుడును సమీపవర్తులైన బ్రహ్మాదులకుగూడ దొరకని నీ పాదసేవయే దయచేయుమని నిన్ను ఎల్లవేళల వేడుకొనుచున్నాను.

## వివరణము

తెలివి తేటలను పొందడానికి ఒక దేవత, ధనాన్ని పొందడానికి ఇంకో దేవత, అందాన్ని పొందడానికి మరో దేవత – ఈ విధంగా ఒక్కొక్క విధమైన ఫలాన్ని పొందడానికి ఒక్కొక్క దేవతను ఆరాధించి అర్చించి, ఆశ్రయించి అన్ని విధాలైన సౌకర్యాలను పొంది కోర్కెలను తీర్చుకోవచ్చును. కాని, ఈ విధంగా పొందినవన్నీ తాత్కాలిక సుఖాలను పరిమిత కాలానికే ఇస్తాయి కాని – శాశ్వతానందాన్ని ప్రసాదించలేవు. దేనిని పొందితే ఇక పొందవలసినది వుండదో – దేనిని పొందకపోతే ఇంకా పొందవలసిందేదో పొందలేదనే భావన వుంటుందో – అటువంటి శాశ్వతమైన ఆనందాన్ని పొందడమే ప్రతి జీవి యొక్క పరమావధి. సులభసాధ్యంకాని ఇట్టి శాశ్వతానందాన్ని పొందడానికి శివుని దగ్గర పైన తెలిపిన బ్రహ్మేంద్రాది దేవతలందరూ కాచుకుని వుంటారు. శివుని సాన్నిధ్యంతో, సేవనంతో పోలిస్తే – జన్మరాహిత్య ఫలం సైతం అంతతృప్తిని ఆనందాన్ని ఇవ్వలేవు. అందువలన శంకరులవంటి సద్భక్తులు మిగిలిన వారి సేవను గాని, అందువలన వచ్చే తాత్కాలిక క్షుద్రలాభాలను గాని కోరరని ఈ శ్లోకం

తెలుపుతుంది. 'నిధి చాల సుఖమా రాముని సన్నిధి సుఖమా' అన్న త్యాగరాజ కీర్తను ఇక్కడ గుర్తుకు తెచ్చుకోవాలి.

## సంస్కృత శ్లోకము - 5

శ్లో. స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితాగాన ఫణితౌ
పురాణే మంత్రే వా స్తుతి నటన హాస్యే ష్వచతురః ।
కథం రాజ్ఞాం ప్రీతి ర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథిత కృపయా పాలయ విభో॥

## అనువాద పద్యము

సీ॥ శ్రుతులయందున గాని, స్మృతుల యందున గాని
హాస్య గాన కవితలందు గాని
స్తోత్ర మందున మంత్ర శాస్త్ర మందున గాని,
వ్యాకరణ శకున మందు గాని
నటనావధాన సంఘటిత మందున గాని
నేర్పులేదు తగిన ఓర్పులేదు
అట్టి సామాన్యుడనైన నా యందున
ప్రీతి రాజులకు నేరీతి గలుగు.

గీ॥ ఈశ ! సర్వజ్ఞ ! పశుపతి ! ఇందు భూష !
నేనెవడొ ఎరుగని పశువైననన్ను
ప్రథిత ! సర్వేశ ! గిరవాస ! పార్వతీశ !
నీవె పాలించు మా నన్ను నిందు దయను.

## టీక

స్మృతౌ = మనుస్మృతి మొదలగు స్మృతులయందుగానీ, శాస్త్రే = తర్క వ్యాకరణాది శాస్త్రములయందుగానీ, వైద్యే = వైద్యమునందుగానీ, శకున = శకునములు చెప్పుట యందుగానీ, కవితా = కవిత్వము జెప్పి

మెప్పించుటయందుగానీ, గాన ఫణితౌ = సంగీతము పాడి రంజింపజేయుట యందుగానీ, పురాణే = పురాణములు చెప్పుట యందుగానీ, మంత్రేవా = మంత్రశాస్త్రమందుగానీ, స్తుతి = స్తోత్రములు చేసి యుప్పొంగించుట యందుగానీ, నటన = నాట్యముసల్పి మోహింపజేయుటయందుగానీ, హాస్యేషు = హాస్యములుచెప్పి నవ్వించుటయందుగానీ, అచతురః = నేర్పులేనివాడను, మయి = (ఇట్టి) నాయందు, రాజ్ఞాం = రాజులకు, ప్రీతిః = ప్రేమ,కథం = ఎట్లు! భవతి = కలుగును. (ఒక వేళ నిందేదైన నేర్చినను నేర్తును గాక వారి ప్రేమవలని లాభంబుల మీఁద నాకిచ్ఛయు లేదు). (అతః = కనుక), ప్రథిత = వేదప్రసిద్ధుడవును, సర్వజ్ఞ = సమస్తము తెలిసిన వాడవును నగు, హే పశుపతే = ఓ సర్వేశ్వరా! కోహం = నే నెవ్వడనో యెఱుగని, పశుం = పశుప్రాయుడనైన, మాం = నన్ను, కృపయా = దయతో, పాలయ = రక్షించుము.

## తాత్పర్యము

సర్వజ్ఞుడవైన ఈశ్వరా! శాస్త్రపాండిత్యములేదు. వైద్యముచేతగాదు. కవిత్వము చెప్పలేను. సంగీతమురాదు. పురాణము చెప్పలేను. మంత్రము లెఱుగను. ఆటపాటలయందు నేర్పులేదు. హాస్యము చెప్పలేను. ఇట్టి నాయెడ రాజులకెట్లు దయగల్గును. వారిచ్చు ఫలములు నాకేల ? సర్వజ్ఞా ! నన్ను నేనే యెఱుగని పశువును. నీవు పశుపతివి గదా! నన్ను నీవే దయతో రక్షింపుము.

## వివరణము

సంసార సంబంధమైన బాధలకు ఉపశమనాన్ని పొందదనానికి ఏదో ఒక ఉపాధిని ఏర్పరచుకోవాలి. ఆశ్రయాన్ని ఆధారాన్ని పొందాలి. ఇందుకే భగవంతుడు మనకు ఉపకరణాలను ఇచ్చాడు. మనస్సు, బుద్ధి, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలను వీటిని ఉపయోగించి ఏదో ఒక ఉపాధిని కల్పించుకోవాలి. 'కూటికోసమే కోటివిద్యలు' అని కదా సామెత. పురాణోపన్యాసాలను చెప్పడానికి – మన్వాది ధర్మశాస్త్రాలు, ఇతర ఆర్ష గ్రంథాలు చదివి వుండాలి. జ్యోతిశ్శాస్త్ర శకున శాస్త్రాలు చెప్పాలంటే శాస్త్ర విజ్ఞానం నేర్చుకుని వుండాలి. మంత్రశాస్త్ర,

తంత్రశాస్త్ర, సంగీత శాస్త్రాలలో ప్రవేశమే గాక వాటిలో ప్రావీణ్యం ఉంటేనే తప్ప అవతలి వారిని రంజింప చెయ్యలేము. రాజాశ్రయాన్ని పొందలేము. ఒక వేళ ప్రావీణ్యాన్ని సంపాదించినా విద్యా గర్వం, ధనమదం కలిగి పరమేశ్వరుని కృపకు దూరమౌతాము. పరమేశ్వరుని మెప్పించడానికి 'తానెంత ?' అని ముందు తెలుసుకోవాలి. మనం పశువులమైతే పరమేశ్వరుడు పశుపతి. అంటే మనలను జాగ్రత్తగా కాపాడే కాపరివాడన్నమాట! (గొఱ్ఱెల కాపరి - గోవుల కాపరి అనే మాటలు క్రీస్తుకు , కృష్ణునికి ఎలా చెల్లుతాయో 'పశుపతి' అనే మాట కూడా పరమేశ్వరునికి అలానే చెల్లుతుంది) కాబట్టి, అటువంటి పశుపతిని సేవించితరించడానికి ముందు వేదశాస్త్ర జ్ఞానం అక్కరలేదు. శరణాగత లక్షణమే ప్రధానం. దాసత్వమే శరణ్యం. ఈశ్వరాయత్త చిత్తమే తప్ప ఇతరమైన విద్యా విజ్ఞానాలు పరమేశ్వరుణ్ణి మెప్పించలేవని ఈ శ్లోక సారాంశం.

### సంస్కృత శ్లోకము - 6

శ్లో. ఘటో వా మృత్పిండో౽ ప్యణురపి చ ధూ౽మో౽గ్ని రచలః
పటో వా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్ ।
వృథా కంఠ క్షోభం వహసి తరసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమ సౌఖ్యం వ్రజ సుధీః

### అనువాద పద్యము

సీ॥ ఘట శబ్దమున గాని, పట శబ్దమున గాని,
పొగయు నిప్పుయు గాని, నగము గాని
వట్టి దారము గాని, మట్టి ముద్దయు గాని,
పరమాణువేని, యంబరము గాని -
తర్కశాస్త్రపు పద తతులు పల్కినచో -
వట్టి కంఠమునకే వ్యథయు తప్ప
అట్టి మాటలచే భయంకరుని యముని
పట్టుచున్ మృత్యువున్ నెట్టగలవె ?

గీ॥ కాన, యవి మాని జీవన గమ్యమైన
భవుని పాదార విందాల భజన సేసి
శాంతినిచ్చెడు పరమమౌ సౌఖ్యమంది
తరణ మొందుము సుమతీ కుతర్కమేల ?

## టీక

సుధీః = ఓ మంచిబుద్ధీ, ఘటోవా = కుండగానీ, మృత్పిండోఽపి = మట్టిముద్దగానీ, అణురపి = పరమాణువు గానీ, ధూమః = పొగ గానీ, అగ్నిః = నిప్పు గానీ, అచలః = పర్వతము గానీ, పటోవా = వస్త్రము గానీ, తంతుర్వా = దారము గానీ, ఘోరశమనం = భయంకరుడైన యముని, పరిహరతి కిం = పోగొట్టునా యేమి ? తర్కవచసా = (పై జెప్పిన) తర్క శాస్త్రమందలి మాటలచేత, వృథా = వ్యర్థముగా, కంఠక్షోభం = కంఠమున కాయాసమును, సహసి = కలిగించు కొనుచున్నావు. (అదిమాని), శంభోః = శివునియొక్క పదాంభోజం = పాదపద్మమును, భజ = సేవించుము, తరసా = శీఘ్రముగా, పరమసౌఖ్యం = మోక్షసామ్రాజ్యమును, వ్రజ = పొందుము.

## తాత్పర్యము

కుండలు చేయుటకు మట్టి సాధనము. దానికి పరమాణువులు కారణము. కొండమీద పొగ కనపడుచున్నది కావున నిప్పక్కడ ఉండును. బట్టలు దారముల వలన కలుగును. ఈ మొదలగు తర్క శాస్త్ర వాక్యములలో నొక్కటిగూడ మృత్యువునకడ్డుపడునదికాదు. ఓ మంచి బుద్ధీ ! ఇవి పిడివేసి వల్లించి కంఠక్షోభ మేల కలిగించు కొనెదవు? వద్దు శివభజనచేసి మోక్షమును పొందుము.

## వివరణము

వివిధ జ్ఞానాలతో ఎన్నో రకాలుగా మనం విజ్ఞులమైనా అవసానకాలం ఆసన్నమైతే ఆ శాస్త్రజ్ఞానం నిరుపయోగమే ! మృత్యుంజయుని బారి నుండి అది మనల్ని రక్షించలేదు. వ్యాకరణ వేత్తకు అన్ని రకాల సంధి సూత్రాలు

కంఠతః వచ్చినా, ఏ సూత్రమడిగినా తడుముకోకుండా వెంటనే సరిగ్గా చెప్పగలిగినా – ఆ సమాధానాలు, ఆ విజ్ఞానం యముణ్ణి మభ్యపెట్టి ఆయన కర్తవ్యాన్ని మరుగుపరచలేవు. ఆయన మనస్సును మార్చలేవు. ఆనర్గళంగా శ్రుతుల్ని (వేదాలను) స్మృతుల్ని వినిపించినా ప్రయోజనం వుండదు. శిల్పనాట్య సంగీతాదుల వలన గూడా అంతే !

కొన్ని కొన్ని పడిగట్టు పదాల ద్వారా ఒక్కొక్క శాస్త్రం పరిచయమై పలువురి ద్వారా ప్రసిద్ధి చెందుతుంది. ఉదా: 1) కుండ నిండా మట్టే కదా కుండ అని వేరుగా ఏముంది ? 2) పొగ కనబడుతోంది కాబట్టి అక్కడ నిప్పు ఉండి తీరాలి.3 ) దారాల పోగు తప్ప అక్కడ వేరే వస్త్రం ఏముంది ? మొదలైన తర్క శాస్త్ర పదాలు పలికి వల్లెవేసినంత మాత్రాన కంఠానికి వ్యధ, శ్రమ తప్ప కాలుణ్ణి, కాల నిర్ణయాన్ని మార్చలేవు, కలకాలం జీవింప చెయ్యలేవు. ఇంతకన్నా ఆ పరమశివుని పాదపద్మాలను ఆశ్రయించి, ఆరాధించి పరమ ప్రశాంత సౌఖ్యాన్ని, శాశ్వతానందాన్ని పొందడం మేలు కదా!' అని అంటున్నారు శంకరులు. (మార్కండేయునికథలో ఏం జరిగిందో గుర్తు తెచ్చుకుంటే ఈ శంకరుల సలహాకు అర్థం తెలుస్తుంది)

'డు కృఞ్ కరణే' వంటి వ్యాకరణ పారిభాషిక పదస్మరణతో కొట్టు మిట్టాడే వైయాకరుణ్ణి ఉద్దేశించి గోవింద పదభజనం చేయడం ఇంత కన్న ముక్తి మార్గమని ఆదిశంకరులు భజ గోవింద శ్లోకాల్లో చెప్పిన విషయాన్ని గూడా ఇక్కడ గుర్తు చేసుకోవాలి.

## సంస్కృత శ్లోకము - 7

శ్లో. మనస్తే పాదాబ్జే నివసతు వచః స్తోత్ర ఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాఽఽకర్ణనవిధౌ।
తవ ధ్యానే బుద్ధి ర్నయన యుగళం మూర్తి విభవే
పరగ్రంథాన్కైర్వా పరమ శివ జానే పరమతః ॥

## అనువాద పద్యము

సీ॥ నాదు మనసును నీపాద పద్మములందు,
వాగింద్రియము స్తోత్ర పాఠమందు,
హస్తయుగ్మమ్ము నీయర్చనాదులయందు,
వీనులు నీకథల్ వినుటయందు
చక్షుయుగ్మము నీదు చక్కదనమునందు,
అచలమౌబుద్ధి నీ ధ్యానమందు,
షడింద్రియమ్ముల చక్కగన్ నిల్వంగ
నేవిధమ్మున గల్గు నితరసక్తి ?
గీ॥ ఇంక మీదట నీ సేవె యెల్లవేళ,
ఇతర మార్గములంటని యింద్రియమ్ము
లెటులు తెలుపును నాకుగా నితరములను ?
ఇట్టి ధ్యానమ్ము కలుగగా కృపను గనుమ.

## టీక

హే పరమశివ = ఓ పరమేశ్వరా, మనః = మనస్సు, తే = నీ యొక్క పాదాబ్జే = పాదపద్మమందును, వచః = వాక్కు (వాగింద్రియము) స్తోత్రఫణితౌ = స్తోత్రపాఠములు చదువుట యందును, కరః = చేతులు (హస్తేంద్రియము), అభ్యర్చాయాంచ = పూజయందును, శ్రుతిః = చెవులు (శ్రవణేంద్రియము), కథాకర్ణనవిధౌ = చరిత్రలు వినుటయందును, బుద్ధిః = బుద్ధి, (నిశ్చయాత్మకమైన అంతఃకరణవృత్తి), తవ = నీయొక్క, ధ్యానే = ధ్యానమందును, నయనయుగళం = కన్నుదోయి, మూర్తివిభవే = నీదివ్యమంగళ విగ్రము యొక్క చక్కదనమందును, నివసతు = స్థిరపడియుండుగాక, అతఃపరం = ఇంకమీఁద, కైర్వా = ఏ యింద్రియములచేత, పరగ్రంథాన్ = నీ కైంకర్యమునకు వ్యతిరిక్తములైన గ్రంథములను, జానే = తెలిసికొందును.

## తాత్పర్యము

మనస్సు, వాక్కు, హస్తము, శ్రవణము, బుద్ధి, నేత్రము, అను ఆరు ఇంద్రియములు సర్వకాల సర్వావస్థలయందు నీ కైంకర్యములందే మునిగియున్నచో గ్రంథాంతర ప్రసక్తి కలుగదు గదా! (కనుక శివా ! అట్లనుగ్రహింపుమని భావము.)

## వివరణము

ఆలోచించడానికి మనస్సు ఉంది కాని దేనిలో నిమగ్నమై ఆలోచించాలో మనకు తెలియదు. మాట్లాడటానికి నాలుక వుంది గాని దేనిని ఈ నాలుక స్మరిస్తే సార్థక మౌతుందో తెలీదు. పనులు చేయడానికి చేతులున్నాయి గాని, ఏ పని చేస్తే ఈ చేతులకు ముక్తి కలుగుతుందో తెలియదు. వినగలగడానికి వీనులున్నాయి కాని వేటిని వింటే వీనులకు విలువ పెరుగుతుందో తెలీదు. చూచి తరించాలంటే దేన్ని చూడాలో మనకు తెలీదు. దేన్ని ధ్యానం చేస్తే ఈ బుద్ధి పెడత్రోవలు త్రొక్కకుండా స్థిరత్వం చెందుతుందో తెలుసుకోవాలి. ఆదిశంకరులు ఈ ఆరింద్రియాలకు సార్థకత చేకూరి, మనం తరించడానికి ఈ శ్లోకంలో ఆరువ్యాపారాల్ని చెబుతున్నారు.

మనస్సుని మహేశ్వరుని పాదారవిందాలపై – నిమగ్నం చెయ్యడంలోను, వాక్కులతో వామదేవుని – స్తుతించడంలోను, హస్తాలతోహరుని – అర్చించడంలోను, వీనులతో విశ్వేశ్వరుని లీలలు – వినడంలోను, కన్నులతో – ఆ కామేశ్వరుణ్ణి – కాంచడంలోను, స్థిరంగా బుద్ధిని స్థాణునిపై లగ్నం చెయ్యడంలోను నిమగ్నమైతే – ఆరింద్రియాలు మనల్ని పాపలోకంలోకి – పెడత్రోవలు త్రొక్కించి – అణగద్రొక్కే అవకాశం వుండదు గదా ! అని ఆ విధంగా చేసి ఆ ఆదిదేవుని కృపకు పాత్రులు కమ్మని ఈ శ్లోకంలో శంకరులు సలహా ఇచ్చారు.

భాగవతంలో ప్రహ్లాదుడు గూడా ఇదేవిధంగా – 'కమలాక్షునర్చించు కరములు కరములు – శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ..' అని పలికిన పద్య భాగాన్ని ఇక్కడ సమన్వయం చేసుకోవాలి. పోతన వ్రాసిన ఈ పద్యంలో 'కరములు – కరములు', 'జిహ్వ – జిహ్వ', 'శిరము – శిరము,' 'చూడ్కులు – చూడ్కులు' 'వీనులు – వీనులు', 'బుద్ధి – బుద్ధి' అని ఒకే పదం రెండు సార్లు చెప్పబడుతుంది. ఈ రెండింటిలో మొదట చెప్పినది ఈ శరీరానికి సమకూర్చబడిన ఉపకరణం (ఇంద్రియం) మాత్రమేననీ రెండవసారి చెప్పినది మాత్రమే సార్థకమైన స్థితిలో వున్న ఉపకరణం – అనీ గ్రహించాలి.

## సంస్కృత శ్లోకము - 8

శ్లో. యథా బుద్ధి శ్శుక్తౌ రజతమితి కాచాశ్మని మణి
ర్జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్ ।
తథా దేవ భ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసి చ న మత్వాపశుపతే ॥

## అనువాద పద్యము

సీ॥ ముత్యపు చిప్పల ముద్దుమోమును జూచి
బండపడినబుద్ధి వెండియనును,
పిండినీటినిచట రెండు కన్నుల గాంచి
పాడుపడినబుద్ధి పాలెయనును,
ఎండమావుల గూర్చి ఎన్నిసారులు విన్న
నుదయమందనిబుద్ధి యుదకమనును,
మోజు గొలుపుచుండ గాజుటాలను జూచి
మందగించినబుద్ధి మణులెయనును

గీ॥ అట్టిరీతిని జడబుద్ధి పట్టియుండి
పశుపతీ! మహాదేవేశ ! పార్వతీశ !

**ఎదలో నుండిన నిను జడు డెఱుగలేక**
**దేవుడను భ్రాంతితో నన్యసేవజేయు.**

## టీక

మహాదేవ = ఓ దేవదేవా ! పశుపతే = సకల భూతాధిపతీ ! జడజనః = మూఢుడు, ఈశం = సర్వనియంతవగు, త్వాం = నిన్ను, మనసి = హృదయమందు, నమత్వా = తలంచక (ఎఱుగక), శుక్తౌ = ముత్యపుజిప్ప యందు, రజతమితి = వెండియనియు, కాచాశ్మని = గాజుఱాయియందు, మణిః = మాణిక్యమనియు,పైష్టి = పిండిగలిపిన, జలే = నీటియందు, క్షీరం = పాలనియు, మృగతృష్ణాసు = ఎండమావులయందు, సలిలం = జలమనియు, బుద్ధిః = మిథ్యాబుద్ధి, యథా = ఎట్లు, భవతి = కలుగుచ్నునదో, తథా = అట్లు, భవదన్యమ్ = నీ కంటె యితరుడైనట్టి వానిని, దేవభ్రాన్త్యా = దేవుడను భ్రాంతిచేత, భజతి = సేవించుచున్నాడు.

## తాత్పర్యము

మహాదేవా ! ముత్యపుచిప్పలను వెండియనియు, గాజురాళ్ళను మణులనియు, పిండినీళ్ళను పాలనియు, ఎండమావులను నీళ్ళనియు భ్రమించునట్లుగా నిన్ను తెలియనేరని మనుజుడు ఇతరుని దేవునిగా భ్రమించి సేవించుచున్నాడు.

## వివరణము

బుద్ధి బుగ్గలైతే అసలుకు, నకిలీకి భేదాన్ని గుర్తించలేము. నజరుగా వుండే నకిలీ వాటినే అసలుగా భ్రాంతి పడి అసలుకు ఎసరు పెట్టి అగచాట్లు పడుతూ వుంటాం. అసలైనది అందుబాటులో ఉన్నప్పటికీ నకిలీలకై నాలుగు దిక్కులు తిరిగి నవ్వులపాలు ఔతూండటం కూడా జరుగుతూ వుంటుంది. ఇది లోకంలో సర్వసాధారణమైన విషయం. ముద్దుగా వెన్న ముద్దల వలె కనబడే ముత్యపు చిప్పలే నిజమైన వెండి అని బండ పడిన బుద్ధి అనుకుంటుంది.

రెండు కళ్ళతో చూచికూడా పిండి నీళ్ళను పాలను కుంటుంది పాడుబుద్ధి. ఎండమావుల్లో నిండునీళ్ళను వెదుక్కుంటుంది వికసించని బుద్ధి. నజరుగా వుండే మొర మొరలాడే గాజు మెరుపులను చూచి మందబుద్ధి మణుల్ని గూడా ప్రక్కన పెడుతుంది. బుద్ధి బుగ్గలైతే ఈ విధంగానే జరుగుతుంది. లేకపోతే హృదయంలోనే ఈశ్వరుణ్ణి ఉంచుకుని ఊరూరా తిరుగుతూ, ఎక్కడెక్కడ వారికి మ్రొక్కు బడులు దేనికి' - అని ఈ శ్లోకంలో అంటున్నారు ఆదిశంకరులు.

సంస్థ యొక్క యజమానిని నేరుగా దర్శించి విన్నవించుకుంటే పనులు జరుగుతాయి గాని దారిలో తారసపడే దానయ్య లందరికీ విన్నవించుకోడం వలన ఏం ఫలం వస్తుంది ? అన్యపరివార దేవతల్ని, ఆశ్రయించడం, అర్చించడంకన్న అసలు దేవుణ్ణి ఆశ్రయించడం శ్రేయమని ఈ శ్లోక సారాంశం.

## సంస్కృత శ్లోకము - 9

శ్లో. గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః ।
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో ॥

## అనువాద పద్యము

సీ॥ గంభీరముగ నుండు కాసారమున దూకు
పుష్పార్థమై పెదబుద్ధినరుడు
జనులు దూరగలేని వనముల దిరుగును
సూనమ్ములకు జడమానవుండు
గగన భాగమ్మంటు నగములందు తిరుగు
కుసుమమ్ముల కనుచు కుమతి నరుడు
ఇట్టి రీతిని తాను వెట్టి చాకిరి చేసి
మీదు మిక్కిలిగ శ్రమించు గాని

గీ॥ *పార్వతీపతి ! భూతేశ ! పశుపతీశ !*
*మానసాంబుజ మర్పించి మౌనియగుచు*
*స్థిరముగా నుండి యిచటనే సేవ జేసి*
*సౌఖ్యముల్ పొంద దాశ్చర్యమయ్యె !*

## టీక

జనః = మనుష్యుడు, జడమతిః = తెలివితక్కువాడై, కుసుమార్థం = పుష్పముల కొఱకుగా, గభీరే = లోతైన, కాసారే = చెఱువునందు, విశతి = దిగుచున్నాడు, విజనే = జనులులేని, ఘోరవిపినే = భయంకరారణ్య మందును. విశాలే = విస్తీర్ణమైన, శైలేచ = పర్వతమందును, భ్రమతి = తిరుగులాడుచున్నాడు, హే ఉమానాథ= ఓ పార్వతీపతీ ! ఏకం = ఒక్క చేతస్సరసిజం = మనస్సనియెడు పద్మమును, భవతే = నీ కొఱకు, సమర్ప్య = సమర్పించి, ఇహ = ఇచ్చట, సుఖేన = సుఖముగా, అవస్థాతుం = స్థిరుడైయుండుటకు, నజానాతి = ఎఱుగడు, కిమహో = ఏమియాశ్చర్యము !

## తాత్పర్యము

ఆహా! మానవులెంత వెఱ్ఱి వారు! పుష్పములకొరకు తా మడవులలోను, కొండలలోను తిరుగులాడుచు, లోతైన చెఱువులలో నీదులాడుచు చిక్కులు పడుచున్నారు. తమతమ మనస్సను పద్మమును పరమేశ్వరుని పాదారవిందముల యందు సమర్పించినయెడల నెంత సుకరముగా నుండును?

## వివరణము

షోడశోపచారపూజలో పుష్పానికి ఒక ప్రత్యేకత వుంది. 'పుష్' అంటే 'పోషించు' (To Nurish) అని అర్థం. కాబట్టి 'పుష్పము' అంటే 'పోషించునది' అనే అర్థం వస్తుంది. రాబోయే ఫలం (Fruit or Result) యొక్క అంకురాన్ని – పింద, కాయ స్థాయిల నుండి ఫలరూపంలోకి తీసుకురావడానికి కావలసిన పోషణ పుష్పం ద్వారా జరుగ్తుతుంది. ఈ ఫలాంకురాన్ని పురుషాంకురంగాను,

పుష్పాన్ని ప్రకృతిమాతగాను సమన్వయపరచుకోవచ్చును. ఈ కారణం మూలంగానే పరమాత్మకు పుష్పమంటే ఎక్కువ ప్రీతి. ఈ పుష్పాన్ని నేరుగాకాక, మంత్ర పూతం చేసి సమర్పించడాన్నే 'మంత్రపుష్ప సమర్పణ' యొక్క అర్థం.

'పుష్పం' అంటే 'ఐదు' అని గూడా నిగూఢార్థంవుంది. అందుకే 'పుష్పోత్సవం' అంటే ఐదురోజులు జరుగు ఉత్సవాలని అర్థం వచ్చింది. 'ఐదు' - అనంగానే పంచజ్ఞానేంద్రియాలు గుర్తుకు రావాలి. మంత్రపుష్పాన్ని సమర్పించడం అంటే - 'మనలోని పంచేంద్రియ ప్రవృత్తులను సంధానించే మనస్సును మంత్రాలతో నియంత్రించి సమర్పణ చేయడం' అని అర్థం. ఈ విధమైన అర్థంలో మంత్రపుష్పాన్ని పూజలో దైవానికి సమర్పించడం యుక్తము, శాస్త్రీయము ఔతుంది. పూజలో పుష్పసమర్పణ అంటే - ఇంతటి అర్థం ఉందని గ్రహించాలి. దీన్ని దృష్టిలో పెట్టుకునే బాహ్యంగా పుష్పాలను సమర్పించడం జరగాలి. ఈ అంతరార్థం తెలియక పుష్పాలను సమర్పించడంలో ఎవరెవరి అర్థబలాన్ని, అంగబలాన్ని బట్టి వారు వారు వారి స్థాయిని బట్టి పుష్పాలకై ధనాన్ని, శక్తిని, కాలాన్ని వెచ్చిస్తూ వుంటారు.

పుష్పాల కోసం కొందరు లోతుగా వుండే కాసారాల్లోకి దూకి పుష్పాలను తెచ్చి సమర్పించి ఆనందిస్తారు. కొందరు చీమలు దూరని చిట్టడవుల్లోనూ, కాకులు దూరని కారడవుల్లోను ప్రవేశించి తిరిగి తిరిగి తెచ్చిన సుమాలను సమర్పించి తృప్తి చెందుతారు. ఆకాశాన్ని స్పృశించే ఎంతో ఎత్తుగా వుండే చెట్లను ఎక్కి కోసుకువచ్చిన పుష్పాలను సమర్పిస్తారు. ఇంతగా ఇన్ని విధాలుగా కష్టపడి పుష్పాల కోసం, శ్రమపడి తిరుగుతారు. 'తమ చెంతనే, తమదే అయిన మనస్సనే పుష్పాన్ని సమర్పించకుండా ఈ రకంగా ఎంత శ్రమపడితే మాత్రం ఏం ప్రయోజనం ? అంటున్నారు ఈ శ్లోకంలో ఆదిశంకరులు 'మనః పుష్పం సమర్పయేత్' - ఇదీ ఈశ్లోక సారాంశం.

## సంస్కృత శ్లోకము - 10

శ్లో. నరత్వం దేవత్వం నగ వన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్ ।
సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానందలహరీ
విహారాసక్తం చే ద్ధృదయ మిహ కిం తేన వపుషా ॥

## అనువాద పద్యము

సీ॥ నరజన్మమైన, నిర్జరజన్మమైనయున్
దానవజన్మైన దైవమైన
నగజన్మమైనయున్, మృగజన్మమైనయున్
వనజన్మమైన, పర్వతమెయైన
మశకజన్మైననూ, పశుజన్మమైననూ
తరుజన్మమైననూ, పురుగెయైన
విహగజన్మల వంటి వివిధ జన్మలలోన
పుట్టినప్పటికిని పూర్తిగాను -
గీ॥ డెందమెపుడు నీ పాదారవిందయుగ్మ
సంస్మరణ పరమానంద సౌఖ్యలహరి
యందె చరియింప సంసక్తి పొందెనేని
కాయమేదైన వచ్చెడు కష్టమేమి ?

## టీక

నరత్వం = మనుష్యుడుగా గానీ, దేవత్వం = దేవుడుగా గానీ, నగ = పర్వతముగాగానీ, వన = అడవిగాగానీ, మృగత్వం = మృగముగాగానీ, మశకతా = దోమగాగానీ, పశుత్వం = పశువుగాగానీ, కీటత్వం = పురుగుగాగానీ, విహగత్వాది = పక్షులు మొదలగునవిగాగానీ, జననం = పుట్టుక, భవతు = అగుగాక, హృదయం = మనస్సు, ఇహ = ఈ పైజన్మముల యందు, సదా =

ఎల్లప్పుడు, త్వత్ = నీయొక్క, పాదాబ్జ = పాదపద్మముల యొక్క స్మరణ = స్మరించుట యనియెడు, పరమానంద = మహానందము యొక్క లహరీ ప్రవాహమందలి, విహార =విహరించుటకు, ఆసక్తం = ఆసక్తికలిగినది, భవతిచేత్ = అగునేని, త ఏన = ఆ, వపుషా = శరీరముచేత, కిం =ఏమి భంగము ?

## తాత్పర్యము

మనస్సు పరమేశ్వర స్మరణము గలదై శివానందలహరి యందు ఓలలాడుచున్నచో దేవ, నర, కీటకాది జన్మలలో ఏ జన్మమెత్తినను కొదువలేదని తాత్పర్యము.

## వివరణము

'జంతూనాం శరజన్మ దుర్లభమ్' అనడం సబబే కాని 'జంతూనాం నరజన్మ ఉత్తమమ్' అనడం మాత్రం మానవాహంకారాన్ని తెలియచేస్తుంది. భక్తి విషయంలో గూడా ఇలా అనడం మరింత తప్పిదమే ఔతుంది. పిపీలికాది బ్రహ్మపర్యంతం భక్తి విషయంలో ఏ జన్మ అయినా అవరోధం కాదు - అనే విషయాన్ని ఆదిశంకరులు ఈ శ్లోకంలో నొక్కి వక్కాణించారు. నర, దేవ, రాక్షస, నగ, మృగ, వన, పర్వత, మశక, పశు, తరు, కీటక, విహంగ, జన్మలలో ఏ జన్మకు చెందిన జీవి అయినప్పటికీ వచ్చే నష్టం ఏదీ లేదు. హృదయం కనక ఈశ్వర పాదారవిందయుగళ స్మరణ అనే ప్రవాహంలోనిమగ్నమై ఆనందించటానికి ఆసక్తి గలిగినదైతే చాలు. ఏ విధమైన జన్మకు చెందిన జీవి అయినా, ఏ విధమైన శరీరంతో జీవిస్తున్నా - తరించడానికి అవేమీ అడ్డుకావు, అడ్డురావు. ఉదా: సాలెపురుగు (కీటకం), సర్పము లేదా - 'కాళము' ఏనుగు (పశువు) ఈ మూడూ గూడా ఈశ్వరుని ఆరాధించి అర్చించి ఈశ్వర క్షేత్రాన్ని తమ పేర్లతోనే 'శ్రీకాళహస్తి' అనే పుణ్యక్షేత్రంగా విరాజిల్ల చేసిన సంగతి తెలిసిందే గదా! భక్తికి కావలసినది నిరంతర ఈశ్వరాయత్తమైన హృదయం గాని నజరు

గొలిపే నాణ్యమైన జన్మలు కాదు - రమణీయమైన ఆకృతులు కాదు' అని ఈశ్లోక సారాంశం.

## సంస్కృత శ్లోకము - 11

శ్లో. వటు ర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో
నరో వా యః కశ్చి ద్భవతు భవ కిం తేన భవతి ।
యదీయం హృత్పద్మం యది భవ దధీనం పశుపతే
తదీయ స్త్వం శంభో భవసి భవభారం చ వహసి.

## అనువాద పద్యము

సీ॥ బ్రహ్మచర్యాశ్రమ రతుడుగానిమ్మిలన్
గృహధర్మయుతుడునౌ గేస్తుగాని
సర్వమ్ము త్యజియించు సన్న్యాసిగానిమ్ము
జడలపెంచిన జటాధారి గాని
మరియింక నే విధి మనుజుడెవడైన
కానిమ్ము పశుపతీ ! కష్టమేమి ?
ఆతండు తన హృదయార విందమ్మును
నీయధీనమునందు నిల్పువేళ

గీ॥ అతని రక్షకుడవు నీవె యగుదువయ్య
అంతమాత్రమె గాదయ్య సాంబమూర్తి
వాని సంసార సంక్లిష్ట భారమెల్ల
నీవె భరియింతువయ్య ఓ నీల కంఠ !

## టీక

నరః = మానవుడు, వటుర్వా = బ్రహ్మచారియైనను, గేహీవా = గృహస్థైనను, యతిరపి = సన్న్యాసియైనను, జటీవా = జటాధారియైనను,

తదితర, యః, కశ్చిత్ = మఱియింకనెట్టివాఁడైనను, భవతు = కానిమ్ము, తేన = అందుచేత, హేభవ = ఓ యీశ్వరా ? కిం భవతి = ఏమి యగును. పశుపతే = సకలభూతనాయకా ? యదీయం = ఎవని సంబంధమైన, హృత్పద్మం = హృదయకమలము, భవదధీనం యది = నీ యధీనమయినదిగానుండునో, తదీయః = వాని సంబంధుడవుగా, త్వం = నీవు, భవసి = అగుదువు, హేశంభో = ఓశంకరా ! భవభారంచ = వానిసంసార భారమును, వహసి = (నీవే) భరింతువు.

## తాత్పర్యము

శివా ! ఏయే వర్ణముల యందున్నను, ఏ యాశ్రమమందున్నను, ఎన్నెన్ని జడలు పెంచుకొన్నను ఎంతవాడైనను సరే ఈశ్వరభక్తి లేనిదే లాభమిసు మంతయును లేదు. హృదయపద్మమునందు నిన్ను ధ్యానించుచు మనస్సు నీయందర్పించి భజించు వానికి సంబంధివై వాని భారమంతయు నీపై వేసికొని కాపాడుదువు.

## వివరణము

జన్మ సంగతి చెప్పిన తరువాత మానవ జన్మకు సంబంధించిన చతురాశ్రమాల గుఱించి ఈ శ్లోకంలో చెప్తున్నారు. జనన మరణాల మధ్య ఉండే మానవ జన్మను 1) బ్రహ్మచర్యాశ్రమం 2) గృహస్థాశ్రమం 3) వానప్రస్థాశ్రమం 4) సన్న్యాసాశ్రమం - అని నాలుగు విభాగాలుగా విభజించారు. వివాహం కానంతవరకు వున్న కాలాన్ని బ్రహ్మచర్యాశ్రమ కాలంగాను, వివాహానంతరం సంసారం సాగించే దశను గృహస్థాశ్రమ కాలంగాను, వృత్తి నిర్వహణానంతరం జరిగే విశ్రాంత జీవన కాలాన్ని వానప్రస్థాశ్రమ కాలంగాను, చిట్టచివరకు సంపూర్ణ వైరాగ్య స్థితిలో ఉండే దశను సన్న్యాసాశ్రమ కాలంగాను నిర్ణయించారు. ఈ నాలుగు ఆశ్రమాల్లో ఏ విధమైన సంసార బంధాలు అడ్డంకులూ లేని చిట్టచివరిదైన సన్న్యాసాశ్రమం భక్తికి,

యోగాభ్యాసానికి విశిష్టమైనదిగా చెప్తుంటారు. కాని, ఈ శ్లోకంలో ఆదిశంకరులు ఆ విషయానికి ప్రాధాన్యమీయలేదు. ఏ ఆశ్రమంలో అయినా మంచివాళ్ళు, చెడ్డవాళ్లూ గూడా వుంటారు. మనిషి మంచితనాన్ని వారున్న ఆశ్రమాలను బట్టి నిర్ణయించగూడదు. 'తలలు బోడులైన తలపులు బోడులా విశ్వదాభిరామ వినురవేమ' అని వేమన చెప్పనే చెప్పాడు. ఈ లోకంలో సంసారం చేసే సన్న్యాసులు, సన్న్యాస స్థితిలో వుండే సంసారులు, బ్రహ్మచర్య కాలంలో గృహస్థాశ్రమ ధర్మాలను పాటించేవారు, గృహస్థాశ్రమంలో బ్రహ్మచర్యం పాటించేవారు గూడా వుంటారు. భక్తి విషయంలో ఆశ్రమంతో సంబంధం లేదు. ఫలాని ఆశ్రమమే ఉండాలనే నిబంధన లేదు. గడ్డం, మీసం పెంచినంత మాత్రాన, కాషాయాంబర ధారి అయినంత మాత్రాన ఆ వ్యక్తి సన్న్యాసి అయితీరాలని లేదు. ఈ విషయాన్ని ఆ వ్యక్తి అంతరంగాన్ని బట్టి, స్వభావ సౌశీల్యాదులను బట్టి నిర్ణయించాలి గాని బాహ్యమైన రూపాన్ని బట్టి, వేషధారణను బట్టి ఉన్న ఆశ్రమాన్ని బట్టి నిర్ణయించకూడదు. భక్తి విషయంలో ఈ విషయం మరింత స్పష్టం.

ఏ ఆశ్రమానికి చెందిన వ్యక్తి అయినా అతని హృదయం పరమేశ్వరుని అధీనమై వుంటే ఆ పరమేశ్వరునితో సంబంధం ఏర్పడి ఆ వ్యక్తి ఉద్ధరింపబడడం తథ్యం. హృదయం పరమేశ్వర భక్తితో పరిపూర్ణమై ఉండడమే దైవానుగ్రహానికి అర్హత గాని ఆశ్రమ, వేషధారణ, బాహ్యపటాటోపాలు కాదు అని ఈ శ్లోక సారాంశం. ప్రహ్లాద, మార్కండేయ ధ్రువుల వంటి బాలురు, అంబరీష, పోతన, త్యాగరాజు, అగస్త్య, వశిష్ఠాదులవంటి గృహస్థ ఋషీశ్వరులు గూడా తరించారంటే భక్తివల్లనే గాని ఆశ్రమ అధిక్య, వేష వైవిధ్యాల వల్ల కాదు గదా!

**సంస్కృత శ్లోకము - 12**

శ్లో. గుహాయాం గేహే వా బహిరపి వనే వాఽద్రి శిఖరే
జలే వా వహ్నౌవా వసతు వసతేః కిం వద ఫలమ్ ।
సదా యస్యైవాంతః కరణమపి శంభో తవ పదే
స్థితంచే ద్యోగోఽసౌ స చ పరమయోగీ స చ సుఖీ ॥

## అనువాద పద్యము

సీ॥ స్వంత గృహములోని అంతరమునగాని
కొండరాళ్ళ నడుమ గుహాలయందునగాని
బయటగా నుండెడు ప్రాంతమందునగాని
నరులు తిరుగని వనమునగాని
నిండు నీటను గాని మండు నిప్పునగాని
ఆకాశ నగ శీర్షమందుగాని
వసియించగా నేమి ఫలము వానికి చెప్పు.
చిత్త చాంచల్యమున్ శీఘ్రమణచి

గీ॥ నీ చరణకమలములందు నిరతముంచి
మౌనమందున జ్ఞాన సంభావ్యమందు
భవ్య సౌఖ్యమ్ము పొందెడు పరమయోగి
స్థిరముగా వాడె యగునయ్య పరమశివుడ !

## టీక

గుహాయాం = కొండగుహయందో, గేహేవా = స్వగృహమందో, బహిరపి = బయట నెచ్చటనో, వనేవా = అడవియందో, అద్రిశిఖరే = పర్వతశిఖరమందో, జలేవా = నీటియందో, వహ్నౌవా = పంచాగ్ని మధ్యమందో, వసతు = నివసించుగాక, హే శంభో = సుఖకరుండువగు ఓయీశ్వరా!, వసతేః = అట్లు నివసించిన మాత్రమున, కిం ఫలం = ఏమి ఫలమో, వద = చెప్పుము (ఏమియు ఫలము లేదనుట), యస్య = అట్టి వాని యొక్క అంతఃకరణమపి = మనస్సుగూడ, సదా = ఎల్లప్పుడును, తవ = నీ యొక్క పదేఏవ = పాదమందే, స్థితం చేత్ = నిలచియున్నచో, అసౌ = ఇట్లు నిలుచుటయే, యోగః = యోగసిద్ధి, సచ = అట్టివాడే, పరమయోగీ = నిర్వికల్పసమాధి గల పరమయోగియు, సచ = వాడే, సుఖీ = పరమానందము గలవాడును అగును.

## తాత్పర్యము

పర్వతగుహలు, అరణ్యములు మొదలగు వానియందు నివాసము చేసినంత మాత్రమున ఫలవేమియులేదు. అంతరఃకరణముగూడ ఈశ్వరధ్యానమునందునిల్పి, తదేక నిష్ఠాగరిష్ఠుడై యున్నచో శివయోగియై పరమానందము నొందును.

## వివరణము

ధ్యానము, అర్చన, తపస్సు మొదలైనవాటికి ఒక పవిత్ర ప్రదేశం ఉండడం మంచిదే కాని, అందుకు ఒక నిర్దేశిత ప్రదేశమే ఉండి తీరాలి లేకపోతే కుదరదు – అని వాటిని మానడం మాత్రం మంచిది కాదు. ఇది ఎలాగో అలా వంక చెప్పి ఎగగొట్టే వాడి లక్షణాన్ని తెల్పుతుందే కాని 'శాస్త్ర ప్రకారమే చేసేవాడు' అని అనిపించుకోడానికి సంబంధించిన ఋజుత్వాన్ని తెలియచెయ్యదు. ఇల్లే ఉండి తీరాలనుకునేవాడు అద్దెఇంటి కంటె స్వంత ఇల్లైతే సంకల్పంలో 'స్వగృహే' అని చెప్పుకోడానికి వీలుంటుంది కాబట్టి స్వగృహం నయమని అంటాడు. ఇంటిలోపల అయితే అందరివల్ల ఆటంకాలు, అవరోధాలు కలుగుతాయి కాబట్టి కొండగుహలైతే ఇంకా నయమని అంటాడు. జనసంచారం వున్న ప్రదేశం కంటే జనసంచారం లేని అరణ్యప్రాంతమైతే ఇంకా నయమని అంటాడు. అసలు బయట ప్రపంచంలో అంతరాయాలు కలుగుతూ వుంటాయి కాబట్టి నిష్ఠ బాగా కుదరాలంటే నీళ్ళల్లో అయితే మరీనయం అనీ అంటాడు. తన నిష్ఠను, ఓర్పును, గొప్పతనాన్ని నలుగురికీ తెలియపరచేందుకు నిప్పులో వుండి సాధన చేసేవారు, ఆకాశాన్ని అంటుకునే పర్వత శిఖరాలపైకి వెళ్ళి తపోధ్యానాదులు చేస్తేనే సాధన గొప్పదవుతుందనే భావాలు కలవాళ్ళు గూడా వుండవచ్చు. కాని ఎక్కడ వుండి అయినా, ఎప్పుడైనా మనస్సును స్థిరంగా – ఆ శివుని పాదారవిందాలమీద నిలపాలి – అనే ఒక్కనియమమే ముఖ్యంగాని ఇతర నియమాలు ముఖ్యంగాదు. శివపాదలయము గాని మనస్సుతో ఎన్ని

కఠోర నియమాలు పెట్టుకుని ఆచరించినా ప్రయోజనం వుండదు. ఫలితం దక్కదు అని ఈ శ్లోక సారాంశం.

## సంస్కృత శ్లోకము - 13

శ్లో. అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మామంధం పరమకృపయా పాతుముచితమ్ ।
మదన్యః కోదీనస్తవ కృపణరక్షాతినిపుణః
త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే ॥

## అనువాద పద్యము

సీ॥ సతతమ్ము నీ పూజ సల్పగా లేనట్టి
నిస్సార సంసార నిలయమందు
దృష్టి మాంద్యము వచ్చి కొట్టుకొనుచునుండు
దీనాతి దీనుండ ! దేవదేవ !
అట్టి నాకంటె నీకెట్టివాడున్నాడు
రక్షింపగా నీవు రక్షబూన ?
దీన సంరక్షకా !దివ్య చైతన్యమా !
పశుపతీ ! శంకరా ! పార్వతీశ !

గీ॥ నీవె రక్షింపగా తగు నీరజాక్ష !
ఎవడు నీ కంటె రక్షకుండిట్టినాకు
మూడు జగములలోనైన లేదు లేదు
కాన రక్షించు మాత్మవిజ్ఞాన మొసగి.

## టీక

హేపశుపతే = ఆత్మ జ్ఞానమును పరిపాలించువాడా, అజడ = జడములైన దేహాదులకన్న విలక్షణమైన, పరమ = ఓపరాత్పరా ! అసారే = సారములేనిదియు, నిజభజనదూరే = ఆత్మాను సంధానము దూరమైనదియునగు, సంసారే =

సంసారమందు, భ్రమంతం = కొట్టుకొనుచున్నట్టియు, అంధం = ఆత్మానాత్మవివేకములేని గ్రుడ్డివాడనైనట్టియు, మాం = నన్ను, కృపయా = దయతో, ధియా = స్వరూపజ్ఞానము నిచ్చుటచేత, పాతం = రక్షించుటకు, ఉచితం = యుక్తము. దీనః = సంసార తాపముచేత దీనుడనైన, మదన్యః = నాకంటె మఱియొకడు, తవ =నీకు, కః = ఎవడున్నాడు ? కృపణరక్షాతినిపుణః = దీనులను సంరక్షించుటయందు మిక్కిలి నేర్పుగలవాడును, మే = నాకు (నన్ను), శరణ్యః = రక్షించదగినవాడు, త్వదన్యః = నీ కంటె మఱియొకడు, త్రిజగతి = ముల్లోకములయందును, కః = ఎవడున్నాడు.

## తాత్పర్యము

మహాదేవా! ముల్లోకములందును దీనరక్షాపరుడవు నీ వొక్కడవే గలవు. నేనును సంసార తాపములను సహింపలేక దీనుడనై నీవే దిక్కుగా నీ పాలబడి యున్నాను. నావంటి దీను లింకెందును కానరారు. కనుక దయచూపి ఆత్మజ్ఞాన మొసగి యీ దీనుని సంసారతాపములనుండి రక్షింపుము.

## వివరణము

గృహస్థా శ్రమధర్మాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేక, సంసారం అంటే అర్థమే తెలియక, గృహస్థాశ్రమాన్ని, సంసారాన్ని తమ సాధనకు, తమ ఆధ్యాత్మిక చింతనకు అడ్డుపడేవిగా అపార్థం చేసుకుని తిట్టుకుంటూ దైన్యమైన జీవితాన్ని గడుపుతూ ఉండేవారు కొందరుంటారు. సంసారాన్ని చేసి చేసి శాశ్వతానందాన్ని ఇచ్చే సుఖం దైహిక, సంసారిక సుఖాల ద్వారా లభించదని తెలుసుకుని - సంసారాన్ని నిస్సారంగా భావించేవారూ వుంటారు. భగవదారాధనకు ఆధ్యాత్మిక చింతనకు దూరం చేసిన సంసార సుఖంలోపడి ఇంతవరకు తాము గ్రుడ్డివారుగా బ్రతికామనే భావన కలుగుతుంది. తమ దీన స్థితి నుండి బయటపడవేయడానికి తగిన రక్షకుడెవరు అని తపన చెంది ఆలోచించినపుడు దీనజన బాంధవుడైన పరమేశ్వరుడు ముందు గుర్తుకు వస్తాడు. బేషరతుగా (Unconditional)

దీనులను రక్షించే స్వభావము ఒక్క భగవంతునికితప్ప ఇతరులకుండదు. ఆయన రక్షణకు దీనత్వమే అర్హత గాని మిగిలినవి కావు. 'ముజ్జగాల్లోను ముక్కంటిని మించిన ముక్తిప్రదాత, ఆది దేవుని మించిన ఆత్మజ్ఞాన ప్రదాత మరొకరులేరని' ఈశ్లోకమందు ఆది శంకరులు నొక్కి వక్కాణించారు.

## సంస్కృత శ్లోకము - 14

శ్లో. ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః ।
త్వయైవ క్షంతవ్యాః శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవనమియం బంధుసరణిః ॥

## అనువాద పద్యము

సీ॥ జ్ఞానదాతా ! నీవు దీనుల పాలిటి
పరమబంధువు గాదె వరమహేశ !
అట్టి దీనులలోన ఆద్యుండ నేనౌదు
నీలకంఠా ! శివ ! నీరజాక్ష !
ఇట్టి నీకును నాకు చుట్టరికము గల
దనివేరె చెప్పగన్ పనియులేదు
కాన ఓ శంకరా ! కరుణ నన్ వీక్షించి
తప్పక క్షమియించు తప్పులన్ని

గీ॥ ఇంక నా రక్షణమున కే వంకలేదు
కాన యిప్పుడె రక్షించు కార్యమీవు
చేయుమా ప్రభు ముందుగన్ చింత దీర్ప
బంధు మర్యాద లందునన్ పశుపతీశ !

## టీక

హేపశుపతీ = ఓ పరమేశ్వరా !, త్వం = నీవు, ప్రభుః = దైన్యము

బాపుటకు సమర్థుడవు (కనుకనే), దీనానాం = దీనులకు, పరమబంధుఃఖలు = ముఖ్య బంధువుడవు గదా, అహం = నేను, తేషాం = ఆ దీనులలో, ప్రముఖ్యః = మొట్టమొదటివాడను, అనయోఃఅపి = ఇట్టి మనకును, బంధుత్వం = చుట్టఱికము, కిముత = (ఉన్నదనివేఱే) చెప్పవలయునా, శివ = ఆనందస్వరూపుడా, సకలాః= సమస్తమైన, మదపరాధాః = నా తప్పులు, త్వయైవ = నీ చేతనే, క్షంతవ్యాః = క్షమింపదగినవి, మదవనం = నా రక్షణము,ప్రయత్నాత్ = ప్రయత్నము వలన, కర్తవ్యం = చేయదగినది, ఇయం = ఇది, బంధుసరణిః = బంధుమర్యాద.

## తాత్పర్యము

ఓ పరమేశ్వరా! నీవు దీనబంధుడవు. నేను దీనుడను. ఇక మనకు బాంధవ్యము గలదని వేరుగా చెప్పనక్కరలేదుగదా! కనుక నా తప్పులన్నియు మన్నించి తప్పక నన్ను నీవే కరుణించి రక్షింపవలసి యున్నది. ఇదియేకదా బంధువుల పద్ధతి.

## వివరణము

కష్టాల్లో ఉన్నవారిని ఆదుకోవడానికి ఒక్కొక్కప్పుడు తన, మన, పర అనే భేదాలను చూడడం గూడా లోక సామాన్యం. మహారాజంతవాడుగూడా బావమఱదిని ఆదుకొన్నట్లు పరాయివాడిని ఆదుకోడు. ముందు - తనకు, తనకు సంబంధించినవారు - ఆ తర్వాతనే ఇతరులు - అనే లోక సామాన్య వ్యవహారాన్ని గూడా గుర్తుతెచ్చుకుని శంకరులు ఈ శ్లోకంలో తనకూ పరమాత్మకు గల చుట్టరికాన్ని దృష్టిలో పెట్టుకుని ప్రార్థించారు.

శివుడు దీనజనబాంధవుడు. భక్తుడైనవాడు దీనాతిదీన స్థితిలో ఉన్నప్పుడు ముందుగా ఆ దైవానికి ఆ భక్తుని కాపాడాల్సిన బాధ్యత ఉంటుంది గదా! కాబట్టి, తెలియక కొన్ని పొరపాట్లు చేసినా అయినవారిని కాపాడడం లోకసహజం. దగ్గఱగావున్న దీన భక్తులను వదిలి దూరంగా ఉన్న వారినెవరినో

ఉద్ధరించడం గూడా అంత సమంజసంకాదు గదా! అనే తర్కంతో శంకరులు ఈ శ్లోకంలో శివుణ్ణి ప్రార్థించారు.

## సంస్కృత శ్లోకము - 15

శ్లో. ఉపేక్షా నోచేత్కిం న హరసి భవద్ధ్యానవిముఖాం
దురాశా భూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్ ।
శిర స్తద్వైధాత్రం న నఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ నన్ను రక్షించుట యన్నయుపేక్ష నీ
కేమైన యున్నదా యిపుడె చెపుమ
లేనిచో దుష్టమ్ములైన తలపులతో
నమల భవద్ధ్యాన విముఖు జేయు
నా ముఖ లిఖితమౌ నలువ వ్రాతను నీవు
తుడచివేయక నన్ను విడుతు వేమి ?
ఆ పని జేయనీ వసమర్థుడవనిన
నమ్మలే నామాట నాకు తెలియు
గీ॥ అట్టి గోటితో త్రుంచగా నలవిగాని
స్థిరముగా నుండు విధి యొక్క శిరము మునుపు
యత్నమే లేక హస్తనఖాగ్రములతొ
ఎట్లు త్రుంచితివయ్య దేవేశ నీవు ?

## టీక

పశుపతే = సర్వలోకాధీశ్వరా, ఉపేక్షానోచేత్ = (నన్ను రక్షించుటయందు నీకుపేక్షకలదేమో) అట్లు ఉపేక్ష లేనిచో, దురాశాభూయిష్ఠాం = దుష్టములైన తలంపులతో నిండినదియు, భవద్ధ్యానవిముఖాం = నీ ధ్యానమునుండి

పరాఙ్ముఖమైనదియు, విధిలిపిం = (నా ముఖముమీది) బ్రహ్మవ్రాతను, కింనహరసి = ఎందుకు తుడిచివేయవు, భవాన్ = నీవు, అశక్తోయది = అశక్తుడవేని, ననఖలు = గోటితోత్రుంచనలవిగాని, తత్ = ఆ, సువృత్తం = మిక్కిలి ధృఢమైన, వైధత్రం = బ్రహ్మ సంబంధమైన, శిరః = ఐదవ శిరస్సును, నిర్యత్నం = యత్నమక్కఱలేకుండ, కరనఖముఖేనైవ = చేతిగోటికొనచేతనే, కథంవా = ఎట్లు, లులితం = త్రుంచి వేయఁబడినది ?

## తాత్పర్యము

సాంబశివా! దుష్టమైన ఆలోచనలతో నిన్ను ధ్యానించుటయందు గూడా ఆసక్తిని కలుగనట్లు చేయుటకు సూచకముగా నానుదుట బ్రహ్మవ్రాసిన వ్రాతను ఉపేక్షింపక తుడిచివేయుము. నా చేతగాదని తప్పించుకొనుటకు వీలులేదు. ఆ బ్రహ్మదేవుని ఐదవ తలను నీ కొనగోటితోనే త్రుంచితివిగదా!

## వివరణము

వారివారి పుణ్య పాప కృత్యాలను అనుసరించి అనుభవించ వలసిన కర్మఫలాలను ఆయా జీవుల నొసటిమీద బ్రహ్మ వ్రాస్తాడని, దానినే 'బ్రహ్మలిఖితం' అని, దీనికి తిరుగులేక ఎంతటివాడైనా అనుభవించి తీరవలసినదేననీ అంటారు.-'ప్రారబ్ధంభోగతో నస్యేత్' ప్రారబ్ధాన్ని అనుభవిస్తేనే తీరుతుంది. 'విధిరేవగరీయసీ' ఇలాంటి మాటలు వింటూ ఉంటాం. కాని, నిదానించి ఆలోచిస్తే ఈ బ్రహ్మలిఖితం ఉల్లంఘింపబడిన సందర్భాలు గూడా ఉన్నట్లు తెలుస్తుంది. ఈ బ్రహ్మవ్రాత భగవద్భక్తులుకానివారి విషయంలోనేగాని భగవద్భక్తుల విషయంలో వర్తించదేమోనని అనిపించే సందర్భాలున్నాయి.

'మార్కండేయునికి బ్రహ్మలిఖితం ప్రకారం 16 ఏళ్ళు ఆయుర్దాయం. కాని, శివుని కరుణవలన చిరంజీవి అయాడు గదా! సత్యవంతుడు సతీసావిత్రి పాతివ్రత్యమహిమ వలన చనిపోయిగూడా ప్రాణాలనుతిరిగి తెచ్చుకుని బ్రతికాడు కదా! ఈ శివానందలహరి స్తోత్రాన్ని రచించిన ఆది శంకరులు గూడా

బ్రహ్మలిఖితం ప్రకారం 8ఏళ్ళ ఆయుర్దాయం అయినా సంన్యసించి 8ఏళ్ళు, వ్యాసుల వారి కరుణవలన మరో 16 సంవత్సరాలు పొంది మొత్తం 32 సంవత్సరాలు బ్రతికారు కదా! ఈ విధమైన సందర్భాలున్నాయి కాబట్టి- శంకరులు 'శివుని కరుణవుండాలేగాని బ్రహ్మలిఖితం ఏం చేస్తుంది- అని ధీమాగా ఈశ్లోకంలో చెప్పారు. ఎందుకంటే- బ్రహ్మవ్రాత లాంటి కోర్టు శిక్షలు గూడా 'మెర్సీ పిటీషన్' ద్వారా రద్దు కాబడిన సందర్భాలు ఉన్నాయి గదా! "అయినా, బ్రహ్మ ఐదవతలనే అవలీలగా గోటితో త్రుంచిన శివునికి ఆ బ్రహ్మవ్రాతను చెరపడం ఏమంత కష్టం ? అని శంకరుల వాదన.

## సంస్కృత శ్లోకము - 16

శ్లో. విరించి ర్దీర్ఘాయుర్భవతు భవతా తత్పరశిర
శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్ ।
విచారః కోవా మాం విశదకృపయా పాతి శివ తే
కటాక్ష వ్యాపారః స్వయమపి చ దీనావనపరః ॥

## అనువాద పద్యము

సీ॥ బ్రహ్మ నరులయొక్క ఫాలభాగమ్మున
దైన్యమున్ లిఖియించి ధరకు బంపి
నను, – దీనరక్షణమున నిందు ఆసక్తి
కలనీదు కృపావీక్షణము మమ్ము
తనకు తానె నిందు దయతోడ రక్షింప
బ్రహ్మ వ్రాతకుమాకు రాదుభయము
కావున శంకరా ! కరుణాసముద్రమా !
శ్రీకంఠ ! లోకేశ ! శివ! గిరీశ !

గీ॥ నలువ కున్నట్టి నాలుగు తలల నింక
త్రుంచకుండగ నీవు రక్షించుమయ్య

**సృష్టికారుడు పరిపూర్ణ జీవితము**
**బొంది నిండుగ నీ కృప నొందుగాక !**

## టీక

విశద = నిర్మలస్వరూపుడవైన, శివ = ఓ శివా! విరించిః = బ్రహ్మదేవుడు, దీర్ఘాయుః = చిరకాలజీవి, భవతు = అగుగాక, భవతా = నీచేత, తత్పరశిరశ్చతుష్కం = ఐదవదిగాక తక్కినవాని నాలుగు తలలు, సంరక్ష్యం = రక్షింపదగినది, సః = ఆ బ్రహ్మ, భువి = భూలోకందు, దైన్యం = దీనభావమును, లిఖితవాన్ ఖలు = (లలాటమున) వ్రాసెను గదా, దీనావనపరః = దీనరక్షణమందాసక్తి గల, తే = నీ యొక్క కటాక్షవ్యాపారః = కటాక్షప్రసారము, స్వయమపి = తనంతటతానే, కృపయా = దయతో, పాతి = రక్షించుచున్నది, విచారః = (దైన్యమును వ్రాయుటవలన) విచారము, కోవా = ఏ మున్నది. (ఏమియు లేదనుట).

## తాత్పర్యము

శివా! బ్రహ్మ మా ముఖమందు దైన్యము వ్రాయుచున్నాడు. అది మాకుపకారకముగా నున్నదిగాని విచారకరముగాదు. అందువలననే కదా దీనపోషకమగు మీ కటాక్షమునకు పాత్రులమగుచున్నాము. అయినదేమో అయిపోయినది. పోనిమ్ము. ఇంక నాతని నాల్గుతలలు మాత్రము ఛేదింపకుము. ఆ బ్రహ్మ దీర్ఘాయుష్మంతుడగుగాక!

## వివరణము

క్రిందటి శ్లోకంలో బ్రహ్మవ్రాతను తుడిచి కర్మఫలానుభవాలనుండి రక్షించమని ప్రార్థించిన శంకరులు ఈ శ్లోకంలో బ్రహ్మ మా లలాటంపై ఏం వ్రాతలువ్రాసినా ఫర్వాలేదు. ఆయన ఇష్టమొచ్చినట్లు వ్రాసుకోనీ, మాకేం నష్టం లేదు అంటున్నారు. ఇదేమిటి బ్రహ్మవ్రాతనే లెక్క చేయనంతధైర్యం ఇంతట్లోనే ఎక్కడ నుండి వచ్చింది? ఎలా వచ్చింది? అన్నదానికి సమాధానమే ఈ శ్లోకం.

ఎట్లాంటి వారి దైన్యాన్ని అయినా దూరంచేసి దీనుల్ని రక్షించే దీనజన రక్షకుడవైన నువ్వున్నావు. పైగా దీనుల్ని రక్షించడంలో శత్రుమిత్ర భేదంగాని, దేవాసుర భేదంగాని, ఆస్తికనాస్తిక భేదంగాని లేదునీకు. వృక్షాలు, వాయువు, చంద్రుడు, సూర్యుడు, మేఘాలు మొదలైనవి స్వపరభేదం లేకుండా తమతమవంతు సహకారాలను అందరికీ ఎలా అందిస్తున్నాయో – అలాగేనువ్వు దీనుల్ని రక్షించి వారి తలవ్రాతల్నే మార్చివేస్తున్నావు. ఇంకమాకేంభయం ? ఆ బ్రహ్మ మానొసటి మీద తన ఇష్టం వచ్చినట్లు ఎలా వ్రాసుకుంటే మాకేం-వ్రాసుకోనీ. మీ బిడ్డల నొసటిపై దైన్యాన్ని లిఖిస్తున్నందుకు శివా! నువ్వు కోపంతో ఆ బ్రహ్మకు మిగిలిన నాలుగు తలలనుమాత్రం త్రుంచకు. మమ్మల్ని రక్షిస్తున్నట్లే– ఆ బ్రహ్మకు కూడా చిరాయువును ప్రసాదించు– అని, 'అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాడు నేర్పరిసుమతీ!'– అనే ఉపదేశాన్ని గూడా ఈ శ్లోకంలో సూచించారు.

## సంస్కృత శ్లోకము - 17

శ్లో. ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపి స్వామిన్ భవదమలపాదాబ్జయుగళమ్ ।
కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజకనకమాణిక్యమకుటైః ॥

## అనువాద పద్యము

సీ॥ పూర్వజన్మ సుకృత పూర్ణఫలము వలనొ
కలిగిన నాపైన కరుణవలనొ
నీ యనుగ్రహముతో నీ భక్తుడగు నన్ను
శీఘ్రముగన్ గ్రహించితివి గాని
నిర్మలమైనట్టి నీ పదాబ్జములను
కన్నులారంగ నే గాంచుటెట్లు ?

స్వర్గలోకములోని సర్వులున్ శిరమొగ్గి
నిండు నమస్కృతుల్ నీకు జేయు
గీ॥ సందడుల నీదు పదముల ముందుపెట్టు
కనక మాణిక్యవంతమై కాంతులొలుకు
దొడ్డ మకుటములన్నియు నడ్డముండె
నయ్య ! నా స్వామి ! నన్నీవె యాదుకొనుము.

## టీక

విభో = ఓ సర్వవ్యాపకుడవైన, స్వామిన్ = పరమేశ్వరా, మమ = నాయొక్క, పుణ్యానాం = సుకృతముల యొక్క, ఫలాద్వా = ఫలమువలననో, మయి = నాయందు, కరుణయావా =దయచేతో, త్వయి = నీవు, ప్రసన్నే౽పి= ప్రసన్నుడవైన, భవదమలపాదాబ్జయుగళం = నిర్మలమైన నీ పాదపద్మములను, కథం = ఎట్లు, పశ్యేయం = చూతును, నమస్సంభ్రమజుషాం = నమస్కారము చేయుటయందు తొందరపడుచున్న, నిలింపానాం = దేవతలయొక్క, శ్రేణిః = గుంపు, నిజకనకమాణిక్యమకుటైః = తమ తమ రత్నాలు చెక్కిన బంగారు కిరీటములతో, మాం = నన్ను, స్థగయతి = అడ్డగించుచున్నది.

## తాత్పర్యము

ఓ జగత్ప్రభూ! నా పుణ్యము వలననో నీ దయ చేతనో, నీ వనుగ్రహించిన ననుగ్రహింతువుగాని నీ పాదారవింద సందర్శన మగుట యెట్లు? దేవతలందరును గుంపులు గుంపులుగాగూడి నేను నేనని నమస్కరించుటకు సంతోషముతో తొందరపడుచు వారి రత్నాల కిరీటములను మీ పాదములయందు మోపుచు నాకడ్డమగుచున్నారు.

## వివరణము

పూర్వజన్మ సుకృతం వుండి, ఆపుణ్యం పండి, నీకరుణ కలిగి నువ్వు ప్రసన్నుడవైనా- నీపాదపద్మదర్శనం కలగడం అంత సులభ సాధ్యమైన

విషయంగా అనిపించడం లేదు. ఎందుకంటే–ఆ పాదాలకు అన్ని వైపులనుండి పెద్ద పెద్ద దొడ్డదేవతలందరు– కేయూరమకుట కుండల కిరీట ధారులై 'నేనుముందు, నేనుముందు' అంటూ 'సాష్టాంగ పడుతుంటే–ఇక అతి సామాన్యుడనైన నేను ఆ పాదాల వద్దకు ఎలా వెళ్ళగలను? కనీసం పాదాలను చూడటానికి కూడాకుదరదు. అంతటి మహద్భాగ్యం కలిగేంతవరకు ఆర్తితో ఎదురుచూడవలసినదే! చూస్తాను (ఆ భాగ్యానికి నోచుకోవాలంటే నిరీక్షణతప్పదు, నిరాశ నిస్పృహలు పనికిరావు అని అర్థం)

పాదాలనే ఎందుకు చూడాలి? అంటే ఆ పాదాలు ధర్మాచరణ కోసం చరించేవి కాబట్టి–అందుకే ఆ చరణాలకు ప్రాముఖ్యం. భక్తిలో పాదాలకే ఎక్కువ ప్రాధాన్యం (చరణశరణాగతి అన్నారు కాని 'హస్త శరణాగతి', ముఖశరణాగతి'–ఇలా అనలేదు) చివరకు బలిచక్రవర్తి గూడా ఆ పాదాన్నే తనశిరస్సు పై పెట్టమని కోరాడు. అవి పరమపదాన్నిచ్చే పాదాలు అని తెలుసుకోవాలి.

## సంస్కృత శ్లోకము – 18

శ్లో. త్వ మేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహంత స్త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖాః ।
కియద్వా దాక్షిణ్యం తవ శివ మదాశా చ కియతీ
కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా ॥

## అనువాద పద్యము

సీ॥ ముల్లోకములకును మోక్షఫలము నిచ్చు
దైవ మీ వొకడవే దేవ దేవ !
అట్టి నీ దయవల్ల హరి విరించ్యాదులు
వైకుంఠ సత్యాది వాసులైరి
పరమ ఫలముగోరి మరల మరల వారు
సేవించుదురు గాదె శివుడు వంచు

*అహో ! మహాదేవ ! ఆ నీ దయాభావ*

*మంతటిది గద మహానుభావ !*

*గీ॥ హరుడ ! నా యాశయెంతటిదని తెలుపుదు ?*

*నా యహంకారము దొలగనీయగ శివ !*

*కరుణ దృష్టితో నాకు రక్షణము నీవు*

*యెపుదు వహియింతువో గద ఈశ్వరేచ్ఛ.*

## టీక

హేశివ = సుఖస్వరూపుడవైన ఈశ్వరా, లోకానాం = జనులకు, పరమఫలదః = మోక్షఫలము నిచ్చువాడవు, త్వం = నీవు, ఏకః = ఒక్కడవే, హరిముఖాః = విష్ణువు మొదలగువారు, త్వన్మూలాం = నీవే కారణముగా గలిగిన (నీ వొసంగిన), దివ్యపదవీం = వైకుంఠము మొదలగు దివ్యస్థానమును, వహంతః = పొందుచున్నవారై, పునరపి = మరల ఉత్తమ ఫలప్రాప్తికై, భజంతే = (నిన్నే) సేవించుచున్నారు, తవ = నీ యొక్క, దాక్షిణ్యం = భక్తాభిప్రాయానుసరణము, కియద్వా = ఎంత పరిమాణము కలది(పరిమితి లేనిదనుట), మదాశాచ = నాయొక్క ఆశయము, కియతీ = ఎంతటిది? (ఇంతయని యెఱుగననుట), మత్ = అహంకారము నుండి, రక్షాం = నాసంరక్షణమును, కరుణాపూరితదృశా = సంపూర్ణకటాక్ష వీక్షణముతో, కదా = ఎన్నడు, వహసి = చేయుదువు.

## తాత్పర్యము

ఆనందస్వరూపుడవైన యో దేవా! మోక్షమిచ్చు మహానుభావుడవు నీ వొక్కడవే ! విష్ణ్వాదులు నీ దయచేతనే వైకుంఠవాసులైరి. అయ్యును తనివినొందక నీవలన ఉన్నతపదవులను గోరుచునే యుందురు. ఆహా! భక్తులమీద నీ కెంత దయ! నాయాశ యెంతని చెప్పుదును! సంపూర్ణకటాక్షముతో నా అహంభావమును పోగొట్టి రక్షింపుము.

## వివరణము

భగవంతుణ్ణి ఆరాధించడంలో కూడా వివిధమైన పద్ధతులున్నాయి. 'ఆర్తో, జిజ్ఞాసురర్థార్థీజ్ఞానీచ భరతర్షభ' అన్నాడు గీతాచార్యుడు. గజేంద్రుడు తనకు వచ్చిన ఆపదనుండి కాపాడమని అర్థించిన ఆర్తుడు, ఉద్ధవుడు కృష్ణతత్త్వం తెలుసుకోవాలనుకున్న జిజ్ఞాసువు. సుగ్రీవుడు వాలివధను, కిష్కింధాధిపత్యాన్ని ఆశించిన అర్థార్థి. ఏదీ ఆశించకుండా నిష్కారణంగా, నిష్కామంగా, ఆనందానుభూతితో హరినామస్మరణ చేసిన ప్రహ్లాదుడు జ్ఞాని. అందుకే భక్తుల వరుసలో ప్రహ్లాదుడు మొట్టమొదట నిలిచాడు. (ప్రహ్లాద నారద పరాశర పుండరీక...) ఇలా ఎంతోమంది ఎన్నో రకాలుగా ఆరాధిస్తే వాళ్ళవాళ్ళ భక్తికి తగినట్లుగా భగవంతుడు వాళ్ళను అనుగ్రహిస్తాడు. సకామభక్తికి దేవతలు అష్టైశ్వర్యాలతో సర్వాధిపత్యాన్ని గూడాపొందారు. అయినా వారు దానితో తృప్తిపొందలేక పోయారు. ఇంకాపొందవలసిన దేనో పొందలేకపోయామన్న కోరికమిగిలి మరల ముక్తి కోసం ప్రాకులాడారు. ప్రార్థించారు. ఈ శ్లోకంలో శంకరులు తనకు అటువంటి అసంతృప్తికరమైన భోగభాగ్యాలు, అధికార సార్వభౌమత్వాలు, చివరకు ముక్తిఫలాన్ని కూడా అక్కరలేదని-కేవలం నీ 'పాదసేవాభాగ్యాన్ని మాత్రమే ప్రసాదించు అదే నాకు చాలు' అని శివుణ్ణి వేడుకున్నారు. అంటే-ఏ ఒక్కటి ఉంటే ఇంకా కోరవలసినవి, కావలసినవి, పొందవలసినవి మిగిలి ఉన్నాయనే అసంతృప్తి ఉండదో అటువంటి భగవత్పాద సేవాతత్పరతను మాత్రమే కోరుకోవాలని ఆ ఒక్కటీ ఉన్నప్పుడు అన్నీ వున్నట్లే అని శంకరుల అభిప్రాయము.

## సంస్కృత శ్లోకము - 19

శ్లో. దురాశాభూయిష్ఠే దురదిపగృహద్వార ఘటకే
దురంతే సంసారే దురితనిలయే దుఃఖ జనకే।
మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చే త్తవ శివ కృతార్థాః ఖలు వయమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ ఇల దురాశల యందు నీడ్చి ప్రభు గృహముల
ద్వార బంధము వద్ద జేరవేసి
దురిత నిలయమునౌచు, దురవసానమునౌచు
సకల దుఃఖములకు జననమౌచు
చవిలేనిదగు నాదు సంసార మందలి
వెట్టి చాకిరిని పోగొట్టవేమి ?
బ్రహ్మదేవుడు నీదు భక్తుదగుటజేసి
వాని వ్రాతలు చెఱపదగనివని

గీ॥ ప్రతిగ జేసినట్టియుపకారమగునేమొ
అయిన కానిమ్ము భక్తులందట్టి ప్రీతి
యున్న యుక్తమే యగుగద కన్నతండ్రి
అయిన సరియె నే గూడ కృతార్థుడౌదు

## టీక

దురాశాభూయిష్ఠే = దుష్టవిషయములయందలి యాశచే మిక్కుటమైనదియు, దురధిపగృహద్వారఘటకే = దుష్టప్రభువుల మందిర ద్వారములకు జేర్చునదియు, దురంతే = దురవసానముగలదియు, సంసారే = జనన మరణ ప్రవాహరూపమైన సంసారమందు, మదాయాసం = నా పరిశ్రమమును, కస్య = బ్రహ్మదేవుని యొక్క ఉపకృతయే = ఉపకారము కొరకు, న వ్యపనయసికిం = పోగొట్టకుంటివాయేమి ? వద = చెప్పుము, ఇయం = ఈ (భక్తుల యుపకారమును గుఱించిన), ప్రీతిః =ప్రేమ, తవ = నీకు, చేత్ = కలిగియున్నచో, వయమపి = (నిన్ను భజించుచున్న వారమైన) మేమును, కృతార్థాంఖలు = కృతార్థులమే గదా !

## తాత్పర్యము

శివా! దురాశలచేత దుష్టప్రభువుల గృహద్వారములయందు పడి కొట్టుకొనుచు పలుదుఃఖముల పాలుగావలసిన తుదిలేని సంసారమందలి నాపరిశ్రమల నేల నశింపజేయవు? నీ భక్తుడుగానున్న బ్రహ్మదేవునిమీది **వాత్సల్యము**చేత నాతనిచేతలు పోగొట్టుటకు ఇష్టపడకున్నావు కాబోలు. నీవు **భక్తవత్సలుడ**వయినప్పుడు నీ భక్తులమైన మాకేమి లోపము? నిన్ను భజించి మేమును కృతార్థులమగుదుముగదా!

## వివరణము

పంచ భూతాత్మకమైన ప్రపంచంలో పంచభూతాత్మకమైన శరీరంతో పుట్టిన ప్రతి వ్యక్తికీ పంచజ్ఞానేంద్రియ కార్యాలుంటాయి. ఇంద్రియ పరితృప్తికి చేసేపనులను 'ఇంద్రియలౌల్యాలు' అంటారు. ఇవి స్వంతదేహానికి సంబంధించినవి. వీటితోపాటు బరువు బాధ్యతలనే పేరుతో సంసార బాధ్యతలుకూడా ఉంటాయి. ఈ బాధ్యతల నిర్వహణలో ఒక్కొక్కప్పుడు చేయకూడని పనులుగూడా చేయవలసి రావచ్చును. ఈ రెండురకాల లంపటత్వాల వలన చేరకూడని వారి పంచనచేరి, వారి కరుణకు పడిగాపులు పడాల్సివస్తుంది. దుర్మార్గుల ఇళ్ళవద్ద వేచిఉండాల్సి వస్తుంది. అధికార మదాంధుల ఆజ్ఞలకులోబడి అకృత్యాలను చెయ్యవలసివస్తుంది. ఇలాఎన్నో ఇబ్బందులు పడుతూపాపకార్యాలను చేయాల్సిరావడం, వాటిని ఇవిపూర్వకర్మ ఫలాలని చెప్పుకుంటూ అనుభవించడం, మళ్ళీ రాబోయే జన్మకు పునాది వేసుకోవలసి రావడం – ఇలాజరుగుతూవుంటుంది. ఇంతటి శ్రమతో కాలుష్యంతో నిండి వుండే ఈ సంసారలంపటత్వంనుండి నన్ను కాస్త దూరంచేసి ముక్తిని ప్రసాదించమని అడుగుతున్నారు. అయితే–ఇలా అనుభవించాల్సిన గతిని మా నుదిటిమీద వ్రాసిన బ్రహ్మదేవుడు నీకు భక్తుడైపోయాడు. అందువలన ఆ భక్తుని పై వాత్సల్యంతో ఆయన వ్రాతల్ని, చేతల్ని పోగొట్టడం ఇష్టంలేక మా

బాధల్ని చూస్తూ గూడా ఊరుకున్నావు. అంతేనా? అయినా నీవు అంతటి భక్తవత్సలుడివైనప్పుడు మేమూ నిన్ను భజించి, నీ వాత్సల్యాన్నిపొంది ఈ సంసారలంపటత్వం నుండి విముక్తులమౌతాము. భక్తవత్సలుడివి నువ్వుండగా ఇంక మాకేం భయం ? అని – భగవంతుని ముందర కాళ్ళకు బంధం వేశారు శంకరులు.

## సంస్కృత శ్లోకము - 20

శ్లో. సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖా స్వటతి ఝటితి స్వైరమభితః ।
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంత చపలం
దృఢం భక్త్వా బద్ధ్వా శివ భవదధీనం కురు విభో ॥

## అనువాద పద్యము

సీ॥ నా మనస్సను కోతి నా నిమిత్తము లేక
నర్తించు మోహకాననమునందు
పరవమ్ములోనున్న వనితాకుచగిరుల
యందు మిగుల నాటలాడుచుండు
పేరాశలనియెడు పెద్ద కొమ్మలయందు
తమకమ్ముతో ముందు దుముకుచుండు
చిలిపిగా, చురుకుగా నలుమార్గములయందు
చిరచిరలాడుచు తిరుగుచుండు

గీ॥ ఈశ! భిక్షుక ! హేదేవ! హే కపాలి !
చనవుగా నీవు నా చిత్త చపలకపిని
భక్తియనియెడి త్రాటితో యుక్త విధిని
కట్టి నీ యధీనమునందు పెట్టుకొనుము

## టీక

కపాలిన్ = బ్రహ్మకపాలము ధరించినవాడవును, విభో = సర్వవ్యాపకుడవును, శివ = ఆనందస్వరూపుడవును, భిక్షో = ఆదిభిక్షుడవును అగు ఓ దేవా, సదా = ఎల్లప్పుడును, మోహాటవ్యాం = సంసారవాంఛయను మహారణ్యమందు, చరతి = సంచరించుచున్నది, యువతీనాం = జవ్వనుల యొక్క కుచగిరౌ = స్తనములనియెడు పర్వతమందు, నటతి = ఆటలాడుచున్నది, ఆశాశాఖాసు =దారపుత్రాదుల యందలి ప్రేమయను కొమ్మలయందు, అటతి = దుముకులాడుచున్నది, ఝడితి = శీఘ్రముగా, అభితః = నలువంకలను, అటతి = పరుగులిడుచున్నది, అత్యంతచపలం = మిక్కిలి చంచలమైన, మే = నా యొక్క హృదయకపిం= మనస్సనియెడు కోతిని, దృఢం = గట్టిగా, భక్త్యా = భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా = కట్టి, భవదధీనం = నీ వశముగా, కురు = చేసికొనుము.

## తాత్పర్యము

శివా! ఆదిభిక్షుకా! నా మనస్సను కోతి సంసారారణ్యమునందు చంచలముగా స్వైరవిహారముగావించుచున్నది. యువతుల స్తనగిరులందు ఆటలాడుచున్నది. ఆశలనియెడు కొమ్మలనుపట్టి దుముకుచున్నది. అన్ని మార్గములలో తిరుగాడుచున్నది. ఇంక లాభములేదు. దృఢమైన భక్తి అనెడి గట్టి త్రాటితో బంధించి నీ అధీనములో నీవే పెట్టుకొనుము.

## వివరణము

శివానందలహరిలో ఈ 20వ శ్లోకం చాలా ముఖ్యమైంది. మనిషిలోని లోపాలను చెప్పుతూనే ఆ లోపాలనుండి బయటపడే మార్గాన్ని గూడా ఈ శ్లోకంలో శంకరులు చెప్పారు.

'మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో: 'అన్న దానినిబట్టి మనిషి పతనానికి అయినా, బ్రహ్మపదసిద్ధికి అయినా మనిషి మనస్సే కారణం.

అటువంటి మనిషి మనస్సును ఒక కోతితో పోల్చారు శంకరులు. కోతి ఒకచోట నిలకడగా స్థిరంగా వుండదు. అన్ని విషయాలు దానికే కావాలి. ఒక దానితో సంతృప్తి చెందదు. చపలత్వం ఎక్కువ. మనస్సుగూడ అంతేకదా! మనిషికుండే మోహాన్ని ఒక అరణ్యంతో పోల్చారు. నిరంతరం కామవ్యామోహ మమకారాలతో నిండివుండేది మోహం అయితే-నిరంతరం (అంతరం అంటే-సందులేకుండా) దట్టమైన భారీవృక్షాలతో, చెట్లతో, గుట్టలతో, లోయలతో, వన్యమృగాలతో నిండివుండేది అరణ్యం. మనస్సనే కోతి ఈ మోహారణ్యంలోనే నిరంతరం తిరుగుతూ వుంటుందిట. మర్కటం పర్వతశిఖరాగ్రాలపై నర్తిస్తూ వుంటే - మనస్సు యువతుల స్తనాగ్రాలపై నర్తిస్తుందిట. అంటే విషయవాసనల ప్రభావం మూలంగా వాటినుండిలభించే తాత్కాలిక సంతృప్తికోసం వివిధ విషయాల్లోకి వెళ్ళి ఇరుక్కు పోతూవుంటుంది. మహారణ్యంలోని పెద్దపెద్ద వృక్షాలకుండే వివిధశాఖలు ఈ మర్కటానికే కావాలి. ఒక కొమ్మమీద నుండి ఇంకోకొమ్మమీదకు దూకుతూ నానాహడావుడి చేస్తూ వుంటుంది. మనస్సు గూడా మోహంలోపపడినపుడు రకరకాల ఆశలుపుట్టి, వాటిని తీర్చుకునేందుకు రకరకాల వ్యక్తుల దగ్గఱకు, గురువుల దగ్గరకు పోతూ-రకరకాల మంత్రాలు స్వీకరిస్తూ, వదిలివేస్తూ, కలసివచ్చినపుడు వాళ్ళని పొగుడుతూ - కలసిరానపుడు తిట్టుకుంటూ పార్టీలు, మతాలు సిద్ధాంతాలు మారుస్తూ నానాహంగామాగాను హడావిడిగాను వుంటుంది. ఇలా ఇష్టమొచ్చినట్లు స్వైరవిహారం చేస్తూ ఎంత చెప్పినా మాటవినని మనస్సనేకోతిని నియంత్రించి చెప్పుచేతల్లో పెట్టుకోడానకి ఒక చక్కని ఉపాయం తట్టి-శివునితోనే ఒక విచిత్రమైన ఒప్పందం చేసుకున్నారు శంకరులు.

'శివా! నిన్ను చూడంగానే నా మనోమర్కటాన్ని అదుపులో పెట్టుకోవడానికి ఒక ఉపాయం తట్టింది. నువ్వు నీ భుక్తిగడవడానికి ఎలాగూ రోజూ పుట్టెను చేత్తోపట్టుకుని భిక్షానికి గడప గడపకు వెళ్తావుగదా! ఒక్క పుట్టెపట్టుకుని బిచ్చానికి వెళ్తే నిన్ను పెద్దగా పట్టించుకునే వారు చాలా తక్కువ మంది వుంటారు.

అందువల్లనీకు కడుపునిండా సరిపోయేభుక్తి దొరకదు. ఇళ్ళకు వెళ్తున్నపుడు నీతో బాటు ఒక కోతిని గూడా తీసుకుని వెళ్ళు. అప్పుడు ఇంట్లో వున్న పెద్దవాళ్ళు అంతగా పట్టించుకోకపోయినా చిన్నపిల్లలు తప్పకుండా బయటకు వచ్చి నీదగ్గరున్న కోతి చేష్టలు చూసి ఆనందిస్తారు. తమపిల్లలను ఆనందపరచినందుకు కృతజ్ఞతతో ఏదోకొంత నీకు ముట్టచెబుతారు.

అయితే వెంటనే ఒక కోతికావాలికదా!' అంటావా. నువ్వు ఎక్కడికో వెళ్ళి డబ్బుపెట్టుబడి పెట్టాల్సిన పని కూడాలేదు. నీతోపంపించడానికి నాదగ్గరే సిద్ధంగావుంది, నామనస్సే ఆ కోతి. దీన్ని నువ్వు తీసుకుని వెళ్ళావంటే ఉభయతారకంగా వుంటుంది-నీకూ కాస్త భిక్షం ఎక్కువ గిట్టుబాటు అవుతుంది. నాకూ దీని వల్లవచ్చే నానాతిప్పలు తప్పి కాస్త ప్రశాంతత చేకూరుతుంది.

'అయితే పంపించు వెంటనే'-అంటావేమో అలాపంపితే తేలిగ్గా నీవెంటపడి వచ్చేదికాదు. ఇది చాలాతెలివిగలది, మొండిది. వెంటవచ్చినట్లేవచ్చి సమయం వీలుచూసుకుని మళ్ళీనాదగ్గరకే వస్తుంది. అందుకని దీన్ని ఒక గట్టి త్రాటితో గట్టిగా కట్టి ఆ త్రాటి రెండవకొసను నీచేతపట్టుకుని నీ అధీనంలో పెట్టుకుని వెళ్ళు.

'అయితే అటువంటి గట్టిత్రాడు ఎక్కణ్ణుంచి తెద్దాం'- అంటావా అదీ సిద్ధంగానే వుంది. నీమీద నాభక్తి అనే దృఢమైన త్రాటిని గట్టిగా కట్టి నామస్సనే కోతిని నీ అధీనంలో నువ్వేపెట్టుకో! నీకునేను-నాకునువ్వు ఒకరికొకరు ఇలా సహాయం చేసుకోకపోతే మనిద్దరికీ ఇతరులెవరైనా ఎందుకు సహాయం చేస్తారు చెప్పు-అని శివునికే ఉపాయం చెప్పి తను అపాయంనుండి బయటపడ్డారు.

'మనస్సు అనేది కోతి వంటిదే! దాన్ని అదుపులోపెట్టుకోవడం అంటే అంత తేలికైనపనికాదు. శివపరమైన భక్తిని జోడిస్తేగాని మనోమర్కటానికి కళ్ళెంపడదు. అదిగూడా మన ప్రయత్నం వల్ల జరిగే పనికాదు, ఆ శివుడే తన అధీనంలో పెట్టుకుని మనకు విముక్తిని కలిగించాలి' అని శంకరులు అభిప్రాయపడి మనకు ఈ ఉపాయం చెప్పారు.

## సంస్కృత శ్లోకము - 21

శ్లో. ధృతి స్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గఘటితామ్ ।
స్మరారే మచ్చేతః స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం
జయ స్వామిన్ శక్త్యా సహ శివగణైస్సేవిత విభో ॥

## అనువాద పద్యము

సీ॥ ధృతి యనెడి స్తంభ దృఢతరాధారమై
దేహాదులనియెడు ధృఢగుణములు
చిత్రమౌ శ్రీపద్మ చిత్రముల్ గలదియై
ప్రతిదిన సన్మార్గ పటిమగొనుచు
స్ఫుటమైన నాచిత్త పటకుటీర మొకటి
నిర్మమైనీముందు నిలిచియుండె
ఈశ ! సర్వేశ! భూతేశ! గిరినివాస!
పరమేశ ! కామేశ! పార్వతీశ!

గీ॥ ప్రమథగణ సేవితా ! హేశివ స్వరూప!
పార్వతీ దేవిగూడి నా పదిలమైన
పటకుటీరములోపల వసతిగొనుచు
జయమునందుచు నుండుమా స్వామి సతము

## టీక

హేస్మరారే = కామునకు శత్రువయినవాడా, భోస్వామిన్ = సకల లోకములను వశపరచుకొనినవాడా, గణైః = గణములచేత, సేవిత = ధ్యానింప బడువాడా, హేవిభో = ఓ సర్వవ్యాపకుఁడా, హేశివ = అఖండానంద స్వరూపుడవగు పరమేశ్వరా, ధృతి = ధైర్యమనియెడు, స్తంభ = నిట్రాడు, ఆధారాం = ఆధారముగాగలదియు, దృఢ = దృఢమైన, గుణ = త్రిగుణకార్యములగు

దేహాదులనియెడు త్రాళ్లతో, నిబద్ధాం = నిలుపబడినదియు, సగమనాం = ఎచ్చటికి కావలయునన్నను పోవునదియు, విచిత్రాం = విచిత్ర (వాసనలనియెడు) నానారంగులు గలదియు, పద్మాఢ్యాం = లక్ష్మీయుక్తమును, పద్మములవంటి చిత్తరవులతో నొప్పునదియు, ప్రతిదివస = ప్రతిదినమందును, సన్మార్గఘటితం = బ్రహ్మవిచారమందు చేరిక గలదియు, రాజమార్గమందు అమర్చబడినదియు, **విశదాం = నిర్మలమైనదియు**, మచ్చేతః = నాచిత్తమనియెడు, స్ఫుటపటకుటీం = **స్ఫుటమైనడేరాను**, ప్రాప్య = పొంది (ప్రవేశించి), శక్త్యాసహ = పార్వతీదేవితోగూడ, జయ = సర్వోత్కర్షతో నుండుము.

## తాత్పర్యము

కామజయముకల్గి సర్వస్వతంత్రుడవును, సర్వవ్యాపకుడవును పరమానంద స్వరూపుడవునగు నో పార్వతీవల్లభా! నా చిత్తమిపుడొక గుడారముగా నున్నది. నామనః కుటీరము విషయ నిత్యత్వావధారణ మనెడు నిట్రాటిపైని నిలిచియున్నది. గుడారము త్రాళ్ళతో గట్టబడి నిలుపబడునట్లు చిత్తము త్రిగుణములవలన జనించిన దేహాదులతో నిలుపబడియున్నది. గుడార మెక్కడకు గావలసిన నచ్చటకు గొనిపోబడునట్లు ఈ చిత్త మచ్చటచ్చటకు గొనిపోబడును. గుడారము పలురంగులతో, పద్మములవంటి చిత్రములతో నుండునట్లు నాచిత్తము బహువిధములగు చిత్రవిచిత్రములగు జన్మాంతర వాసనలతో కూడి సంపదను గోరుచున్నది. మరియు బ్రహ్మవిచారమునందు గూర్చబడియున్నది. ఇట్టి నాచిత్త కుటీరమందు శక్తితో గూడ నివసించి యుండుము.

## వివరణము

ఇంతకుముందుశ్లోకంలో చిత్తాన్ని పూర్తిగా ఈశ్వరాధీనానికి వదిలినట్లు, తనకింకా తన చిత్తంపై మమకారం అధికారంలేనట్లు ఆదిశంకరులు చెప్పారు. చిత్తాన్ని శివపరం చెయ్యొచ్చుగాని, ఆ చిత్తం శివుడు ఉండటానికేమన్నా సదుపాయంగా వుంటుందా అన్నదానికి ప్రస్తుతశ్లోకంలో ఆ చిత్తం ఎలాంటిదో చెబుతున్నారు.

**ధృతి స్తంభాధారాం - ధృఢ గుణనిబద్ధం**

శివుడు అనవసరంగా చలిలో ఎక్కడో గౌరీశంకరశిఖరంపై ఇల్లువాకిలి లేనివాడుగా ఉండాల్సిన పనిలేదుట. ఆయన హాయిగా వసించడానికి తగ్గ గుడారం (డేరా) తన వద్ద ఉన్నదంటున్నారు శంకరులు. ఏ విధమైన వికారాలు లేనిది అంటే - బాహ్యమైన ఒత్తిళ్ళకు, బలాలకు ఏ మాత్రం ఆకారం పాడవనిది, స్థిరత్వాన్ని, ధృఢత్వాన్ని కలిగి ఉండే విధంగా త్రిగుణాలనే గట్టి త్రాళ్ళతో చెక్కు చెదరని ధైర్యమనే నిట్రాతిని ఆధార స్తంభంగా కలిగి ఉన్నదిట.

**సగమనాం**

ఒకేచోటవుంటే విసుగు వస్తుందనుకున్నా, ఋతుధర్మాలు మారుతున్నపుడు ఆ ఋతుధర్మాల కనుగుణంగా ఉండే వేరు వేరు చోట్లకు నివాసాన్ని మార్చుకోవాలనుకున్నా, అలా సుదూరతీరాలకు మార్చుకోవడానికి, దూరాలను ప్రయాణించడానికి ఎంతో కాలం పట్టే అవసరం లేకుండా వాయు వేగం కన్నా ఎక్కువ వేగంతో మార్చగలిగేది (గాలి వేగం కన్న మనోవేగం ఎక్కువ కదా !) అనే అర్థం 'సగమనాం' అనే విశేషణంలో వుందని గుర్తించాలి.

**విచిత్రం పద్మాఢ్యాం**

ఈ చిత్తకుటీరాన్ని గుడ్డతో చేసిన డేరాయే గదా అని తేలిక భావంతో తీసిపారెయ్యడానికి వీల్లేదుట. రకరకాల భావాలనే రంగులతో చిత్ర విచిత్రమైన పూర్వజన్మ సంస్కారాలనే వాసనలతో వుంటుందిట. ఈ కుటీరంలో అనాహత పద్మాల్లాంటివి గూడా ఉన్నాయిట. ఈ పద్మాల్లో లక్ష్మీదేవి వసిస్తూ సంపదలతో విరాజిల్లుతూ వుంటుందని ఈ 'విచిత్రం పద్మాఢ్యాం' విశేషణాలకు అర్థంగా చెప్పుకోవచ్చును.

**ప్రతిదివస సన్మార్గ ఘటితం ... విశదాం**

నిత్యం ఈ కుటీరంలో వేదాంత చర్చ, బ్రహ్మ జిజ్ఞాసకు సంబంధించిన ప్రసంగ కార్యక్రమాలు, రాజయోగాది మార్గాల విశ్లేషణాత్మక ప్రవచనాలు జరుగుతూనే వుంటాయిట. అవకర లక్షణాలతో ప్రదర్శింపబడేవి ఏవీ ఉండవు

అని, మహానుభావులు ఇష్టపడి ఉండడానికి చాలా వీలుగా అనువుగా ఈ చిత్తకుటీరం ఉంటుందని 'ప్రతిదివస సన్మార్గ ఘటితాం' - విశేషణాల ద్వారా సూచింపబడుతోంది. ఈ చిత్త కుటీరం - ఇరుకుతనం, మలిన లక్షణాలు లేనిదని - 'విశదాం' పదం సూచిస్తుంది.

కామదూరుడు, కామహరుడు అయిన శివునికి పైన చెప్పిన లక్షణాలు గల తన చిత్త కుటీరం బాగా వాసయోగ్యంగా వుంటుంది - అని సూచిస్తూ "ఇన్ని వాసయోగ్యమైన సల్లక్షణాలు గల నా చిత్త కుటీరంలో మా అమ్మ పార్వతితో గూడా కలిసి హాయిగా ఏచీకూ చింతా లేకుండా, అద్దె కూడా కట్టాల్సిన అవసరం లేకుండా, ఎన్ని రోజులైనా వుండవచ్చు. నా మాట విను. నా ప్రార్థన మన్నించు. ఇంత ఆదరంగా ఆహ్వానించే నన్ను కాదనకు, నా మాటకు పెడ చెవిన పెట్టకు. నన్ను అనుగ్రహించు" - అని ఈ శ్లోకంలో శంకరులు శివుణ్ణి ప్రార్థిస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 22

శ్లో. ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే ।
ఇమం చేతశ్చోరం కథమిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్.

## అనువాద పద్యము

సీ॥ జనవశీకరణాది ఘనవిధానములచే
ధన సేకరణ పైన మనసుగల్గి
ధనవంతునింటిలో తను ప్రవేశించగా
వివిధ మార్గములతో వెదకి తిరుగు
చిత్రమౌనాలోని చిత్తమనెడి దొంగ
నింక నే విధము సహింతునేను

*శంకరా! భక్తవశంకరా! పురహరా!*
*ప్రభువరా! స్మరహరా! పాపదూర!*

గీ॥ అట్టి నా చిత్తచోరుని పట్టినీవు
నీ యధీనములోనికి నిలిపియిపుడె
నిరపరాధుని నాపైన కరుణజూపి
తరణమార్గమ్ము జూపుమా తస్కరేశ!

## టీక

హేతస్కరపతే = చోరులకు ప్రభువైనవాడా, హేశంకర = భక్తులకు సుఖముగలుగజేయువాడా, హేవిభో = ఓ మహాప్రభో, ప్రలోభాద్యైః = వశీకరణము మొదలగు నుపాయములచేత, అర్థాహరణ = ధనాకర్షణమందు, పరతంత్రః = ఆసక్తిగలవాడై, చేతశ్చోరః = చిత్త మనియెడు దొంగ, ధనిగృహే = ధనవంతుని యింటియందు, ప్రవేశోద్యుక్తస్సన్ =ప్రవేశింప నుద్యుక్తుడగుచు, బహుధా = అనేక విధములుగా,భ్రమతి= తిరుగుచున్నాడు, ఇమం = ఈ, చేతశ్చోరం = చిత్తమనియెడు దొంగను, కథం = ఎట్లుగా, సహే = సహింతును, ఇహ = ఇప్పుడు, తవ, ఆధీనం కృత్వా = నీవశము జేసికొని, నిరపరాధే = అపరాధములేనట్టి, మయి = నా యందు, కృపాం = దయను, కురు = చేయుము.

## తాత్పర్యము

కల్లబొల్లి మాటలుచెప్పి ధనికుల చిత్తమును వశపరుచు కొనుట మొదలగు కొన్ని దుష్టోపాయములుపన్ని ధనాకర్షణమునకుగా ధనవంతుల యిండ్లలో దూరుచు తిరుగులాడుచున్న ఈ మనస్సను దొంగను నే నోర్వలేను. నీ కప్పగించెదను. చోర ప్రభువగు శంకరా! ఆ దొంగను నీవు నీవశము చేసికొని నిరపరాధినగు నన్ను దయతో రక్షింపుము.

## వివరణము

గత శ్లోకంలో తన చిత్తం మహానుభావులు నివసించేందుకు చక్కని వాస యోగ్య లక్షణాలు గల కుటీరం అని వివరిస్తూ శివుణ్ణి తన చిత్త కుటీరంలో నివాసం ఏర్పరచుకోవలసినదిగా ఆహ్వానించిన ఆదిశంకరులు – ఈ శ్లోకంలో వేరొక విధమైన పద్ధతిని అనుసరిస్తున్నారు.

రుద్రనమకంలో శివుడు – 'తస్కరాణాం పతయే నమోనమః' అని కీర్తింపబడతాడు. భాగవతంలో శ్రీకృష్ణుడు గూడా నవీనత చోరునిగా కీర్తింపబడతాడు. అంటే మొత్తానికి పరమాత్మ కృష్ణుడు పరమ శివుడు ఇద్దరూ గూడా దొంగలేనన్నమాట ! దొంగలేమిటి దొంగలకు నాయకులు. అటువంటి దొంగల నాయకులకు తోటి దొంగలను గుర్తించగలిగి, వారిని అదుపులో పెట్టుకోగలిగి, వారిపై అధిపత్యం వహించ గలిగే సామర్థ్యము, వారిపై అదుపు ఉంటుందని ఆది శంకరులు చెప్తున్నారు. అందువల్లనే తనలోనే తిష్ఠ వేసుకుని ఉన్న మనస్సనే దొంగను దొంగల నాయకుడైన శివునికి అప్పగించి ఒడ్డున పడదామనుకుంటున్నారు.

**ప్రలోభా ద్యైరర్థాహరణ పరతంత్రో..**

మనస్సనే దొంగ అవతలివారిని బుట్టలో వేసుకోగలిగే చాలా విద్యలు తెలిసిన వాడట ! పెట్టుబడి పెట్టిన సొమ్ముకు కొన్ని రెట్లు ఎక్కువ ఇస్తానని మభ్య పెట్టి నమ్మించి, ఇష్టమైన వారిని వశం చేసుకునే వశీకరణ మంత్రాలు ఉన్నాయని చెప్పి – డబ్బు, సంపద గల వారిని తేలిగ్గా ప్రలోభ పెట్టి వారి వద్ద వున్నదంతా దొంగిలించే బుద్ధిగలవాడట ! వ్యక్తి యొక్క ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ఇలా ఎక్కడెక్కడ ఎవరెవరి దగ్గఱ డబ్బూ దస్కం, నగా నట్రా సంగ్రహించడానికి అవకాశం వుంటుందో వాళ్ళ వాళ్ళతో పరిచయాలు ఏర్పరచుకుని, పరిస్థితుల్ని అవగాహన చేసుకుని, సమయము సందర్భము చూసుకుని అవతలి వారిని కొల్లగొట్టడానికి నానా తిరుగుళ్ళూ తిరుగుతాడట ఈ మనస్సనే దొంగ. గట్టిగా మందలించి నాలుగు దెబ్బలేసి బుద్ధి చెబ్దామన్నా

శరీరమే వుండని మనస్సనే దొంగను ఎలా అదుపులో పెట్టుకోవడం ? ఎలా భరించడం' - అని ఎవరికైనా అనిపిస్తే తను చేసిన పనే చెయ్యమని చక్కని సలహా ఇస్తున్నారు ఆదిశంకరులు. అయితే దానికి పరిష్కారంగా శంకరులు ఏం చేశారు ? ఎవరికి తగ్గవారిని వారికి అప్పచెప్పడం మంచిది గదా ! అందుకని తనకు పనికిరాకపోయినా దొంగలనాయకుడైన శివునికేమన్నా ఉపయోగపడతాడని - ఆ శివుడనే దొంగల నాయకునికే తన మనస్సనే దొంగను అప్పగించి, ఆయన ఆధీనంలోనే పెట్టుకోమని ప్రార్థించారు.

(దొంగను పట్టడం పక్కాదొంగవల్లనే కుదురుతుంది. కాబట్టి - నా చిత్తచోరుని నువ్వే పట్టుకోవాలని, దొంగ - దొంగలజట్టులో ఉండాలి కాబట్టి నువ్వే నా చిత్తచోరుణ్ణి ఉంచుకోమని, ఇలా దొంగను మంచి చేసుకుంటే దొంగల భయము గూడా ఉండదు గదా అని చెప్పి ఒప్పించే లౌక్యమైన విధానం ఇది).

విశ్వంలో భౌతికంగా కనపడే దొంగలు వంచకులు ఎలాగూ వుంటారు. వీళ్ళకి 'తోడు కనబడకుండా అందరిలోను ఉండే మనస్సులనే దొంగలు గూడా గుప్తంగా వుంటారు. అసలు ఈ మనస్సనే దొంగనే ముందు సంస్కరించాలి. (అసలు దేవుని సామ్రాజ్యమైన ఈ విశ్వంలో దొంగలు, వంచకులు ఏమిటి ? అని విమర్శించనక్కరలేదు. మంచీ చెడులకు సంబంధించిన అన్ని రకాల వాళ్ళూ విశ్వంలో వుంటారు. అంటే - వైవిధ్యంగా ఉండేదే విశ్వం. అయినా దొంగలు దొంగతనం చేస్తే ఆ దొంగల దగ్గర వాటా దొంగిలించే పోలీసులూ, ఆ పోలీసుల దగ్గర వారిపై అధికారులు, ఆ అధికార్ల వద్ద రాజకీయ నాయకులు, వారిపై వారి పెద్దనాయకులు, ఆ నాయకుణ్ణి భయపెట్టి లాక్కునే విప్లవ ఉద్యమకారులు - ఆ ఉద్యమకారులనుండి డబ్బు మళ్ళీ కొంత ప్రజల్లోకి రావడం - ఇలా జరుగుతూ వుండే ఈ జగన్నాటకంలో అన్నిరకాల పాత్రధారులుగాగూడా పాత్రపోషణ చేస్తాడు భగవంతుడు. రుద్రనమకంలో చెప్పబడిన 'తస్కరాణాంపతయే నమోనమః వంచతే పరివంచతే' - అన్న మంత్రాలకిదే అర్థం.) అందుకు ఏం చెయ్యాలో ప్రస్తుత శ్లోకంలో పరిష్కారాన్ని సూచించారు ఆదిశంకరులు.

## సంస్కృత శ్లోకము - 23

శ్లో. కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి ।
పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథమిహ సహే శంకర విభో ॥

## అనువాద పద్యము

సీ॥ నీ పూజలను చేతు నా పుణ్యదైవమా!
శంకారా! హేవిభో! సాంబశివుడు!
విష్ణుపాదముగాని విధిపదమునుగాని
కలుగనీయవలదు ఫలముగాను
ఆకాశమందున హంసరూపునగాని
వసుధయందు మృగరూపమునగాని
నీ శీర్షపదములు నిండుగా జూడగన్
తరుగుచున్ నిన్ను నే నరయలేక

గీ॥ అట్టి పదఫలఖేదమ్ము దిట్టుకొనుచు
నేను సహియింపలేనింక గాననీవు
అట్టి పూజకు జన్మకానందమొసగు
మోక్ష సాయుజ్యపదవినే మోదమిమ్ము

## టీక

హేవిభో = ఓ మహాదేవా ! త్వత్పూజాం = నీ యారాధనమును, కరోమి = చేయుదును, సపది = తత్క్షణమే, భోశంకర = ఓసుఖకరమైనవాడా, మే = నా కొఱకు, సుఖదః = నిత్యసుఖము నిచ్చువాడవు, భవ = అగుము, తస్యాః = ఆ పూజకు, విధిత్వం = బ్రహ్మయగుట, విష్ణుత్వం = విష్ణువగుట, ఫలమితి = ఫలమని, దిశసిఖలు = ఇత్తువుగదా, పునశ్చ = మరలనిటుమీదను, దివి =

ఆకాశమందును, భువిచ = భూమియందును, త్వాం = నిన్ను, ద్రష్టుం = చూచుటకు, పక్షిమృగతాం = హంసపక్షిరూపముగానీ వరాహరూపము గానీ, వహన్ = ధరించుచు, అదృష్ట్వా = చూడలేక, తద్భేదం = పక్షిమృగములుగా బుట్టుటవలని దుఃఖమును, కథం = ఎట్లుగా, సహే = సహింతును, విభో = మహాప్రభో.

## తాత్పర్యము

శంకరా! నిన్నారాధింతును. నాకు పూజాఫలముగా మోక్షానంద మొసంగుము. కాని బ్రహ్మత్వమో విష్ణుత్వమో దానికి ఫలమని మాత్ర మీయవద్దు. అక్కడనుండి హంసగానో పందిగానో పుట్టి నీపాదములను శిరస్సును కనుగొనుటకు పైలోకాలు క్రిందిలోకాలు అన్నీ తిరిగి శ్రమపడలేను. ఆమీద తుదకు నిన్ను కనుగొనలేక క్షుద్ర జన్మవలని యవమానమును సహింపలేను. కాన, బ్రహ్మవిష్ణు లోకానందములకన్న నధికమైన సాయుజ్యముక్తియను పరమానందమును దయచేయుమని భావము.

## వివరణము

పరమశివుణ్ణి ఆరాధించి పొందవలసిన పరమఫలాన్ని గూర్చి ఈ శ్లోకంలో సూచించి, ఆదిశంకరులు సలహా ఇస్తున్నారు.

దేవుళ్ళను దేవతలను ఆరాధించి వాళ్ళు ప్రత్యక్షమై, వరం కోరుకోమనం గానే - వెంటనే ముందూ వెనకా చూడకుండా ఏదో లాభించేదాన్ని మనం వరంగా కోరుకుంటాము. మనకు శుభం జరిగేది కోరుకోవాలి గాని లాభించేది కోరుకోకూడదు. ఏది జరిగితే మనకు మంచి అవుతుందో అది శుభం గాని, ఏది జరిగితే మనకు నచ్చుతుందో లేదా లాభిస్తుందో అది శుభం కాదు. ఈ విషయం ఈ శ్లోక వివరణ చదివితే అర్థమౌతుంది.

శివుణ్ణి తపస్సుచేసిమెప్పించి తనకు బాగా కలిసివస్తుందిని వరం కోరుకున్న భస్మాసురునికి చివరకు ఏమైంది ? అలాగే గజాసురునికి ఏమైంది?

అలాగే వరం కోరుకోమనంగానే బండపనులు చేసిపెడుతుందిగదా అని ఏనుగుని కోరుకుంటే ఆ మర్నాడు నుండి దాన్ని మేపడానికి కావలసిన గ్రాసాన్ని ఏర్పాటు చెయ్యాలి గదా ! అలాగే పొడవైన కారుని గాని, విమానాన్ని గాని కోరుకుంటే వాటిని వినియోగించుకోడానికి కావలసిన చోదకులు, ఇంధనం, లైసెన్సులు, పర్మిషన్లు గూడా ఏర్పాటు చేసుకోవాలి గదా ! అది అంత తేలికైన విషయమా! మనం అన్నంతినడంమాని వాటిని పోషించాల్సి వస్తుంది. ఇవన్నీ తెలిసే శంకరులు ఏమంటున్నారో చూడండి.

నిన్ను ఆరాధించినందుకు నాకు ఆ పూజాఫలంగా గొప్పగా వుంటుందిగదా అని ఏ బ్రహ్మపదాన్నో, విష్ణుపదాన్నో మాత్రం ఇవ్వవద్దు. అలా ఇస్తే వాళ్ళు ఏపాట్లు పడ్డారో నేనూ అదే పాట్లు పడాల్సి వస్తుంది. నీ పాదాలను దర్శించడానికె విష్ణుమూర్తి వరాహంలాగాపుట్టి భూమిని త్రవ్వుకుంటూ పాతాళలోకం అంతా గాలించాడు గదా ! అయినా నీ పాదాలను చూడ గలిగాడా? అలాగే నీ శిరస్సుని చూడ్డానికి హంసగా పుట్టి అకాశ మార్గమంతా చరించి ఆ బ్రహ్మ నానాతిప్పలు పడ్డాడుగదా ! వ్రతం చెడ్డా ఫలం దక్కలేదన్నట్లు ఏదో సాధించాలని క్షుద్రమైన జన్మలెత్తి గూడా వాళ్ళు సాధించిందేమిటి ? అవమానం తప్ప ! అందుకని బ్రహ్మపదం వద్దు, విష్ణుపదం వద్దుగాని నాకు ఆ రెంటినీ మించింది తిరిగి మళ్ళీ ఏ కోరికా కోరవలసిన అవసరం లేకుండా చేసేది అయిన నీతోడి సాయుజ్యపదవినిచ్చి పరమానం దాన్నిప్రసాదించు చాలు - అని శంకరులు ఎంతో అనుభవంతో కోరుకున్నారు - అని ఈ శ్లోకం ద్వారా తెలుసుకోవాలి.

## సంస్కృత శ్లోకము - 24

శ్లో. కదా వా కైలాసే కనకమణిసౌధే సహ గణై
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః ।
విభో సాంబ స్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః ॥

## అనువాద పద్యము

సీ॥ స్తవనీయమౌ సదాశివ నివాసస్థాన
మౌ దివ్యకైలాసమందునున్న
బంగారు రత్నాల రంగారు మేడపై
ప్రమధాది గణముల ప్రక్కనిలిచి
పట్టువీడని సరణి గట్టిగా శిరముపై
హస్తాంజలిమకుట మమరజేసి
హేవిభో! హేసాంబ! హేస్వామి! హేభవ!
హేసదాశివ! పరమేశ ! ఈశ !

గీ॥ పాహి మాం పాహి అనిఇల బలుకుచుండ
అట్టి ఆనందమునగల్గు నమరసుఖము
ననుభవించుచు బ్రహ్మకల్పాదులెన్నొ
క్షణములోననె సులువుగా గడుపుటెపుడొ?

## టీక

కైలాసే = శివనివాసస్థానమగు కైలాసమందు, కనకమణిసౌధే = బంగారు రత్నాలమిద్దెమీద, గణైస్సహ = ప్రమథగణములతో గూడ, శంభోః = పమమశివుని యొక్క అగ్రే = ముందర, వసన్ = ఉన్నవాడనై, స్ఫుటఘటిత = దృఢముగా కూర్చబడిన,మూర్ధాంజలిపుటః = శిరస్సు నందలి అంజలిబంధము గలవాడనగుచు, భోవిభో, భోసాంబ, భోస్వామిన్, భోపరమశివ, పాహి = రక్షింపుము, ఇతి = ఇట్లు, నిగదన్ = పలుకుచున్నవాడనై, సుఖతః = అట్టియానందానుభవమువలన, విధాతౄణాం కల్పాన్ = అనేక బ్రహ్మ కల్పములను, క్షణమివ = క్షణమాత్రముగా, కదావా = ఎప్పుడు, వినేష్యామి = గడుపుదునో.

## తాత్పర్యము

కైలాసమునకుజేరి ప్రమథగణములతోగూడ పరమేశ్వరుని యెదుట హేవిభో ! హేసాంబ ! హేస్వామిన్ ! హే పరమశివ ! పాహిపాహి యని పలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగా కాలమెప్పుడు గడపుదునో గదా!

## వివరణము

కష్టసమయం వచ్చినప్పుడు – తనకు నచ్చేవిధంగా కలవచ్చినా, తనకు నచ్చేసన్నివేశంలో పాల్గొంటున్నా, ఊహాలోకాల్లో విహరిస్తున్నా – ఆ కష్టాన్ని, అందువల్ల వచ్చే మనఃక్లేశాన్ని మరచి పోగలిగి ఆనందం అనుభవించగలం – అని శంకరులు ఈ శ్లోకంలో తెలియపరుస్తున్నారు. ఆయన ఊహల్లో ఎలాంటి ఆనందం పొందుతారో ఈ శ్లోకం వివరిస్తుంది.

కమనీయమైన కైలాసంలో ఉండాలి. తాను ఒంటరిగా కాకుండా తనప్రక్క తనలాంటి భక్తులే వుండాలి. అప్పుడు సంకల్పానికి లక్ష్యానికి సిద్ధిచేకూరుతుంది. (వ్యతిరేక భావాలు గల వ్యక్తుల సాన్నిధ్యంలో భావాలు అడ్డుకుంటాయి) ఇందువల్ల భక్తుల మధ్య సాలోక్య సిద్ధి చేకూరుతుంది. భక్తితో మూర్ధాంజలి మకుటంతో శివనామస్మరణ చేస్తున్నప్పుడు అందరి హృదయాల్లో శివుడే వుండి అందరూ శివుని సాన్నిధ్యాన్ని అనుభవిస్తారు. దీని వల్ల సారూప్యం, సామీప్యం సిద్ధులు రెండూ చేకూరుతాయి. ఇలా సాలోక్య, సామీప్య సారూప్య సిద్ధులు చేకూరిన తరువాత శివనామ స్మరణానందంతో పరమ శివునికి మరింత చేరువై చివరికి అభేద స్థితిలో సాయుజ్య సిద్ధికి సంబంధించిన పరమానందాన్ని గూడా పొందడం జరుగుతుంది. అప్పుడు బాహ్య ప్రపంచాన్నే మరచిపోయి, బ్రహ్మకల్పాదుల్ని గూడా అధిగమించి నిత్యానంద పరవశస్థితిలోనే ఉండిపోవచ్చుట ! ఇంతకంటే కావల్సిందేముంటుంది జీవి తరించడానికి అని శంకరుల ఉద్దేశ్యం. మనకు నచ్చితే మనమూ అలాంటి స్థితిని ఆనందాన్ని

ఇహలోకంలో ఉండే పొందవచ్చును. ఈ ఊహవల్ల వచ్చే ఆనందం ఎప్పటికైనా నిజంగా దక్కుతుంది. అందుకు నిర్మలమైన భక్తితో ఓపిగ్గా నిరీక్షించాలి అంతే!

## సంస్కృత శ్లోకము - 25

శ్లో. స్తవై ర్బ్రహ్మాదీనాం జయజయవచోభిర్నియమినాం
గణానాం కేళీభిర్మదకలమహోక్షస్య కకుది ।
స్థితం నీలగ్రీవం త్రినయన ముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ మహనీయులగు ముఖ్యమౌనివరేణ్యులు
పలికెడు జయజయ ధ్వనులతోడ
బ్రహ్మాదులుపలుకు రమ్యమౌస్తుతులతో
వేడుకనిడు గణక్రీడతోడ
హద్దులెరుగలేని యానందమునదేలు
ముద్దైన ఆ యెద్దు మూపునెక్కి
దేహభాగమ్మును దేవి పార్వతిచేత
ఆలింగనాక్రాంత మైనవాడు

గీ॥ ఖండపరశువువాడు, ముక్కనులవాడు
నల్లగానుండు కంఠమ్ము చెల్లువాడు
లేడి హస్తమందున్నట్టివాడవైన
పరమశివ ! నిన్ను దర్శించు భాగ్యమెపుడో ?

## టీక

బ్రహ్మాదీనాం = బ్రహ్మమొదలగువారియొక్క, స్తవైః = స్తోత్రములతోడను, నియమినాం = నియమవంతులగు మహర్షులయొక్క, జయజయవచోభిః = జయజయధ్వనులతోడను, గణానాం = ప్రమథగణముల యొక్క, కేళీభిః =

క్రీడలతోడను, మదకలమహోక్షస్య = సంతోషాతిశయమున సొంపుగా నున్న వృషభముయొక్క, కకుది = మూపురమునందు, స్థితం = ఉన్నట్టివాడును, నీలగ్రీవం = నల్లనికంఠము గలవాడును, త్రినయనం = మూడుకన్నులు గలవాడును, ఉమాశ్లిష్టవపుషమ్ = పార్వతీదేవిచేత ఆలింగనము చేసికొనబడిన దేహము గలవాడును, కరధృతమృగం = చేతితో పట్టుకొనబడిన లేడిగలవాడును, ఖండపరశుం = ఖండమైన గండ్రగొడ్డలి గలవాడును అగు, త్వాం = నిన్ను, కదావా = ఎప్పుడు, పశ్యేయం = చూతును.

## తాత్పర్యము

స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును, జయజయ ధ్వనులతో మహర్షులును, ఆటపాటలతో ప్రమథగణములును గొలువ పార్వతీ సమేతుడవై వృషభ వాహనముమీద వేంచేసియున్న నీ సందర్శనము చేయు భాగ్యము నా కెన్నడు లభించునోగదా!

## వివరణము

ఈ శ్లోకంలో కూడా శంకరులు తాను ఎదురుచూసే భాగ్యంగురించి తెలియపరుస్తున్నారు.

'సాక్షాత్తు వాణీనాథుడైన బ్రహ్మ మొదలైన వారు స్తోత్రాలు చేస్తూ ఉండాలిట. మహానుభావులైన మహర్షిపుంగవులు జయ జయ ధ్వానాలు చేస్తూ వుండాలిట. వీటికి ప్రమథగణాల ఆటపాటలు తోడవాలిట. ఈ ఆనందాన్ని చూసి పరవశించే నందిమీద అయ్యవారైన శివుడు స్థిరంగా ఠీవిగా కూర్చుని వుండాలిట. ఆయన శరీరంలో సగభాగమై అమ్మవారు ఆక్రమించుకుని వుండాలిట. చేతుల్లో లేడి, ఖండ పరశువు పట్టుకుని వుండాలిట. అలా వుండే శివుణ్ణి తనివి దీరా చూస్తూ పరవశిస్తూ పరమానందాన్ని పొందాలిట ! ఇంతకు మించి తనకింకేమీ అక్కరలేదుట. ఇష్ట దైవాన్ని గూర్చి ఏ భక్తుని కైనా ఇలాంటి కోరికే వుండాలి. హృదయంలో ఆ దైవం ముద్రితమై ఉండిపోతేనే జన్మలో ఎప్పుడో ఒకప్పుడు ఆ ఆనందాన్ని పొందే భాగ్యం చేకూరుతుంది.

## సంస్కృత శ్లోకము - 26

శ్లో. కదా వా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్ ।
సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామి హృదయే ॥

### అనువాద పద్యము

సీ॥ పర్వతశాయివౌ పరమేశ్వరా నిన్ను
కన్నులారంగ నే గాంచుచుండి
భవ్యమౌనీపాద పద్మయుగళమును
హస్తయుగముతోడ నంటిపట్టి
గుండెపై, శిరముపై, రెండు నేత్రములపై
బాగుగానదుముచున్ కౌగిలించి
సంపుల్లసరసిజ సౌగంధములుగల
పరిమళ ద్రవ్యాల పరవశించి

గీ॥ జన్మ సాఫల్యమౌ త్రోవచక్కచూపు
అజ ముకుందాదులు సయితమందలేని
పరమసుఖమెపుడెదయందు పాదులీన
అనుభవించెదనోగద తనివితీర!

### టీక

హేగిరిశ = పర్వతశాయివగు ఓ ఈశ్వరా, త్వాం = నిన్ను, దృష్ట్వా = చూచి, తవ = నీయొక్క, భవ్యాంఘ్రియుగళం = క్షేమకరమైన పాదములను, హస్తాభ్యాం = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = నేత్రమందును, వక్షసి = వక్షస్థలమందును, వహన్ = చేర్చుకొనుచున్నవాడనై, సమాశ్లిష్య = కౌగిలించుకొని, స్ఫుటజలజగంధాన్ =

వికసించిన పద్మములయొక్క సుగంధమువంటి సుగంధముగల, పరిమళాన్ = పరిమళములను, ఆఘ్రాయ = మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మామొదలగు వారిచేత, అలభ్యాం = పొందశక్యముగాని, ముదం = సంతోషమును, హృదయే = హృదయమునందు, కదావా = ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును.

## తాత్పర్యము

హే గిరిశా! నిన్నుజూచి నీ పాదములను చేతులతో పట్టి, శిరస్సునందు, నేత్రములందు ఱొమ్మునను జేర్చి కౌగిలించుకొని అందలి పద్మగంధముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును దొరకని యానందము నెప్పుడు పొందుదునో కదా!

## వివరణము

తాను ఊహించుకున్న, తన హృదయంలో ముద్రితమై వున్న తన దైవాన్ని చూడటమే గనుక తటస్థపడితే భక్తుడు ఏం చెయ్యాలో ఈ శ్లోకంలో తనను ఆ భక్తునిగా ఆపాదించుకుని ఆదిశంకరులు సెలవిచ్చారు.

తన దైవాన్ని కళ్ళారా చూడంగానే ముందుగా పవిత్రమైన పాదాలను హస్తాలతో పట్టుకోవాలిట. అటుపైన వాటిని తలకు కళ్ళకు, వక్షస్థలానికి హత్తుకుని ఆలింగనం చేసుకుని ఆ పాదపద్మ పరిమళాలను ఆఘ్రాణిస్తూ హరి బ్రహ్మాదులైన పెద్ద పెద్ద వారికి పొంద శక్యము కాని ఆ ఆనందాన్ని హృదయం నిండా నింపుకుని పరవశించిపోవాలిట. ఇదే నిజమైన భక్తునికి నమ్మిన దైవానికి మధ్య వుండే భక్తిపరమైన సంబంధం – అని ఆదిశంకరులు అంటున్నారు.

## సంస్కృత శ్లోకము - 27

శ్లో. కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామర సురభి చింతామణి గణే ।
శిరస్థే శీతాంశౌ చరణ యుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః ॥

## అనువాద పద్యము

సీ॥ పర్వతశాయివగు పరమేశ నీచెంత
అర్థాధిపతి కుబేరాఖ్యుదుండ
మేరునగమువంటి మేలైన బంగారు
కొండ నీ చేతిలోనుండనెపుడు
కల్పవృక్షమ్మును కామధేనువుతోడ
ఈవి చింతామణి యింటనుండ
శృంగార భంగిమన్ శీర్షమందునజూడ
ఆహ్లాదకరుడు శీతాంశువుండ
గీ॥ అఖిల శుభములు చరణములందునుండ
ఏమినీకిత్తు నిష్టార్థమీశ నేను
ఉన్నదొక్కటి నాచెంత కన్నతండ్రి
అదియే 'నాచిత్త' మదినీకు నప్పగింతు

## టీక

హేగిరిశ = పర్వతశాయివగు ఓ ఈశ్వరా ! హేమాద్రౌ = మేరుపర్వతము (బంగారుకొండ), కరస్థే = చేతిలోనుండగా, ధనపతౌ = కుబేరుడు (ధనవంతుడు), నికటస్థే = దగ్గఱనుండగా, స్వర్భూజ = కల్పవృక్షముల యొక్కయు, అమరసురభి = కామధేనువుయొక్కయు, చింతామణి = చింతామణులయొక్కయు, గణే = సమూహము, గృహస్థే = ఇంటిలోనుండగా, శీతాంశౌ = చంద్రుడు, శిరస్థే = శిరస్సుననుండగా, అఖిలశుభే = సమస్తశుభమును, చరణయుగళస్థే = పాదద్వంద్వమందుండగా, కం = ఏ, అర్థం = ఇష్టార్థమును, అహం = నేను, దాస్యే = మీకిత్తును, మమ = నాయొక్క మనః = మనస్సు, భవదర్థం = నీకొఱకు, భవతు = అగుగాక.

## తాత్పర్యము

కైలాసవాసా! బంగారుకొండ నీచేతనున్నది. కుబేరుడు మిత్రుడుగా నీ దగ్గఱనున్నాడు. కోరికలనిచ్చు కల్పవృక్షములును, కామధేనువు చింతామణులును నీ యధీనములై నీయింట నున్నవి. చంద్రుడు భూషణముగా నీ శిరస్సుననున్నాడు. సమస్త శుభములును నీ పాదంబుల వలన కలుగుచున్నవి. **శంకరా! నీకు** నేనొసగదగిన నొక్కటియు కానరాదు. కనుక నాచిత్తము నర్పించెదను స్వీకరింపుము.

## వివరణము

విశ్వంలో వున్నదంతా భగవంతునిదే అయినపుడు మళ్ళీ ఆయనకు ఏదైనా సమర్పించడం ఆయనది ఆయనకే ఇచ్చినట్లు అవుతుంది గదా ! కాబట్టి ఇచ్చేదేమిటి ? అని తర్కవాదం చేసేవాళ్ళూ వుంటారు. మనం అనుభవించే ఆస్తిపాస్తులు మన తండ్రి, తాతలనుండే సంక్రమించాయి. అసలు మనం భూమి మీదకువచ్చి బ్రతికిబట్టకట్టడానికి తల్లిదండ్రులు కదా కారణం ! అలాంటి మనం 'నా ఆస్తి' అని చెప్పుకుంటూ మన శరీరపోషణ నిమిత్తం వాళ్ళిచ్చిన ఆస్తిపాస్తులను అనుభవిస్తున్నా మన తల్లిదండ్రులు ఏమీ అనుకోరు. పైగా ఏదైనా శుభకార్యం నిర్వహించిన తరువాత తల్లిదండ్రులకు బట్టలు గూడా పెడతాము. వాస్తవానికి తమవల్ల పిల్లలకు సంక్రమించిన ఆస్తిపాస్తులే అయినా వాళ్ళేదో తమకు బట్టలు పెట్టినట్లు తల్లిదండ్రులు సంతృప్తి చెందుతారు కాని తమవే తమకు ఇస్తున్నారని అనుకోరు. అలాగే విశ్వభాగ్యం అంతా భగవంతునికి సంబంధించినదేఅయినా ఆయనకు మనం భక్తితో సమర్పిస్తే చాలా సంతోషిస్తాడు.

భగవంతుని కేమి సమర్పించాలి అన్న దాని గ్గూడా భగవద్గీతలో 'పత్రం, పుష్పం, ఫలం, తోయం' అని చక్కగా చెప్పబడింది. ఒక ఆకుగాని, పువ్వుగాని, పండు గాని చివరకు కనీసం నీళ్ళైనా సమర్పిస్తే చాలని దీని అర్థం. ఎవరో

బాగా వున్నవాళ్ళు అర్జిత సేవలు ఎంతో డబ్బు ఖర్చు పెట్టి చేయిస్తారు. పెద్దగా నైవేద్యాలు సమర్పిస్తారు. విలువైన ఆభరణాలు సమర్పిస్తారు. అలా అని లేనివాళ్ళుగూడా అలా చెయ్యాలని లేదు. అలా చేస్తేనే భగవంతుడు అనుగ్రహిస్తాడని లేదు. అసలు వాస్తవానికి మనం ఏది నైవేద్యం పెట్టినా ఆయన తీసుకుంటున్నాడా ? ఆయన వైపు చెయ్యి చూపించి మనమే గదా మొత్తం ప్రసాదం క్రింద స్వీకరించేది. ఒక పాత్రలో టిఫిన్ పెట్టి మన ఇంటి కొచ్చిన వారికి ఇచ్చినపుడు వాళ్ళేం చేస్తున్నారు ? టిఫిన్ స్వీకరించి పాత్రను వదిలేస్తున్నారు. భగవంతుడైతే - మనం ఇచ్చే నైవేద్యం వెనుక వున్న మన భక్తిసమర్పణభావాన్ని స్వీకరించి, నైవేద్యాన్ని మనకే వదిలేస్తాడు. ఆ భక్తిసమర్పణ- నైవేద్యం పరిమాణం మీద, విలువ మీద ఆధారపడి వుండదు గదా ! అలా అయితే బాగా ఉన్నవారిది ఎక్కువ భక్తి, లేనివారిది తక్కువ భక్తి ఔతుంది. ఇది ఎంత మాత్రం నిజమో మనకు తెలీదా ! అయినా కొండంత దేవునికి కొండంత పత్రి సమర్పించుకోగలమా ?

"పత్రం పుష్పం ఫలం తోయం" అన్నదాంట్లో ఒక విచిత్రమైన అంతరార్థం వుంది.

1) 'పతంత్యనేతీతి - పత్రం' అంటే - 'పడిపోయేది పత్రం. మనిషిని పడేసేది - మనస్సు కాబట్టి - మనస్సే పత్రం'.

2) 'పుష్పతీతి పుష్పం' - అంటే 'వికసించేది పుష్పం. మనిషిలో వికసించేది బుద్ధి కాబట్టి - బుద్ధియే పుష్పం'.

3) 'ఫలతి - విశీర్యతే ప్రహారైః ఇతి - ఫలం' ప్రహారైః అంటే వేటుల చేత, విశీర్యతే = పగులునది - ఫలం. జ్ఞానబోధ అనే దెబ్బల చేత పగిలేది మనలోని 'అహంకారం' కాబట్టి, 'అహంకారమే - ఫలం !

4. 'త్రాయతేత్రాయతేతి - తోయం' - రక్షించేది కనుక తోయం. సోహం భావంతో ఉన్నప్పుడు ధ్యేయాన్ని సరిగ్గా గుర్తుంచుకుని క్రమక్రమంగా రక్షించేది చిత్తమే కాబట్టి ఈ చిత్తమే - తోయం. భగవంతునిలో ఐక్యభావన కలిగినపుడు

పరవశంతో కలిగే ఆనందాశ్రువులే ఈ తోయం. ఐక్యభావన చిత్త లక్షణం కాబట్టి 'చిత్తమే – తోయం'.

(వేదాంతం లక్ష్మయ్య గారికి కృతజ్ఞతలు – గండి శ్రీరామ కృష్ణానంద స్వాముల వారు గూడా తన జనప్రియగీతోపన్యాసాల్లో ఈ విషయాలే చెప్పారు.)

భగవంతునికి సమర్పించే వాటిలో మన పతనానికి కారణమైన మనస్సును **ముందు సమర్పించ**డం మంచిది గదా ! శివుని దగ్గర బంగారు కొండ, **ధనపతి కుబేరుడు**, ఇంట్లో కల్పవృక్షం, కామధేనువు, చింతామణుల రాసులు ఉన్నా, నత్తిపై చంద్రుడు వున్నా, సకల శుభాలకు నిలయమైన పాదాలు వున్నా ఆయనకు మనం ఇంకేం సమర్పించి తృప్తిపరచగలం ! అందుకని తేలిగ్గా ఇవ్వగలిగింది, పైసా ఖర్చులేనిదీ – మనం పతనం కాకుండా వుండాలంటే మనం భగవంతునికి సమర్పించవలసినదీ, సమర్పించగలిగేది గూడా అయిన 'మనస్సు'ను సమర్పించడమే సముచితమని – 'భవదర్థం మమ మనః' అని శంకరులు సెలవిచ్చి, మార్గాన్ని సూచించారు ఈ శ్లోకంలో. ఏ పూజలోనైనా చిట్ట చివరగా మామూలు మనస్సు గాక మంత్ర పూతమైన మనస్సనే పుష్పాన్ని (మంత్రపుష్పాన్ని) సమర్పించడంలోని అంతరార్థం ఇదే ! (పుష్పం అంటే ఐదురేకలు కలిగిన పువ్వు – అందుకే 'పుష్పోత్సవాలు' అంటే ఐదురోజులు జరిగే ఉత్సవాలు – అని అర్థం. పుష్పాన్ని మనస్సు అనుకుంటే దానిలోని ఐదు రేకలు పంచ జ్ఞానేంద్రియాలను సూచిస్తాయి. అంటే పంచజ్ఞానేంద్రియాలతో కూడిన మనస్సే ఈ పుష్పం.)

## సంస్కృత శ్లోకము - 28

**శ్లో. సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే**
**సామీప్యం శివభక్తిధుర్యజనతా సాంగత్య సంభాషణే ।**
**సాలోక్యం చ చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే**
**సాయుజ్యం మమ సిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోఽస్మ్యహమ్ ॥**

## అనువాద పద్యము

సీ॥ సారూప్య సిద్ధిని, స్వామి విగ్రహమును
చిత్తమందున పూజచేసినపుడు
సామీప్య సిద్ధిని స్వామినిన్ హేశివా!
హేదేవ ! యని నుతియించినపుడు
ఈశ్వరారాధనల్ గృహమందు జరుపంగ
భక్తిగలిగిజేయు వారిగూడి
సతతమ్ము నీ కథా సద్గోష్ఠిలో నుండి
లౌక్యమ్మువీడ సాలోక్యసిద్ధి

గీ॥ ధ్యానమందున భక్త్యైక యానమందు
చేతనా చేతనాత్మకరీతులందు
నిత్యసాయుజ్యమందున సత్యమందు
నిలుపు మో దేవ! ధరణిలో నెలవు చూపి

## టీక

భోస్వామిన్ = ఓసర్వాధ్యక్షుడా ! తవ = నీయొక్క, పూజనే = సారూప్యం = సమానరూపముబొందుటయు, శివమహాదేవేతి సంకీర్తనే = హేశివా! హే మహాదేవా ! అని యిట్లు కీర్తించినప్పుడు, సామీప్యం = సమీప మందుండటయు, శివభక్తి ధుర్య = ఈశ్వర భక్తి అనుభావమును వహించుచున్న, జనతా = జనసమూహముయొక్క, సాంగత్యసంభాషణే = సహవాసము సల్లాపము, కలిగినపుడు, సాలోక్యం = ఒక్క లోకము నందుండుటయు, హే భవానీపతే = ఓ సాంబమూర్తీ ! చరాచరాత్మక = స్థావరజంగమరూపమైన, తను = మూర్తియొక్క ధ్యానే = ధ్యానము చేసినప్పుడు, సాయుజ్యం = నీతోడనైక్యమును, మమ = నాకు, అత్ర = ఈజన్మమందు, సిద్ధం భవతి = సిద్ధించుచున్నది. (అతః = కనుక) అహం = నేను, కృతార్థః = ధన్యుడను, అస్మి = అగుచున్నాను.

## తాత్పర్యము

జగత్ప్రభూ! నీ పూజయందు సారూప్యమును, నీ నామసంకీర్తనమందు సామీప్యము, నీ భక్తులతోకూడి కథాకాలక్షేపములుచేయుటవలన సాలోక్యము, చరాచరాత్మకమైన నీ మూర్తి ధ్యానమందు సాయుజ్యమును గూడ నాకీలోకమందే దయచేయుచుంటివిగాన ధన్యుడనైతిని.

## వివరణము

'ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచభరతర్షభ' - అని భగవద్గీతలో భక్తులు నాలుగు రకాల వాళ్ళుంటారని చెప్పబడింది. అల్లాగే ముక్తులు గూడా నాలుగు విధాలుగా వుంటాయి. 1) 'సాలోక్యం' - అంటే భగవత్సంబంధమైన లోకంలో గడపడం. 2) 'సామీప్యం' అంటే భగవంతునికి సన్నిహితంగా వుండటం 3) 'సారూప్యం' - అంటే భగవంతుని రూపంలో వుండటం. 4) 'సాయుజ్యం' - అంటే భగవంతునిలో ఐక్యం చెందడం.

ఒక ప్రదేశంలో వుండి కూడా వేరు వేరు ఆలోచనలలతో ఉండేవారు ఒకే లోకంలో ఉన్నట్లు కాదు. విద్యాలయపు తరగతి గదిలో విద్యార్థులందరూ అధ్యాపకుడు రాకపూర్వం వేరు వేరు ఆలోచనలతో, వేరు వేరు గుంపులుగా ఒకే గదిలోనే ఉండవచ్చు. కాని ఎవరి లోకం వారిదేకాని - ఒకే లోకంలో ఉన్నట్లు కాదు. అధ్యాపకుడు వచ్చి పాఠం మొదలు పెట్టగానే - అందరూ మంచి విద్యార్థులే అయి, పాఠంలోనే నిమగ్నమైతే అప్పుడు వారంతా ఒకే లోకంలో ఉన్నట్లు లెక్క. ఈ స్థితిని 'సాలోక్యం' అంటారు. భగవద్విషయంలో కూడా అందరూ కలిసి సంకీర్తన చేస్తున్నపుడు, భగవద్విషయాలను మనః పూర్వకముగా వింటున్నపుడు, భగవంతుని లీలలు చూస్తున్నపుడుగూడా ఈ 'సాలోక్య' స్థితిని పొందవచ్చు. అంటే - మనము మన చుట్టూ వుండే వాతావరణం వ్యక్తులు అందరూ ఒకే విధమైన ధ్యేయాన్ని, లక్ష్యాలను కలిగి వున్నపుడు ఈ సాలోక్యం ఇహ లోకంలోనే పొందవచ్చు. తాను ఇహ లోకంలోనే

ఎప్పుడూ అలాంటి స్థితిని పొందిన వాణ్ణిని శంకరులు ఈ శ్లోకంలో తెలిపరుస్తున్నారు.

భౌతికంగా భగవంతునికి దగ్గరగా లేకపోయినా సాలోక్య సిద్ధిని పొందవచ్చు. కాని, భగవంతుని సాన్నిధ్యంలో ఉన్నపుడు మాత్రమే సామీప్య సిద్ధిచేకూరుతుంది. అయితే - 'సామీప్యం' అంటే భౌతికంగా దగ్గరగా వుండాల్సిన అవసరం లేదు, మానసికంగా దగ్గఱగా వుంటే చాలు, అది గూడా - సామీప్యముక్తే అవుతుందనుకుంటే - సాలోక్యంలోనే సామీప్యం గూడా సిద్ధింస్తుంది.

భగవంతుని రూపంతో సమానమైన రూపాన్ని పొందటం ద్వారా వచ్చే ముక్తిని 'సారూప్య' ముక్తి అంటారు. మనలోని చిత్తానికి ఒక రూపాన్ని ఆపాదిస్తే చిత్తం ఆరూపం అయిపోతుంది. ఇది చిత్త లక్షణం. ఒక దేవతను ఆరాధిస్తున్నపుడు, పూజిస్తున్నపుడు న్యాస ప్రక్రియ ద్వారా ఆరాధ్యదేవతతో సారూప్యం పొందడం జరుగుతుంది. శివుణ్ణి పూజించి, ధ్యానం చేస్తే 'శివోహం' అనగలిగే స్థితి వస్తుంది. రామకృష్ణ పరమహంస ఏ దేవతను పూజిస్తే వారి రూపం ప్రాప్తించేదట! హనుమంతుణ్ణి ఉపాసన చేసినపుడు ఆయనకు కొద్దిగా తోకగూడా వచ్చినట్లు చెప్తారు. జయ విజయులకు వచ్చిన ముక్తి గూడా సారూప్యముక్తి క్రిందకే వస్తుంది. అందుకే వారిరువురు విష్ణుమూర్తిలాగానే శంఖ, చక్ర, గదాది చిహ్నాలతో వైకుంఠ ద్వారానికి ఇరువైపులా వుంటారు.

చరాచరాత్మకమైన విశ్వం యావత్తును పరమాత్మ దేహంగా ధ్యానించినపుడు - తను, తనతో పాటు తోటి జీవకోటి, స్థావరాలు అన్నీ గూడా ఆ పరమాత్ముని భాగాలే అనే అనుభూతి కలుగుతుంది. అప్పుడు మనలోని మన కన్నులాగా, మనలోని మన ముక్కులాగా పరమాత్మలో మనం ఒక భాగమై లీనమై పోతాము. ఈ స్థితిలో కలిగే ముక్తి సాయుజ్యముక్తి ఔతుంది.

పైన తెల్పిన విధంగా ఇహలోకంలో వుండే నాలుగు రకాల ముక్తులను పొందవచ్చునని, తాను అలా పొంది ధన్యుడనైనానని శంకరులు ఈ శ్లోకంలో విశదపరచారు.

## సంస్కృత శ్లోకము - 29

శ్లో. త్వత్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయామ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవ యాచే విభో ।
దీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం
శంభో లోకగురో మదీయమనసః సౌఖ్యోపదేశం కురు ॥

## అనువాద పద్యము

సీ॥ పరమ శుభమగు నీపాదపద్మములపై
చిత్తమ్ము నిలిపి పూజించుచుంటి
ప్రతిదినమును నీదు ప్రార్థనల్ సేయుచున్
పూని నేను శరణు పొందుచుంటి
చిరకాలముననుండి సురదేవతలచేత
అర్చనల్పొందు నీ అండచేర
కరుణాలవాల నీ కనులనన్ నిల్పుచున్
నీ కటాక్ష ప్రాప్తినాకు నిమ్ము

గీ॥ కోరెదను శివ! నిన్ను నే నోరుదెఱచి
ఓ మహాగురో! శీఘ్రమే నామరూప
జననమరణాది వేదనా జనితమైన
క్లేశములదీర్చు బ్రహ్మోపదేశమిమ్ము

## టీక

హేవిభో = ఓసర్వవ్యాపకుఁడా ! పరమం = సర్వోత్కృష్టమైన, త్వత్పాదాంబుజం = నీపాదపద్మమును, అర్చయామి = పూజించుచున్నాను, అన్వహం = ప్రతిదినమును, త్వాం = నిన్ను, చింతయామి = తలచుచున్నాను, ఈశం = జగత్కర్తవగు, త్వాం = నిన్ను, శరణం = జననమరణములనుండి రక్షించు దిక్కుగా, వ్రజామి = పొందుచున్నాను, వచసా = వాక్కుచేత, త్వామేవ

= నిన్నే, యాచే = (అభీష్టమును) యాచించుచున్నాము, దివ్యైః = దేవతలచేతను, చిరం = చాలకాలముగా, ప్రార్థితాం = ప్రార్థింపఁబడినదియు, సకరుణాం = ప్రేమతోగూడినదియు, చాక్షుషీం = నేత్రముల సంబంధమైన, వీక్షాం = కటాక్షప్రసారమును,మే = నాకు, దిశ = ఇమ్ము, శంభో = సుఖకరుడా, లోకగురో = భక్తలోకమునకు రహస్యార్థములను దెలియఁజేయువాడా, మదీయమనసః = నామనస్సునకు, సౌఖ్యోపదేశం = బ్రహ్మోపదేశమును, కురు = చేయుము.

## తాత్పర్యము

పరమేశ్వరా! నీ పాదార్చనముచేయుచు ప్రతి దినము నిన్ను తలంచుచు శరణుపొంది వేడుకొందును చిరకాలము నుండి దేవతలచే కోరబడుచుండెడి నీ కరుణాకటాక్షమును నాపై ప్రసరింపజేసి కేశము లడంచుచు బ్రహ్మోపదేశము చేయుము.

## వివరణము

ఏ పని ఫలవంతం అవాలన్నా ఆ పనికి చేసే ప్రయత్నం త్రికరణ శుద్ధిగా వుండాలి. మనస్సు, వాక్కు, శరీరము (కాయము) ఈ మూడింటిని మనకు సంబంధించిన 'త్రికరణా'లంటారు. ఈ మూడింటికి శ్రుతి కుదిరితేనే చేసే పనికి త్రికరణశుద్ధి చేకూరుతుంది. చేసేదొకటి, చెప్పేదొకటి, ఆలోచించేది ఒకటి అయితే శ్రుతి చెడి త్రికరణ శుద్ధి చేకూరదు. భగవదారాధన విషయంలో గూడా ఇది సత్యం. భగవంతునికి మూడు శరీరాలుంటాయి. 1) స్థూల శరీరం 2) సూక్ష్మ శరీరం 3) కారణ శరీరం. ఈ మూడింటినే భగవద్గీతలో వరుసగా 1) క్షర పురుషుడు 2) అక్షర పురుషుడు 3) పురుషోత్తముడు అనే పేర్లతో సంకేత పూర్వకంగా గీతాచార్యుడు చెప్పాడు.

'స్థూల శరీరం' లేదా 'క్షర పురుషు'డంటే భౌతికంగా వుండే శరీరం. 'సూక్ష్మ శరీరం' లేదా 'అక్షర పురుషు'డంటే – నశించనిది, సూక్ష్మంగా ఉండేది అని అర్థం. ఈ రెంటికి కారణభూతంగా నేపథ్యంలో వర్తించేది 'కారణ శరీరం'.

ఈ కారణ శరీరాన్నే భగవద్గీతలో 'పురుషోత్తముడు' అన్నారు. ఒక నల్లబల్ల మీద ఒక వృత్తాన్ని గీస్తే - అ వృత్త పరిధి క్రింద ఒక ఆకారంగా ఇమిడి వుండే నల్ల బల్ల భాగాన్ని 'క్షరపురుషుడ'ని అనుకోవచ్చును. వృత్తరేఖను చెరిపివేస్తే ఇది వుండదు, అందుకని ఇది క్షరపురుషుడు. వృత్త పరిధి లోపల పరిమితమై వున్న నల్ల బల్ల భాగాన్ని 'అక్షర పురుషుడని' అనుకోవచ్చును. వృత్త రేఖను చెరిపి వేసినా ఈ పరిధిలోని నల్లబల్ల భాగం చెక్కుచెదరదు. ఇక వృత్త పరిధి క్రింద, లోపల బయటాగూడా నేపథ్యంలో వున్న నల్లబల్లను 'పురుషోత్తము'డని అనుకోవచ్చును. ('అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః' మంత్రపుష్పం).

ఒకే వ్యక్తి వివిధ నాటకాల్లో వేర్వేరు పాత్రలు వేస్తుంటే - ఆ పాత్రలు 'క్షర పురుషుడని' ఆ పాత్రలు వేసే ఆ ఒకే పాత్రధారుని 'అక్షర పురుషుడని' ' ఈ నాటకాలన్నిటిలోని ఆయా పాత్రలను సృష్టించిన నాటక కర్త లేదా నాటక సూత్రధారిని' 'పురుషోత్తము' డని అనుకోవచ్చును.

భగవంతుని భౌతిక విగ్రహానికి మన శరీరంతో లేదా చేతులతో పూజ చెయ్యాలి. దీన్నే 'కాయిక పూజ' అంటారు. భగవంతుని సూక్ష్మ శరీరాన్ని మన వాక్కుల్తో స్తుతించాలి. దీన్నే 'వాచికపూజ' అంటారు. భగవంతుని కారణ శరీరాన్ని మన మనస్సుతో ధ్యానించాలి. దీన్నే 'మానసికపూజ' అంటారు. ప్రస్తుత శ్లోకంలో శంకరులు శివుని విగ్రహానికున్న పాదాలను చేతులతో పట్టుకుని కాయిక పూజను చేసి, వాక్కులతో శివుని సూక్ష్మ శరీరాన్ని స్తుతించి, మనస్సుతో శివుని కారణ శరీరాన్ని ధ్యానించి త్రికరణ శుద్ధిగా ఆరాధిస్తూ సంపూర్ణంగా శరణుజొచ్చి, దేవతలు కూడా చిరకాలం కోరుకునే శివుని కరుణా దృష్టితనపై ప్రసరించాలని కోరుకుంటున్నారు. మనం గూడా చేసే పనులకు ఈ విధమైన త్రికరణ శుద్ధి వుండాలి - అని ఈ శ్లోకం ద్వారా సూచించారు.

## సంస్కృత శ్లోకము - 30

శ్లో. వస్త్రో ద్ధూతవిధౌ సహస్ర కరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతా உన్నపచనే బర్హి ర్ముఖాధ్యక్షతా ।
పాత్రే కాంచన గర్భతా உస్తి మయిచేద్బాలేందు చూడామణే
శుశ్రూషాం కరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకీ గురో,

## అనువాద పద్యము

సీ॥ వేయి కరములుండు వేరాజు గావలె
వస్త్రమ్ములనుగట్ట పదిలముగను
వ్యాపకుండైనట్టి వనమాలిగావలె
పుష్పార్చనము జేయపొందుగాను
వాయురూపుడు గంధవాహుండుగావలె
గంధమందించంగ బంధురముగ
అగ్నిముఖాధీశు దమరేశు దవవలె
అన్నమ్మువండుట కనువుగాను

గీ॥ స్వర్ణగర్భుండు గావలె పాత్రనీయ
అపుడు మాత్రమే సంసేవ ననువుగాను
నీకు చేయంగ నౌదు త్రిలోకగురుడ!
చంద్రశేఖర! పశుపతి ! స్వామి ! సాంబ !

## టీక

హేబాలేందు చూడామణే = ఓచంద్రశేఖరుఁడా ! హేపశుపతే - సంసారబంధమోచకుఁడా ! హేస్వామిన్ = ఓసర్వశరీరాధ్యక్షా ! త్రిలోకీగురో = మూఁడులోకములకును రహస్యార్ధములను ప్రకటించువాడా! తే = నీయొక్క వస్త్రోద్ధూతవిధౌ = వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా = సూర్యుడగుటయు (వేయికరములుగలుగుట), పుష్పార్చనే = పుష్పోపహారార్పణ

మందు, విష్ణుతా = విష్ణువగుటయు (వ్యాపకత్వము), గంధే = గంధోపచారమందు, గంధమహాత్మతా = వాయురూపుడగుటయు, అన్నపచనే = అన్నమువండుటయందు (హవిరుపచారము చేయుటయందు), బర్హిర్ముఖాధ్యక్షతా = ఇంద్రుడగుటయు, పాత్రే = పాత్రోపచారమందు (అర్ఘ్యవిధి), కాంచనగర్భతా = హిరణ్యగర్భుడగుటయు (ధనపూర్ణుడగుట), మయి = నాయందు, అస్తిచేత్ = ఉన్నయెడల, తే = నీయొక్క, శుశ్రూషాం = సేవను, కరవాణి = చేయజాలుదును.

## తాత్పర్యము

సర్వవ్యాపకా! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయికరములు గలవాడు కావలయును. పుష్పోపచారముచేయుటకు వ్యాపకుండు కావలయును. గంధోపచారమునకు గంధవహుండు గావలయును. వంటచేసి నీకు హవిస్సు నివేదన చేయుటకు అగ్నిముఖాధ్యక్షుడు గావలయును. అర్ఘ్యపాత్రము సమర్పించుటకు ఆగర్భ శ్రీమంతుడు గావలయును. అట్టి సూర్యుడును, విష్ణువును, వాయుదేవుడును, దేవేంద్రుడును, హిరణ్యగర్భుడును అయినప్పుడే నీ కట్టి ఉపచారములు చేయగలను. లేనిచో నీ కుపచారములుచేయ నా తరమా?

## వివరణము

భగవంతుణ్ణి పూజించడంలో మూడు విధాల గురించి క్రిందటి శ్లోకంలో చెప్పబడింది. ఈ శ్లోకంలో నిత్యం చేసే కాయిక పూజ గురించి చెప్పబడుతోంది. మనం చేసే పూజలో ముఖ్యంగా పదహారు రకాల ఉపచారాలుంటాయి. దీన్నే 'షోడశోపచార పూజ' అంటారు. 1) ఆవాహన, 2) ఆసన 3) అర్ఘ్య 4) పాద్య 5) స్నాన 6) వస్త్ర 7) గంధ 8) యజ్ఞోపవీత (లేదా స్త్రీదేవతల కైతే వింజామర) 9) ఆభరణ 10) పుష్ప 11) ధూప 12) దీప 13) నైవేద్య 14) తాంబూల 15) నీరాజన 16) మంత్రపుష్ప ఉపచారాలు కలసి మొత్తం పదహారు ఉంటాయి.

వీటినే 'షోడశోపచారాలు' అంటారు. వీటిలో కొన్నింటిని ఈ శ్లోకంలో ఉదహరించారు.

చతుర్దశ భువనాధిపతి అయిన శివుడంతటి వానిని సంతృప్తిగా పూజించాలంటే మాటలా అంటూ కొన్ని ఉపచారాలు ఎవరు చేస్తే సంతృప్తిగా వుంటుందో చెబుతున్నారు. శివునికి వస్త్రోపచారం చెయ్యాలంటే సూర్యుడే చెయ్యాలిట. ఎందుకంటే - సూర్యుడు తన కిరణసముదాయంతో ఈ ప్రపంచాన్ని అల్లుకుని విస్తరింపజేసే వాడుట. అందుకనే సూర్యునికి 'వివస్వంతుడు' అనే పేరు వచ్చింది. ఇక పుష్పోపచారం చెయ్యాలంటే - వ్యాపకుడు, పోషక కర్త అయిన విష్ణువే చెయ్యాలిట. గంధోపచారం చెయ్యాలంటే - తనతో పాటు గంధాన్ని మోసుకుని సర్వత్రా వ్యాపింప చేసే వాడైన వాయు దేవుడే చెయ్యాలిట'. వండి హవిస్సుగా ఏదైనా నివేదన చెయ్యాలంటే - అగ్ని ముఖాధీశుడైన ఇంద్రుడే చెయ్యాలిట ! పాత్రతో అర్ఘ్యం సమర్పించాలంటే హిరణ్య గర్భుడైన సాక్షాత్తూ బ్రహ్మే సమర్పించాలట !

మరి శివునికి ఈ విధమైన ఉపచారాలు చెయ్యడం సామాన్యుల వల్ల వీలౌతుందా ? అలా అని పూజ మానక్కరలేదు. మనకు తగ్గ స్థాయిలో యథాశక్తి పూజ చెయ్యాలి. ఆ విధంగా చేస్తూ వుంటే ఎప్పటికయినా ఈ శ్లోకంలో చెప్పిన వారి స్థాయి సామర్థ్యాలు మనకు గూడా శివుడు కలుగ చేస్తాడనే నమ్మకంతో పూజ చెయ్యాలి. శివుని స్థాయి అంతటిది అని చెప్పడానికే ఈ ఉదాహరణలు గాని - మనం శివుణ్ణి పూజించటానికి తగం అని గాదు.

## సంస్కృత శ్లోకము - 31

శ్లో. నాలం వా పరమోపకారకమిదం త్వేకం పశూనాంపతే
పశ్యన్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్ ।
సర్వామర్త్యపలాయనౌషధ మతిజ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళే న గిళితం నోద్గీర్ణ మేవ త్వయా.

## అనువాద పద్యము

సీ॥ భూతనాథా ! నీదుపొట్టలో నున్నట్టి
సకల చరాచర సంచయమును
బయటగానున్నట్టి వారల సయితమ్ము
రక్షింపగా జూచి తక్షణమున
ఆ దేవతల పలాయన మంత్రమని యెడి
దైవరుగ్మత కౌషధమ్ము రీతి
అతి తాప భరితమై అతిభయంకరమైన
గరళ మ్ముంచితి వీవు కంఠమందు

గీ॥ అదియు మ్రింగుడు బడకుండ గదలనీవు
వెడలనుమియంగ బడకుండ విడువవీవు
అట్టి పరమోపకారమ్మునైన దొకటి
చాలదా నీదు మహిమకు నీలకంఠ !

## టీక

హేపశూనాంపతే = ఓభూతనాథా ! కుక్షిగతాన్ = కడుపులోనున్న, చరాచరగణాన్ = స్థావరజంగమసమూహములను, బాహ్యాస్థితాన్ = వెలుపలనున్న వారలను, రక్షితుం = కాపాడుటకు, పశ్యన్ = ఆలోచించుచు, త్వయా = నీచేత, అతిజ్వాలాకరం = మిక్కిలి తాపము కలుగజేయునదియు, భీకరం = భయంకరమునుఅగు, గరళం = కాలకూటవిషము, సర్వామర్త్య = సమస్తదేవతలయొక్కయు, పలాయన = పాఱిపోవుట అనెడు రోగమునకు, ఔషధం = మందగునట్లుగా, గళే = కంఠమందు, నిక్షిప్తం = నిలుపబడినదై, నగిళితం = మ్రింగబడలేదు, నోద్గీర్ణమేవ = వెడల నుమియబడనులేదు, పరమోపకారకం = మిక్కిలి యుపకారకమైన, ఇదం ఏకం = ఇది యొక్కటియే, నాలంవా = (నీ మహిమదెలియుటకు) చాలదా.

## తాత్పర్యము

నిఖిలలోక భయంకరమై సంతాపకరమైన కాలకూటవిషమును చూచి భయపడి పారిపోవు దేవతల నూరడించుటకుగాను నీ కంఠమందే యుంచుకొని యుమియక, మ్రింగక కడుపులోని వారలకును, వెలుపలి వారలకును, బాధ కలుగకుండ మహోపకార మొనర్చితివి. దేవా! నీ మహిమ తెలియుట కీ దృష్టాంత మొక్కటి చాలదా.

## వివరణము

ఏ దేవత గూడా ప్రపంచానికి చెయ్యని మహోపకారం శివుడొక్కడే చేశాడని 'ఆర్త త్రాణపరాయణుడు' 'జగద్రక్షకుడు' 'ఆపద్బాంధవుడు' 'మహానుభావుడు' అనే పేర్లకు సరిగ్గా తగినవాడు శివడొక్కడేనని ఈ శ్లోకం ద్వారా శంకరులు నిర్ధారిస్తున్నారు.

సహాయం చెయ్యమని కోరినా చెయ్యని వాణ్ణి - 'అహం భావుడు' అంటారు. సహాయం కోరితే చేసేవాణ్ణి 'ఆపద్బాంధవుడు' అంటారు. సహాయం అవసరమని తెలుసుకుని అడక్కుండానే చేసి ఆదుకునేవారిని 'మహానుభావు' డంటారు. బాధ్యతలను గుర్తుచేసి చెయ్యమని చెప్తే చేసేవారు కొందరుంటారు. వారి కన్నా చెయ్యవలసినవి చెప్పించుకోకుండానే చేసేవారు కొందరుంటారు. ఈ రెండోరకం వారినే 'ఆత్మీయు'లంటారు. ఎంతో ప్రేమ వుంటే గాని ఆత్మీయతాదృక్పథం ఉండదు.

దేవతలు, దానవులు కలసి క్షీరసముద్రాన్ని మథించారు. జ్వాలలు చిందిస్తూ కాలకూటవిషం ఉద్భవించింది. దేవతలు దానవులు హడలిపోయారు. భయభ్రాంతులతో ప్రయత్నం విరమించి పారిపోదామనుకున్నారు. ఏదైనా మంచి ఫలితం దక్కితే అనుభవిద్దామనుకున్నారే గాని ఇలా హాలహాలం ఉద్భవిస్తే ఏం చేస్తారు ? ఎవరి బ్రతుకు వారు చూసుకునే స్వార్థప్రయత్నంలో పడ్డారు. అప్పుడు శివుడు ఆ హాలాహలాన్ని తాను భక్షించి దేవదానవులందర్నీ

రక్షిద్దామనుకున్నాడు. కాని, ఆ విషాన్ని మ్రింగితే లోపల కుక్షిలో సకల చరాచర ప్రాణికోటి అహుతి అయిపోతుందేమోననే ఉద్దేశ్యంతో అటు లోపల ప్రాణికోటి, ఇటు బయట దేవదానవులు అందరూ రక్షింపబడటం కోసం - ఆ విషాన్ని మ్రింగి, లోపలకు పోనీయకుండా కంఠం వద్దనే నిలిపివేశాడు. ఇంతటి సమయస్ఫూర్తి, ఇంతటి దయాగుణం, ఇంతటి తెగింపు, సాహసము, ఆర్తత్రాణ పరాయణత్వము ఎవరికి వుంటాయి ? కల్పవృక్షం వస్తేను, కామధేనువు వస్తేను, లక్ష్మీదేవి వస్తేను ఉచితంగా సంగ్రహించడానికైతే ముందుకు వస్తారు గాని ఇలా హాలాహలం వస్తే - పూర్తిగా మ్రింగకుండా బయటకు ఉమియకుండా - కంఠం వద్దే నిలిపి అందర్నీ కాపాడే రక్షణ గుణం, ఉపకారం గుణం ఎవరి కుంటుంది ? ఈ ఒక్క మహోపకారగుణం చాలు శివుడు అందరి దేవతలలో అగ్రగణ్యుడని చెప్పుకోడానికి - అంటున్నారు శంకరులు.

## సంస్కృత శ్లోకము - 32

శ్లో. **జ్వాలోగ్రస్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వా త్వయా**
**దృష్టః కించ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్ ।**
**జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః**
**కిం తే నీలమణి ర్విభూషణమయం శంభో మహాత్మన్ వద.**

## అనువాద పద్యము

సీ॥ **జ్వాలలన్ చిందుచున్, సకలదేవతలను**
**తరుమగల్గిన భయంకరవిషమును**
**దేవా ! మహాదేవ ! దీన సంరక్షకా!**
**కనులతో దానిని కంటి వెటుల ?**
**మరియు దానిని నీవు కరతలమ్మందున**
**చేతితో నెత్తుచున్ జేర్చి తెట్లు ?**
**ఆ విధమ్ముగజేయ నదియేమి నల్లగా**
**పండిన నేరేడు పండుగాదు**

గీ॥ వేసుకొంటివి నాల్కపై వింత గొలుప
అటుల జేయుటకది సిద్ధ ఘుటిక యగునె ?
అట్లె కంఠ మందుంచితి వటుల జేయ
నీలమణి గాదుకద! చెప్పు ! నీలకంఠ !

## టీక

హేమహాత్మన్ = సర్వజ్ఞుడవైన ఈశ్వరుడా ! జ్వాలోగ్రః = మంటలచేత సహింపగూడనిదియు, సకలామర = అందఱు దేవతలకు, అతిభయదః = మిగుల భయంకరమునుఅగు, క్ష్వేళః = విషము, త్వయా = నీచేత, కథంవా = ఎట్లుగా, దృష్టః = చూడబడినది ? కించ = అంతియకాక, కరే = హస్తమందు, ధృతః = ధరించఁబడినది (చేతితోదాకబడినది) ? కరతలే = అఱచేతియందు, నిహితః = ఉంచుకొనబడినది ? పక్వజంబూఫలంకిం = పండిన నేరేడుపండా యేమి ? జిహ్వాయాంచ = నాలుకయందును, నిహితః = వేసికొనబడినది, సిద్ధఘుటికావా = సకలసిద్ధికారియగు నౌషధఘుటికయా యేమి? కంఠదేశే = కంఠప్రదేశమందు, భృతః = భరింపబడినది. అయం = ఈ కాలకూటవిషము, తే = నీకు, విభూషణం = అలంకారమైన, నీలమణిఃకిం = ఇంద్రనీల మాణిక్యమాయేమి ? వద = చెప్పుము.

## తాత్పర్యము

తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకల దేవతలకును భయంకరమైన ఈ కాలకూటవిషమును కన్నులతో గాంచుటయేకాక చేతితో నెత్తి యరచేతిలోనుంచుకొంటి వది నేరేడు పండాయేమి? ఇదికాక నాలుకమీద వేసికొంటివి. అది సిద్ధఘుటికయాయేమి? మరియును కంఠమందటులనే యుంచుకొంటివి అది ఇంద్రనీలమణియాయేమి చెప్పుము.

## వివరణము

హాలాహల భక్షణం గూర్చి మరికొన్ని విశేషాలను శంకరులు ఈ శ్లోకంతో వెలిబుచ్చుతున్నారు.

ప్రళయాగ్ని జ్వాలలు చిందిస్తూ అతి వేగంగా విస్తరిస్తూ, విజృంభిస్తూ ముందుకు వచ్చే కాలకూట విషాన్ని చూసి దేవతలందరూ హడలిపోతుంటే - శివుడు దానికి ధైర్యంగా ఎదురు నిలబడి తనచేతిని చాచాడు - అంతే ! పెద్ద కారుమేఘమంత ఉన్న ఆ హాలాహలం ఆదివరాహమంత అయి తగ్గుతూ తగ్గుతూ చివరకు పండిన నల్లని నేరేడుపండంత అయి చిట్టచివరకు శివుని అరచేతిని చేరంగానే మరింత చిన్నదైపోయింది. (అంటే - హాలాహలం చిన్నదై పోవడం కాదు. ఆ హాలాహలం అలాగే వుంది కాని శివుడు దాని ముందు తన పరిమాణాన్ని పెంచగా పెంచగా చివరకు తన పరిమాణం ముందు ఆ హాలాహలం సాపేక్షకంగా తన అరచేతిలో చుక్కంత ఐనట్లు కనబడిందన్నమాట!)

ఆ హాలాహలాన్ని అవలీలగా మ్రింగి తన కంఠం మధ్యలోనే నిలిపి వేశాడు. అసలు దగ్గఱగా ఎదురుగా నిలబడటమే కష్టం అనుకుంటే - నిలబడటమే కాకుండా చేతులలోకి తీసుకోవడం, తీసుకోడమే కాకుండా మ్రింగడం, మ్రింగడమే కాకుండా కంఠం వద్దనే నిలిపి వేయడం సామాన్య విషయమా - అలా మ్రింగడానికి అదేమి పండిన నేరేడు పండుకాదు సిద్ధ ఘుటికా కాదు గదా ! మ్రింగి కంఠం వద్దనే నిలిపితే అంతటి హాలాహలం శివుణ్ణి, శివుని కంఠాన్ని గూడా ఏమీ చేయలేకపోయింది. తెల్లగా వుండే శివుని కంఠం ఇంద్రనీలమణిని ఆభరణంగా ధరించినట్లు వెలుగులు చిమ్మింది. అద్భుతమైన ఈ సన్నివేశాన్ని చూసిన దేవదానవులందరూ ఆశ్చర్యంతో మరల తిరిగి పొందిన ఉత్సాహంతో - 'నీలకంఠా! మృత్యుంజయా ! సర్వేశ్వరా ! సదాశివా ! శ్రీమన్మహాదేవా!' అంటూ జయ జయ ధ్వానాలు చేశారు.

## సంస్కృత శ్లోకము - 33

శ్లో. నాలం వా సకృదేవదేవ భవతస్సేవా నతిర్వా నుతిః
పూజా వా స్మరణం కథాశ్రవణమప్యాలోకనం మాదృశామ్ ।
స్వామిన్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే
కా వా ముక్తిరితః కుతో భవతి చేత్కిం ప్రార్థనీయం తదా ॥

### అనువాద పద్యము

సీ॥ కాయికమ్మౌ నమస్కారముద్రనుగాని
మానసికమ్మగు స్మరణగాని
వాక్కుతో జేయనౌ చక్కని స్తుతిగాని
చేతులతో జేయు సేవగాని
వీనులు నీ కథల్వినుచుండుటనుగాని
కనులతో నీ మూర్తిఁ గనుటగాని
లెక్కకొకపరి నీ యొక్క భజనమును
చాలదే నా వంటి సాధకులకు

గీ॥ స్వామి యివి గాక ముక్తింక యేమిటయ్య
శ్రమయె అస్థిర దేవతాశ్రయముచేత
ఏమి ప్రాప్తించు దానితో నేమి ఫలము
కోరదగినది యేముండె వారి నసలు.

### టీక

హేస్వామిన్ = సర్వభూతాధ్యక్షుడవైనదేవా ! భవతః = నీ యొక్క, నతిర్వా = కాయికమైన నమస్కారమేని, నుతిర్వా = వాక్కుతోడి స్తోత్రమేని, పూజావా= పూజయేని, స్మరణం = మనసులో స్మరించుట యేని, కథాశ్రవణమపి = చెవులతో నీచరిత్రలు వినుటయేని, ఆలోకనం = కన్నులతో నీమూర్తి జూచుటయేని, సకృదేవ = ఒక్కమాఱుమాత్రమే, భవతః = నీయొక్క, సేవా = భజనము,

**మాదృశాం** = నావంటివారలకు, **నా లంవా** = (ముక్తియొసగ) చాలదా ? **ఇతః** = ఈ పైయుపాయమును విడిచి, **ముక్తిః** = మోక్షము, **కావా** = ఎట్టిది ? **కుతో௨పి** = పైయుపాయములలోనే యొకదానినుండియైనను, **భవతిచేత్** = ముక్తి గలుగునేని, **తదా** =అప్పుడు, **అస్థిర** = శాశ్వతముగాని, **దేవతా** = దేవతలయొక్క **అనుసరణాయాసేన** = ఆశ్రయించు ప్రయత్నము చేత, **కింలభ్యతే** = ఏమిలాభమగును, **ప్రార్థనీయం** = కోరదగినదియు, **కిం** = ఏమున్నది ?

**తాత్పర్యము**

ఓ స్వామీ! నమస్కారము. స్తోత్రము, స్మరణము మొదలగు నీ సేవలయందొక్కొక్కటియు మోక్షమునకు గొప్ప సాధనము. ఈ యుపాయములను వీడి వేరుగా మోక్షములేదు. అస్థిరులైన యితర దేవతల ననుసరించి యేమిలాభము? వారిని కోరదగిన దేమున్నది?

**వివరణము**

ఈ శ్లోకం ముక్తి రావడానికి చాలా తేలికగా ఉండే ప్రక్రియను సూచిస్తున్నట్లు వుంటుంది. ఒక్కసారి శివునికి – నమస్కారం చేసినా, సేవించినా, పూజించినా, స్మరించినా, దర్శించినా గూడా ముక్తి వస్తుందట. ఇంతటి ఫలం దక్కడానికి మరి అశాశ్వతులైన ఇతరులకు కష్టపడి సేవచెయ్యవలసిన పని లేదుట ! వారిని కోరికలు కోరవలసిన పనీలేదుట !

గ్రామ ఫోను లాగా సంకీర్తన చేసినా, నామంజపించినా యాంత్రికంగా పూజలు, అభిషేకాలు చేసినా, హోమాలు చేసినా ఏమీ ప్రయోజనం వుండదు. ఆ చేసేది హృదయపూర్వకంగా, నిష్ఠగా, ఏకాగ్రతా దృష్టితో ఒక్కసారి చేసినా చాలు ! అని – ఈ శ్లోక భావన. శివుణ్ణి ఒక్కణ్ణే స్మరించు అంటే మనకు దేవతాభావం ఎవరిమీద వుంటే, ఆ దేవత విషయంలో అయినా సరే, చేసే పూజకు, పలికేమాటకు, ధ్యానించే మనసుకు శ్రుతి కుదిరితే ఒక్కసారి చాలు. త్రికరణాలకు శ్రుతి కుదరనపుడు వెయ్యిసార్లు కాదు గదా లక్షసార్లు, కోటిసార్లు

– రోజులు, సంవత్సరాలు తరబడి చేసినా ఫలితం దక్కదు అని అసలు అర్థం.

శంకరులు అందరి దేవతల్లోను ఆదిదేవుని చూడగలిగారు. అందరి మీద స్తోత్రాలు వ్రాశారు. శివకేశవులకు, పరాశక్తికి భేదాన్ని చూడలేదు. అంతటా నిండి వున్న పరబ్రహ్మను – సాలగ్రామాల్లోను, అందరి దేవతల విగ్రహాల్లోను, చిత్రపటాల్లోను, పుణ్యనదీనదరూపాల్లోను గూడా చూసి సర్వాంతర్యామిని దర్శించి తరించారు. వాస్తవానికి శంకరులు స్తుతించినట్లుగా ఎంతోమంది దేవతలను ఇతరులెవ్వరూ స్తుతించలేదన్న విషయం అసత్యం కాదు. ఇంతటి అద్వైతదృష్టి, అంతర్యామి దర్శనం కలిగిన వారు మాత్రమే అలా స్తుతించగలరు. మిగిలిన వారు అలా చెప్పలేరు, చెప్పరు గూడా !

శివస్మరణకు విముఖత్వం చూపే వైష్ణవ పీఠాధిపతులు – విష్ణు స్మరణ పాపం అనే శైవాధినేతలు, అమ్మవారిని తామసశక్తిగా ఉద్బోధించి నెత్తదుస్తుందని – లలితారాధన మంచిది కాదని చెప్పే ప్రబుద్ధులూ – విభూతికాదు నామాలు పెట్టాలని, నామాలు కాదు విభూతి పెట్టాలని చెప్పే పరస్పర విద్వేషులు, అసలు ఈ రోజుల్లో గుండ్రటి కుంకుమబొట్టు పెట్టడమే తప్పనే మఠాధిపతులు ఉన్న ఈ దేశంలో – శంకరాచార్యుల వారు అందరి దేవతల మీద స్తోత్రాలు వ్రాసి ఏ దేవత స్తోత్రం వ్రాస్తున్నపుడు ఆ దేవత మిగిలిన అందరి కన్నా గొప్ప అని చెప్పడం ఆశ్చర్యంగా వుంటుంది. ఇందుకు కారణం 'అందరిలో వున్నది ఒక్కరే !' అనే ఆయన అభేద, అద్వైత భావన; అన్నిటా సర్వాంతర్యామిని చూడగలగడమే అనిపిస్తుంది. పరమత సహనమే కాదు. పరదేవతా సహనం, పరగురు సహనం కూడా ఉండాలని చెప్పడమే ఆయన ఉద్దేశ్యం అనిపిస్తుంది. వ్యాసులవారుకూడా అటు విష్ణుసంబంధమైన, శివసంబంధమైన, పరాశక్తి సంబంధమైన పురాణాలు వ్రాశారు. ఆయన కూడా ఎవరికి సంబంధించిన పురాణం వ్రాస్తున్నపుడు వారే అందరి కంటే గొప్ప అనే చెప్పారు. ఇలా అనడానికి కారణం – ఆ అందరిలోను ఉన్నది ఒక్కరే కాబట్టి. (లేదా – ప్రతి పురాణం ఒక పెళ్ళిలాంటిది అనుకుంటే ఎవరికి సంబంధించిన పెళ్ళిలో

అందరికంటే ఆ పెళ్ళికొడుక్కో లేదా ఆ పెళ్ళికూతురుకో ప్రాముఖ్యం ఇవ్వబడుతుంది కదా! - వారి ఉద్దేశ్యాన్ని అలా అర్థం చేసుకోవాలి.)

సౌందర్యలహరిలో - అమ్మవారే అందరికన్నా గొప్ప అని చెప్పినట్లు వుంటుంది. విష్ణు సహస్రనామంలో విష్ణువే గొప్ప అని - శివ సహస్ర నామాల్లో శివుడే అందరికంటే గొప్పఅనీ చెప్పబడినట్లుంటుంది. చిత్రం ఏమిటంటే అలా చెప్పినవాళ్లకు అసూయలు, ద్వేషాలు, దురభిమానాలు కలగలేదు. అవి కలిగేది ఆరాధించే మనకే ! చిత్రంగా లేదూ !

## సంస్కృత శ్లోకము - 34

శ్లో. కిం బ్రూమస్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో భవ
ద్ధైర్యం చేదృశ మాత్మనస్థ్సితి రియం చాన్యైః కథం లభ్యతే ।
భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం
పశ్యన్నిర్భయ ఏక ఏవ విహరత్యానందసాంద్రో భవాన్.

## అనువాద పద్యము

సీ॥ సాటిలేనట్టి నీ సాహసమ్మును తెల్ప
ఏమని చెప్పుదు స్వామినేను
ఇట్టి ధైర్యమింకెట్టి వానికి నుండు
ఇట్టి నా స్థితిబొంద నెవరి తరము
దిగ జారిపోయెడి దేవతాగణమును
వణుకుచున్ భయపడు మునిగణమును
నశ్యమౌనట్టి యీ దృశ్యమౌజగమును
గలదైన ఆ లయకాలమందు

గీ॥ నిర్భయమ్మున వానిని నిశితముగను
కలత దూరని మనసుతో గాంచుచుండి
ఒక్క నీవు మాత్రమె యుండి చక్కగాను
విశ్వమున విహరింతువో విశ్వనాథ !

## టీక

హేపశుపతే = ఓ భూతనాథా, హేశంభో = ఓ శంకరా, తవ = నీ యొక్క సాహసం = తెగింపు (అసాధ్యసాధనము), కింబ్రూమః = ఏమని చెప్పుదుము ? ఈదృశం = ఇటువంటి, భవద్ధైర్యం = నీ ధైర్యము, కస్య = ఎవ్వనికి, అస్తి = కలదు ? ఇయం = ఈ (ఇట్టి), ఆత్మనః = తన (నీ) యొక్క స్థితిశ్చ = ఉనికియును, అన్యైః = ఇతరులచేత, కథం = ఎట్లుగా, లభ్యతే = పొందబడును, ఆనందసాంద్రః = ఆనందముతో నిండియున్న, భవాన్ = నీవు, భ్రశ్యద్దేవగణం = పడిపోవు దేవతాగణమును, త్రసన్మునిగణం = భయపడుచున్న మునిగణమును, నశ్యత్ప్రపంచం = మాయమై పోవుచున్న ప్రపంచమును గలదియగు, లయం = ప్రళయకాలమును, పశ్యన్ = చూచుచు, నిర్భయః = భయము లేనివాడవై, ఏక ఏవ = ఒక్కడవే, విహరతి = విహరించు చున్నావు.

## తాత్పర్యము

భూతనాథా! ఏమి నీ సాహసము? ఏమి నీ ధైర్యము? మరెవ్వరేని ఇట్లు నిలిచి యుండగలరా? నిరాశతో దేవతలందరునటునిటు పారిపోజూచుచుండగా, మునులందరు భయకంపితులగుచుండగా, తుదకు ప్రపంచమంతయు నశించి పోవుచుండగా – నీ వొక్కడవేకదా నిర్భయుడవై మహాప్రళయమందు భీతిలేక విలసిల్లు చుంటివి.

## వివరణము

దేవతలు, ఋషులు సమస్త ప్రపంచం నశించిపోయే సమయంలో నిర్భయంగా చెక్కుచెదరకుండా, ఏమాత్రం భయపడకుండా నిర్వికారంగా, స్థిత ప్రజ్ఞుడిలాగా ఉండేవాడు శివుడొక్కడే ! అందరూ తనలోనే ఉన్నారు. తను అందరిలో వున్నాడు. ఇంక తనకంటె ఇతరమనే ప్రసక్తి ఎక్కడ వుంది? భేద దృష్టి గల వారికే భయం కూడా వుంటుంది. మన శరీరంలో ఎడమ చేతిని చూసి కుడి చెయ్యి భయపడుతుందా ? పడదు. ఎందుకని ? ఆ రెండు

చేతులూ మన శరీరంలోని భాగాలే కాబట్టి. అలాగే తనే ప్రపంచం, తనలోనే ప్రపంచం అయినపుడు ఇంక భయం ఎక్కడుంటుంది ? తనలో వున్న ప్రపంచం నిక్షేపంగా వుంది. మళ్లీ సృష్టి సమయానికి మొత్తం క్రమబద్ధంగా బయటపడి బట్టకడుతుంది. అందుకే అంతటి ప్రళయం వచ్చినా శివుడు సాక్షీభూతుడుగానే వుంటాడు. ఆనందాగానే యోగమూర్తిలాగానే వుంటాడు ఆందోళనపడడు. ఆవేదన అంతకన్నా వుండదు. అదీ సాహసం అంటే ! స్థిత ప్రజ్ఞత్వం అంటే! అదీ నిర్వికార నిస్సంగత్వం అంటే ! ఇలా ఉండగలిగేది శివుడొక్కడే !

## సంస్కృత శ్లోకము - 35

శ్లో. యోగక్షేమధురంధరస్య సకలశ్రేయః ప్రదోద్యోగినో
దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః ।
సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభో త్వం పరమాంతరంగ ఇతి మే చిత్తే స్మరామ్యన్వహమ్.

## అనువాద పద్యము

సీ॥ మెందు యోగమ్మును నిందు క్షేమమ్మును
దండిగన్ శుభములుపందు నటుల
ప్రజల కందించెడి ప్రబలమౌ బాధ్యతా
యుతమైన యున్నతోద్యోగి వీవు
ఇహ పరాత్మకమైన మహిమోపదేశార్థ
దివ్యమౌ నైపుణ్యమందునిల్చి
బాహ్యాంతరములందు వ్యాపించి యంతట
నుండగల్గిన సర్వజ్ఞుండ వీవు
గీ॥ అఖిల హృదయార్ద్ర జనితామృతాబ్ధివీవు
అట్టి నీ భవ్య గుణగణమందు నింక
తెలియ నీ దివ్య గుణగణాదులను మించి
తలతు నా పరియాప్తుడం చెలమి నిన్ను.

## టీక

యోగ =అలభ్యవస్తువులను లభింప జేయుటయందును, క్షేమ = లబ్ధమైనదానిని. పరిపాలించుటయందును, ధురంధరస్య = భారమును వహించినట్టియు, సకలశ్రేయః ప్రదోద్యోగినః = సమస్త శుభముల నిచ్చెడు నట్టి యుద్యోగము గలిగినట్టియు, బాహ్యాంతరవ్యాపినః = బాహ్యప్రపంచమందును నిండియున్నట్టియు, సర్వజ్ఞస్య = సర్వజ్ఞుడవైనట్టియు, దయాకరస్య = దయజూచునట్టియు, భవతః = నీయొక్క (సంబంధమైనది) మయా = నాచేతను, వేదితవ్యం = తెలియదగినదియు, కిం = ఏమియున్నది? త్వం = నీవు, మే = నాకు, పరమాంతరంగః = అత్యంతాప్తుడవు, ఇతి = అని, అన్వహం = ప్రతిదినమును, చిత్తే = మనస్సునందు, స్మరామి = తలచు చున్నాను.

## తాత్పర్యము

శివా ! ప్రజల యోగక్షేమభారము వహించుట, సకలశ్రేయస్సు లొసంగుట, ఐహికాముష్మిక సాధనోపాయముల నుపదేశించుట, ఎల్లరను దయతోజూచుట, సర్వజ్ఞత్వము ఎల్లెడ నిండియుండుట నీ గుణములు గదా! నీవే నాకు పరమాప్తుడవని యెల్లవేళల దలంతును. అదియే నాకు శ్రేయస్కరమగుగాక!

## వివరణము

ప్రళయ సమయంలో శివుడు సాక్షీభూతుడుగా నిర్వికారుడుగా, నిర్వేదంతో, నిస్సంగత్వంతో ఉంటాడని పూర్వ శ్లోకంలో చెప్పబడింది. నిస్సంగత్వం అంటే పట్టించుకోకుండా బాధ్యతలను విస్మరించేవాడని అర్థం చెప్పుకోకూడదు. సజ్జనుల యొక్క ఆశ్రితుల యొక్క యూగక్షేమాలు చూస్తాడు. కాలానుగుణంగా జరగవలసిన వాటిని జరిగేలా చూసి ఆదుకుంటాడు. కనిపెట్టుకుని వుంటూ ఇహపరసంబంధమైన, సమ్మతమైన హితము, శుభము జరిగేలా చూసే దయాసముద్రుడు. కాబట్టి అందరికీ ఆత్మీయుడు. అందుకే

అందరి హృదయాల్లోను వుండేవాడు శివుడే అని 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి' అన్న గీతవాక్యం చెబుతుంది. అందుకే శివస్మరణ సర్వమంగళకరం.

## సంస్కృత శ్లోకము - 36

శ్లో. భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభే సాంబ తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్ ।
సత్త్వం మంత్రముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్
పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణమాపాదయన్.

## అనువాద పద్యము

సీ॥ పరమేశ్వరా ! నీదు భక్తుడౌ నేను స్వ
కీయ దేహమ్మును గృహమునంత
పరిశుద్ధి గావించి పరమావధిని గోరి
రుచిర కళ్యాణ కారుండ నౌచు
ప్రచ్ఛన్నమై యొప్పి స్వచ్ఛమైనదియునౌ
కళనొప్పు మనసను కలశమునకు
భక్తి గుణములతో యుక్త విధిని జుట్టి
ముదమను జలమందు పదిల పఱచి
గీ॥ నీదు పదపల్లవ యుగము, నీదు జ్ఞాన
మనెడి నారికేళఫలము నందమర్చి
పలికి మంత్రమ్ము పుణ్యాహవాచనమును
పూర్తి చేయగ – నే నెఱవేర్తు సాంబ !

## టీక

హేసాంబ = ఓ సాంబమూర్తీ ! భక్తః=భక్తుడనైన నేను, నిజశరీర= స్వకీయ శరీరమనెడు, అగారశుద్ధిం = గృహము యొక్క పరిశుద్ధిని (దోషములు

లేమి), వహన్ = సంపాదించుచున్నవాడనై, రుచిరం = మనస్సునకింపైన, కల్యాణం = మంగళమనియెడు వివాహమంగళమును, ఆపాదయన్ = సంపాదింప బోవుచు, భక్తిగుణావృతే = భక్తియను నూలుపోగులతో జుట్ట బడినదియు, ముదమృతాపూర్ణే = సంతోషమనెడు యుదకములతో నిండించబడినదియు, ప్రసన్నే = స్వచ్ఛమైనదియు నగు, మనః కుంభే = మనస్సను కలశమందు, తవ = నీ యొక్క అంఘ్రిపల్లవయుగం = పాదంబులను రెండు పల్లవములను, సంవిత్ఫలం = జ్ఞానంబను కొబ్బరి బొండమును, సంస్థాప్య = ఉంచి, సత్త్వం = సత్త్వగుణ ప్రధానమైన, మంత్రం = తారకమంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహం = పుణ్యాహవాచనమును, ప్రకటీకరోమి = ప్రకాశింపంజేయుదురు.

## తాత్పర్యము

సాంబశివా! నా శరీరమను గృహమును శుభ్రపరచుకొని, మనస్సున కింపైన కల్యాణము చేయబూని భక్తియను దారములను చుట్టి సంతోషమను నీటితో నింపిన నా మనస్సను కలశమున నీ చరణపల్లవములను, జ్ఞానమను కొబ్బరి బొండమును చేర్చి కలశస్థాపనచేసి మంత్రపూర్వక పుణ్యాహవాచనము భక్తితో నాచరింతును.

## వివరణము

నిజమైన భక్తుడు తన శరీరాన్ని గృహంగాను, తన హృదయాన్ని పరమ పవిత్రంగాను ఉంచుకుంటాడని చెప్తూ భక్తుని దేహాన్ని ఇంటితో పోల్చారు. ఇంటికి పరిశుద్ధిని పవిత్రతను చేకూర్చే పుణ్యాహవాచన క్రతువులో ప్రధానమైన కలశ పాత్రతో ఆ భక్తుని హృదయాన్ని పోల్చారు. ఈ హృదయ కలశం భక్తి అనే దారాలతో చుట్టబడాలిట. సంతోషమనే ఉదకంతో నింపబడాలిట. అటువంటి హృదయ కలశంలో శివుని పాదాలనే చిగురుటాకులు (మామిడి చిగుళ్ళు) ఉంచి పైన జ్ఞాన మనే టెంకాయ వుంచాలిట - శివస్మరణ అనే

మంత్రాలను ఉచ్చరించాలిట. అప్పుడు హృదయానికి పవిత్రత, పరిశుద్ధి, పాత్రత చేకూరుతుందట.

మైలగాని, పురుడు గాని వచ్చి ఇల్లు, ఇంటిలోని వారు అశౌచంగా వుంటే శుద్ధిరోజున తప్పకుండా విఘ్నేశ్వర పూజ చేసి, పుణ్యాహవాచనం చేసి ఆ కలశాల లోని పవిత్ర జలాన్ని ఇల్లంతా చల్లాలి. ఇంటిలోని వారి శిరస్సులపై కూడా చల్లాలి. అప్పుడు అశౌచం పోయి అంతా నిర్మలమవుతుంది. అలాగే - భక్తుడు తన హృదయంలోని మాలిన్యాన్ని తొలగించుకోవడానికి ఈ శ్లోకంలో చెప్పిన విధానాన్ని ఆచరించి శివనామంతో పవిత్రీకరణం చేసుకోవాలి.

### సంస్కృత శ్లోకము - 37

శ్లో. అమ్నాయాంబుధిమాదరేణ సుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తి రజ్జుసహితం కృత్వా మథిత్వా తతః ।
సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం
నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్య మాతన్వతే.

### అనువాద పద్యము

సీ॥ సుమనస్సులందరున్ సుగుణ సంపత్తితో
నలరుమదిని కవ్వమట్లు జేసి
రమ్య భక్తి యనెడి త్రాడు దానికి జుట్టి
వేద నీరధి ద్రిప్పు నాదరమున
కల్పవృక్షము వంటి కామేశ్వరా ! నిన్నె
కామధేనువు వంటి స్వామి ! నిన్నె
చింతామణిని బోలు శివశంకరా ! నిన్నె
శాశ్వత సుఖసుధా సాంబ ! నిన్నె

గీ॥ మోక్షలక్ష్మీశ్వరా భక్త రక్ష !నిన్నె
సోమసుందర శివ పరంధామ ! నిన్నె
బుద్ధి కోరెదు ఫలముగన్ పూర్ణ పురుష !
పొందగల్గిరి నిన్నె ఓ ఇందు మౌళి.

## టీక

సుమనస్సంఘాః = పండితబృందములు (దేవబృందములు), సముద్యత్ = గుణసముదాయముతో నొప్పుచున్న, మనః = మనస్సును, దృఢభక్తి రజ్జుసహితం = అచంచలభక్తి యనుత్రాడుతో గూడిన, మంథానం = కవ్వమునుగా, కృత్వా = చేసి, అమ్నాయాంబుధిం = వేదసముద్రమును, ఆదరేణ = ఆసక్తితో, మథిత్వా = తరిచి, తతః = దానివలన, సోమం = చంద్రుని, కల్పతరుం = కల్పవృక్షమును, సుపర్వసురభిం = కామధేనువును, చింతామణిం = చింతామణిని, ధీమతాం = బుద్ధికి సమ్మతమైన, నిత్యానందసుధాం = శాశ్వతానందప్రదమైన యమృతమును, నిరంతరరమాసౌభాగ్యం = అవిచ్ఛిన్న లక్ష్మీ సమృద్ధిని, ధీమతాం = బుద్ధిమంతులకు, కల్పద్రుమం = కల్పవృక్షము వంటివాడును, సుపర్వసురభిం = కామధేనువువంటివాడును, చింతామణిం = చింతామణివంటివాడును, నిత్యానందసుధాం = అమృతము వంటి నిత్యానంద స్వరూపుడును, నిరంతరమాసౌభాగ్యం = మోక్ష లక్ష్మీ సమృద్ధిరూపుడును నగు, సోమం = ఉమాసమేతుడగు పరమేశ్వరుని, అతన్వతే = విస్తరించి పొందు చున్నారు.

## తాత్పర్యము

దేవతలు మందర పర్వతమును కవ్వముగాజేసి, సముద్రమును మథించి- కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, చంద్రుడు మొదలగు వానిని సంపాదించినట్లు విద్వాంసులు తమ మనస్సును కవ్వముగాజేసి, భక్తియను త్రాడుగట్టి, వేదములనెడు మహాసముద్రమును మథించి, అందుండి

భక్తులకు కల్పతరువు, కామధేనువు, చింతామణులవంటివాడును, నిత్యానంద స్వరూపుడును, మోక్ష లక్ష్మీస్వరూపుడునగు సోమేశ్వరుని సాధించుచున్నారు.

## వివరణము

దేవతలు క్షీరసాగరాన్ని మథించినట్లే భక్తులు గూడా వేదమనే పాలకడలిని మథించాలిట. ఇందుకు భక్తితో కూడిన మనస్సును కవ్వంగా ఉపయోగించి మథించాలిట. అంటే, వేదవాఙ్మయాన్ని క్షుణ్ణంగా చదువుకోవాలని అర్థం. ఎందుకంటే - ఆ వేదవాఙ్మయంలో సూక్ష్మంగా అంతస్సూత్రంగా ప్రతిపాదింపబడేది భగవంతుడైన శివుడే కాబట్టి. క్షీరసాగరమథనం జరిపినపుడు దేవతలకు లభించిన కామధేనువు, కల్పవృక్షము, చింతామణి లాంటి శివుడు వేదవాఙ్మయమథనం ద్వారా లభిస్తాడుట. చిట్టచివరకు ఏ భక్తునికైనా దక్కాల్సిన మోక్ష సామ్రాజ్యలక్ష్మిని గూడా ఈ వేద వాఙ్మయ మథనం ద్వారానే పొందవచ్చు అని సూచించారు.

## సంస్కృత శ్లోకము - 38

శ్లో. ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నశ్శివ
సోమస్సద్గణ సేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః ।
చేతఃపుష్కరలక్షితో భవతి చే దానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తిస్తదా జాయతే ॥

## అనువాద పద్యము

సీ॥ పూర్వ జన్మాంతర పుణ్యపూర్వాచల
మ్మందునన్ నిండుగా నందువాని
శ్రీ సుధామూర్తిని శివసరూపమువాని
స్వచ్ఛప్రసన్నాక్ష బలమువాని
సుజన తారాగణ భజనమందెడువాని
హరిణ మృగముఁ దాల్చినట్టివాని

పూర్ణకలా పరిపూర్ణత గలవాని
హృదయగగనమందు మెదలువాని
గీ॥ తామసాంతకుడగునట్టి సోమునిగన -
శాశ్వతానంద పాదోఽధి సొరుతోడ
సుమసుగంధ ప్రవృత్తితో సుమన సాంత
రంగమందలి చిత్తముప్పొంగుచుండు.

## టీక

ప్రాక్పుణ్యాచల = పూర్వజన్మమందలి పుణ్యముల గుట్టయొక్క; తూర్పు దిక్కుననుండు పుణ్యకరమైన పర్వతము (ఉదయగిరి) యొక్క; మార్గ = మార్గమున, దర్శిత = చూపబడిన, సుధామూర్తిః = అమృత శరీరము (అమృతమయమగుబింబము) కలవాడును, ప్రసన్నః = స్వచ్ఛమైన వాడును, శివః = ఆనందస్వరూపుడును (ఆహ్లాదకరమైనవాడు), సద్గణసేవితః = సజ్జన సమూహముచే బూజింపబడువాడును (నక్షత్రగణముచే జుట్టుకొన బడినవాడు), మృగధరః = లేడినిదాల్చినవాడును, పూర్ణః = అంతటను నిండిన వాడును (షోడశకలాపరిపూర్ణుడు), తమోమోచకః = అజ్ఞానము (చీకటి) బాపువాడును (అగు), సోమః = ఈశ్వరుడనుచంద్రుడు, ప్రాగల్భ్యేన = ప్రౌఢిమచేత, చేతః పుష్కరలక్షిః = హృదయాకాశమందు చూడబడినవాడును, భవతిచేత్ = అగునేని, ఆనంద పాథోనిధిః = ఆనందసముద్రము, విజృంభతే = ఉప్పొంగుచున్నది. తదా = అప్పుడు, సుమనసాం = సంస్కరింపబడిన చిత్తము గలవారలకు, వృత్తిః = (ఓలలాడవలయునను) ప్రవృత్తి, జాయతే = కలుగుచున్నది.

## తాత్పర్యము

పూర్వపుణ్యమనెడి పర్వతము యొక్క మార్గమున (తూర్పుదిక్కున గల పుణ్యోదయ పర్వతము మీదుగా) కనబరచునట్టి అమృతమయమైన ఆకృతి గలవాడును, నిర్మలుడును సజ్జనులచే సేవింపబడువాడును, లేడిని ధరించిన

వాడును, పూర్ణుడును (కళలునిండిన వాడు లేక అంతటానిండివున్నవాడు), చీకటి (పెంజీకటిని) పారద్రోలు వాడును అగు శివుడు అనెడి చంద్రుడు హృదయమనెడి ఆకాశమున చూడబడిన వాడైనచో ఆనంద మనెడి సముద్రము మిక్కిలి ప్రబోధ ప్రతిభతో ఉప్పొంగి వెల్లువగును. అప్పుడు శుద్ధాంతరంగులగు విబుధుల చిత్తము రంజిల్లును.

## వివరణము

క్రిందటి శ్లోకంలో వేదవాఙ్మయ మథనం ద్వారా భగవద్దర్శనము, మోక్షము సంప్రాప్తిస్తాయి అని చెప్పిన శంకరులు ఈ శ్లోకంలో ఆ భగవంతుడైన శివుణ్ణి చంద్రునితో పోల్చారు. హృదయమనే ఆకాశంలో శివుడనే చంద్రుడు స్థిరపడితే ఆనందమనే వెన్నెల సముద్రం ఉప్పొంగిపోతుందట !

ఈ ఆనందస్థితి చేకూరినవారి బ్రతుకే బ్రతుకుట ! ఈ ఆనందం దక్కాలంటే వేదశాస్త్ర పఠనాదులచే మనస్సు సంస్కరింపబడాలని సూచించారు. ఎన్నో జన్మల ద్వారా సంక్రమించిన సుకృత ఫలం ద్వారానే ఈ స్థితి సంప్రాప్తిస్తుందని ఈ శ్లోక భావన.

## సంస్కృత శ్లోకము - 39

శ్లో. ధర్మో మే చతురంఘ్రికః స్సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతః ।
జ్ఞానానందమహోషధి స్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతం సే స్థితే.

## అనువాద పద్యము

సీ॥ సర్వపూజ్యుండగు చంద్రశేఖర రాజు
నామానస కమలనగరమందు
కమనీయ మైనట్టి కైవల్యనాథుడై
స్వచ్ఛపాలనమును సలుపుచుండ-

నాల్గు పాదమ్ములు కల్గిన ధర్మమ్ము
ఇంపగు విధి నాచరింపబడియె
పాపమ్ము నాశమై లోపలిరిపులైన
లోభకామాదులు లోపమొంది
గీ॥ సర్వకాలములను సుఖశాంతులుండి
జ్ఞాన సాధనౌషధ ఫలసాయముండి
నిత్య సుఫలిత సిద్ధియే సత్యమగుచు
నిలిచె నా చిత్త రాజ్యమ్ము నికరమగుచు.

## టీక

రాజావతంసే = చంద్రుడు శిరోభూషణముగా గలవాఁడును (రాజశ్రేష్ఠుడును), మాన్యే = సర్వపూజ్యుఁడును (సర్వసమ్మతుడును) అగు శివుడు (రాజు), మే = నా యొక్క, మానసపుండరీకనగరే = కమలము వంటి మనస్సనియెడు నగరమందు, కైవల్యనాథే = కైవల్యముతో గూడిన ప్రభువై, స్థితే = ఉండఁగా, చతురంఘ్రికః = నాలుగుపాదములు గలిగిన, ధర్మః = ధర్మము, సుచరితః = సుఖముగా నాచరింపబడినది. పాపం = పాపము, వినాశం = నాశమును, గతం = పొందినది. కామక్రోధమదాదయః = కామము క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము ననునవి, నిగళితాః = తొలగిపోయినవి, కాలాః = పక్షము మాసము సంవత్సరము మొదలగు కాలములు, సుఖావిష్కృతః = సుఖమును ప్రకటించుచున్నవి. జ్ఞానానంద = జ్ఞాన సాధన గ్రంథబాహుళ్య మనియెడు, మహౌషధిః = సిద్ధి సాధనమయిన యోషధి, సదా = ఎల్లవేళలను, సుఫలితా = చక్కగా ఫలించినది. భవతి = అగుచున్నది.

## తాత్పర్యము

ధార్మికుడైన రాజు స్వతంత్రుడై నగరమందుండి పరిపాలించుచుండగా

దోషములు పోయి భూమి ఫలవంతమై సర్వసమృద్ధి గలిగినట్లు నా హృదయ పుండరీకమందు పరమేశ్వరుడు మోక్షాధినాథుడై నివసించియుండ నాకు అరిషడ్వర్గము తొలగిపోయి, జ్ఞాన సాధనములనెడు ఓషధులు ఫలించి సదా సుఖము గల్గినది.

## వివరణము

హృదయంలో భగవంతుడైన శివుడు ఉన్నపుడు మాత్రమే ఆ భక్తుని **జీవితం ఆనంద** భరిత మౌతుందిట. రామరాజ్యంలాగా వర్ధిల్లుతుందిట. ఇదే విషయం భగవద్గీత చివరి శ్లోకంలో చెప్పబడింది. యోగేశ్వరుడైన కృష్ణుడు, ధనుర్ధారి యైన అర్జునుడు కలిసి ఎక్కడ ఉంటారో – అక్కడ తప్పకుండా విజయం, విభూతి, వైభవము, ధర్మము, నీతి వుంటాయిట. ద్వాపర యుగంలోని కృష్ణుడు, ధనుర్ధారి అయిన అర్జునుడు కలిసి ఉన్న రూపమే అంతకు పూర్వకాలంలో 'పినాకపాణి' అయిన 'శివుని'గా వూహించుకుంటే – ఎక్కడ శివుడు వుంటాడో అక్కడల్లా సుఖశాంతులు, విజయానందాలు, నీతి ధర్మము వర్ధిల్లుతాయి అని చెప్పుకోవచ్చును. ఎందుకంటే – హృదయంలో యోగ మూర్తి అయిన శివుని వలన అంతశ్శత్రువులైన కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాదులు నిర్మూలింపబడి శాశ్వతానందం చేకూరుతుంది కాబట్టి.

## సంస్కృత శ్లోకము - 40

శ్లో. ధీయంత్రేణ వచోఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై
రానీతై శ్చ సదా శివస్య చరితాంభోరాశిదివ్యామృతైః ।
హృత్కేదారయుతాశ్చ భక్తికలమా స్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవ న్విశ్వేశ భీతిః కుతః ॥

## అనువాద పద్యము

సీ॥ నీ చరిత్రంబను నీరధిలోగల
ఉత్కృష్టమైన పీయూషజలము

కమనీయమైనట్టి కవితాదులనియెడి
కుల్యోపకుల్యాది కూర్పువలన
నాదు వాక్కనియెడి నజ్జరైన ఘటముతో
ధీశక్తి యను మోట తిరుగుచుండ
ఎదయను పొలములో పదునుగా ప్రవహించి
భక్తి సస్యము ఫలవంత మయ్యె

గీ॥ శాశ్వతానందసుఖదాత ! విశ్వనాథ !
నీ చరణ సేవ సేయంగ నిల్వనిచట
భార దుర్భిక్ష జనిత మౌ భయము తొలగి
పోవుచుండగ నాకేల పుట్టుదిగులు ?

## టీక

హేభగవన్ = షడ్గుణైశ్వర్య సంపన్నుడవైన, హేవిశ్వేశ = సకలభువనాధిపతీ, ధీయంత్రేణ = బుద్ధియనుమోటతో, వచోఘటేన = వాక్కనుబొక్కెన (బాల్చీ) చేత, కవితాకుల్యోపకుల్యాక్రమైః = కవిత్వమనియెడు కాలువలు పిల్లకాలువలు మొదలగువానిగుండా, ఆనీతైః = (హృదయ మనుపొలములోన) తేబడిన, సదాశివుని = శివుని యొక్క, చరితాంభోరాశి = చరిత్రలనెడు జలధి యొక్క దివ్యామృతైః = మంచినీళ్ళచేతను, హృత్కేదారయుతాః = హృదయం బనుపొలమున బుట్టియున్న, భక్తికలమాః = భక్తియను వరిపైరులు, సాఫల్యం = పంటను, ఆతన్వతే = విస్తరించుచున్నవి. సేవకస్య = నీసేవకుడనగు, మమ = నాకు, దుర్భిక్షాత్ = కఱవువలన, భీతిః = భయము, కుతః = ఎక్కడిది ?

## తాత్పర్యము

హే భగవాన్ శివా! నీ చరిత్రయను మహాసముద్రములోని దివ్యామృతము కవిత్వమను కాలువలు పిల్లకాలువలు మొదలగు వాని గుండా వాక్కనెడు

బొక్కెనతో నాబుద్ధియను మోటవలన హృదయమను పొలములోనికి ప్రవహించి భక్తి యను సస్యమును ఫలవంతముగా చేయుచున్నది. ఇంక ఎంత కఱవు వచ్చినను నాకేమి భయము?

## వివరణము

దక్కవలసినవి పొందవలసినవి దక్కనపుడు, పొందనపుడు ఇంక అవి దక్కవేమో, పొందలేమేమో అనే భయం పట్టుకుంటుంది. ఈ భయం కఱవులాంటిది. కఱవు వలన భయం కలగకుండా వుండాలంటే పుష్కలమైన తిండి గింజలకు సంబంధించిన పంటపండాలి. అలాగే పొందలేమేమో అనే భయం పోవాలంటే భగవంతుని అనుగ్రహం హృదయం నిండా పండాలి. భగవంతుని గురించి తెలుసుకున్న కొలదీ ఆయన అనుగ్రహానికి దగ్గఱౌతాము. అంటే భగవచ్చరిత్రలు సమగ్రంగా తెలుసుకుని ఆనందించాలి. హృదయం నిండా ఆనందం పండటానికి అన్నీ ఏర్పాటయే ఉన్నాయని శంకరులు చెబుతున్నారు. బుద్ధి ఏతంలాగా పనిచేస్తే, వాక్కులు ఏతపుకుండల్లాగా పనిచేస్తున్నాయట. ఈ వాక్కులనే కుండలతో కవిత్వమనే పిల్లకాలువల మార్గం ద్వారా శివుని చరిత్రలనే మహా నీరధి నుండి బయలుదేరిన నీరు హృదయం అనే వరిమడిని తడిపి సస్యశ్యామలం చేసి భక్తి అనే 'రాజనాల' జాతి వరి ధ్యాన్యాన్ని పండిస్తున్నాయిట. ఇంక నా హృదయం నిండా ఆనందమనే ఆహారపు పంట ఉంటే – నా మనుగడకు కఱవు అనే భయం ఎక్కడ వుంటుంది అని అంటున్నారు – ఈ శ్లోకంలో శంకరులు.

## సంస్కృత శ్లోకము - 41

శ్లో. పాపోత్పాతవిమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్ర ధ్యాన నతి ప్రదక్షిణ సపర్యాలోకనాకర్ణనే ।
జిహ్వా చిత్తశిరోఽంఘ్రిహస్తనయనశ్రోత్రై రహం ప్రార్థితో
మా మాజ్ఞాపయ తన్ని రూపయ ముహు ర్మామేవ మామేఽవచః ॥

## అనువాద పద్యము

సీ॥ పాపమ్ములనియెడు దుత్పాతంబులను బాప
ఇష్టసంపదలన్ని యినుమడింప
చిత్రస్తుతులఁ జేయ జిహ్వేంద్రియమ్మును
ధ్యానమ్ముకొఱకు నా మానసమును
కోరి ప్రదక్షిణల్ కూర్మిసేయ పదముల్
సేవించుటకు గాను చేతిజతయు
ఆలోకనా క్రియ కక్షిద్వయమ్మును
కథలనాకర్ణింప కర్ణములును

గీ॥ నిన్ను గొల్వంగ నిరతమ్ము నన్ను గోరు
ఆజ్ఞలిచ్చుచు మృత్యుంజయాఖ్యనీవు
అటులె జేయంగ బురిగొల్పు సాంబ నన్ను
ముంగిగా మాత్రమెపుడు చేయంగవలదు.

## టీక

హేమృత్యుంజయ = మృత్యువును జయించినవాడా, పాపోత్పాత విమోచనాయ = పాపమనుఉత్పాతమును బాపుట కొఱకును, రుచిరైశ్వర్యాయ = ఇష్టమైన యైశ్వర్యము కొఱకును, స్తోత్ర = (నిన్ను) స్తోత్రము చేయుట, ధ్యాన = (నిన్ను) ధ్యానించుట, నతి = (నీకు) నమస్కారము చేయుట, ప్రదక్షిణ = (నీ) ప్రదక్షిణము చేయుట, సపర్యా = (నీ) పూజసేయుట, ఆలోకన = (నిన్ను) జూచుట, ఆకర్ణనే = (నీకథలు) వినుట – వీని విషయమై, జిహ్వా = నాలుకచేతను, చిత్త = మనస్సు చేతను, శిరః = శిరస్సు చేతను, అంఘ్రి = పాదములచేతను, హస్త = చేతులచేతను, నయన = కన్నుల చేతను, శ్రోత్రైః = చెవులచేతను, అహం = నేను, ప్రార్థితః = ప్రార్థింప బడితిని. మాం =నన్ను, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము (అట్లు చేయుమని శెలవిమ్ము),తత్ =

షష్ఠ్యోత్రాదికమును గూర్చి, మాం = నన్ను, ముహుః = మాటిమాటికి, నిరూపయ = పురికొల్పుము, మే = నాకు, అవచః = మూగతనము, మైవ = కలుగనీయకుము.

## తాత్పర్యము

పరమేశ్వరా! పాపములు నశించి ఇష్టములు సిద్ధించుటకు పరమేశ్వరుని స్తుతింపుమని నాలుకయు, ధ్యానింపుమని మనస్సును, నమస్కరింపుమని శిరస్సును, ప్రదక్షిణము చేయుమని పాదములును పూజింపుమని చేతులును, చూడుమని కన్నులును, కథలు వినుమని చెవులును నన్ను కోరుచున్నవి. నీయాజ్ఞ లేనిదే ఆకోరిక నెరవేర్పలేను. అట్లు చేయుటకు నన్ను పురిగొల్పుము. మూగతనము, మతిలేనితనము, కుంటి గ్రుడ్డి తనము మొదలగునవి నాకు రాకుండజూడుము.

## వివరణము

శ్లో. పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః,
న పాపఫల మిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః

పుణ్య కార్యాలను చేయడం ఇష్టం లేకపోవచ్చు గాని పుణ్య కార్యాలు చేసినందువల్ల వచ్చే ఫలితం మాత్రం పొందాలని కోరుకుంటారుట. కాని, పాపం విషయంలో అలా కాదుట. పాపఫలం రాకూడదు అనుకుంటారు. కానీ, ప్రయత్న పూర్వకంగా పాపాలు చేస్తారుట. ఇది సగటు మానవుని లక్షణం. దీన్ని బట్టి మానవుడిది ఎంత స్వార్థ బుద్ధో తెలుస్తుంది.

పాపకార్యం చేస్తే పాపం వస్తుందని, పుణ్యకార్యం చేస్తే పుణ్యం వస్తుంది అనుకోవడం గూడా అంత సమంజసం కాదు. ఒకడు చండీయాగం చేసాడు. అది పుణ్యకార్యమే. కాని, తన ఉన్నతపదవికి అడ్డం వచ్చే అభ్యర్థి చనిపోవడానికి సంకల్పించి చేశాడు. కాబట్టి పాపమే ఔతుంది. కాబట్టి, పుణ్యకార్యం చేసినా ఉద్దేశ్యం చెడ్డది కాబట్టి శిక్ష తప్పదు. అలాగే తలారివాడు ఉరి శిక్ష వేసిన

వాడి తలను వధ్యశిల వద్ద వధించాడు. పైకి ఇది పాప కార్యం లాగా అనిపిస్తుంది కాని, అలా చెయ్యాలని అతనికేమీ సంకల్పం లేదు. అలా చెయ్యమని ప్రభుత్వము వారు తనకు 'డ్యూటీ' వేశారు. అంతే – దాని ప్రకారము మాత్రమే అతను వధించాడు. అందువల్ల ఇది డ్యూటీ నిర్వర్తించినట్లవుతుంది కాని పాపం చేసినట్లు కాదు. అందుకని పైకి ఇలా చెయ్యడం 'పాపం' అనిపించినా శిక్ష వుండదు. పాప పుణ్యకార్యాలు అందుకు వేసే శిక్షలు ఇలా నిర్ణయింపబడతాయి.

పాపం చెయ్యడం వల్ల వచ్చే ఉత్పాతాలు రెండు రకాలు. ఒకటి ధర్మశాస్త్ర విరుద్ధమైన కార్యాలు చెయ్యడం వల్లవచ్చేవి అయితే – రెండు ధర్మశాస్త్రం విధించిన కార్యాలను చేయకపోవడం వల్లవచ్చేవి. దీన్ని బట్టి పాపం చెయ్యడం వలన మాత్రమే పాపం రాదు. ధర్మాన్ని చెయ్యకపోయినా పాపం వస్తుంది. పాపపుణ్యాల విషయంలో అవగాహన చాలా అవసరం. పాపం చెయ్యడం వలన ఉత్పాతాలు, ఉపద్రవాలు వస్తాయి. అంటే తనకు సంబంధించి – మూగతనం, చెవిటితనం, కుంటితనం, గ్రుడ్డితనం, పక్షపాతం మొదలైనవి వస్తాయి. పూర్వం చేసిన పాపాలకు ప్రస్తుత జన్మలో ఇలాంటివి వస్తున్నాయి. ప్రస్తుత జన్మలో అయినా పాపాలు చెయ్యకుండా వుంటేనే కాని వచ్చే జన్మలో ఇవి రాకుండా వుండవు. మన దేహానికి వున్న ఉపకరణాల ద్వారా మంచి పనులు చెయ్యాలి. భగవదనుగ్రహం పొందాలి. అందుకని చేతులతో చెయ్యవలసిన ధర్మ కార్యాలను చేతులతోను, ఇంకా ఇతర పంచేంద్రియాలతో పాడు పనులు చెయ్యకుండా మంచి పనులు జరిగే విధంగానే వాటిని వినియోగిస్తూ, మిగిలిన కాలంలో భగవంతునిస్తుతిస్తూ, చేతుల్తో పూజ చేస్తూ, మనస్సులో ధ్యానిస్తూ, చెవులతో భగవచ్చరిత్రలు వింటూ వుండాలి.

## సంస్కృత శ్లోకము - 42

శ్లో. గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః ।
విద్యా వస్తుసమృద్ధి రిత్యఖిల సామగ్రీ సమేతే సదా
దుర్గాతిప్రియ దేవ మామకమనోదుర్గే నివాసం కురు ॥

## అనువాద పద్యము

సీ॥ గాంభీర్యముద్రను కందకమ్మట్లుగా
గట్టి ధైర్యమ్ముఁ బ్రాకార సరణి
ఉదయించుచున్న సహృదయగుణమ్ములు
తలమానికమ్మగు బలము సరణి
నా దేహమందలి జ్ఞానేంద్రియమ్ములు
రాకపోకలకు ద్వారములసరణి
ఈశ్వరాయత్తమౌ శాశ్వత జ్ఞానమే
సర్వపదార్థ సంచయము సరణి.

గీ॥ యుండి దుర్గమ్మునకు వలయు సకల శుభ
లక్షణ సమన్వితమునైన రక్షనిచ్చు
నా మనో దుర్గమందుమానాథ ! వాస
ముండు మెపుదు దుర్గాప్రియా ! నిండుదయను

## టీక

హేదుర్గాతిప్రియ = పర్వతదుర్గమందు మిగుల ప్రీతిగలిగిన, హేదేవ = ఓ పరమశివుడా, పరిఖాపదం = అగడ్తకు లక్షణమయిన, గాంభీర్యం = గాంభీర్యము (లోఁతు)ను, ఘనధృతిః = దిట్టమైన ధైర్యము, ప్రాకారః = కోటగోడయును, ఉద్యద్గుణస్తోమః = పుట్టుచున్న సద్గుణపుంజము, ఆప్తబలం = నమ్మకమైన బలమును, దేహస్థితః = శరీరమందున్న, ఘనేంద్రియ చయః = కన్ను మొదలగు నింద్రియములు, ద్వారాణి = రాకపోకలకు ద్వారములును, విద్యా = ఈశ్వరుని గుఱించిన జ్ఞానము, వస్తుసమృద్ధిః = పదార్థ సంపత్తియును, ఇతి = ఇట్టి, అఖిలసామగ్రీసమేతే = దుర్గమునకు గావలసిన పదార్థములన్నియు సమగ్రముగానున్న, మామకమనోదుర్గే = నామనస్సను దుర్గమందు, సదా = ఎప్పుడును, నివాసం = నివాసము, కురు = చేయుము.

## తాత్పర్యము

దుర్గమంబగు కైలాస పర్వతమున ప్రీతితో నివసించుచున్న దేవా! గాంభీర్యమును అగడ్తగను, ధైర్యమును ప్రాకారముగను, ఉదయించు సుగుణములను బలముగను, చక్షురాదింద్రియములను ద్వారములగను, పరమ శివజ్ఞానమును సకల పదార్థ సంపదగను గలిగి, నామనస్సు ఒక దుర్గము (కోట) నకు ఉండవలసిన అన్ని లక్షణములతో సమగ్రముగానున్నది. దుర్గప్రియుండవుగాన నీవిందు నివసింపుము.

## వివరణము

తన మనస్సు అనే గట్టి కోటలోనే స్థిరంగా సౌఖ్యంగా ఉండి పొమ్మని శంకరులు శివుణ్ణి ప్రార్థిస్తున్నారు. నా మనస్సులోపల ఏమున్నదో విప్పి చెప్పితే గాని తెలియదు. అంత గంభీరమైంది అంటే – అంతలోతైంది. కోటకు అగడ్త ఎలాంటిదో నా మనస్సుకు ఈ లోతు లక్షణం అలాంటిది. పైగా ఈ చిత్తంలోనే స్వప్నావస్థలో ఆకాశంతో సహా పంచ భూతాలన్నిటినీ చూడవచ్చు. అందువల్ల ఆకాశం కంటె గూడా నా మనస్సే గొప్పది. నా మనస్సు పరిస్థితులకు లొంగిపోనిదై, మారిపోనిదై ధైర్య, స్థైర్య గుణాలు కలిగి వుంటుంది. కోటకు ప్రహరీ ఎలా పనిచేస్తుందో నా మనస్సుకు ఈ ధైర్యగుణం అలా పనిచేస్తుంది. కోట లోపల నమ్మదగ్గ సైన్యం వున్నట్లే నా మనస్సులో గూడా దైవీ గుణాలు చాలా వున్నాయి. కోటకు వాకిళ్ళు ఉన్నట్లే నా మనస్సుకు గూడా పంచజ్ఞానేంద్రియాలున్నాయి. కోటలో అవసరమైన పదార్థ సంపత్తి వున్నట్లే నా మనస్సులో కూడా అర్థవంతమైన విద్యోపాసన వుంది. ఈ విధంగా నా మనస్సు అన్ని విధాలా సౌకర్యాలతో దృఢంగా వుండే కోటలాగా వున్నది కాబట్టి వేరే కోట కట్టే ప్రయత్నం చెయ్యనక్కరలేదు. ఓ శివా ! ఇంక ఆలస్యం చెయ్యకుండా అందులో ప్రవేశించి స్థిరంగా ఉండి పోవయ్యా అని – ప్రార్థిస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 43

శ్లో॥ మా గచ్ఛస్త్వమితస్తతో గిరిశ భో మయ్యేవ వాసం కురు
స్వామిన్నాదికిరాత మామకమనః కాంతార సీమాంతరే ।
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్య మోహాదయ
స్తాన్హత్వామృగయా వినోద రుచితాలాభంచ సంప్రాప్స్యసి ॥

## అనువాద పద్యము

సీ॥ ఆది కిరాతా ! మహాప్రభో ! హే స్వామి !
కైలాసవాస ! శంకర ! కపర్ది !
ఇటుగాని అటుగాని ఎటుగాని పోకుమా
సుందరాకార ! ఓ శూలపాణి !
నా మనస్సనెడి కాననమందు వసించి
గర్వమ్ముతో గూడి గట్టివైన
మాత్సర్య మోహాది మన్యంపు మృగములు
లెక్కలేకుండగన్ చక్క దిరుగు

గీ॥ సంహరించుచు వానిని చక్కగాను
వేటలో గల యానంద పాటవమును
సూటిగా నీవు సుఖములో మేటి రీతి
పొందగలవయ్య పశుపతీ ! పూర్ణముగను.

## టీక

హే ఆదికిరాతా = ఓ ఆదికిరాతమూర్తీ ! భోగిరీశ = ఓ కైలాసవాసా! స్వామిన్ = మహాప్రభో ! త్వం = నీవు, ఇతస్తతః = ఇటునటు, మాగచ్ఛః = పోకుము. మయ్యేవ = నాయందే, వాసం = నివాసమును, కురు = చేయుము. మామకమనః కాంతారసీమాంతరే = నాహృదయమను అరణ్య ప్రాంతమున; మదజుషః = (మమ్మెవ్వరును జయింపలేరను) గర్వముతోగూడిన, మాత్సర్య

మోహాదయః = మాత్సర్యము, మోహము మొదలగు, మృగాః = అడవిమృగములు, బహుశః = అనేకములుగా, వర్తంతే = తిరుగుచున్నవి. తాన్ = వానిని, హత్వా = చంపి, మృగయావినోదరుచితాలాభంచ = వేటతో కాలముగడపుటయందలి కోరిక యొక్క ఫలితమును, సంప్రాప్స్యసి = పొందగలవు.

## తాత్పర్యము

ఓ ఆది కిరాతమూర్తీ! నీ వెందునుబోక నామనస్సునందే యుండుము. నామనస్సొక మహారణ్యము. అందు కామక్రోధాదులను క్రూర మృగములనేకమున్నవి. వానిని వేటాడి వేట యందలి నీ యానందమును దీర్చుకొనుము.

## వివరణము

శివుడు ఆది భిక్షువేకాదు. అది కిరాతకుడు కూడా ! అందుకని శివునికి మృగాలను వేటాడి ఆనందించడం అంటే ఇష్టముంటుంది. అయితే ఇలా మృగాలను వేటాడాలంటే దూరంగా ఉండే కారడవులకు వెళ్ళాలి. అది ఎంతో వృథా ప్రయాసలతో కూడుకున్న పని. అందుకని శంకరులు శివునికి ఒక చక్కని ఉపాయం చెబుతున్నారు. క్రిందటి శ్లోకంలో కోట లాగా వుండే తన మనస్సులో ప్రవేశించు అని ప్రార్థించారు. ఈ శ్లోకంలో మృగాలను వేటాడి వినోదించడానికి చాలా అనువుగా అనుగుణంగా తన మనస్సనే అరణ్యం వుందంటున్నారు.

అరణ్యంలో చెట్లూ చేమలూ దట్టంగా వున్నట్లే తన మనస్సు కూడా ఆవేశకావేశాలు, ఉద్రేకాలు, ఆలోచనలు అనే చెట్లూ చేమలతో దట్టంగా పేరుకు పోయి ఉన్నదిట ! అరణ్యంలో లెక్కలేనన్ని క్రూరమృగాలున్నట్లే తన మనస్సనే అరణ్యంలో గూడా కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాది మృగాలు వున్నాయిట! అరణ్యం సూర్యకిరణాలు కూడా ప్రవేశించలేనంత దట్టంగా వుంటుంది. అలాగే

తన మనస్సు కూడా వివేక విజ్ఞాన ప్రకాశం లేకుండా – అవిద్య అనే పెంజీకటితో నిండి వుంటుందిట. అంటే – అరణ్యానికి వుండవలసిన అన్ని లక్షణాలు తన మనస్సుకు ఉన్నాయి కాబట్టి అనవసరంగా ముసలి ఎద్దును ఎక్కి ప్రయాసపడి దూరంగా ఉండే అరణ్య ప్రవేశం చేయనక్కరలేదుట. తన మనస్సు అనే అరణ్యం సిద్ధంగా వుంది వెంటనే ప్రవేశించి మృగాల వేటలో వినోదాన్ని పొందు అంటున్నారు. అంటే మనస్సులోనే ఎప్పుడూ శివుడు వుండిపోవాలి. ఆ మనస్సుని శివుడు ఎలా వినియోగపరచుకోవాలనుకున్నాడో అందుకు తగిన విధంగా వసతులు కల్పించాలి. అని అర్థం.

## సంస్కృత శ్లోకము - 44

శ్లో. కరలగ్న మృగః కరీంద్రభంగో
ఘనశార్దూలవిఖండనో ऽ స్తజంతుః ।
గిరిశో విశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖో ऽ స్తి మే కుతో భీః ॥

## అనువాద పద్యము

సీ॥ చేతిలోన మృగము చెల్లిన వాడును
కరిరాక్షసుని భంగపఱచువాడు
ఘనమైన వ్యాఘ్రాసురుని బలము మిగుల
ఖండమ్ముగావించు మెండువాడు
ఘనజంతు జీవముల్ తనయందు లీనమై
మిన్నగా వానిపై నున్నవాడు
పర్వతశాయియై వపుషమ్ము విశదమై
తెల్లని కాంతులు జల్లువాడు

గౌ॥ పంచముఖములు గల గట్టివాడునైన
పరమ శివుడను సింహమ్ము స్థిరముగాను
కూరుచుండగ నా చిత్త కుహరమందు
ఎక్కడెవరితో యింక నాకేమి భయము ?

## టీక

కరలగ్న మృగః = చేతనిమిడిన మృగముగలవాఁడును, కరీంద్ర భంగః = గజాసురుని భంగపరచిన వాడును (ఏనుఁగులజంపునదియు), ఘన శార్దూలనవిఖండనః = ప్రబలుడైన వ్యాఘ్రాసురుని ఖండించినవాడును (పెద్దపులుల జంపినదియు), అస్తజంతుః = తనయందు లీనమగు ప్రాణికోటిగలవాడును (జంతువులనిరసించునదియు), గిరిశః = పర్వతమందు శయనించువాడును, విశదాకృతిః = తెల్లని శరీరకాంతిగలవాడును, పంచముఖః = అయిదు ముఖములు గలవాడును (తెఱువబడిన ముఖముగలదియు) నగు పరమేశ్వరుడను సింహము, మే = నా యొక్క చేతఃకుహరే = చిత్తమను గుహయందు, అస్తి = కలదు, మే = నాకు, భీః = భయము, కుతః = ఎక్కడిది?

## తాత్పర్యము

చేతియందు మృగముగలవాడును, గజాసురుని సంహరించిన వాడును, ఘనుడైన వ్యాఘ్రాసురుని ఖండించినవాడును, అంతమును పొందిన ప్రాణిసముదాయముగలవాడును, తెల్లని శరీరముగలవాడును, కొండయందు నివశించువాడును అగు పంచముఖుడు (శివుడు) నాహృదయమను గుహయందు విరాజిల్లుచున్నాడు. ఇంక నాకేభయమునులేదు.

## వివరణము

'శివుని కుండే లక్షణాలన్నీ సింహానికీ బాగా చెల్లుతాయి అని, అటువంటి శివుడు అనే సింహం నా హృదయమనే గుహలో ఉండగా ఇంక నాకేం భయం' అని అంటున్నారు శంకరులు.

సింహం పంజా విసిరి లేడిని అవలీలగా పట్టుకుని వుంటుంది. అటువంటి లేడి (మృగం) శివుని చేతిలో గూడా వుందిట. (శివుడు మృగధరుడు కదా) సింహం ఏనుగుని చంపుతుంది. (మృగరాజు) శివుడు కూడా గజాసురుణ్ణి చంపాడు. సింహం పులిని కూడా చంపుతుంది. శివుడు కూడా వ్యాఘ్రాసురుణ్ణి

చంపాడు. సింహం కడుపులో ఎన్నో మృగాలుంటాయి. అలాగే శివుని కడుపునిండా స్థావర జంగమాత్మకమైన విశ్వం నిండి వుంటుంది. సింహం లాగే శివుడు కూడా కొండ మీద వుంటాడు. సింహం తెల్లగా వుంటుంది. శివుడు కూడా శుద్ధ స్ఫటిక వర్ణంలో (కర్పూర గౌరార్ధ శరీరకాంతితో) తెల్లగా వుంటాడు. సింహానిది పంచముఖం అంటే విశాలమైన నోరు కలది. శివుడు కూడా పంచముఖుడే! కాబట్టి సింహం లాంటి శివుడు నా హృదయంలోనే సదా నివసిస్తూ వుంటే ఎవరి వల్ల తనకు భయం వుంటుంది. చివరకు మృత్యువు వలన కూడా భయం వుండదు అని నిక్కచ్చిగా నమ్మకంతో చెప్పారు.

మనం కూడా శివుడి లాంటి పెద్దవారి అండ చూసుకుంటే ఎన్ని ఇబ్బందులు వచ్చినా ఆయన ఆదుకుని మనల్ని రక్షిస్తాడు. కాబట్టి మీరు కూడా ఎందుకు ఆ శివుణ్ణి హృదయంలో ప్రతిష్ఠించుకోకూడదూ ? అని సలహా ఇస్తున్నారన్నమాట !

## సంస్కృత శ్లోకము - 45

శ్లో. ఛందశ్శాఖిశిఖాన్వితైర్ద్విజవరైస్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలైర్దీపితే ।
చేతఃపక్షిశిఖామణే త్యజ వృథా సంచారమన్యైరలం
నిత్యం శంకరపాద పద్మయుగలీనీడే విహారం కురు. ॥

## అనువాద పద్యము

సీ॥ చిత్తమనియెడి ఓ శ్రేష్ఠ విహంగమా !
వేదమ్ములనియెడు వృక్షతతుల
శాఖాంతములతోడ సంబంధమైనట్టి
ద్విజసత్తములు సేవించునట్టి
నిండు సుఖమ్ముతో నిత్య నివాసమై
దివ్యామృత ఫలమందిచ్చునట్టి

ఖేదమ్మునంతను ఖేదింపగల్గుచు
మెండు వెలుగుతోడ నిండునట్టి

గౌ॥ అందమగు శివపాదారవిందయుగ్మ
మనెడి గూటిలో విహరింపు మనువుగాను
ఇతరమైనట్టి తావులందేమి ఫలము
చాలు ! విడుము నీవట్టి సంచారములను.

## టీక

హేచేతఃపక్షిశిఖామణే = మనస్సనియెడు పక్షి శ్రేష్ఠమా ! ఛందశ్శాఖిశిఖాః = వేదములనియెడు వృక్షముల యొక్క కొమ్మలచివరలతో (వేదాంతములతో), అన్వితైః = సంబంధించిన, ద్విజవరైః = బ్రాహ్మణశ్రేష్ఠుల (పక్షి శ్రేష్ఠముల) చేత, సంసేవితే = ఆశ్రయింపబడినదియు, శాశ్వతే = నిత్యమైనదియు, సౌఖ్యాపాదిని = సుఖముసంపాదించునదియు, సుధాసారైః = అమృత రసముగల, ఫలైః = ఫలములతో, ఖేదభేదిని = సంసార సుఖమును (ఆకలిని) పోగొట్టునదియు, దీపితే = ప్రకాశవంతమైన, శంకరపాదపద్మ యుగళీనీడే = ఈశ్వరుని యొక్క పాదపద్మద్వంద్వమను గూటియందు, విహారం = విహారమును, కురు = చేయుము. అన్యైః = ఇతరములతో, అలం = చాలును, వృథా = నిష్ఫలమైన, సంచారం = సంచారమును, త్యజ = విడువుము.

## తాత్పర్యము

ఓ మనస్సనెడుపక్షీ! ఇటునటు తిరిగి యేల శ్రమపడెదవు. పరమేశ్వరుని పాదద్వంద్వము ఒక చక్కనిపక్షిగూడు వలెనున్నది. దానికెన్నడును చలనములేదు. అందు మంచి వెలుతురుగలదు. అది మిక్కిలి సౌఖ్యమిచ్చును. అమృతఫలముగల్గి దుఃఖ నివారకమైయున్నది. అందు విహరించి యానందింపుము. అనేక ద్విజసత్తము లాయా శాఖాగ్రములకు సంబంధించియుండి దాని నాశ్రయించు చుందురు. నీవును ఇతరాశ్రయము వదిలి దానిని ఆశ్రయింపుము.

## వివరణము

ఇంతవరకు శివుణ్ణి వేటగానితోను, ఆది భిక్షువుగాను, సింహంగాను వర్ణిస్తూ వచ్చిన శంకరులు ఈ శ్లోకంలో మనస్సును ఒక పక్షిగాను, శివుని పాదార విందాలను ఆ పక్షి ఆశ్రయించవలసిన గూడు గాను వర్ణిస్తున్నారు.

పక్షి ఒక చోట స్థిరంగా వుండదు. ఎప్పుడూ అటూ ఇటూ తిరుగుతూనే వుంటుంది. తనక్కావలసిన ఆహారాదులు లభించేవరకు ఆ త్రిప్పట తప్పదు. మనస్సు కూడా స్థిరంగా వుండదు. (చంచలంహి మనః కృష్ణ - గీత) అన్ని విషయాలు, అందరి వ్యవహారాలు దీనికే కావాలి. తనక్కావలసినవి పొందే వరకు నానా తిప్పలు పడి సాధిస్తుంది. మెదడుకు కావలసిన మేత (జ్ఞానం)- అన్ని చోట్లకూ తిరగాల్సిన అవసరం లేకుండా స్థిరమైన ఒక చోటే లభిస్తే దాన్ని ఆశ్రయించడమే మేలు కదా ! అలాంటి గూడు లభిస్తే పక్షిమాత్రం ఎందుకు అలా నానా అగచాట్లు పడుతుంది. గూడునే ఆశ్రయించుకుని వుంటుంది. శివుని పాదార విందాలు సకల సౌభాగ్యాన్ని, సంపదను, జ్ఞానాన్ని, సుఖాన్ని ఇవ్వగలిగిన నివాసం లాగా ఉన్నప్పుడు - మనస్సనే పక్షి ఆపాదాలు అనే గూటినే ఆశ్రయిస్తే ఎంతో మేలు గదా ! పైగా పాదాలు ఆశ్రయిస్తే ఎలాంటి వారైనా కరిగిపోయి కాదనలేక ఆశ్రయమిస్తారు కూడా గదా ! అంటున్నారు.

## సంస్కృత శ్లోకము - 46

శ్లో. ఆకీర్ణే నఖరాజికాంతివిభవై రుద్యత్సుధావైభవై
రాధౌతే౽పి చ పద్మరాగలలితే హంసవ్రజై రాశ్రితే ।
నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు
స్థిత్వా మానస రాజహంస గిరిజానాథాంఘ్రి సౌధాంతరే ॥

## అనువాద పద్యము

సీ॥ గోటివరుస యొక్క మేటికాంతులతోడ
సాటిలేని ప్రభలు చాటునట్టి

వృద్ధి బొందుచునుండు విధు సుధాంశువులతో
నిండి స్వచ్ఛమ్ముగా నుండునట్టి
పద్మరాగ ప్రభావైభవమ్ములతోడ
పరమహంసాశ్రితావరణమైన
శైలజాపతి పాద సౌధాంతరమ్మునం
దతిరహస్యమ్ముగా నాదు కొనుచు
గీ॥ భక్తియను భార్యతో గూడి యుక్త విధిని
ఇష్ట సంచారమును జేయు మెల్లవేళ
చిత్రమైనట్టి నాలోని చిత్తమనెడి
హంసరాజమ ! నీ వట్టి హర్మ్యమందు.

## టీక

హేమానసరాజహంస = ఓమనస్సనురాజహంసమా ! నఖరాజి కాంతివిభవైః = గోటివరుసలయొక్క కాంత్యతిశయములచేత, ఆకీర్ణే = నిండియున్నదియు, ఉద్యత్సుధావైభవైః = దినదినము వృద్ధిబొందుచున్న చంద్రునియమృత కిరణములు వ్యాపించుటచే (సున్నపుపూతలచే), ఆధౌతే = శుభ్రపడినదియు, అపిచ = మఱియును, పద్మరాగలలితే = పద్మముల యొక్క యెఱుపువంటి యెఱుపుతో నొప్పునదియు (పద్మరాగమణులు చెక్కినదియు), హంసవ్రజైః = హంసమంత్రధాన్యపరుల సమూహములచేత (హంసల గుంపులచేత), ఆశ్రితే = సేవింపబడినదియు నగు, గిరిజానాథాంఘ్రి సౌధాంతరే = పార్వతీపతియొక్క పాదమనుమేడలోపల, రహసి = రహస్యమందు, భక్తివధూగణైస్సహ = భక్తియను భార్యలతోగూడ, నిత్యం = ఎప్పుడును, స్వేచ్ఛావిహారం = ఇష్టమైన సంచారమును, కురు = చేయుము.

## తాత్పర్యము

మనస్సనెడి రాజహంసమా! గోళ్ళవరుసకు సంబంధించిన కాంతి వైభవముతో కూడు కొనినదియు, ఉద్భవించుచున్న అమృతము వ్యాపించుటచే కడుగబడినదియు, పద్మములవంటి వన్నెతో ఇంపైనదియు, పరమహంసల గుంపులచే సేవింపబడునదియు అగు పార్వతీపతి యొక్క పాదమనెడి మేడయందు ఏకాంతమున భక్తిరూపములైన భార్యలతోగూడ నిరంతరము స్వేచ్ఛగా విహరింపుము.

## వివరణము

ఈసారి శివుని పాదారవిందాలను ఒక దివ్య సౌధంగా వర్ణించి, మనస్సనే రాజహంసను ఆ సౌధాన్ని ఆశ్రయించుకుని నిరంతరం స్వేచ్ఛగా విహరించమని సలహా ఇస్తున్నారు.

శివుని పాదాల గోళ్ళనుండి వచ్చే కాంతి నలుమూలలా ప్రసరించడం వలన పాదయుగళభవనం ఎప్పుడూ కావలసినంత వెలుగుతోను, వెలుతురుతోను విరాజిల్లుతూ ఉంటుందిట ! శివుని తలపై వున్న చంద్రుడు అమృతాన్ని స్రవిస్తూ నిత్యం ఆయన పాదాలను కడుగుతూ పరిశుభ్రతను చేకూరుస్తూ వుంటాడుట. ఆ పాదాలు పద్మాల అందాలను మించిన అందంతో వుంటాయిట. పరమ హంసలు (యుక్తాయుక్త వివేక జ్ఞానం సంపూర్ణంగా కలిగిన వారిని పరమహంసలంటారు) నిత్యం ఆ శివుని పాదాలను సేవిస్తూ వుంటాయిట. రకరకాల భక్తి పద్ధతులు అనే ఆడుహంసలను గూడా తోడు చేసుకుని అటువంటి శివుని పాదయుగళమనే దివ్య సౌధాన్ని ఆశ్రయించుకుని ఎందుకు సుఖంగా వుండకూడదు ? అని శంకరల సలహా (ఆ పరమహంసలలో శంకర భగవత్పాదులు గూడా వుంటారు గదా ! అటువంటి వారి సాన్నిధ్యం ఎంతో అదృష్టం ఉంటే గాని లభించదని గ్రహించి వెంటనే మానస హంసను శివపాదపరం చెయ్యాలి.)

## సంస్కృత శ్లోకము - 47

శ్లో. శంభుధ్యాన వసంతసంగిని హృదారామే౽ ఘజీర్ణచ్ఛదా
స్రస్తా భక్తిలతాచ్ఛటా విలసితా పుణ్యప్రవాళశ్రితాః ।
దీప్యంతే గుణకోరకా జపవచః పుష్పాశ్చ సద్వాసనాః
జ్ఞానానంద సుధా మరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః॥

## అనువాద పద్యము

సీ॥ పరమేశ్వరుని పాదపద్మ చింతనమను
వాసంత కాల సంప్రాప్తి చేత
నా డెందమనుతోట నలుమూలలందలి
అఘములనెడి పండుటాకులూడి
అందమ్ము లొల్కు ముత్యంపు వరుసలను
చిగురుటాకుల నెన్నొ మిగులc బొంది
మంచి గుణములను మాఱు మొగ్గలతోడ
వాగ్జపములను పుష్పములతోడి

గీ॥ స్వాదు సత్కర్మసంసార వాసనలతొ
భక్తియను తీగ సాగుచు యుక్తముగను
జ్ఞాన సుఖసుధామధువులు జాఱుచుండి
ప్రభవమొందు బ్రహ్మ జ్ఞాన ఫలము నిడుచు.

## టీక

శంభుధ్యాన = ఈశ్వర ధ్యానమను, వసంతసంగిని = వసంత ఋతుసంబంధము గల, హృదారామే = హృదయమనుపూవులతోట యందు, స్రస్తాః = రాలిపోయిన, అఘజీర్ణచ్ఛదాః = పాపములనునట్టి పండుటాకులును; విలసితాః = ప్రకాశమానములైన, పుణ్యప్రవాళశ్రితాః = పుణ్యములనునట్టి చిగురుటాకులను బొందినవియు, గుణకోరకాః = సద్గుణములను మొగ్గలు

గలవియు, జపవచఃపుష్పాః = జపవాక్కులను పుష్పములు గలవియు, సద్వాసనాః = సత్కర్మ సంస్కారములను సువాసనలు గలవియు నగు, భక్తిలతాచ్ఛటాః = భక్తియను తీగజొంపములును; జ్ఞానానందసుధా మరందలహరీ = జ్ఞానము, ఆనందమునను అమృతమకరందముల యొక్క ప్రవాహము; సంవిత్ఫలాభ్యున్నతిః = బ్రహ్మజ్ఞానమను ఫలాభివృద్ధియును, తీప్యంతే = ప్రకాశించుచున్నవి.

## తాత్పర్యము

పరమేశ్వర ధ్యానమనెడి వసంత ఋతువుతోడి సంబంధము సంప్రాప్తమగుటచే నామనస్సను పూలతోటలో పాపము లన్నియు పండుటాకులుగా రాలినవి. పుణ్యములు చిగురుటాకులుగా మొలకలెత్తినవి. వానిపై సద్గుణములు మొగ్గలుగా బయలుదేరినవి. భక్తిలతలు సాగుచున్నవి. అందు జపవచనములు పుష్పములుగా నుదయించినవి. సత్కర్మసంస్కారములు సువాసన వెదజల్లుచున్నవి. జ్ఞానానందములు అమృతమకరందములుగా ప్రవహించుచున్నవి. బ్రహ్మజ్ఞానము ఫలముగా స్ఫురించుచున్నది.

## వివరణము

ఈ శ్లోకంలో శివుని సాన్నిధ్యాన్ని వసంత ఋతువుతో పోల్చి, దీనితోడి సంబంధం వలన హృదయమనే పూలతోటకు చేకూరే వివిధ సదవకాశాలను వర్ణిస్తున్నారు. తాత్పర్యంలో ఈ వర్ణన విశదంగానే చెప్పబడింది కాబట్టి మళ్ళీ వివరణ వ్రాయడం అనవసరం.

## సంస్కృత శ్లోకము - 48

శ్లో. నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్విజ సేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్ ।
శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణ సంజాత శ్రమం ప్రాప్స్యసి ॥

### అనువాద పద్యము

సీ॥ నా మనస్సనియెడి ఓ మరాళేంద్రమా
 శాశ్వత సుఖమను జలము గల్గి
దేవతా ముని గణ దివ్య చిత్తములను
 స్థిరమైన సారస శ్రీలు గల్గి
సద్విజులందరి సంసేవలందుచు
 పాపమ్ములన్నియు బాపునట్టి
సత్కర్మ సంస్కార సద్వాసనాఫల
 ప్రకటిత మౌనట్టి ప్రబలమైన

గీ॥ శంకర ధ్యానమనెడి కాసారమీవు
పొంది శాశ్వతానందమ్ము నందుకొనుము
అల్పదేవతాశ్రయమను స్వల్ప పల్వ
లముల కోసమై తిరిగెడు శ్రమమరేల ?

### టీక

హేమనోహంసావతంస = ఓమానసరాజహంసమా ! నిత్యానంద = శాశ్వతానందమను, రస = ఉదకమునకు, ఆలయం = ఉనికి పట్టును, సుర = దేవతలయొక్కయు, ముని = పరమహంసల యొక్కయు, స్వాంత = హృదయములను, అంబుజాత = పద్మములకు, ఆశ్రయం = ఆధారమును, స్వచ్ఛం = నిర్మలమును, సద్విజసేవితం = యోగ్యులయిన ద్విజుల (రాజహంసల) చేత సేవింపబడినదియు, కలుషహృత్ = పాపహరమును, సద్వాసనా = సత్కర్మవాసనల చేత (సువాసనల చేత), ఆవిష్కృతం = ప్రకటింపబడి నదియునగు, శంభుధ్యాన = ఈశ్వరధ్యానమను, సరోవరం = మంచిసరస్సును, స్థిరం = స్థిరమైనదానిని, వ్రజ = పొందుమా, క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుటయను, పల్వలభ్రమణ = పడియలనుగుతించిన త్రిప్పటచేత,

సంజాత = పుట్టిన, శ్రమం = ఆయాసమును, కిం = ఏల ? ప్రాప్స్యసి = పొందెదవు ?

## తాత్పర్యము

ఓ మనోరాజహంసమా! క్షుద్రదేవతల నాశ్రయించుటవలన కొన్ని పాపములు తొలగిన తొలగుగాక! శాశ్వతానందము చేకూరదు. శంభుధ్యానము చేయుము. అదిగొప్ప సరోవరము. సత్కర్మసంస్కారమునగాని లభింపదు.

## వివరణము

పరమేశ్వర ధ్యానాన్ని ఒక ఉత్తమ సరస్సుతో పోల్చారు. మనస్సును రాజహంసతో పోల్చి ఆ ఉత్తమ సరస్సును ఆశ్రయించి శాశ్వత సుఖాన్ని పొందమంటున్నారు.

సరస్సులో పద్మాలుంటే – పరమేశ్వర ధ్యాన సరస్సును ఆశ్రయించుకుని మహర్షులు దేవతలు హృదయమనే పద్మాలు వుంటాయి. సరస్సులో పద్మాల పరిమళాలు ఉంటే – ధ్యాన సరస్సులో సంస్కారపూతమైన సద్వాసనలుంటాయి. సరస్సును రాజహంసలు ఆశ్రయించుకుని వుంటే – ధ్యానసరస్సును వివేకజ్ఞానంగల పరమహంసలు ఆశ్రయించుకుని వుంటారు. ఈ రెంటిలో నిమగ్నమైనపుడు పాపతాపాలు పోతాయి గాని, ఈశ్వర ధ్యాన సరస్సును ఆశ్రయిస్తే ఇంకా అదనంగా బంధ విముక్తి శాశ్వత ఆనందసుఖాన్ని కూడా పొందవచ్చును.

## సంస్కృత శ్లోకము - 49

శ్లో. ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్నముపేత్య భక్తి లతికా శాఖోపశాఖాన్వితా ।
ఉచ్చైర్మానసకాయమానపటలీ ఆక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మసంవర్ధితా ॥

## అనువాద పద్యము

సీ॥ శివభక్తిపరమైన సేవార్ద్రమనియెడి
జలధారనిండుగా కలిగియుండి
శంకర పదయుగ్మ సారసమ్ములనెడి
పాదునుండి జనన భాగ్యమంది
స్థైర్యమనెడి స్తంభ సహకారమున ప్రాకి
శాఖోపశాఖలు చాల గలిగి
ఉన్నతోన్నతముగా నున్న నామనసను
పలు పందిరుల యందు నలుముకొనుచు

గీ॥ కల్మష రహితమై పుణ్యకర్మలనెడి
సమయ సహకారముల చేత సాగుచుండి
భక్తియను తీగ పెరుగుచు ముక్తియనెడి
ఫలము నిడుగాక నా కోర్కె బరువు దీర.

## టీక

ఆనందా =(శివభక్తియందలి) ప్రేమయను, అమృత = ఉదకముతో, పూరితా = నింపబడినదియు, హర = శివునియొక్క, పదాంభోజ = పాదపద్మమను, ఆలవాల = పాదునుండి, ఉద్యతా = పుట్టిపెరిగినదియు, స్థైర్య = చిత్తస్థైర్యమను, ఉపఘ్నం = ప్రాకును, ఉపేత్య = పొంది, శాఖోపశాఖాన్వితా = చిలవలు పలవలు పొందుకొనినదియు, ఉచ్చైః = ఉన్నతమైన, మానస = మనస్సను, కాయమాన = పందిళ్ళయొక్క, పటలీం = సమూహమును, ఆక్రమ్య = అలముకొని, నిష్కల్మషా = చీడమొదలగు వానిచే శిథిలము గాక, సత్కర్మ సంవర్ధితా = పురాకృత పుణ్యకర్మముల (దోహదక్రియల) చేత వృద్ధి బొందింపబడినదియు అగు, భక్తిలతికా = భక్తియనుతీగ, మే = నాకు,

నిత్యాభీష్టఫలప్రదా = శాశ్వతమైన నాయభీష్టఫలము నిచ్చునది, భవతు = అగుగాక.

## తాత్పర్యము

ఈశ్వరసేవానురక్తి నీరుగను, శివుని పాదపద్మములను పాదుగను, చిత్తస్థైర్యము ప్రాకుడుకంపగను, చక్కగా బయలుదేరి చిలవలుపలవల నల్లుకొనుచు క్రమముగా నున్నతమైన నామనస్సను పందిరి యంతట నలముకొని చీడ మొదలగు దోషములచే చెడిపోకుండనున్న ఈ భక్తిలతను పురాకృతపుణ్యకర్మ యను దోహదముచే పెంపొంది నామనోభీష్టమగు శాశ్వతఫలంబు ఫలించునుగాక!

## వివరణము

పరమేశ్వరుని పాదపద్మాన్ని పాదుతో పోల్చారు. భక్తిని లతతో పోల్చారు. శివపాదాలనే పాదు నుండి బయలుదేరిన భక్తిలతకు భక్తుల ప్రేమే నీరుగా పనిచేస్తుందిట. నీటిలో అన్ని కరుగునట్లే ప్రేమలో అన్ని కరిగిపోతాయి. భక్తిలోని స్థిరత్వమే ఈ భక్తిలతకు నిలువుగా ప్రాకడానికి వీలుగా వుండే వెదురు కర్ర. విస్తరించి వుండే మనస్సే పందిరిగా పనిచేస్తుందిట. అప్పుడు ఈ భక్తిలత చక్కగా మనస్సునిండా అల్లుకుని ఆవరిస్తుందిట. శ్రవణ స్మరణ కీర్తనాదుల వలన వృద్ధి చెంది పరిపక్వ స్థితికి వచ్చి అభీష్టాలకు ఫలాలను ఇస్తుందిట. చివరకు శాశ్వతమైన మోక్షఫలాన్ని గూడా ఇస్తుంది. భగవంతుని పాదాలపైనే భక్తి వుంటే కావలసిన వన్నీ అవసరమైన వేళల్లో ఏర్పాటౌతాయి అని సూచన.

## సంస్కృత శ్లోకము - 50

శ్లో. సంధ్యారంభ విజృంభితం శ్రుతిశిరః స్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితమ్ ।
భోగీంద్రాభరణం సమస్త సుమనఃపూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జునమహాలింగం శివా ఽ ఽ లింగితమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ సంజవేళల వికాసమును పొందుచునుండి
శ్రుతి శిరస్సుల యందు చేరుచుండి
అమలాను రాగ సభ్రమరమై యుండియు
మధుర మనోహర మంజులవాయు
సద్వాసనలతోడ సతతమ్ము శోభిల్లి
భోగీంద్ర భూషణమ్ముగ వసించు
సకలమగు సుమనస్సత్పూజ్య మౌచుండి
సత్వసౌగంధముల్ సహజమగుచు

గీ॥ సతిశివాలింగితమయి శ్రీశైలమందు
సన్నమల్లె తీగలలుముకొన్న మద్ది
వృక్షమునుబోలు విధమున వెలసియున్న
మల్లికార్జున లింగని మదిభజింతు.

## టీక

సంధ్యారంభ = సాయంకాలమందు, విజృంభితం = తాండవనృత్యమున విజృంభించునట్టియు (పుష్పములు వికసించునదియు), శృతిశిరస్థానాంతర = వేదములకు శిరస్థానము లైన యుపనిషత్తులను నితర స్థలమందు (చెవులయందును, తలమీఁదను), అధిష్ఠితం = బోధ్యముగానున్నదియు అనగా తెలియబడునదిగానున్నదియు, సప్రేమ = ప్రేమతో గూడిన, భ్రమరా(ర) = భ్రమరాంబిక చేతను (తుమ్మెదల చేతను), అభిరామం = మనోహరమైనట్టియు, అసకృత్ = ఎల్లప్పుడును, సద్వాసనా = సాధువులయొక్క భావనచేత (మంచిసువాసన చేత), శోభితం = ఒప్పునట్టియు, భోగీంద్ర = వాసుకి (భోగవంతులకు), ఆభరణం = భూషణముగా గలిగినట్టియు (భూషణ మైనట్టియు) సమస్తసుమనః = ఎల్లదేవతల (విద్వాంసుల) చేతను (సకల

పుష్పములకంటెను), పూజ్యం= పూజింపదగి నట్టియు, గుణ = సత్త్వగుణముచేత (సుగంధగుణముచేత), ఆవిష్కృతం = ప్రకటితమైనట్టియు, శివాలింగితం = పార్వతీదేవి చేత కౌగలించుకొనబడిన, శ్రీగిరి = శ్రీశైలమందున్న, మల్లికార్జున = మల్లెతీగయల్లుకొన్న మద్దిచెట్టునుబోలిన, మహాలింగం = పరమాత్మసూచకమైన శివలింగమును, సేవే = భజించుచున్నాను.

## తాత్పర్యము

శ్రీశైలపర్వతమందున్న మల్లికార్జున మహాలింగము మల్లెతీగ అల్లుకొన్న మద్దిచెట్టుతోపోల్చి వర్ణింపబడినది. ఈశ్వరుడు సాయంకాలమున తాండవనృత్యముతో భక్తుల నానందపరచును. అదిపుష్పవికాసములతో తాండవించి యానందపరచును. శివుడు శ్రీశైలమందుగాక ఉపనిషత్తుల యందుండును. దానిపుష్పములు శ్రవణములయందు శిరస్సులయందు అలంకారములుగానుండును. మల్లికార్జునుడు భ్రమరాంబతోడను అర్జునవృక్షము భ్రమరములతోడనుగూడి యొప్పును. ఈశ్వరునకు సద్వాసనయనగా సాధుభావనయొక్క శోభయు, దానిసువాసనయొక్క శోభయుగలదు. భోగీంద్రుడనగా శేషాహి శివుని యాభరణము. భోగీంద్రులనగా మహాభోగవంతులకు దానిపూలు అలంకారములు. శివుడు సుమనఃపూజ్యుడనగా సర్వదేవతలచేతను పూజింపబడువాడు. దానిపుష్పము లన్ని పుష్పములకంటెను మిక్కిలి శ్లాఘనీయములు. భగవంతుడు సత్త్వమువలన తెలియబడును. అది సుగంధ గుణమున తెలియనగును. అట్టిమల్లికార్జునదేవుని భజించెదను.

## వివరణము

శంకర భగవత్పాదులు శిష్యగణంతో పాదచారియై భారతదేశం అంతా పర్యటించారు. అలా పర్యటిస్తున్న సందర్భంలో మన ఆంధ్రప్రదేశ్‌లోని శ్రీశైలమహాపుణ్యక్షేత్రాన్ని గూడా సందర్శించారు. సరిగ్గా అప్పుడు సంధ్యాకాలం అయింది. అక్కడ మల్లె తీగ అల్లుకొనిన మద్ది చెట్టును ఒక దానిని చూశారు.

ఆ చెట్టును ఉపమానంగా చేసుకుని చెప్పిన మహోద్భుతమైన శ్లోకమే ఇది. దీని తరువాత వచ్చే - 'భృంగీచ్ఛానటనోత్కటపి... శ్రీశైలవాసేవిభుః' అన్న 51వ శ్లోకం కూడా శ్రీశైల మల్లికార్జునస్వామిని ఉద్దేశించి చెప్పినదే ! మొత్తం 100 శ్లోకాలున్న ఈ శివానందలహరి స్తోత్రంలో ఈ రెండు శ్లోకాలు సరిగ్గా మధ్యలో ప్రాణప్రదంగా వుండటం విశేషం. "శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అన్న సూక్తిని - ఇలా స్తోత్ర మధ్యంలో ప్రాణప్రదంగా వున్న ఈ రెండు శ్లోకాలు ధ్రువపరుస్తాయి.

### సంధ్యాకాల విజృంభితం

ఈ శ్లోకంలో శివుణ్ణి మద్ది చెట్టుతోను, శ్రీశైల భ్రమరాంబను ఆ మద్ది చెట్టును చుట్టుకుని వున్న మల్లెతీగెతోను పోల్చి చెప్పారు. పగటికి రాత్రికి మధ్య వున్న కాలాన్ని సాయం సంధ్యాకాలం అంటారు. సూర్యుడు అస్తమించిన తరువాత నక్షత్రాలు ఇంకా రాకుండావున్న మధ్య సమయాన్ని సాయం సంధ్యాకాలం అంటారు. ఈ కాలాన్నే ప్రదోష కాలం అని కూడా అంటారు. ఇతర సమయాల్లో సామాన్యంగా వున్నప్పటికీ ఈ సంధ్యాకాలం వచ్చే సమయానికి శివుడు తాండవ నృత్యం చేస్తూ విజృంభిస్తాడు. అందుకనే ఆ సంధ్యాసమయంలో శివస్మరణ చేయమని మన పెద్దవాళ్ళు చెబుతారు. మద్ది చెట్టు కూడా ఈ ప్రదోషకాలంలో పూలు విరిసి విరాజిల్లుతుంది.

### శ్రుతి శిరః స్థానాంతరాధిష్ఠితం

ఉపనిషత్తుల్లో పరమేశ్వరుడైన శివుని గురించి ప్రతిపాదింపబడుతుంది. అలాగే ఇతర పుణ్యక్షేత్రాలలో గూడా శివుని ప్రాభవం, వైభవం వుంటుంది. అందుకని ఉపనిషత్తులలో అధిష్ఠించి వుండేవాడని శివుని పరంగా ఈ విశేషణం చెల్లుతుంది. పూజానంతరం (మద్దిచెట్టు యొక్క) పూలు చెవుల్లోను శిరస్సు మీదా కూడా 'శ్రీపరమేశ్వర ప్రసాదం శిరసా గృహ్ణామి' అని - ఆడవాళ్ళు

తలకట్టులోను, మగవాళ్ళు చెవుల్లోను పెట్టుకుంటారు. సంస్కృతంలో చెవుల్ని శ్రుతులని, తలని శిరస్సని అంటారు. అంటే - ఈ చెవులు - తలలు, శ్రుతి శిరస్సులన్నమాట ! శ్రుతులు అంటే వేదాలని అర్థం. ఈ వేదాలకు శిరస్థానంతో పోల్చదగినవి ఉపనిషత్తులు. అందుకని ఉపనిషత్తులను 'శ్రుతిశిరస్సు'లు అంటారు. శ్రుతిశిరస్సులను అధిష్ఠించడం అంటే, శివుని పరంగా - ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడేవాడని, మద్ది చెట్టుపరంగా - దాని పూలు చెవుల్లోను నెత్తిమీద పెట్టుకునే సంబంధం కలిగినదిగాను - ఈ విశేషణం చెల్లుతుంది. ఇక స్థానాంతరాలంటే - పుణ్యక్షేత్రాలలో అధిష్ఠించి వుండే వాడని శివుని పరంగాను, ఆ స్థానాంతరాల్లో అంటే పుణ్యక్షేత్రాల్లో భగవదర్పణ కోసం పూలు విరిసిగా. భక్తుల చేతుల్లోను అంగళ్ళలోను అధిష్ఠించి వుంటాయని (మద్దిచెట్టు) పూలపరంగాను - చెప్పుకోవాలి.

### సప్రేమ భ్రమరాభిరామం

ప్రేమతో కూడిన భ్రమరాంబిక సరసన మనోహరంగా వున్న - అని శివుని పరంగాను, 'భ్రమరం' అంటే తుమ్మెద కాబట్టి - పూలపై వ్రాలి వుండే తుమ్మెదలతో మనోహరంగా వున్న -అని మద్ది చెట్టు పరంగాను అర్థం చెప్పుకోవాలి.

### అసకృత సద్వాసనాశోభితమ్

'సకృత్' అంటే 'ఒక్కసారి' అని, 'అసకృత్' అంటే - 'ఎల్లప్పుడూ' అని అర్థం. ఎప్పుడూ ఆశ్రయించుకుని ఉండే, సాధుపుంగవుల పవిత్ర భావాలతో శోభిల్లుతూ ఉండేవాడని, లేదా - భక్తులను అనుగ్రహిద్దామనే సద్భావనతో ఎప్పుడూ వుండే వాడని శివుని పరంగాను, అల్లుకున్న మల్లెపూల సువాసనలతో శోభిల్లేదిగా మద్దిచెట్టు పరంగాను అర్థం చేసుకోవాలి.

**భోగీంద్రాభరణం**

'భోగి' అంటే 'సర్పము' అని అర్థం. భోగీంద్రుడు అంటే సర్పరాజు అయిన వాసుకిని సూచిస్తుంది. ఈ వాసుకుని మెడలో ఆభరణంగా కలిగిన వాడు అని శివునిపరంగాను, భోగీంద్రులు అంటే - మహాభోగ సంపన్నులు అని అర్థం చెప్పుకుంటే వీరికి పుష్పాలు అలంకార ప్రాయం కాబట్టి భోగీంద్రులకు ఆభరణ ప్రాయంగా చెల్లు సంబంధము గలిగినది అని మద్ది చెట్టుపరంగాను అర్థం చెప్పుకోవాలి.

**సమస్త సుమనః పూజ్యం**

'సుమనస్సు' లంటే దేవతలు అనే అర్థంలో దేవతల చేత పూజింపబడేవాడని శివుని పరంగాను, సుమనస్సులంటే మంచి పుష్పాలనే అర్థం తీసుకుంటే పూలలో ఎక్కువ శ్లాఘనీయము' లని మద్ది చెట్టుపరంగాను అర్థం చెప్పుకోవాలి.

**గుణావిష్కృతం**

మంచి గుణములచే ప్రకటితమయే వాడని శివుని పరంగాను, 'గుణము' అంటే 'దారము' అనే అర్థములో దారాలచే సూత్రీకరింపబడే పూలతో సంబంధం కలిగిన అనే అర్థంలో మద్ది చెట్లు పరం గాను అర్థం చెప్పుకోవాలి.

ఈ విధంగా శ్రీశైలంలో వేంచేసి యున్న మల్లికార్జునస్వామిని లేదా - మల్లె తీగలు అల్లుకున్న మద్ది చెట్టును బోలినవాడును, 'శివాలింగితం' (శివలింగంలో పానువట్టం పార్వతిని సూచిస్తుంది) అంటే - పార్వతిచే ఆలింగనము చేసుకొనబడినవాడును అయిన - మహాలింగ స్వరూపుణ్ణి నేను సేవించుచున్నాను అని ఈ శ్లోకభావన.

## సంస్కృత శ్లోకము - 51

శ్లో. భృంగీచ్ఛానటనోత్కటఃకరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః ।
సత్పక్షస్సుమనో (ఽ) వనేషు స పున స్సాక్షాన్మదీయే మనో
రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః ॥

## అనువాద పద్యము

సీ॥ భృంగీచ్ఛతోడ వర్తింప జూచుచునుండి
 కరిమదగ్రాహియై కరము వెలిగి
ధగ ధగ మెఱయు మాధవుని యందు మిగుల
 అపరిమితానంద మందుచుండి
మధుర నాదమ్ముతో మనసు దోచుచునుండి
 అపర మహాసిత వపుషముండి
పంచశరుని చేత బాణ లక్ష్యమ్ముగా
 అదరింపబడిన హ్లాదమౌచు
గౌ॥ సకల సమనోవనమ్మందు సహృదయమ్ము
కనుల యెదుటనె కన్పించు తనువు గల్గి
యుండు శ్రీగిరి భ్రమరాధిపుండు నాదు
హృదయ కమల మందున విహరించు గాక !

## టీక

భృంగీచ్ఛానటనోత్కటః - భృంగి (గీ)= భృంగియను ప్రమథుని యొక్క (భృంగజాతి యొక్క), ఇచ్ఛా = అభిప్రాయముచే (అపేక్షలను), నటన = వర్తించుట యందు (అనుకరించుట యందు), ఉత్కటః = ఉత్కటేచ్ఛ కలిగినగట్టియు, కరిమద = గజాసురుని బలగర్వమును (ఏనుగుమదము),

గ్రాహీ = అణచినట్టినట్టియు (గ్రహించు స్వభావముగలిగినట్టియు), స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపుడైన స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపుడైన మాధవుని యందు (వసంతమందు), ఆహ్లాదః = ఆనందము గలిగినట్టియు, నాదయుతః = ప్రణవనాద ప్రతిపాద్యుడైనట్టియు (ఝుంకారధ్వనితో గూడినట్టియు), మహత్ = గొప్ప (అ) సితవపుః = తెల్లనిశరీరము గలిగినట్టియు (నల్లనిశరీరము గలిగినట్టియు), పంచేషుణా = మన్మథుని చేత, అదృతః = బాణలక్ష్యముగను (సహాయముగను) ఆదరింపబడినట్టియు, సుమనః = దేవతల (విద్యాంసుల) యొక్క అవనేషు = సంరక్షణములయందు (సుమనోవనేషు = పూలతోటలయందు) సత్పక్షః = యభిమానము గలిగినట్టియు, సాక్షాత్ = కన్నుల యెదుట నున్నట్టియు, శ్రీశైలవాసీ = శ్రీశైలమందు భక్తుల ననుగ్రహింప లింగరూపమున నున్నట్టియు, విభుః = పలువిధరూపములగుచున్నట్టియు, భ్రమరాధిపః = భ్రమరాంబాపతి యనునట్టి భృంగశ్రేష్ఠము, మదీయే = నా సంబంధమైన, మనోరాజీవే = మానసకమలమందు, విహరతాం = విహరించుగాక.

## తాత్పర్యము

శ్రీశైలవాసీ! భ్రమరాంబాధిపతీ! నీవు భ్రమరాధిపతివి అనగా తుమ్మెదరేడు గావున నామనఃపద్మమున సంచరింపుము. నీవు - భక్తుడుభృంగీశ్వరుని ఇచ్ఛానుగుణముగా వర్తింపజూతువు. తుమ్మెదరేడు - భృంగియనగా, తుమ్మెదలజాతి దానియపేక్ష ననుసరించి నడచును. నీవు గజాసురుని గర్వము నిగ్రహించితివి. అది ఏనుగుల మదోదకము గ్రహించును. నీకు మోహినీరూపము ధరించిన మాధవునియందాహ్లాదము స్ఫురించినది. దానికి మాధవ అనగా వసంతమునందాహ్లాదము. నీకు ప్రణవనాదము. దానికి ఝుంకారనాదము. మన్మథుడు నిన్ను పుష్పబాణముతో నాదరించెను. దానిని సహాయముగా నాదరించెను. నీకు (సుమనోఽవనము) విబుధరక్షణ మందభిమానము. దానికి

(సుమనోవనము) పూలతోటయందభిమానము. కాబట్టి, నామనఃపద్మమందు ఎడబాయకుండుట సహజమే కావున అందు విహరింపుము.

## వివరణము

ఈ శ్లోకంకూడా శ్రీశైల మల్లికార్జున స్వామిని ఉద్దేశించి చెప్పినదే. ఈ శ్లోకంలో మల్లికార్జున స్వామిని ఒక భృంగరాజుగా అంటే భ్రమరనాథునిగా వర్ణించి చెప్పడం జరిగింది. అంటే - ఈ శ్లోకంలో మల్లికార్జున స్వామికి ఉపయోగించిన విశేషణ పదాలన్నీ భ్రమరాధిపుడు అంటే భృంగరాజుకు గూడ చెల్లుతాయి.

**భృంగీచ్ఛానటనోత్కటః**

భృంగి + ఇచ్ఛా + నటన + ఉత్కట: అని విడదీసి - భృంగి అనే ప్రమథుని యొక్క అభిప్రాయానుసారంగా నర్తించుట యందు ఎక్కువ ఇష్టపడువాడు అని - మల్లికార్జునస్వామిపరంగాను చెప్పుకోవాలి.

'భృంగీ + ఇచ్ఛా + నటన + ఉత్కటః' అని విడదీసి - 'భృంగీ' అంటే - ఆడ తుమ్మెద ఇష్టానుసారం నర్తించుటలో ఎక్కువ ఇష్టపడునది అని - భృంగాధిపతి పరంగా చెప్పుకోవాలి.

**కరిమదగ్రాహి**

గజాసురుని బలగర్వాన్ని అణచి పెట్టినవాడు అని - శివుని పరంగాను, ఏనుగు మదాన్ని గ్రహించే స్వభావం గలది అని - భ్రమరాధిపతి పరంగాను అర్థం చెప్పుకోవాలి (మత్తగజానికి మదజలధారలు కారుతుంటే వాటిని తుమ్మెదలు గ్రహిస్తాయి).

**స్ఫురన్మాధవాహ్లాద :**

ప్రకాశించుచున్న మోహినీ రూపుదైన విష్ణుమూర్తి (మాధవుని) యందు ఆనందం కలిగి యున్నవాడని - శివుని పరంగాను ('హరి స్త్వా మారాధ్య ప్రణతన జన సౌభాగ్య జననీం, పురా నారీ భూత్వా పురరిపుమపి క్షోభమనయత్...' అనే - సౌందర్యలహరిలోని 5వ శ్లోకం ఇక్కడ గుర్తు చేసుకోవాలి)

'మాధవ' అనే పదానికి మాధవమాసం (వసంత ఋతువుకు సంబంధించిన వైశాఖమాసం) అనే అర్థంలో వసంత ఋతువులో మరింత ఆనందంతో ప్రకాశించేది అని - భ్రమరరాజు పరంగా అర్థం చెప్పుకోవాలి. (వసంత ఋతువులో చెట్లు చిగిర్చి పూలు పూస్తాయి. అప్పుడు తుమ్మెదలకు ఆపూలలో తేనెలు పుష్కలంగా దొరుకుతాయి. తుమ్మెదలు పూలపై వ్రాలి ఆనందంతో వుంటాయి).

**నాదయుత :**

'నాదం' అంటే 'ప్రణవ' నాదం అనే అర్థం చేసుకోవాలి. 'ప్రణవ' మన్నా 'ఓంకారమన్నా ఒకటే. శివపరంగా ఈ రెంటికీ సంబంధించిన మంత్రం, శ్లోకం ఇలా ఉన్నాయి.

1) 'తస్యవాచకః - ప్రణవః' - పాతంజలం'

2) ఓంకార మంత్ర సంయుక్తం
నిత్యం ధ్యాయంతి యోగినః
కామదం మోక్షదం తస్మై
ఓంకారాయ నమోనమః - మహన్యాసం

కాబట్టి 'నాదయుతః' అంటే ప్రణవ నాద ప్రతిపాదితుడైన వాడు అని- శివుని పరంగా అర్థం చెప్పుకోవాలి. 'నాదయుతః' అంటే 'ఝుంకార ధ్వనితో గూడి ఉన్నటువంటి' అని - భ్రమరరాజు పరంగా అర్థం చెప్పుకోవాలి.

**మహాసితవపు :**

'మహా + సిత + వపుః' అని విడదీస్తే గొప్ప తెల్లని శరీర ఛాయ గలిగిన వాడు అని - శివుని పరంగాను, 'మహా + అసితవపుః' అని విడదీస్తే గొప్పనల్లని శరీరచ్ఛాయ గలిగినట్టి అని - భ్రమర రాజు పరంగాను అర్థం చెప్పుకోవాలి.

**పంచేషుణాచాదృతాః**

'పంచేషు'డు అంటే 'మన్మథుడనే అర్థంలో మన్మథుని చేత బాణలక్ష్యంగా

ఆదరింపబడినవాడు అని – శివుని పరంగాను, మన్మథునికి సహాయకారిగా ఆదరింపబడినట్టిది (శృంగార భావాలు, ఉద్దీపన భావలు కలుగజేయాలంటే – వసంతఋతువు, పువ్వులు, పువ్వులపై తుమ్మెదలు మొదలైనవి నేపథ్యంలో వుండాలి) అని – భ్రమరరాజుపరంగాను అర్థం చెప్పుకోవాలి.

**సుమనోవనేషు సత్పక్షః**

'సుమనోఽవనేషు' అనే విధంగా విడదీస్తే 'సుమనస్సు'లంటే దేవతలు లేదా విద్వాంసులు కాబట్టి, ఆ దేవతల లేదా విద్వాంసుల యొక్క 'అవనేషు' అంటే సంరక్షణ యందు 'సత్పక్షః' – అభిమానము కలిగి యున్నట్టి వాడు అని – శివుని పరంగాను, 'సుమనోవనేషు' అనే సమాసానికి 'సుమనః' అంటే 'పువ్వు(ల)' అని, 'వనేషు' అంటే తోటలయందు, 'సత్పక్షః' అభిమానము కలిగియున్నట్టి – అని భ్రమరరాజు పరంగాను అర్థం చెప్పుకోవాలి. (భ్రమరాలకు పూలతోటలో ఎన్ని పూవులుంటే అంత ఎక్కువ ఇష్టం గదా!)

ఈ విధంగా నా కన్నుల యెదుట శ్రీశైలమందు లింగరూపంలో వున్న భ్రమరాంబాధిపతి ఎప్పుడూ నా మనస్సనే పద్మం మీదనే వసించుగాక అని – ఈ శ్లోకానికి అర్థం.

ఇంతకు ముందు శ్లోకం, ప్రస్తుత శ్లోకం తెలుగు నేలలో వేంచేసిన మల్లికార్జున స్వామి మీద శంకరులు వ్రాసిన అద్భుతమైన శ్లోకాలు అవడం మన అదృష్టం. 'కాశీలో మరణిస్తే మోక్షం వస్తుందంటారు. శ్రీశైల గోపుర శిఖరం చూస్తేనే చాలు ఇంక పునర్జన్మ వుండదు అంటారు. అంటే కాశీలో మరణించిన తరువాత సాధించేదాన్ని శ్రీశైలశిఖరంచూస్తూ బ్రతికి ఉన్నపుడే సాధించేవచ్చన్నమాట ! ఈ రెంటినీ అర్థం చేసుకుంటే శ్రీశైలం ఎంత గొప్ప పుణ్యక్షేత్రమో, అందలి మల్లికార్జునస్వామి ఎంతటి మహిమాన్వితమైన దైవమో అర్థమవుతుంది.

## సంస్కృత శ్లోకము - 52

శ్లో. కారుణ్యామృత వర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదా కర్మఠం
విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిమ్ ।
నృత్యద్భక్తమయూర మద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంచతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః॥

## అనువాద పద్యము

సీ॥ అవ్యాజ కారుణ్యదివ్యామృత శ్రీలు
చింత దీర్పంగ వర్షించునట్టి
ఘన విపద్గ్రీష్మసంజనిత తాపమ్మును
మాయమ్ముజేయ సామర్థ్యమొసగు
బ్రహ్మవిద్యాసస్య - ఫలము పొందగగోఱు
సుమనస్సులకు నాశ్రయమగుచుండి
భక్తులనెడి మయూరోక్త వర్గము గల్గి
నగమునం దిచ్ఛాకృతిగవసించు

గీ॥ కదలుచుండెడి జటా సంకలితమైన
నీలకంధరా ! సతతమ్ము నిన్నెనాదు
చిత్తమనియెడు చాతక చిత్రఖగము
కోరుచుండును శంకరా ! నోరు దెఱచి.

## టీక

హేశంభో = సుఖోత్పత్తి కారణమైనవాడా ! హేనీలకంధర = నల్లని కంఠము గల వాడా, (నీల = నల్లని, కం = జలము, ధర = ధరించినవాడు, మేఘుఁడా!) మే = నాయొక్క, మనశ్చాతకః = మనస్సను చాతకపక్షి, కారుణ్యామృతవర్షిణం = దయఅను అమృతమును వర్షించునట్టియు (కనికరమువల్ల జలమును వర్షించునట్టియు), ఘన = గొప్పదియగు, విపత్ =

ఆపదయను (సస్యనాశము మున్నగువిపత్తు గలిగిన), గ్రీష్మ = అతితాపమును (గ్రీష్మమును), ఛిదా = ఛేదించుటకు, కర్మఠం = సమర్థమైనట్టియు, విద్యాసస్య = విద్యయను పైరుయొక్క ఫలోదయాయ = ఫలము (బ్రహ్మానందానుభవము) జనించుట కొఱకు, సుమనస్సంసేవ్యం = దేవతలచేతను, పండితుల చేతను కర్షకుల చేతను, ఆశ్రయింపదగినట్టియు, ఇచ్ఛాకృతి = కామరూపమైనట్టియు, నృత్యత్ = నాట్యము చేయుచున్న, భక్త = భక్తులనియెడు (మేఘమందు ప్రీతిగల), మయూరం = నెమళ్లుగలిగినట్టియు, అద్రినిలయం = పర్వతము నివాసస్థలముగా గలిగినట్టియు, చంచత్ = చలించుచున్న, జటా = జడలయొక్క (మెఱుపుల యొక్క), మండలం = సమూహము గలిగినట్టియు, త్వాం = నిన్ను, సదా = ఎల్లప్పుడును, వాంఛతి = కోరుచున్నది.

## తాత్పర్యము

నీలకంధరా ! నామనస్సను చాతకము నీలమేఘమును వలె వాంఛితసిద్ధికై నిన్ను దర్శింపవేచియున్నది. మేఘము జలము వర్షించును. నీవు దయామృతము కురిపింతువు. అది గ్రీష్మతాపమడంచును. నీవు సంతాపములడంతువు. అది సస్యములను పండించును. నీవు విద్యాసస్యమును పండించి బ్రహ్మానందానుభవము ఫలముగా నిత్తువు. దేవతలు, పండితులు నిన్ను భజింతురు. కర్షకులు మేఘుని భజింతురు. మయూరములు నల్లనిమేఘమునుచూచి నాట్యము చేయును. నీవు కైలాసపర్వతమున నుందువు. మేఘుదును పర్వతమునునుండును. కామరూపమును, జటావల్లియు నిరువురకును గలదు.

## వివరణము

శంకరులు ఈశ్లోకంలో శివుణ్ణి నీలమేఘంతో పోల్చి ప్రార్థించారు. మేఘం లాగా వుండాలంటే నల్లగా వుండాలి. శివుడు నీలకంఠుడే గదా ! మేఘం నీటిని వర్షిస్తుంది. శివుడు కూడా కరుణామృతాన్ని వర్షిస్తాడు ! మేఘం తాపాన్ని చల్లార్చి ఉపశమింప చేస్తుంది. శివుడు గూడా ఆపదల్లో ఆదుకుని కష్టనష్టాలను

దూరం చేస్తాడు. మేఘం సస్యాలను పండింప చేస్తుంది. శివుడు విద్యను పండింపచేస్తాడు. మంచిమనస్సుగలవారందరూ సకాల వర్షాలు పడాలని మేఘాలను కోరుకుంటారు. దేవతలు, మంచిమనస్సుగలవారు శివుణ్ణి ప్రార్థిస్తారు. మేఘం లాగే శివుడు కూడా రకరకాల ఆకారాలను రూపాలను ధరిస్తాడు. మేఘాన్ని చూసి నెమళ్ళు నృత్యం చేసినట్టే – శివుణ్ణి చూసి భక్తులు నృత్యం చేస్తారు. మేఘంలాగానే శివుడు కూడా కొండమీద వుంటాడు. మేఘానికి మెఱపు తీగలున్నట్లే – శివుని గ్గాడా ప్రకాశవంతమైన జడలుంటాయి. మేఘం కొరకు చాతకపక్షి పరితపించినట్లే – శివుని కొఱకు భక్తులు పరితపిస్తారు. ఇలా ఎన్ని విధాలుగా చూసినా మేఘానికున్న లక్షణాలన్నీ శివునికి వున్నాయి కాబట్టే – శివుణ్ణి నీలమేఘంతో పోల్చి మనస్సనే చాతకపక్షిని ఆ నీలకంఠ మేఘాన్ని ఆశ్రయించి ఆనందించమన్నారు.

## సంస్కృత శ్లోకము - 53

శ్లో. ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా
నుగ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే ।
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనే విహారరసికం తంనీలకంఠం భజే ॥

## అనువాద పద్యము

*సీ॥ గగన భాగమ్మును సిగవిధానమ్ముగన్*
*భుజగనాథుని శిరోభూషణముగ*
*నమ్రులౌవారికానందమ్ము నొసగగన్*
*ప్రణవోపదేశ నిక్వాణములను*
*గలిగి, కేకియవోలె ఘనకాంతిని గలుగు*
*శ్యామవర్ణ గిరిజ నందుజూచి*
*నవరసాత్మకముగన్ నవవిధానములతో*
*ఆనందముగ నృత్యమాడునట్టి*

గీ॥ ఉపనిషత్తులనెడి ఉపవనమున
సంచరించుటకోసమై సతము గోరి
నీలకంఠుని కొలుతును నెమ్మనమున
చిత్తమందున్న నా యొక్క చింత దీర.

## టీక

యః = ఏ శివుడు (ఏ నెమలి), ఆకాశేన = ఆకాశముచేత, శిఖీ = శిఖావంతుడు అనగా వ్యోమకేశుడనుట (శిఖండకముగలిగిన నెమలి), సమస్తఫణినాం = సకలసర్పములకును, నేత్రా = నాయకుడైన వాసుకిచేత, కలాపీ = భూషణవంతుఁడు (పింఛము గల నెమలి), నత = సముత్రైనవారిని, అనుగ్రాహి = అనుగ్రహించు స్వభావము గల, ప్రణవ = ప్రణవమంత్రము యొక్క ఉపదేశ = ఉపదేశమందలి, నినదైః = ధ్వనులచేత, కేకీతిచ = కేకాధ్వనిగలవాడు అనియును (కేకాధ్వని గల నెమలి), గీయతే = గానము చేయబడుచున్నాడో, శ్యామాం = శ్యామవర్ణమైనట్టియు, ఘనరుచిం = మేఘకాంతివంటి కాంతిగల, శైలసముద్భవాం = పార్వతిని (పర్వతమందు బయలదేరిన మేఘకాంతిని), దృష్ట్వా = చూచి, నటంతం = నాట్యము సేయునట్టియు, వేదాంతోపవనే = వేదాంతమను నుద్యానవనమందు, విహార రసికం = సంచరించుట యందు రసికుడైనట్టియు, తం = ఆ, నీలకంఠం = నల్లని కంఠము గల యీశ్వరుడను నెమలిని, ముదా = సంతోషముతో, భజే = సేవించుచున్నాను.

## తాత్పర్యము

నీలకంఠుడును, వ్యోమకేశుండును, నాగయజ్ఞోపవీతుండును, ప్రణవోపదేశముచేత భక్తుల ననుగ్రహించువాడును, పార్వతీ వల్లభుండును, వేదాంతవేద్యుండును - అగు నీలకంఠుని భజించెదను. (వివరణలో పూర్తి వివరములు చెప్పబడినవి).

## వివరణము

క్రిందటి శ్లోకంలో శివుణ్ణి నీలమేఘంతో పోలిస్తే - ఈ శ్లోకంలో శివుణ్ణి నెమలితో పోల్చి స్తుతిస్తున్నారు. నెమలికి తలపై శిఖ ఉన్నట్లే శివునికి కూడా ఆకాశం జటాజూటంలా వుంటుంది. నెమలికి పింఛం అలంకారంగా వుంటే - శివునికి మెడలో వాసుకి అలంకారంగా వుంటుంది. నెమలి - 'కేకా' ధ్వని చేయగలిగితే శివుడు అన్ని ధ్వనులకూ మూలమైన ఓంకారాన్నే తన నామంగా కలవాడు. (తస్యవాచకః ప్రణవః - పతంజలి) నెమలి పర్వతం పైన చరించే నీలమేఘం తాలూకు మెఱపు కాంతిని చూడంగానే నాట్యం చేస్తుంది. శివుడు గూడా శ్యామల వర్ణంతో వుండి మెఱపు కాంతులు విరజిమ్మే పర్వత పుత్రికను చూడంగానే ఆనందంతో నాట్యం చేస్తాడు. నెమలి శ్రుతి శిరస్సులలో (చెవుల్లోను, నెత్తిపైన పెట్టుకునే పూలుండే తోటలో) విహరిస్తే - శివుడు శ్రుతి శిరస్సులలో (ఉపనిషత్తులలో) విహరిస్తాడు. (అంటే ప్రతిపాదింపబడతాడు అని అర్థం) నెమలిదీ శివునిదీ కూడా నీలకంఠమే !

ఇన్ని రకాలుగా సాదృశ్యం వుండబట్టే శంకర భగవత్పాదులు శివుణ్ణి నెమలితో పోల్చి ఆ నీలకంఠుణ్ణి భజిస్తున్నానని చెప్పారు.

## సంస్కృత శ్లోకము - 54

శ్లో. సంధ్యా ఘర్మదినాత్యయో హరికరాఘాతప్రభూతానన
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా ।
భక్తానాం పరితోషబాష్పవితతి ర్వృష్టిర్మయూరీ శివా
యస్మిన్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే ।

## అనువాద పద్యము

సీ॥ స్తవనీయమైన సంధ్యాసమయమనెడి
కమనీయ వర్షంపు సమయమందు
మధుసూదనుడుజేయు మధుమృదంగధ్వని
పర్జన్య జనితమౌ గర్జనముగ

దేవతాగణముల దృష్టిపరంపర
మిరుమిట్లు గొలిపెడు మెఱుపు పగిది
భక్తుల ఆనంద భాష్పధారాఝరి
దివ్యవర్షమ్ముగా తీర్చియుండ
గీ॥ ఆడ నెమలిగ శర్వాణి తోడురాగ
ఉజ్జ్వలోత్కృష్ట సంధాన యోగ్యమైన
తాండవమ్మను దివ్యనృత్యమ్ము జేయు
నీలకంఠుని కొలుతును నెమ్మనమున.

## టీక

సంధ్యా = సాయంకాలము, ఘర్మదినాత్యయః = వర్షారంభ కాలముగను, హరి = విష్ణుమూర్తియొక్క కర =హస్తముల చేతనైన, ఆఘాత = వాయింపు చేత, ప్రభూత = పుట్టిన, ఆనక = మద్దెలయొక్క ధ్వానః = ధ్వని, వారిదగర్జితం = ఉరుముగను, దివిషదాం = దేవతలయొక్క దృష్టిచ్ఛటా = చూపుల పరంపర, చంచలా = మెఱపుగను, భక్తానాం = భక్తుల యొక్క పరితోషబాష్పవితతిః = ఆనందాశ్రుధార,వృష్టిః = వర్షముగను, శివా = పార్వతీ దేవి, మయూరీ = ఆడ నెమలిగను, యస్మిన్ = ఏ నీలకంఠుడను నెమలియందు, ఉజ్జ్వల = ప్రకాశమానమైన, తాండవం = తాండవమనునృత్యము, విజయతే = సర్వోత్కృష్టముగా నున్నదో, తం = ఆ, నీలకంఠం = శివుని, భజే = కొలుచుచున్నాను.

## తాత్పర్యము

ప్రదోషకాలమను వర్షాకాలమున విష్ణువు వాయించు మద్దెలచప్పుడు ఉఱుముగాను, ఆకాశమందుండిచూచు దేవతలచూపులు మెఱపులుగాను, భక్తుల సంతోషప్రవాహము ధారావర్షముగాను, ప్రకాశింపగా – మయూరీ మయూరములుగా తాండవనృత్యక్రీడాసక్తులైన పార్వతీపరమేశ్వరులను భజింతును.

## వివరణము

ఈ శ్లోకంలో కూడా శివుణ్ణి నెమలితో పోల్చి, అటువంటి నీలకంఠుడనే నెమలి చేసే తాండవ నృత్యం అతి మనోహరంగా వుంటుందని, అలా నృత్యం చేసే శివుణ్ణి భజిస్తున్నానని శంకరులు అంటున్నారు.

వర్షాకాల ప్రారంభసమయంలో సాయంసంధ్యాకాలంలో వర్షం కురవడానికి ముందు ఉరుముల ధ్వని, మెఱపుల ప్రకాశం గూడా తోడవుతాయి. అప్పుడు ఎదురుగా ఆడు నెమలి వుంటే దానిని చూస్తూ మగ నెమలి అతి మనోహరంగా నృత్యం చేస్తుంది. సరిగ్గా కైలాసంలో ఇలాంటి సమయంలోనే - విష్ణుమూర్తి వాయించే మృదంగ ధ్వనులే ఉరుముల్లా వుండి - పైనుండి చూసే దేవతల చూపులవరుసలే మెఱపుల్లా వుండి, భక్తుల యొక్క పరవశానందాశ్రువులే వర్షధారలుగా ఉండి, పార్వతీదేవియే ఆడనెమలిగా ఎదురుగా వుంటే - నీలకంఠుడనే నెమలి తాండవనృత్యం చెయ్యకుండా వుంటుందా - అతి మనోజ్ఞమైన మనోహరమైన ఆ నృత్యం చేసే నీలకంఠున్ని ధ్యానంలో దర్శించి భజించి తీరాలి - అంటున్నారు శంకరులు.

## సంస్కృత శ్లోకము - 55

శ్లో. ఆద్యాయామితతేజసే శ్రుతిపదైర్వేద్యాయ సాధ్యాయ తే
విద్యానందమయాత్మనే త్రిజగతస్సంరక్షణోద్యోగినే ।
ధ్యేయాయాఖిలయోగిభి స్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే ॥

## అనువాద పద్యము

సీ॥ మొట్ట మొదటివాడు చిట్టచివరివాడు
అమిత తేజోరూపమైన వాడు
దివ్యశ్రుతుల యందు తెలియదగినవాడు
పరమభక్తికి సాధ్యపడెదువాడు

ఆనంద విద్యామయాత్మరూపమువాడు
సర్వయోగి ధ్యానసార ఫలము
మూడు లోకమ్ముల పూర్ణ రక్షణమున
కున్నత దీక్షగైకొన్నవాడు.

గీ॥ సురలు గీర్తింప దగువాడు శుభకరుండు
జడలు దాల్చిన వాడు, చిచ్ఛక్తి యుతుడు
చూడచక్కని తాండవ మాడు శివుని
కోరి చేతును శత నమస్కరములను.

## టీక

ఆద్యాయ = ప్రపంచమునకు మొదటివాడును, అమితతేజసే = మితిలేని తేజస్సు రూపము గలవాడును, శ్రుతిపదైః = వేదవాక్యముల చేత, వేద్యాయ = తెలియదగినవాడును, సాధ్యాయ = భక్తానుగ్రహము కొఱకు ప్రతిమాదిరూపమున బ్రతిష్ఠింపబడినవాడును, విద్యానంద మయాత్మనే = చిదానందమయమైన యాత్మస్వరూపుడును, త్రిజగతః = ముల్లోకము యొక్క, సంరక్షణ = కాపాడుటయందు, ఉద్యోగినే = ప్రవృత్తిగలవాడును, అఖిలయోగిభిః = యోగులందఱిచేతను, ధ్యేయాయ = ధ్యానించదగిన వాడును, సురగణైః = దేవగణముల చేతను, గేయాయ = గానము సేయదగిన వాడును, మాయావినే = చిచ్ఛక్తితోగూడినవాడును, సమ్యక్తాండవసంభ్రమాయ = చక్కని తాండవ నృత్యమందు తొందరగలవాడును, జటినే = జడలు దాల్చినవాడును, శంభవే = సుఖకరుండునుఅగు, తే = నీ కొఱకు, సా= ఆ, ఇయం = ఈ, నతిః = నమస్కారము అగుగాక.

## తాత్పర్యము

ఆదిదేవుడు, తేజస్వంతుడు, వేదవేద్యుడు, భక్తసులభుడు, చిదానందుడు, జగద్రక్షకుడు, ధ్యానగమ్యుడు, సురకీర్తనుడు, చిచ్ఛక్తియుతుడు, తాండవ నృత్య తత్పరుడు, జటాధారి, సుఖకరుడు - అయిన శివునికి నమస్కారము.

## వివరణము

శివునికి ముందెవ్వరూ లేరు. అంటే తల్లిదండ్రులు గూడా శివునికి లేరు. ఒకసారి పార్వతి 'నేను నా తల్లీదండ్రీ పేర్లు చెబుతాను – మీరు మీ తల్లీదండ్రీ పేర్లు చెప్పగలరా ? అని అడిగిందట !' అందుకు శివుడు ఏ పేర్లు చెప్పాలో తెలియక, ఏం చెయ్యాలో తోచక చివరకు తెగించి – 'నేను నా అత్తా మామా పేర్లు చెబుతాను నువ్వు మీ అత్తామామా పేర్లు చెప్పగలవా ? అని కార్బన్ కాపీ తెలివితో అడగాల్సి వచ్చిందట ! దీనిని బట్టి శివుడికి తల్లిదండ్రులు లేరని, శివుడే మొదటి వాడు, ఆదిదేవుడూ అనీ నిర్ధారించుకోవలసి వుంటుంది. తల్లిదండ్రులే వుంటే – వాళ్లే ఆది దంపతులు, ఆదిదేవుళ్ళు అయి వుండేవారు కదా ! అందుకని శివుడు మొట్టమొదటి వాడు.

అలాగే సకలదేవతలతో సహా సకల సృష్టి – ప్రళయకాలంలో కాలవశమై శివునిలోకి లీనమైతే – ఆ ప్రళయానికి సాక్షీభూతుడుగా సదాశివుడు ఒక్కడే వుంటాడు. అందుకని శివుడు చిట్ట చివరి వాడు.

యజుర్వేదంలోని రుద్రసూక్తాల్లోను ఈశావాస్యాది ఉపనిషత్తులలోను పూర్తిగా ప్రతిపాదింపబడిన వాడు ఈశుడే ! భక్త సులభుడు. భోళాశంకరుడు. ఉద్ధరిణె నీరు నెత్తిమీద పోస్తే చాలు ఉబ్బిపోయే ఉబ్బులింగడు. యోగమూర్తి అవడం మూలాన యోగులందరూ శివుణ్ణే ధ్యానిస్తారు. మూడు కన్నులతో త్రికాల జ్ఞానం కలవాడు. కాబట్టే ముల్లోకవాసులకు ఎప్పుడు ఏం జరుగుతుందో తెలిసి అవసరమైతే వారిని కాపాడేవాడు. ఇంతటి మహిమాన్వితుణ్ణి సురలంతా కీర్తిస్తారు. పూజిస్తారు. తాండవనృత్యం చేసి ఆనందింప చేసే అటువంటి శివునికి కోరి మరీ నమస్కారం చెయ్యాలి అంటున్నారు ఆదిశంకరులు.

### సంస్కృత శ్లోకము - 56

శ్లో. **నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయనీశ్రేయసే**
**సత్యాయాదికుటుంబినే మునిమనః ప్రత్యక్ష చిన్మూర్తయే ।**
**మాయాసృష్టజగత్త్రయాయ సకలామ్నాయాంతసంచారిణే**
**సాయం తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే ॥**

## అనువాద పద్యము

సీ॥ నిత్య స్వరూపుండు సత్య స్వరూపుండు
త్రిగుణ రూపము వాడు త్రిపురహరుడు
కాత్యాయనీదేవి కమనీయఫలముగన్
ఆదికుటుంబీకుడైన వాడు
ముని మానసములకు ముందుగన్ నిలిచెడు
చిద్రూప సంపద చెల్లువాడు
పూర్ణమాయాసృష్ట ముజ్జగమ్ములవాడు
సకల వేదాంత సంచారి యౌచు

గీ॥ సంధ్యలో తాండవమ్మును సల్పువాడు
జడలు దాల్చినవాడు, శశాంక యుతుడు
అఖిలసుఖములకుత్పత్తి యైన శివుని
కోరి చేతును శత నమస్కారములను.

## టీక

నిత్యాయ = నిత్యుఁడును (చలనము లేనివాడు), త్రిగుణాత్మనే = సత్త్వరజస్తమోగుణములు శరీరములుగా గలవాడును (బ్రహ్మవిష్ణు రుద్ర స్వరూపుడు), పురజితే = స్థూలసూక్ష్మ కారణ శరీరములను లేక త్రిపురాసురులను జయించినవాడును, కాత్యాయనీశ్రేయసే = పార్వతీదేవి యొక్క తపః ఫలమైనవాడును, సత్యాయ = భూతభవిష్యద్వర్తమాన కాలములు మూటియందును బాధలేనివాడును, ఆదికుటుంబినే = మొట్టమొదటి సంసారియైన వాడును, మునిమనః = మునీశ్వరుల యొక్క మనస్సులకు, ప్రత్యక్ష = గోచరమైన, చిన్మూర్తయే = చిత్స్వరూపము గలవాడును, మాయా = మాయాశక్తిచేత, సృష్ట = సృజింపబడిన, జగత్త్రయాయ = ముల్లోకములు గలవాడును, సకల = సమస్తమైన, ఆమ్నాయాంత = ఉపనిషత్తుల యందును,

సంచారిణే = సంచరించువాడును (ఉపనిషద్వాక్యములచే బోధింపబడువాడు), సాయం = సాయంకాలమున, తాండవసంభ్రమాయ = తాండవ మాడు తొందరగలవాడును, జటినే = జడలుదాల్చినవాడును, శంభవే = సుఖోత్పత్తికారణమైనవాడును నగు పరమేశ్వరుని కొఱకు, సా = ఆ, ఇయం = ఈ, నతిః = నమస్కారము అగుగాక.

## తాత్పర్యము

నిత్యుడును, త్రిగుణశరీరుడును, పురభేదియు, పార్వతీ మనోహరుండును, మునిమనస్సులకు గోచరించువాడును, చిద్రూపుడును, వేదాంతవేద్యుడును, మాయవలన ముల్లోకములను గల్పించువాడును, తాండవనృత్యమందాసక్తి గలవాడు నగు శివునకు నమస్కారము.

## వివరణము

ఈ శ్లోక అనువాద పద్యంలోను, తాత్పర్యంలోను అవసరమైన వన్నీ వివరించడం జరిగింది. అందువల్ల వేరుగా వివరణ అవసరం లేదు.

## సంస్కృత శ్లోకము - 57

శ్లో. నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవత స్సేవాం న జానే విభో ।
మజ్జన్మాంతరపుణ్యపాకబలత స్త్వం శర్వ సర్వాంతర
స్తిష్ఠస్యేవహి తేన వా పశుపతే తే రక్షణీయోఽస్మ్యహమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ పొట్టనింపగ జేయునట్టి మార్గములలో
ధనమునందాశతో ధనికతతిని
ఆశ్రయింపగ జూచి వ్యర్థ సంచారమ్ము
చేయుచుంటి సతము చెలిమి చేసి

అంతెగాని విభుడవైన నిను భజింప
　　యెంత మాత్రమును నే నెఱుగకుంటి
నా పూర్వజన్మ పుణ్య పరిపాకము వల్ల
　　అమల తేజముతోడ నంతరమున
గీ॥ నీవు నాయందు దీప్తివై నిలిచినావు
పశుపతీ ! శర్వ ! పరమేశ ! పార్వతీశ !
ఇంక సంరక్షణాభార మెల్లవేళ
నీవె చేయంగ వలె నాకు నీలకంఠ !

## టీక

నిత్యం = అనుదినమును, స్వోదరపోషణాయ = తనపొట్ట పోసికొనుట కొఱకు, విత్తాశయా = ధనలోభముతో, సర్వాన్ = ధనముగల వారి నందలను, ఉద్దిశ్య = గుఱించి, వ్యర్థం = నిష్ప్రయోజనముగా, పర్యటనం = సంచారమును, కరోమి = చేయుచున్నాను. హేవిభో = సర్వవ్యాపకుడవైన ఓ దేవా ! భవతః =నీ యొక్క, సేవాం = భజనమును, నజానే = ఎఱుగను. హేపశుపతే = సర్వప్రపంచపాలకుండవును, హేశర్వ = పరమేశ్వరా, మజ్జన్మాంతర పుణ్య = నాపూర్వజన్మార్జిత పుణ్యమయొక్క, పాకబలతః = పరిపాకవశము వలన, త్వం = నీవు, సర్వాంతరః = అన్నమయాదికోశము లన్నిటికంటెను సూక్ష్మరూపుడవై యంతర్యామిగా నా యంతరంగమున, తిష్ఠస్యేవహి = ఉన్నావు గదా!, తేనవా = ఆహేతువు చేతనైనను, తే = నీకు, అహం = నేను, రక్షణీయః = రక్షింపదగినవాఁడను, అస్మి = అగుదును.

## తాత్పర్యము

శివా! పొట్టపోసికొనుటకు ధనాశతో నెందరినో యాశ్రయించితినిగాని నిన్ను సేవించు టెరుగను. పూర్వజన్మమున ఏ కొంచెమో పుణ్యము చేసితిని కనుకనే నాయంతరంగమున నున్నావు. నన్ను రక్షించుభారము నీపైనున్నది.

## వివరణము

సాధారణంగా సంసార తాపత్రయంతో ఎలాగో అలా పొట్ట నింపుకోవాలనే స్వార్థంతోనో, ఏదో కొంత వెనకేసుకోవాలనే తలంపు తోనో - అడ్డమైన వారి చుట్టూ తిరుగుతూ, వాళ్ళను మంచి చేసుకోడానికి వాళ్ళని పొగుడుతూ అనవసరంగా కాలాన్ని వృథా చేసుకుంటాము. కాని, ఎప్పుడు ఎవరికి ఏది అవసరమో దాన్ని ఇచ్చేవాడు, - మన కష్టానికి, ప్రయత్నానికి తగిన ఫలితాన్ని తప్పకుండా ఇచ్చే భగవంతుడు ఉన్నాడనే నమ్మకం అంత తొందరగా కలగదు. ఆ భగవంతుడు కూడా మనకు దూరంగా ఎక్కడో లేడు. మనలోనే ఉన్నాడనే భావన కలిగి, ఆ భావం స్థిరపడటం గూడా ఎంతో కాలానికి గాని జరగదు. ఈ విషయాన్నే భగవత్పాదులు ఈ శ్లోకంలో గుర్తు చేస్తున్నారు. 'ఏదో పూర్వజన్మ సుకృతంచేత మానవ జన్మఎత్తాను. సర్వాంతర్యామి యైన నువ్వు నాలో గూడా వుంటావు కదా అనే సత్యం ఇన్నాళ్ళకైనా తెలుసుకుని నిర్భయంగా వున్నాను. (ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి - భగవద్గీత) ఇంక నాకేం దిగులు లేదు. అనవసరంగా కాలాన్ని వృథా చెయ్యను. నిన్నే స్మరిస్తూ చేసే పనుల ఫలితాలన్నీ నీకే సమర్పిస్తాను. మరి నువ్వే నా సంగతి చూసుకోవాలి' - అని ప్రార్థించాలని తనను అడ్డం పెట్టుకుని మనకు తెలియచేస్తున్నారు. కాంచన కనకాలపైనా కీర్తిపైనా వుండే దృష్టిని మళ్ళించి కామేశ్వరునిపై పెట్టండి. ఆయన మీ కామాలన్నీ (అవసరాలన్నీ) తీరుస్తాడు - అని శంకరుల ఉద్బోధ.

## సంస్కృత శ్లోకము - 58

శ్లో. ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః ।
వేద్యః కిం న భవస్యహో ఘనతరం కీదృగ్భవేన్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ ॥

## అనువాద పద్యము

సీ॥ పద్మ బాంధవుడైన భాస్కరుండొకడయ్యు
వసుధాంబరములందు వ్యాప్తమైన
కటిక చీకటి నెల్ల తృటి కాలమున జీల్చి
నేత్ర గోచరమయి నిలిచి యుండ
కోటి సూర్యుల యొక్క మేటి కాంతులు గల
పశుపతీ ! శుభకరా ! ప్రధిత నీవు
తేట తెల్లము నాకు తెలియ వీలుగలిగి
ఏల కాకుంద విదేమి వింత ?

గీ॥ నన్ను బంధించినట్టి అజ్ఞాన తిమిర
కూటమెంతైన నీకదే పాటి దగును ?
కాన తొలగించి యట్టి అజ్ఞానమంత
నీవు ప్రత్యక్షమై నన్ను కావుమయ్య !

## టీక

హేపశుపతే = ఓ పరమేశ్వరా ! వారిజబాంధవః = పద్మబాంధవుడైన సూర్యుడు, ఏకః = ఒక్కడయ్యును, క్షితినభోవ్యాప్తం = భూమ్యంతరిక్షములు నిండిన, తమోమండలం = అంధకారరాశిని, భిత్వా = భేదించి, లోచన గోచరోఽపి = కన్నులకగుపడుచున్నవాడును, భవతి = అగుచున్నాడు. త్వం = నీవు, కోటిసూర్యప్రభః = కోట్లకొలంది సూర్యులయొక్క కాంతి గలవాడవు, వేద్యః = తెలిసికొనదగినవాడవు, కింనభనసి = ఏలకావు? అహో = ఎంతవింత, ఘనతరం = మిగులదట్టమైనది యయ్యును, మత్తమః = నాయజ్ఞానాంధకారము, కీదృక్ = ఏపాటిది, భవేత్ = అగును ? తత్ = కనుక, సర్వం = ఆ అజ్ఞానమునంతను, వ్యపనీయ = తొలగించి, సాక్షాత్ = ప్రత్యక్షమై, ప్రసన్నః = అనుగ్రహించువాడవు, భవ = అగుము.

## తాత్పర్యము

దేవా! ఒక్కసూర్యుడే భూమ్యాకాశముల నిండిన చీకటిని పోగొట్టుచు కన్నుల కగపడుచున్నాడు. కోటిసూర్యుల వెలుగొందుచున్న నీవేల ప్రత్యక్షముగావు? నాయజ్ఞానాంధకారము తొలగించుట నీకొక లెక్కయా? నాకు సాక్షాత్కరించి యనుగ్రహింపుము.

## వివరణము

శ్రీ లలితాసహస్రనామాల్లో 'భక్తహార్దతమోభేద భానుమద్భానుసంతతిః' అనే నామం ఉంది (404 నామం). అలాగే సౌందర్యలహరిలో శంకర భగవత్పాదులే 'అవిద్యానామంతస్తిమిర మిహిరద్వీపనగరీ' అని 3వ శ్లోకంలో అమ్మవారిని సంబోధించారు. ఈ రెంటి అర్థం ఏమిటో ప్రస్తుత శ్లోకానికి అర్థం కూడా అదే ! (తప్పకుండా ఈ రెండింటి అర్థాలను నేను వ్రాసిన శ్రీలలితాసహస్రనామ వివరణ రెండవ భాగంలోను, సౌందర్యలహరి వివరణలోని 3వ శ్లోక వివరణలోను చదవండి - వివరణ కర్త.)

మనకు కనబడే సూర్యుడు భూమ్యాకాశాల మధ్య వున్న చిమ్మ చీకటి నంతా పటాపంచలు చేసి మనకు కనిపిస్తున్నాడు. అంతర్యామి అయిన శివుడు కోటి సూర్య ప్రభాసంపన్నుడు. అయినా ఆయన మనకు కనబడటం లేదు. లోపం ఆయనలో వుందా ? మనలో వుందా ? అని ప్రశ్నించుకుంటే అసలు సంగతి తెలుస్తుంది. ఆయన కోటిసూర్య ప్రకాశ మానుడే ! అయితే ఆయన మన హృదయంలోనే వున్నా మన్న హృదయం నిండా దట్టంగా అజ్ఞానాంధకారం అలుముకుని వుంది. దాన్ని దాటి బయట పడటమే కష్టం. ఆ అజ్ఞానాంధకారం పోగొట్టు కోవాలంటే మన వల్లకాదు. ఆయన అనుగ్రహం మనపై ప్రసరించి జ్ఞానోదయమవాలి. బాహ్యదృష్టికి 'కార్యం' మాత్రమే కనబడుతుంది. అంతర దృష్టికి మాత్రమే 'కారణం' ద్యోతక మవుతుంది. వెలుగుకు సూర్యుడు కార్యం అయితే ఈశ్వరుడు కారణం అవుతాడు. కారణం ద్యోతక మవాలంటే

అంతరదృష్టి ఏర్పడాలి. ఆ రోజు త్వరలో రావాలని హృదయాంతర్గతమైన అజ్ఞానాంధకారం పోయి దేదీప్యమానమైన ఆయన దర్శనం కలగాలని, - అందుకు భక్తితో, ప్రపత్తితో నిరీక్షించాలని శంకరులు హితవు పలుకుతున్నారు. (పద్మ బాంధవుడైన సూర్యుడు పద్మాన్ని తన దీప్తివంతమైన కిరణ పుంజంతో వికసింపచేస్తే - 'హృదయపద్మబాంధవుడైన ఈశ్వరుడు దేదీప్యమానమైన జ్ఞాన ప్రకాశంతో అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి హృత్పద్మవికసనానికి తోడ్పడతాడు' అనే విషయం - 'ఏకోవారిజబాంధవః" - అనే పద ప్రయోగం సూచిస్తుందని గమనించాలి.)

## సంస్కృత శ్లోకము - 59

శ్లో. హంసః పద్మవనం సమిచ్ఛతి యథానీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా ।
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్య సౌఖ్యప్రదమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ అరవింద వనమును హంసరాజమ్ములు
జలధరశ్రీలను చాతకములు
సవితాంశు శతమును చక్రవాకమ్ములు
కుముద బాంధవుని చకోరములును
ఏ ప్రకారమ్ము తామిచ్ఛతో జేరునో
ఆ ప్రకారమ్ము నా అమల మనసు
వేదాంతములలోనె వెదుకగన్ తగినట్టి
కైవల్య సౌఖ్యమ్ము కలుగునట్టి
గీ॥ పశుపతీ ! మహాదేవేశ ! పార్వతీశ !
చంద్రమౌళీశ్వరా ! విభో ! సదయభావ

నీ పదాంభోరుహ యుగళ నిధిని సతము
మారు త్రోవలు పోకుండ గోరుచుందు.

## టీక

హే పశుపతే = సకలభూతములకునధిపతియు, హేవిభో = సర్వవ్యాపకుడవునగు, హేగౌరీనాథ = ఓపార్వతీపతీ ! హంసః = హంసపక్షి, పద్మవనం = కమలములగుంపును, చాతకః = చాతకపక్షి, నీలాంబుదం = నల్లమబ్బును, కోకః = చక్రవాకపక్షి, కోకనదప్రియం = సూర్యుని, చకోరః = చకోరపక్షి, ప్రతిదినం = దినదినమును, చంద్రం = చంద్రుని, యథా = ఏ ప్రకారముగా, సమిచ్ఛతి= కోరుచున్నదో, తథా = అప్రకారముగా, మామకం = నాసంబంధమైన, చేతః = చిత్తము, చిన్మార్గమృగ్యం = ఉపనిషత్తుల యందు వెదుకదగిన, కైవల్యసౌఖ్యప్రదం = కేవలనిర్గుణపరబ్రహ్మ భావంబను సౌఖ్యము నొసగునట్టి, భవత్పాదాబ్జయుగళం = మీపాదపద్మద్వంద్వమును, వాంఛతి = కోరుచున్నది.

## తాత్పర్యము

గౌరీశా! హంస - పద్మములను, వానకోయిల - వర్షాకాలమేఘమును, చక్రవాకము - సూర్యుని, వెన్నెలపురుగు - చంద్రునికోరినట్లు, నీ పాదపద్మములను - నా చిత్త మెల్లప్పుడు కోరుచున్నది.

## వివరణము

ఎవరెవరికి ఎవరెవరంటే ఇష్టమో మనం జాగ్రత్తగా ఈ విశ్వాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది. హంసకు పద్మాలంటే ఇష్టం. చాతకపక్షికి వర్షాకాలమేఘమంటే ఇష్టం. చక్రవాకపక్షికి సూర్యుడంటే ఇష్టం. చకోరపక్షికి చంద్రుడంటే ఇష్టం. ఒక్క ఇష్టమే కాదు ఎలాగైనా ఎప్పుడూ అవి వాటి వాటి సాన్నిధ్యంలో ఉండిపోవాలని తపిస్తాయి. అందుకు తగ్గ ప్రయత్నం కూడా చేస్తాయి. అవసరమైతే ఆ సమయం వచ్చేవరకు నిరీక్షిస్తాయి. అలాగే -

'బుద్ధి విశేషం కల మానవునికి తన బుద్ధి వికసనమే పరమధ్యేయం. ఆత్మజ్ఞానమే అంతిమ లక్ష్యం. ఇది ప్రాపంచిక విషయంలపటత్వంవల్ల సిద్ధించదు. ఉపనిషత్తులు మొదలైన జ్ఞానమార్గ ప్రబోధకమైన వాటి ద్వారా మాత్రమే సిద్ధిస్తుంది. ముందు అంతఃకరణం శుద్ధి చెందాలి. అందుకోసం - జ్ఞానానికి, కైవల్యానికి ఉత్పత్తి స్థానం అయిన శివుని పాదారవిందాలయందే మన చిత్తాన్ని నిమగ్నం చెయ్యాలి' అనే సూచన భగవత్పాదులు ఈ శ్లోకం ద్వారా తెలియచేస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 60

శ్లో. రోధస్తోయహృతః శ్రమేణ పథికశ్ఛాయాం తరోర్వృష్టితో
భీతః స్వస్థగృహం గృహస్థమతిథిర్దీనః ప్రభుం ధార్మికమ్ ।
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృత స్త్వం తథా
చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ నీటి వేగములోన సూటిగా పడినవా
డెవ్విధమ్మున జేరు నేటిగట్టు
నడకవల్ల శ్రమనుపడు ప్రయాణికుడిట
జేరు నే రీతిగన్ చెట్టునీడ
కటిక చీకటిలోన కదలకుండెదువాడు
చేపట్టునేరీతి దీపకళిక!
వర్షభీతుండెట్లు స్వస్థ గృహము జేరు
అగ్ని నెట్లందు శీతావృతుండు

గీ॥ దీనుడెట్లందు ధార్మిక క్షోణిపతిని,
అతిథి యెట్లు జేరు గృహస్థు ! నట్లెసతము
సర్వభయహర ! సుఖకర ! శంభుపాద
పద్మముల నందుమా చిత్త భ్రమరరాజ !

## టీక

హేచేతః = ఓ మానసమా ! తోయహృతః = నీటివేగమున కొట్టుకొని పోవువాడు, రోధః = తీరమును, పథికః = బాటసారి, శ్రమేణ = అలసటచేత, తరోః = చెట్టుయొక్క ఛాయాం = నీడను, వృష్టితః = వర్షము వలన, భీతః = భయపడినవాడు, స్వస్థగృహం = సుఖమైనయిల్లును, అతిథిః = భోజనసమయమునకు పొరుగూరు నుండి వచ్చినవాడు, గృహస్థం = సంసారిని, దీనః = దరిద్రుడు, ధార్మికం = ధర్మాత్ముడైన, ప్రభుం = రాజును, సంతమసాకులః = చీకటిలో కొట్టుకొనుచున్నవాడు, దీపం = దీపమును, శీతావృతః = చలిపట్టుకొన్నవాడు, శిఖినంచ = అగ్నిహోత్రమును, యథా = ఏ ప్రకారముగా (ఆశ్రయించునో), తథా = ఆ ప్రకారముగా, త్వం = నీవు, సర్వభయాపహం = ఎల్లభయములను బాపునదియు, సుఖం = సుఖకరమైనదియునగు, శంభోః = శివుని యొక్క పదాం భోరుహం = పాదకములమును, వ్రజ = ఆశ్రయింపుము.

## తాత్పర్యము

ప్రవాహమున గొట్టుకొనిపోవువాడు ఒడ్డును, బాటసారి చెట్టునీడను, వర్షమున తడియువాడు మంచియింటిని, దీనుడు ధర్మాత్ముని, చీకటిలోపడ్డవాడు దీపమును, చలిచే పీడితుడు అగ్నినివలే ఓ మనసా నీ వీశ్వరునిపాదము లాశ్రయింపుము. అవి సమస్తభయములను పోగొట్టును.

## వివరణము

ఒక్కొక్క రకమైన కష్టంగాని, ఇబ్బంది గాని,ఆపద గాని వచ్చినపుడు – ఒక్కొక్కరకమైన ఉపశమనం గాని, పరిష్కారం గాని పొందడానికి ప్రయత్నిస్తాము. అన్ని రకాల సమస్యలకు ఒకే ఒక పరిష్కారం ఉండదు. కాని, జగన్నాటక సూత్రధారుడైన పరమేశ్వరుని పాదాల నాశ్రయిస్తే అన్ని సమస్యలకూ పరిష్కారాలు కుదిరి బాధలన్నీ తొలగి శుభాలు కలుగుతాయి. అందువల్ల ఇతర వృథా

ప్రయాసలు మాని ఈశ్వర పాదారవిందాలను ఆశ్రయించమని శంకరులు సలహా ఇస్తున్నారు. ఆపదవస్తే – ఆ పదమే శరణ్యం.

## సంస్కృత శ్లోకము - 61

శ్లో. అంకోలం నిజబీజ సంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్ ।
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే ॥

## అనువాద పద్యము

సీ॥ అంకోల బీజమ్ములన్ని పండిమరల
వాటంతటవి చెట్టు పట్టునట్లు
సూది తిన్నగపోయి సూదంటురాతిని
అత్రమ్ముమీరగా నంటునట్లు
సాధ్వీ శిరోమణి సహకరించుచు పతి
న్విడ నాడకుండ జీవించునట్లు
చిగురుదొడగుతీగ చెట్టును పెనవైచి
వదలకుండగ పైకి ప్రాకునట్లు

గీ॥ నదులు సాగరు జేరగాఁ గదలునట్లు
శివుని పాద పద్మయుగళ సేవ సతము
చేయుచుండుట యన్నది చెప్పబడును
ముక్తి నొసగెడు యుక్తమౌ భక్తియనగ

## టీక

ఇహ = ఈ లోకమందు, నిజబీజసంతతిః = తనగింజలరాశి, అంకోలం = ఊడుగుచెట్టును, సూచికా = సూది, అయస్కాంతోపలం = సూదంటుఱాయిని, సాధ్వీ = పతివ్రత, నైజవిభుం = తనభర్తను, లతా = తీగ, క్షితిరుహం =

వృక్షమును, సింధుః = నది, సరిద్వల్లభం = సముద్రమును, యథా = ఏ ప్రకారముగా (తనంతట తానే), ప్రాప్నోతి = పొందుచున్నదో, తథా = ఆ ప్రకారముగా, చేతోవృత్తిః = చిత్తవృత్తి, పశుపతేః = ఈశ్వరునియొక్క, పాదారవిందద్వయం = పాదకమలయుగళమును, సదా = ఎల్లప్పుడును, ఉపేత్య = పొంది, తిష్ఠతి = ఉండుట ఏదికలదో, సా = అది, భక్తిరితి = భక్తియని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

## తాత్పర్యము

ఊడుగింజలు చెట్టును వానియంతటనవియే యంటుకొనునట్లు, సూది - సూదంటురాయిదగ్గరకు పరుగెత్తునట్లు, పతివ్రత - పతినెడబాయనట్లు, తీగ - చెట్టును పెనవేసికొనునట్లు, నదులు - సముద్రమును పొందునట్లు మనోవృత్తి శివుని పాదపద్మములను పొంది యుండుటయే భక్తియని పెద్దలు చెప్పుదురు.

## వివరణము

భక్తి అంటే ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలం ఉండాలే గాని ప్రపంచంలో ఎన్నో రకాలుగా ఈ భక్తి వ్యక్తమవుతుంది. ఆ భక్తిలో గూడా ఎన్నో వ్యత్యాసాలు, వైవిధ్యాలు వుంటాయి.

అంకోల బీజాలు అంటే ఊడుగు గింజలు పండి చెట్టు నుండి నేలమీదకు రాలిపోయినా మళ్ళీ ఒక అనుకూల సమయం ఆసన్నమైనపుడు ఇతర ప్రేరణలు లేకుండా వాటంతట అవే ఆ ఊడుగు చెట్టు ప్రమానుకే అంటుకుపోతాయి. అంటే, తాము చేరవలసిన చోటు వాటికి తెలుసన్నమాట. ఇది సామీప్య ముక్తిని సూచించే భక్తికి నిదర్శనం.

దగ్గరలో ఏదన్నా సూదంటు రాయి (అయస్కాంతం) ఉంటే సూది ఇతర త్రోవలు పట్టకుండా ఏదో కొంపమునిగిపోయినట్లు ఆత్రంగా తిన్నగా వెళ్ళి, ఆసూదంటురాతిని అతుక్కుపోతుంది. అంతేకాదు. ఆ సూదంటు రాతి ఆకర్షణ

ధర్మాన్ని గూడా తానూ పొందుతుంది. ఇది సాలోక్యముక్తిని సూచించే భక్తికి నిదర్శనం.

పతివ్రతా శిరోమణి తన భర్తను ఆశ్రయించుకుని వుంటూ, అతని తోడిదే తన జీవితానికి అర్థము పరమార్థము అని నమ్ముతూ, ఎప్పుడూ విడవకుండా కనిపెట్టుకుని సహధర్మచారిణీ ధర్మాన్ని నిర్వర్తిస్తుంది. ఇది కూడా సామీప్య, సాలోక్యాలను సూచించే భక్తికి నిదర్శనం.

అప్పుడే చిగురు వేస్తున్న తీగ ఒక చెట్టును గాని వెదురు కర్రను గాని ఆశ్రయంగా చేసుకుని వదలకుండా దాన్ని చుట్టుకుంటూ పైపైకి ప్రాకుతుంది. చివరకు పువ్వులను ఫలాలను పొంది ప్రపంచానికి సమర్పిస్తుంది. ఇది కూడా సామీప్య ముక్తిని సూచించే భక్తికి నిదర్శనం.

ఎక్కడో పుట్టి, ఎక్కడెక్కడో ప్రవహించినా - నదులు చిట్టచివరకు తమ లక్ష్యాన్ని గుర్తుపెట్టుకుని, సముద్రాన్ని చేరి దానిలో లీనమైపోతాయి. తమ అస్తిత్వాన్ని కూడా కోల్పోతాయి. నదినీళ్ళు తియ్యగా వున్నా - సముద్రంలో కలవంగానే - ఆ నీళ్ళు ఉప్పగానే వుంటాయి. అంటే సముద్ర లక్షణాన్ని, రూపాన్ని గూడా పొంది తమ అస్తిత్వాన్ని (నామరూపాలను) పూర్తిగా కోల్పోయి, సముద్ర నామంతోనే సముద్రలక్షణంతోనే వ్యవహరింప బడతాయి. ఇది సాయుజ్య ముక్తిని సూచించే భక్తికి నిదర్శనం. ఇన్ని రకాల లక్ష్యాలతోను భక్తిని, తద్వారా ముక్తిని పొందవచ్చును.

## సంస్కృత శ్లోకము - 62

శ్లో. ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యత శ్ఛాదనం
వాచాశంఖముఖస్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః ।
రుద్రాక్షైర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి ॥

## అనువాద పద్యము

సీ॥ మేనంత పులకింప నానంద బాష్పాల
తోడ స్నానక్రీడ నాడ జేసి
స్వచ్ఛ భావమ్మను వస్త్రమ్ము కప్పుచున్
పొత్తిళ్ళలోచేర్చి హత్తుకొనుచు
వేద వాక్కులనెడి వెండి గిన్నెలతోడ
త్వచ్చరిత్రమ్మను పాలు పట్టి
భూతిరుద్రాక్షలచే తనూరక్షణ
తనివితీరంగ మోదమ్ము పంచి
గీ॥ అపుడు నీ ధ్యానమనియె డుయ్యలనుకూర్చి
పవ్వళింపగ జేయును పాటపాడి
భక్తియను తల్లి యీ భంగి భక్తశిశువు
నెపుడు బెంచును ప్రేమతో తపము సరణి.

## టీక

హేదేవ = స్వయంప్రకాశస్వరూపుడవైన ఓపరమేశ్వరుడా ! భక్తిజననీ = నీ భక్తియనియెడు తల్లి, ఆనందాశ్రుభిః = ఆనందబాష్పములచేత, పులకం = రోమాంచమును, ఆతనోతి = విస్తరింపజేయును. నైర్మల్యతః = నిర్మలత్వము చేత, ఛాదనం (ఆతనోతి) = (ఈగలు దోమలు చలి మొదలగు బాధ లేకుండ) బట్టకప్పుటయు నొనర్చును. వాచాశంఖముఖస్థితైః = వేదవాక్కను శంఖము యొక్క ముఖమందున్నట్టి, చరిత్ర = నీ చరిత్రములనియెడు, అమృతైః = పాలతో, జఠరాపూర్తిం (ఆతనోతి) = కడుపునిండ జేయును. రుద్రాక్షైః = రుద్రాక్షలచేతను, భసితేన = విభూతిచేతను, వపుషః = శరీరము యొక్క, రక్షాం (ఆతనోతి) = సంరక్షణము చేయును. భవద్భావనాపర్యంకే = నీ తలంపనియెడు మంచమందు, వినివేశ్య = పరుండబెట్టి, భక్తార్భకం = భక్తుడను శిశువును, రక్షతి = కాపాడును.

## తాత్పర్యము

తల్లి బిడ్డను చేరదీసి పులకితుని చేయునట్లు భక్తిరసము భక్తుని పరవశుని చేయును. తల్లి బిడ్డకు ఈగలు మొదలగుబాధను తొలగించుటకు బట్టకప్పునట్లు భక్తి నిర్మలభావము నావరింపచేయును. తల్లి పాలను త్రాగించునట్లు భక్తి వేదాదివాక్యముగా నీచరితామృతమును తనివితీరత్రాగించును. రుద్రాక్షలను ధరింపజేసి, విభూతిపెట్టించి రక్షించును. తల్లి బిడ్డను మంచముపై పరుండబెట్టి కాపాడునట్లు భక్తి మనస్సునందు ఈశ్వరధారణయను మంచమున ప్రవేశపెట్టి పరిపాలించును.

## వివరణము

భక్తి తన భక్తుడనే శిశువును తల్లిలాగా ఎలా లాలించి, పాలించి, పెద్ద చేసి రక్షిస్తుందో ఈ శ్లోకంలో వివరిస్తున్నారు.

పసిపిల్లవాణ్ణి చూడంగానే తల్లికి సహజమైన మాతృప్రేమ ఉప్పొంగి దగ్గఱకు తీసుకుంటుంది. ఆ స్పర్శకు శిశువుకు ఒళ్ళు పులకరిస్తుంది. తల్లికి ఆనంద బాష్పాలు ఒలుకుతాయి. భక్తి కూడా భక్తునికి పరవశం వచ్చినపుడు ఆనంద బాష్పాలు వచ్చేటట్లు చేస్తుంది. తల్లి – శిశువును స్నానం చేయిస్తుంది. భక్తి గూడా భక్తుణ్ణి పరవశుణ్ణి చేసి అప్పుడు వచ్చిన ఆనంద బాష్పాలతోనే సుస్నాతుణ్ణి చేస్తుంది.

తల్లి ఒడిలోని స్పర్శకు శిశువుకు ఏదో అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. అంతకు పూర్వం వళ్ళు నెప్పులు మొదలైనవన్నీ దూరమైపోతాయి. ఒక విధమైన హాయిచేకూరుతుంది. అలాగే భక్తి – భక్తుణ్ణి పరవశుణ్ణి చేసి వళ్ళు తెలియని హాయిని చేకూరుస్తుంది.

కీటకాలు కుట్టకుండా చలి బాధించకుండా ఉండి హాయిగా నిద్ర సుఖాన్ని పొందడం కోసం – మెత్తని పొత్తిళ్ళలో చేర్చి హృదయానికి హత్తుకుని తల్లిశిశువును పడుకోపెడుతుంది. అలాగే భక్తి గూడా భక్తునికి పవిత్రమైన, నిర్మలమైన సాత్త్విక భావాలను కలుగచేసి ఆదరిస్తుంది.

తల్లి శంఖువంటి వెండిగిన్నెలలో ఆవుపాలుపట్టి శిశువుపొట్టను నింపుతుంది. అలాగే - భక్తి కూడా భక్తునిచేత అర్చనాదులు చేయించి - శివచరిత్రను తెలిపే స్తోత్రాలను చదివింపచేసి 'శంఖమధ్యస్థితం తోయం... అంటూ తీర్థస్వీకార మంత్రాన్ని చెప్పి తీర్థాన్ని త్రాగిస్తుంది. శిశువు ఝుడుసుకుని ఉలిక్కిపడి కలవరించినా, కలత చెందినా వెంటనే తల్లి రుద్రాక్షలతోను, విభూతి తోను అంగరక్షణ చేస్తుంది - అలాగే భక్తి గూడా భక్తుని చేత రుద్రాక్షలను, విభూతిని ధరించేటట్లు చేస్తుంది.

తల్లి శిశువును ఉయ్యాలలో పరుండ బెట్టి ఆనందభైరవి లాంటి రాగాలతో జోలపాటలు పాడి నిద్రపుచ్చుతుంది. అలాగే భక్తి కూడా భక్తుణ్ణి శివధ్యామనే ఉయ్యాల్లో మనస్సునులీనం చేయిస్తుంది. ఈ విధంగా తల్లి శిశువును లాలించి పాలించి పోషించి రక్షించునట్లు భక్తి కూడా భక్తుణ్ణి ఆదుకుని ఆదరించి అన్ని విధాలా రక్షిస్తుంది. కాబట్టి శిశువుకు తల్లి లాలన పాలన ఎంత అవసరమో భక్తునికి భక్తి అంతే అవసరం - అని శంకరులు ఈ శ్లోకంలో నిర్ధారించారు.

## సంస్కృత శ్లోకము - 63

శ్లో. మార్గావర్తితపాదుకా పశుపతేరంగస్య కూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే ।
కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే ॥

## అనువాద పద్యము

సీ॥ సకల మార్గమ్ములు సంచరించిన చెప్పు
శివ శరీరముపైన చీపురయ్యె
పుక్కిలించిననీరు పురహరునకు పుణ్య
తీర్థాభిషేకమై దివ్యమయ్యె
సగముతినిన మాంసశకలమ్ము తిన్నగన్
నవనివేదనమాచు భవునిజేరె

ఆదిదేవా ! కాళహస్తీశ్వరా ! శివా !

త్రిపురహరా ! విభో ! దేవ దేవ !

గీ॥ వనములచరియించు మృగజీవములనెల్ల

రహిత మొనరింప జూచుకిరాతు డొకడు

పరమ భక్తాగ్రగణ్యుడై తిరము వెలిగె

ఏమి వింత ? భక్తి కసాధ్యమేమి గలదు ?

## టీక

పశుపతేః = శివునియొక్క, అంగస్య = అవయవమునకు, మార్గావర్తిత పాదుకా = పలుమారు దారినడచిన ప్రాతచెప్పు, కూర్చాయతే = చీపురైనది, పురరిపోః = త్రిపురాంతకునికి, గండూషాంబునిషేచనం = పుక్కిలించి నీరుచల్లుట, దివ్యాభిషేచాయతే = గంగాజలముతోడియభిషేకమయినది. కించిద్భక్షితమాంసశేషకబళం = కొంచెము తినగా మిగిలిన మాంసపుతునక, నవ్యోపహారాయతే = క్రొత్తనివేదనద్రవ్య మగుచున్నది. వనచరః = కిరాతుడు, భక్తావతంసాయతే = ఉత్తమభక్తుడగుచున్నాండు. భక్తిః = భక్తి, కిం నకరోతి = ఏమి చేయదు ? అహో = ఎంత విచిత్రము !

## తాత్పర్యము

తిన్నడనుభక్తుని కాలిచెప్పు శివునిశరీరముపై చీపురయ్యెను. పుక్కిటపట్టిన నీరభిషేక జలమయ్యెను. ఎంగిలిమాంసపుముక్కలు నివేదనకైనవి. కిరాతుడగు తిన్నడు భక్తాగ్రగణ్యుడయ్యెను. ఆహా భక్తి ఏమి చేయలేదు!

## వివరణము

ఇది భక్త కన్నప్ప సూటి భక్తిని తెలిపే శ్లోకం. సామాన్యంగా పూజలు, పునస్కారాలు, అర్చనలూ, ఆరాధనలూ ఉన్న చోట - మడి ఆచారాల వంటి నియమనిబంధనలు చాలా వుంటాయి. ఏం చేసినా, ఎలా చేసినా తప్పు పట్టే వారు ఉంటారు. కొందరు ఆ తప్పులకు విపరీతమైన ప్రాయశ్చిత్తాలను గూడా

సూచించి పాటింపచేస్తారు. నిజమైన భక్తికి ఇటువంటి మడి ఆచారాలతోను, నియమ నిబంధనలతోను ఏమీ సంబంధం లేదు. భక్తి కలిగినపుడు - మనస్సు హృదయము ద్రవించి ఏం చేయిస్తే వాటిని సూటిగా చేసి సంతృప్తిని ఆనందాన్ని అనుభవించడమే దైవానుగ్రహం పొందడానికి, తరించడానికి మార్గం. ఈ విషయం ఎన్నిసార్లు చెప్పినా మనం పెట్టుకున్న నియమ నిబంధనలను మనం సాధారణంగా వదులుకోలేక భగవంతునికి దూరమౌతాము. కన్నప్పకథ తెలిస్తే గాని సందేహం తీరదని ఒక శ్లోకం దానికి ఆదిశంకరులు ఈ శివానందలహరిలో కేటాయించారు.

పుణ్య క్షేత్రమైన కాళహస్తికి దగ్గరలో ఒకబోయల గూడెం వుండేది. ఆ గూడెం పేరు 'ఉడుమూరు' శివభక్తి పరులైన దంపతికి ఒక కొడుకు పుట్టాడు. అతనికి వాళ్ళు పెట్టుకున్న పేరు 'తిన్నడు'. సూటి ప్రవర్తన కలిగి వుండే అతనికి 'తిన్నడు' అనే పేరు కూడా సార్థకమే అయింది. తల్లిదండ్రుల నుండి శివభక్తి తిన్ననికి వారసత్వంగా వచ్చింది.

ఒకనాడు అడవికి వేటకు వెళ్ళినపుడు ఒక అడవి పంది అరుస్తూ ఒక పొదలో దూరి కనబడకుండా అంతర్థానమైంది. తిన్నడు దాని కోసం వెళ్ళి వెదుకుతూ వుంటే ఆ పొదల మధ్య శివలింగం ఒకటి కనబడింది. ఆ శివలింగంలో సాక్షాత్తూ శివుణ్ణే చూశాడు తిన్నడు. ఇద్దరుంటే ఎలా మనం మాట్లాడుకుంటామో అలాగే ముఖాముఖీగా ఆ శివలింగంతో ఏవేవోమాట్లాడుతూ కబుర్లు చెప్పేవాడు. పూజ చేసేవాడు. శివునికి ఆకలివేస్తోందని ఆకులను పొట్లంలాగాచుట్టి రుచిచూసిన మాంసపు ముక్కలను దాంట్లో వుంచి - ఒక చేత్తో పట్టుకుని, రెండో చేతిలో అడవిపూలు, బిల్వదళాలు పట్టుకుని, నోటినిండా నీళ్ళు పుక్కిటపట్టి తిన్నగా శివలింగం దగ్గరకు వచ్చి చేతులలోని ద్రవ్యాలు క్రింద బెట్టి, తన కాలి చెప్పుతో లింగంపై బడిన ఎండుటాకులు, పండుటాకులను చీపురుతో ఊడ్చినట్లు తుడిచేవాడు. తన పుక్కిట్లో వున్న నీటిని లింగంపై

ఉమిసి కడిగేవాడు. దళాలను పూలను పైన వేసి పూజించేవాడు. దొప్పలోని రుచి చూసిన మాంసాన్ని నైవేద్యం పెట్టేవాడు. శివుడు తినకపోతే బ్రతిమాలుకునే వాడు. ఇదీ శివునికి తిన్నడుచేసే పూజ.

మనం కనక ఈ పూజ చూస్తే 'హవ్వ!' 'హవ్వ !' అంటూ రెండు చేతివ్రేళ్ళతో చెక్కిళ్ళు నొక్కుకునేవాళ్ళం. శివుడు మాత్రం ఇవేం పట్టించుకోలేదు. ఒక రోజు శివుడు తిన్నడిని పరీక్షిద్దామని తన ఒక కంటినుండి నీరు కార్చాడు. తిన్నడు ఆ కన్ను ఆ విధంగా ఉండటం చూడలేక వెంటనే అడవిలోని కొన్ని చెట్ల ఆకుల రసాలు తెచ్చి వైద్యం చేశాడు. అయినా నీరు రావడం తగ్గలేదు. పైగా ఈ సారి రక్తం కూడా రావడం ప్రారంభించింది. ఆ రక్తాన్ని ఆపడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అయినా రక్తం కారడం ఆగలేదు. అప్పుడు శివుని ఆ కంటిని ఊడబెరికి తన కన్నునొక దానిని అక్కడ పెట్టాడు.

ఇంతలో రెండవకంటినుండి నీరుకారడం, రక్తంకారడం ప్రారంభించింది. ఈ సారి గూడా ఇదివరకు లాగానే తనకున్న ఆ రెండవ కంటిని శివుని రెండవ కంటి స్థానంలో పెడదామనుకొని శివుని రెండవ కన్నును ఊడబెరికాడు. తన కన్నును బాణంతో తీయబోతూ ఈ కన్నుకూడా తనకు లేకపోతే గ్రుడ్డివాడై శివుడు ఎక్కడ వున్నాడో ఆ శివునికి కళ్ళెక్కడ వున్నాయో గూడా తెలియక తికమక పడాల్సి వస్తుందని, రక్తం కారే శివుని రెండో కంటి స్థానం వద్ద తన కాలి బొటన వ్రేలిని గుర్తుగా వుంచి, తన రెండవ కంటిని తీసి దాని స్థానంలో పెట్టడానికి ఉద్యుక్తుడయాడు. అప్పుడు శివుడు వెనువెంటనే ప్రత్యక్షమై నాకు కన్నును అప్పగించి రక్షించిన తిన్నడివి – ఈ రోజు నుండి నువ్వు 'కన్నప్ప' గా ఖ్యాతి వహిస్తావు. 'నవ్వు తినకుండా నాకు నైవేద్యం పెడితే నేతింటానా ?' అని చెప్పి నైవేద్యం ఆరగించకుండానే అంతర్ధానమయాడు. ఆ శివుడే కాళహస్తీశ్వరుడు. అప్పటి నుండి ముందు కన్నప్పకు నైవేద్యం పెట్టి తరువాతనే కాళహస్తీశ్వరునికి నైవేద్యం పెట్టే ఆచారం ఇప్పటికీ అక్కడ కొనసాగుతోంది.

ముక్కంటినే ముగ్ధుణ్ణి చేసిన ఆ మూఢభక్తి ఎంతటిదో ఆలోచించండి. ఒకరి భక్తిని, పూజను మరొకరు విమర్శించుకోకండి. ఎవరికి తోచిన మార్గంలో వారిని అర్చించుకోనీయండి. భక్తి ప్రధానం గాని 'తంతు' 'తతంగం' 'మంత్రం' 'తంత్రం' కాదు ముఖ్యం అని – ఈ శ్లోకం తెలియచేస్తుంది. ('నబుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినామ్' అనే భగవద్గీతలోని శ్లోకం గూడా ఇదే విషయాన్ని తెలియ చేస్తుంది).

## సంస్కృత శ్లోకము - 64

శ్లో. వక్షస్తాడనమంతకస్య కఠినాపస్మారసంమర్దనం
భూభృత్పర్యటనం సమత్సురశిరః కోటీర సంఘర్షణమ్ ।
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో సదా౽ంగీకురు ॥

## అనువాద పద్యము

సీ॥ అంతకుండైనట్టి యముని వక్షమ్మును
తన్న వలెను నీవు తనివితీర
అతి కఠోరం బైన అజ్ఞాన రూపమ్ము
నణగద్రొక్కగవలె ననువుగాను
పృథివీధరంబైన వెండికొండ పయిన
చరియింపవలెనయ్య గిరినివాస !
మ్రొక్కెడు దేవతామూర్తి మస్తకమకు
టోద్భవ ఘర్షణ మ్మోర్వవలెను
గీ॥ ఈ కఠిన కృత్యముల నతిమృదులమైన
నీ పదాబ్జమ్ములేరీతి నిర్వహించు
నాదు మనసను మణిమయపాదుకలను
దాల్చి సంచరింపుము వరదా, మహేశ !

## టీక

గౌరీపతే = పార్వతీవల్లభా ! శంభో = మంగళకరుడ ! అంతకస్య = యముని యొక్క, వక్షస్తాడనం = ఱొమ్ముదన్నుటయు, కఠిన = కఠినమైన (భేదింపరాని), అపస్మార = స్వరూప అజ్ఞానముయొక్క, సంమర్దనం = నిగ్రహించుటయు (చితుకద్రొక్కుట), భూభృత్పర్యటనం = వెండికొండయందు సంచరించుటయు, నమత్ = నమస్కరించుచున్న, సుర = దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటముల యందు, సంఘర్షణం = ఒరయుటయు, ఇదం = ఈ నాలుగును, మృదులస్య = మార్దవయుక్తమైన, తావక పదద్వంద్వస్య = నీ పాదముల యొక్క, కర్మ = వ్యాపారము, మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, మణిపాదుకావిహరణం = మణిమయమైన పాదుకలతో సంచారమును, సదా= ఎల్లప్పుడును, అంగీకురు = అంగీకరింపుము.

## తాత్పర్యము

ఉమానాథా! నీవు యమునిరొమ్ము తన్నవలెను. అపస్మారమునణగ ద్రొక్కవలెను. కొండమీద తిరుగవలెను. నమస్కరింపవచ్చిన దేవతాదుల కిరీటములరాపిడి కోర్వవలెను. ఇదంతయు కఠినకృత్యము. నీ పాదములతి కోమలములు. నా మనస్సను మణిపాదుకలను తొడుగుకొనుటకు దయచేసి యంగీకరింపుము.

## వివరణము

హే సాంబశివా ! దృఢకర్కశకాయుడై యముని ఱొమ్మును తన్నడం (మార్కండేయుణ్ణి రక్షించడం కోసం), దట్టమైన అజ్ఞాన అపస్మారాన్ని మర్దించటం లాంటి కఠినమైన పనులు నిర్వర్తించడానికి, అతి మృదువుగా వుండే నీ పాదాలు తగవు కానీ – నా హృదయమనే మణిమయి పాదుకలను తొడుక్కొని ఈ పనులు చేసుకో – అంటూ నచ్చచెప్పి సదా తన హృదయంలోనే శివపాద పద్మాలుండాలని కోరుకుంటున్నారు ఆదిశంకరులు.

## సంస్కృత శ్లోకము - 65

శ్లో. వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనం కుర్వతే ।
దృష్ట్వా ముక్తి వధూస్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేతస్తవ పాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభమ్ ॥

## అనువాద పద్యము

*సీ॥* నీ పదాబ్జములను నెమ్మనంబందుంచి
భజనమ్ము సల్పెడువాని జూచి
వక్షస్థలము తన్న వచ్చున్న శంకతో
ప్రాణాంతక యముడు పారిపోవు
ముకుటమ్ములందున్న మణిదీపముల చేత
నీ రాజునమ్మిచ్చు నిర్జరతతి
ముక్తికాంతామణి మురిపెమ్ముతో వచ్చి
గాఢమ్ముగా వాని కౌగలించు

*గీ॥* ఈశ ! సర్వేశ ! పశుపతీ ! హే గిరీశ !
హే భవానీపతీ ! శివా! హేమహేశ !
అట్టి భక్తుని కిహలోకమందు జూడ
సాధ్యపడనట్టి దిక యేమి సాంబమూర్తి !

## టీక

హేభవానీపతే = ఓ పార్వతీవల్లభా ! యచ్చేతః = ఏ పురుషునియొక్క చిత్తము, తవ = నీయొక్క పాదపద్మభజనం = పాదకమలము సేవచేయునో, దృష్ట్వా = వానినిజూచి, వైవస్వతః = యముడు, వక్షస్తాడనశంకయా = (తన) రొమ్ముతన్నునను భయముచేత, విచలితః = పాఱిపోవుచున్నాడు. నిర్జరాః = దేవతలు, కోటీర = కిరీటములయందు, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, రత్నదీప

= రత్నాములనెడు దీపముల యొక్క కలికా = అంకురముల చేత, నీరాజనం = నీరాజనమును, కుర్వతే = చేయుచున్నారు. ముక్తివధూః = ముక్తికాంత, నిభృతాశ్లేషం = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్నది. తస్య = ఆ భక్తునికి, ఇహ = ఈలోకమందు, దుర్లభం = లభ్యము కానిది, కిం = ఏది ?

## తాత్పర్యము

ఉమానాథా! నీవు మునుపటివలె తన రొమ్మున తన్నుదువేమోయని భయపడి నీ భక్తుని జూచిన యముడు పారిపోవును. దేవతలు ఆ భక్తునికి తమ కిరీటమాణిక్య దీపములతో నీరాజనము లిత్తురు. ముక్తికాంత తనంత తాను వచ్చి ఆలింగన మొసంగును. ఇంక నీ భక్తున కేది దుర్లభము?

## వివరణము

శివుడంటేనే కాదు శివపాదాలను అర్చించే ఏ శివభక్తుణ్ణి చూసినా - మార్కండేయుని విషయంలో తన రొమ్ముపై తన్నిన ఆ శివపాదాలు గుర్తుకు వచ్చి - యముడంతటి వాడు భయపడి పారిపోతాడట. దేవతలు ఆ భక్తుని చూసినపుడు శివపాదాలే గుర్తుకు వచ్చి తమ కిరీటాల్లోని మణుల కాంతులనే దీపాలతో నీరాజనాలిస్తారుట. ముక్తి కాంత కూడా ఆలింగనం చేసుకుంటుందిట. అంటే అతి దుర్లభము అసాధ్యము, అపురూపము అయిన విషయాలు గూడా శివపాద సేవనతో అవలీలగా జరుగుతాయి అని అర్థం.

## సంస్కృత శ్లోకము - 66

శ్లో. క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనాః
యత్కర్మాచరితంమయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్ ।
శంభో స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామకరక్షణం పశుపతే కర్తవ్యమేవ త్వయా ॥

## అనువాద పద్యము

సీ॥ గిరినివాసా ! నీదు క్రీడార్థమేగదా
యీ లోకములు నీవు సృష్టి జేయ
ప్రజలందరును నీకు బహువినోదార్థమౌ
జంతువులే గదా! జంగమేశ !
అందుచే నా చేత నాచరింపబడెడు
పనులగు న్నీప్రీతి కనువుగాను
నా యిట్టి చేష్టలు నీ యష్టసిద్ధికే
సాధకమ్మగును నిశ్చయముగ నిల

గీ॥ కాన పరమేశ ! పశుపతీ ! దీనబంధు !
ఆది దేవా ! కిరాత ! మహానుభావ !
నాదు బాధ్యతాయుత రక్షణమ్ము సతము
నీవె వహియింప వలెనయ్య నిశ్చయముగ.

## టీక

శంభో = సుఖకరుడవైన పరమేశ్వరుడా ! అఖిలం= సమస్తమైన, ప్రపంచం = లోకమును, క్రీడార్థం = లీలామాత్రఫలముగా, సృజసి = సృజించుచున్నావు. తే = నీకు, జనాః = ప్రజలు, క్రీడామృగాః = విలాసార్థమైన జంతువులు, మయా = నాచేత, యత్ = ఏ, కర్మ = కర్మము, ఆచరితం = ఆచరింపబడినదో, తత్ = ఆ కర్మము, భవతః = నీయొక్క ప్రీత్యై = ప్రేమకొఱకు, భవత్యేన = అగుచున్నది. మచ్చేష్టితం = నావ్యాపారము, స్వస్య = నీ సంబంధమైన, కుతూహలస్య = ఇష్టమునకు, కరణం = సాధకమైనది, నిశ్చితం = నిశ్చయము. తస్మాత్ = కాబట్టి, హే పశుపతే = ఓ పరమశివుడా! మామకరక్షణం = నా సంరక్షణ, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయదగినది.

## తాత్పర్యము

శివా! నీవీ ప్రపంచమంతము సృజించుట విలాసార్థముగదా! ఈ ప్రజలందరు నీ వినోదార్థకమైన జంతువులు. వారివారి పెంపుడుజంతువుల నడవడులు వారికి ప్రేమాస్పదములేకదా! కావున నేనుచేయు సత్కర్మములుగాని దుష్కర్మములుగాని నీకు తృప్తికరములగును. కనుక నన్ను రక్షింపవలసినవాడవగు చున్నావు.

## వివరణము

ఈ శ్లోకంలో శంకరాచార్యులవారు చాలా లౌక్యంతో శివుణ్ణి మంచి చేసుకుని తర్కంతో ఆయన రక్షణ పొందచూస్తున్నారు.

పరమేశ్వరుడు ఒంటరిగా తానొక్కడే వున్నప్పుడు - ఏమీ తోచక, తోడు ఎవ్వరూ లేరని, కాలక్షేపం కావడం లేదని, ఆడుకోడానికైనా కనీసం ఇంకొకడు వుండాలని అనిపించి - తానే ఇంతమందిగా, ఇన్నివస్తువులుగా ఇన్ని ప్రదేశాలుగా, స్థావర జంగమాత్మకమైన యావత్ప్రపంచంగా అయిపోయాడని తైత్తిరీయోపనిషత్తులో 'సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి" అనే మంత్రంలో చెప్పబడుతుంది. అంటే, కేవలం తన క్రీడార్థంగా, విలాసార్థంగా మాత్రమే ఈ విశ్వాన్ని శివుడు సృజించాడన్నమాట ! అంటే ఈ విశ్వంలోని ప్రజలందరూ శివుడు ఆడుకోడానికి - సర్కస్‌లో వినోదార్థమై ఏర్పాటు చేసుకున్న జంతువుల్లాంటి వాళ్ళన్నమాట ! మనం కొన్ని జంతువులను ఇళ్ళల్లో పెంచుకుంటాం. అలాగే ఈ ప్రపంచం అనే శివుని ఇంట్లో శివుడు మనందరినీ పెంపుడు జంతువుల్లా ఏర్పాటు చేసుకున్నాడు. పెంపుడు జంతువులు ఏం చేసినా మనం వాటి చేష్టలకు ఆనందిస్తామే గాని విసుక్కోము కదా ! అలాగే "మేము ఏమైనా తెలిసిగాని, తెలియకగాని - సత్కర్మలు గాని, దుష్కర్మలు గాని చేస్తున్నపుడు నీకు అవి ఆనందాన్నే కలిగించాలి గాని తప్పుగా అనిపించకూడదు. పెంపుడు జంతువుల్ని యజమాని రక్షించుకున్నట్లే - నువ్వు మమ్మ్ము రక్షించాల్సిన

వాడవే అవుతున్నావు. ఇంక మాకేంభయం ?" అంటున్నారు శివునితో ఆది శంకరులు. చూశారా ఆయన తర్కం ? చూశారా ఆయన లౌక్యం ? శంకరుని ముందు శంకరులవంటి వారికే ఈ లౌక్యం, తర్కం సాధ్యం 'శంకర శ్శంకర స్సాక్షాత్' అని గదా ఆయనగురించి అందరూ చెప్పేది.

## సంస్కృత శ్లోకము - 67

శ్లో. బహువిధ పరితోష బాష్పపూర
స్ఫుట పులకాంకిత చారు భోగభూమిమ్ ।
చిరపద ఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే ॥

## అనువాద పద్యము

సీ॥ వివిధానంద సుధాధరాశ్రువులతో ప్రేమార్ద్రరోమాంచమౌ
అవిరామంబగు భక్తికిన్ సుఖపదమ్మౌ, సుస్థిరస్థానమై
భవమౌ, దివ్యఫలమ్ముగోరు జనసేవ్యంబౌ శివధ్యానమున్
భవబంధమ్ములు బోవ నా ఎదదలో భావింతు నేనెప్పుదున్.

## టీక

బహువిధ = నానాప్రకారములైన, పరితోషబాష్పపూర = ఆనంద భాష్పముల యొక్క ప్రవాహమునకు, స్ఫుట = వ్యక్తపడిన, పులకాంకిత = రోమాంచరూపమైన, భక్తిచిహ్నా = భక్తియొక్క గుఱుతునకు, చారు = రమ్యమైన, భోగభూమిం = భోగస్థానమును, చిరపద = శాశ్వత కైలాసస్థానమనెడు, ఫల = ఫలమును, కాంక్షి = అపేక్షించువారిచే, సేవ్యమానాం = సేవింపబడునదియు, పరమసదాశివ భావనాం = సర్వోత్కృష్టడగు, సాంబశివుని ధ్యానమును, ప్రపద్యే = శరణుపొందుచున్నాను.

## తాత్పర్యము

అనేక విధములైన ఆనందభాష్పముల సమృద్ధి గలిగినదియు, ప్రస్ఫుటమైన గగుర్పాటు చిహ్నముగా గల గొప్ప సుఖమునకు స్థానమైనదియు, శాశ్వతపదవి అనెడి ఫలమును అపేక్షించువారిచే సేవింపబడునదియు, సర్వోత్కృష్టమును అగు పరమేశ్వర భావనను శరణుజొచ్చుచున్నాను.

## వివరణము

ఈశ్లోకానికి తాత్పర్యంలో చెప్పిన వివరణ చాలును.

## సంస్కృత శ్లోకము - 68

శ్లో. అమితముదమృతం ముహుర్దుహంతీం
విమలభవత్పదగోష్ఠ మావసంతీమ్ ।
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మను పరిపాలయ భక్తిధేనుమేకామ్ ॥

## అనువాద పద్యము

మ॥ అమితానందపు పాలు మాటికిని తీయన్‌జాల వీలైనదై,
అమలంబౌ భవదంఘ్రి గోష్ఠమును వాసార్థమ్ముగా నున్నదై
అమలంబౌ సుకృతార్థమైన దగునాదౌ భక్తిగోవున్ సదా
స్థిమితం బొందగ బ్రోవుమా సుగుణమూర్తీ కృత్తివాసప్రభో.

## టీక

సదయ = దయతోగూడినవాడా ! పశుపతే = ఓ పశుపాలకుడా ! అమితముదమృతం = అపరిమితానందమను పాలు, ముహుః = మాటిమాటికి, దుహంతీం = పితుకనిచ్చునదియు, విమల = నిర్మలమగు, భవత్పద = నీ పాదములనెడు, గోష్ఠం = పశువుల చావడిని, ఆవసంతీం = నివసించునదియు, సుపుణ్యపాకాం = మంచి పుణ్యములకు ఫలమైనదియునగు, మమ = నా

యొక్క, భక్తిధేనుం =భక్తియనుగోవును, ఏకాం= ఒక్క దానిని, పరిపాలయ = కాపాడుము.

## తాత్పర్యము

భూతనాథా! నీవు అపారదయగలవాడవు. నా పుణ్యవశమున నాకీ భక్తియను గోవు లభించినది. ఇది ఆనందరూపమైనపాలు పదేపదే యిచ్చును. నీ పాదరూపమైన పశువులచావడిలో గట్టికొననిచ్చి ఈ యావునొక్క దానిని కాపాడుము.

## వివరణము

భగవత్పాదులు శివునితో ఉభయతారకంగా ఉండే ఒక చక్కని ఒప్పందం చేసుకుంటున్నారు. అపరిమితమైన ఆనందమనే స్వచ్ఛమైనపాలను మాటి మాటికీ పితకడానికి వీలైనదిఅయిన భక్తి అనే గోవు తన దగ్గఱ వున్నదట. శివుని దగ్గఱ నిర్మలమైనటువంటి, పవిత్రమైనటువంటి (శివుని) పాదమనే గోశాల (పశువుల చావడి) ఉన్నదిట. తన భక్తి గోవుకి కావలసిన రక్షణ పోషణ శివుని పాద గోశాల వద్ద చక్కగా లభిస్తుంది. కాబట్టి, తన భక్తి గోవును శివుని పాద గోశాల వద్ద ఉండటానికి అనుగ్రహించి ఆ భక్తి గోవు సంరక్షణ, పాలన బాధ్యతను స్వీకరించి మహోపకారం చేసి పెట్టవలసినదిగా ఈ శ్లోకంలో శివుణ్ణి అభ్యర్థిస్తున్నారు. అంటే – తన భక్తి శివపరంగానే ఉండాలి, ఆ భక్తి శివునికి ఆనందాన్నిచ్చే విధంగానే వుండాలి అని అర్థం.

## సంస్కృత శ్లోకము - 69

శ్లో. **జడతా పశుతా కళంకితా**
**కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ ।**
**అస్తి యది రాజమౌళే**
**భవదాభరణస్య నాస్మి కిం పాత్రమ్ ॥**

### అనువాద పద్యము

చం॥ జడుడను గాను, నేను పశుజన్ముడగాను, కళంకమేమియున్
పడనటువంటివాడ, నతివంకరటింకర మార్గమందునన్
నడకలు లేనివాడ, మరి నాకవి యుండినవేళ నేను ని
న్నడుగక మున్నె నీదు నగనొందగనే మరి చంద్రశేఖరా !

### టీక

జడతా = మూఢత్వము (జలమయుడగుట), పశుతా = వివేకము లేమి (పశువగుట), కళంకితా = కళంకము గలిగి యుండుట, కుటిలచరత్వం చ= కుటిలముగా సంచరించుటయు, మయి = నా యందు, నాస్తి = లేదు, దేవ = మహాదేవా ! రాజమౌళే = చంద్రశేఖరా ! అస్తి యది = ఉన్నయెడల, భవదాభరణస్య = నీ యలంకారమునకు, పాత్రం = తగినవాడను, నాస్మికిం = కానా ?

### తాత్పర్యము

దేవా! నాకు జడత్వపశుత్వ, కళంకితాకుటిలసంచారములేదు. చంద్రున కవియున్నవి. అట్టిచంద్రుని శిరస్సున బెట్టుకొంటివి. అట్టిగుణములున్నచో నేనును నీకు ఆభరణమయ్యెడివాడనేమో!

### వివరణము

శివుడు తన శిరస్సుపైన చంద్రుణ్ణి ఆభరణంగా ధరించడాన్ని గమనించినశంకరులు ఆలోచనలో పడ్డారు. చూసి చూసి ఈ చంద్రుణ్ణి నెత్తిపైకి ఎక్కించుకున్నారేమిటి అని ఆలోచించి ఆలోచించి - అయితే చంద్రుని లక్షణాలు, స్వభావాలు కనుక వుంటే తననుగూడా అలా ఆభరణంగా ధరిస్తారేమోననే నిర్ణయానికి వచ్చారు. చంద్రునికుండేవన్నీ అవలక్షణాలేగాని ఒక్కటీ మంచి లక్షణం లేదు. సముద్రజలంలో పుట్టాడు, కాబట్టి చంద్రుడు జడుడు. గురుపత్ని అయిన తారతో రమించాడు కాబట్టి పశువు. తనలో

అందరికీ కనబడే కళంకం ఉన్నది కాబట్టి కళంకి. తను భూమిచుట్టూ తిరిగే మార్గం వంకరటింకరగా వుంటుంది కాబట్టి కుటిలచరుడు. ఇటువంటి చంద్రుణ్ణి నెత్తిన పెట్టుకుని శివుడు తాను చంద్రశేఖరుడని అందరి చేత పిలిపించు కుంటున్నాడు. ఇన్ని అవలక్షణాలున్నా శివుని నెత్తిపైకి ఎక్కంగానే ఏ దోషము లేనట్లు అందరి చేత శివునికి భూషణుడని చంద్రుడు కూడా పిలిపించు కుంటున్నాడు. ఇంత మార్పు ఎందుకు వచ్చింది ? చంద్రుడికి ఎందుకిలా కలసి వచ్చింది అని ఆలోచిస్తే బహుశః పనికిరాని వాణ్ణిసైతం గొప్పవానిగా చేయగల గొప్ప దయాగుణం శివునిలో వుండి వుంటుంది. ఇలా దుర్లక్షణాలున్న చంద్రుణ్ణే ఆభరణంగా నెత్తికెక్కించుకుంటే ఏ దుర్లక్షణము లేని తను అభ్యర్థిస్తే తనను గూడా ఆభరణంగా చేసుకోడానికి శివునికి అభ్యంతరం ఏముంటుంది - అని - 'ఓ సాంబశివా ! జడత్వం, పశుత్వం, కళంకత్వం, కుటిలచరత్వం లాంటి లక్షణాలు మరి నాలో ఏమాత్రం లేవు. ఏం చెయ్యను. అవి కనక వుండి వుంటే చంద్రుని లాగా ఎప్పుడో నీకు ఆభరణమయే వాడినేమో' - అని వ్యంగ్యంగా శివునితో అనడానికి సిద్ధమైనట్లు ఈ శ్లోకంలో పైకి కనబడుతుంది కాని, అసలు విషయం ఏమిటంటే -

ఎందుకూ పనికిరానివాణ్ణి సైతం పైకి తీసుకు వచ్చే సామర్థ్యం శివుని దగ్గర వున్నపుడు సగటు మంచి లక్షణాలున్నవాడికి శివుని పంచన చేరితే తరించవచ్చనే ఆశపుడుతుంది గదా ! (ఈ రోగానికి వైద్యం లేదని, చనిపోవడం ఖాయమని చెప్పించుకున్న మహారోగిని ఒక వైద్యుడు వైద్య సేవ చేసి బ్రతికిస్తే - సాదాసీదరోగాలున్న సగటు రోగులకు తామూ తేలిగ్గా బ్రతక గలమనే ఆశపుట్టి ఎంతో ధైర్యం కలుగదూ ! నిజంగా అలాంటి రోగాలని తగ్గించిన వాడే ఘనమైన వైద్యుడు. అతని పేరే దశ దిశలా వ్యాపిస్తుంది. అందరూ అతని దగ్గఱకే రావడానికి ప్రయత్నిస్తారు.)

అందుకే - అవలక్షణాలున్న చంద్రుడిలాంటివాడిని నెత్తికెక్కించుకుని శివుడు కూడా అలానే చేశాడేమో' అని కాస్త వివేకంతో ఇలా గూడా

ఆలోచించాలని శంకరులు మనకు రేఖామాత్రంగా ఈ శ్లోకంలో సూచించారు. పైగా శివుడు చేసిన ఈ పనివల్ల ఇలా దోషాలను గుణాలుగా మార్చగలిగే దేవుడు శివుడు ఒక్కడేనేమో అని కూడా వెంటనే గ్రహించి ఆయన పంచన జేరి తరిస్తాము.

## సంస్కృత శ్లోకము - 70

శ్లో. అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా
వరివసితుం సులభః ప్రసన్నమూర్తిః ।
అగణితఫలదాయకః ప్రభుర్మే
జగదధికో హృది రాజశేఖరో ఽస్తి ॥

## అనువాద పద్యము

చం॥ సకల ఫలప్రదాతయు ప్రసన్నముఖ ప్రభువైనవాడు, నీ
సకల జగత్తుకన్న యధిసత్తమహాధికుడిందుశేఖరుం
డొకడు మదీయచిత్తమున నుండెను కాన స్వతంత్ర బుద్ధితో
తికమక లేక గొల్వదగు దేవుడగున్ బహిరంతరమ్ములన్.

## టీక

ప్రసన్నమూర్తిః = సుముఖమైన మూర్తిగలవాడును, అగణిత = ఎంచ దరముగాని, ఫల= వాంఛితమునకు, దాయకః =దాతయు, ప్రభుః = సర్వసమర్థుడును, జగదధికః = జగత్తుకన్న నెక్కువవాడును నగు, రాజశేఖరః = చంద్రశేఖరుడు, మే = నాయొక్క, హృది = హృదయమందు, అస్తి = కలదు. అరహసి = బహిరంగముననను, రహి = ఏకాంతమందును, స్వతంత్రబుద్ధ్యా = ఇచ్ఛానుసారము, వరివసింతుం = పరిచర్య చేయుటకు, సులభః = సులభమైనవాడు, భవతి = అగును.

## తాత్పర్యము

సుముఖుడై సులభుడై యెల్లకోర్కెలుదీర్చుచు సర్వసమర్థుడైన చంద్రశేఖరుడు నాహృదయమందే యున్నవాడుగనుక ఏకాంతముగను బహిరంగముగను కూడ స్వతంత్రముగా పూజింపవచ్చును.

## వివరణము

సర్వాంతర్యామిత్వము, జగన్నాథ సార్వభౌమత్వమూ ఉన్నవాడూ అయిన శివుని వల్ల మనకు ఎంతో సౌకర్యం సౌలభ్యం చేకూరినట్లే! అని అంటున్నారు భగవత్పాదులు. ఎందుకంటే సర్వాంతర్యామి కాబట్టి అంతటా - అందరిలోనూ వుంటాడు. భక్తి నిండుగా వున్న వారికి ఎప్పుడూ హృదయంలోనే పిలిస్తే పలికేటట్లుగా వుంటాడు. కాబట్టి, శివుణ్ణి ఏకాంతంగా ఉన్నా భజించవచ్చు. జనసమూహంలో వున్నా కూడా భజించవచ్చు. ఎక్కడో అరణ్యాల్లోకి కొండ గుహల్లోకి వెళ్ళి ధ్యాన, జప, తపాదులు చేయవలసిన పనిలేదు. అలా నియమ నిష్ఠలతో గంటల తరబడి సేవించే మహర్షులలాంటి వాళ్ళకు ఇచ్చే ఫలమే - కొలది కాలమే ఒంటరిగా వుండి సేవించినా, జన సమూహంలో సేవించినా కూడా వస్తున్నపుడు ఇంక చిక్కేమిటి ? నష్టమేమిటి ? అందరినీ స్వంత బిడ్డలలాగానే చూసుకునే సమదృష్టి గల సర్వాంతర్యామి శివుడు అయినపుడు ఇక్కడే తన వద్దనే తన హృదయంలోనే వున్న ఆ శివుణ్ణి సేవించుకుని తరిస్తాను అని అంటున్నారు. మనం కూడా ఈ సదుపాయాన్ని వినియోగించుకుని తరించమని సలహా ఏమో ఇది. భగవస్సాన్నిధ్యాన్ని పరిపూర్ణంగాపొందిన అనుభవంతో శంకరులిలా అంటున్నారు.

## సంస్కృత శ్లోకము - 71

శ్లో. ఆరూఢభక్తిగుణకుంచిత భావచాప
యుక్తైః శివస్మరణబాణగణైరమోఘైః ।
నిర్జిత్య కిల్బిషరిపూన్ విజయీ సుధీంద్రః
సానందమావహతి సుస్థిరరాజలక్ష్మీమ్ ॥

## అనువాద పద్యము

చం. బలమగు భక్తి మౌర్వి, అది వంచిన భావము దివ్యచాపమున్,
ఫలితము తప్పకుండెడు శివస్మరణన్ శరపుంజమట్లుగా
గలిగియఘారు లందరిన్ కాల్చి ముదమ్మున సుస్థిరమ్ము, ని
ర్మలమగు రాజ్యలక్ష్మి, దనరాణిగ పొందు సుధీంద్రుడొక్కడున్.

## టీక

సుధీంద్రః = విద్వద్వరిష్ఠుండు, అరూఢ = పాదుకొనిన, భక్తి = భక్తియును, గుణ= అల్లెత్రాటిచేత, కుంచిత = వంచబడిన, భావ = అంతఃకరణము అను, చాప = ధనుస్సునందు, యుక్తైః = కూర్చబడిన, అమోఘైః = విఫలములు గాని, శివ = ఈశ్వరుని యొక్క, స్మరణ = స్మరణమను, బాణగణైః = బాణపుంజములతో, కిల్బిషరిపూన్ = పాపములనెడు శత్రువులను, నిర్జిత్య = నిశ్శేషముగా జయించి, విజయీ = జయముగలవాడగుచు, సానందం = ఆనందముతో గూడునట్లుగా, సుస్థిరరాజలక్ష్మీం= స్థిరులైన బ్రహ్మాదులకు రాజైన పరమశివుని యొక్క సారూప్యమను స్థిరమైన రాజలక్ష్మిని, ఆవహతి = పొందును.

## తాత్పర్యము

బుద్ధిమంతుడు భక్తిని వింటినారిగను, అంతఃకరణవృత్తిని విల్లుగను అమర్చుకొని, అందు ఈశ్వరధ్యానమును బాణముగా నెక్కుపెట్టి, పాపములను శత్రువులనెల్ల జయించి, రాజు - రాజ్యలక్ష్మిని పొందునట్లు, పరమేశ్వర సారూప్యలక్ష్మిని పొందును.

## వివరణము

మనలో పాపాలున్నంత వరకు పవిత్రులం కాలేము. అందుకని ముందు మనలోని పాపాలు పోగొట్టుకోవాలి. ఈ పాపాలు శత్రువుల్లాంటివి. వీటిని జయించాలంటే - అమోఘమైన అంటే - వృథాకాని మరి తిరుగులేని

బాణాల్లంటివి కావాలి. 'శివస్మరణ అమోఘమైన బాణం లాంటిది దాన్ని ఉపయోగించి శత్రువుల్లాంటి పాపాలను పోగొట్టుకుని శుద్ధాంతరంగులై చింతలేని సుస్థిరమైన మోక్షసామ్రాజ్య లక్ష్మిని పొందవచ్చు గదా !' అని ఆది శంకరులు సలహా ఇస్తున్నారు. అయితే ఈశ్వరస్మరణ అనే బాణం ఒక్కటి వుంటే చాలుతుందా – దాన్ని సంధించడానికి వింటినారి కూడా వుండాలి గదా ! – అంటే శుద్ధమైన అంతఃకరణ ప్రవృత్తిని ధనుస్సుగా చేసుకుని, దృఢమైన భక్తిని వింటినారిగా అమర్చుకొని, తిరుగులేని శివస్మరణ అనే బాణాన్ని ఉపయోగించి పాపాలనే శత్రువులను పొగొట్టుకోండి – సరేనా ! అని సందేహనివృత్తిని చేస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 72

శ్లో. ధ్యానాంజనేన సమవేక్ష్య తమఃప్రదేశం
భిత్వా మహాబలిభి రీశ్వరనామమంత్రైః ।
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మమిహ తే శివ తే కృతార్థాః ॥

## అనువాద పద్యము

ఉ॥ ధ్యానమనంజనమ్ము నమలాక్షుల కన్గొని, జక్కజూచి, ఈ
శానుని నామ మంత్రమను సర్వమహాబలులందజేసి, య
జ్ఞాననివాసమంత ఖననమ్మొనరించి, సురాశ్రయమ్ము స
ర్వాల్ నగలైన నీదుపదపద్మనిధిన్ గొనువారు ధన్యులౌ

## టీక

శివ = సాంబశివా ! ధ్యానాంజనేన = ధ్యానమను కాటుక చేత, సమవేక్ష్య = లెస్సగా కనిపెట్టి, ఈశ్వర నామ మంత్రైః = ఈశ్వరుని యొక్క నామమంత్రములనెడు, మహాబలిభిః = గొప్పపూజోపకరణములచేత, తమః ప్రదేశం = అజ్ఞానమను స్థలమును, భిత్వా = త్రవ్వి, యే = ఏ భక్తులు,

దివ్యాశ్రితం = దేవతల చేత పొందబడిన, భుజగభూషణం = సర్పమాభరణముగా గలిగి, తే = నీయొక్క, పాదపద్మం = పాదకమలమును, ఇహ = ఈ జన్మమందు, ఉదవహంతి = ఎత్తికొనుచున్నారో, తే = వారు, కృతార్థాః = ధన్యులు.

## తాత్పర్యము

శివా ! నిధులు వెదకువాడు కన్నులకంజనము పూసికొని కనిపెట్టి యానందించునట్లు – భక్తుడు ధ్యానాంజనముతో మీ పాదపద్మనిధిని గనుగొని, మీ నామమంత్రముతో మహాబలి యొనర్చి, ఆవరణమైన అజ్ఞానము దొలగించి, మిమ్ముగొల్చి కృతార్థుడగును.

## వివరణము

ఈ శ్లోకంలో శివుని పాదాన్ని గొప్పనిధిగా వర్ణించారు. భూమిలో అనేకమైన నిధి నిక్షేపాలుంటాయి. అందుకే కదా భూమికి 'రత్నగర్భ' అనే పేరుంది. ఈ నిధి నిక్షేపాలను దక్కించుకోడం అంత సులువైన పని కాదు. కొంత కష్టపడి ప్రయత్నం చేయాలి. సరిగ్గా శివపాదనిధిని పొందాలన్నా గూడా అంతగానూ కష్టపడాల్సిందే ! నిధి ఎక్కడుందో తెలియాలంటే కంటికి అంజనం (ప్రత్యేక మైన కాటుక) రాసుకుని చూడాలి. శివపాద నిధిని చూడాలంటే ముందు ధ్యానం చేసి దర్శించాలి. అంటే శివధ్యానం – శివపాదనిధిని పొందడానికి అంజనం లాంటి దన్నమాట ! కనబడినంత మాత్రాన నిధి మనకు చేకూరినట్లే అని భావించకూడదు. ఆ నిధి బట్టబయలై వుండదు. రాళ్ళూ అప్పలు చేత కప్పబడి, కొందరు దేవతల చేత, సర్పవిశేషాల చేత కాపాడబడుతూ వుంటుంది. కొన్ని ప్రత్యేకమైన మంత్రాలనుచ్చరించి, బలుల్ని సమర్పించి, నిధి రక్షకులను ప్రసన్నులుగా చేసుకుని, భూమిని త్రవ్వి, అడ్డు వచ్చే రాళ్ళని అప్పలను తీసివేసి ఆ నిధులను పొందాలి. అలాగే శివపాద సన్నిధిని ధ్యానంలో దర్శించినంత మాత్రాన మనకది చేకూరినట్లే అని భావించకూడదు. మన పాపాలే శివధ్యానానికి ప్రతిబంధకాలవుతాయి. ముందు

వాటిని తొలగించాలి. ఆ తరువాత మంత్రోచ్చారణ, నామస్మరణలతో శివుని చుట్టూ కాపలా వుండే ప్రమథ గణాధిదేవతాదులను ప్రసన్నులను చేసుకోవాలి. అటుపైన మరింత సాన్నిధ్యంలో బ్రహ్మాది దేవతలచే ఆశ్రయింపబడి వాసుక్యాది సర్పాలంకృతులతో ఉండే శివపాదనిధిని దక్కించుకోవాలి. ఇవన్నీ చేయగలిగితే తప్పక శివపాదనిధిని పొంది ధన్యులవవచ్చు - అంటున్నారు ఆది శంకరులు.

## సంస్కృత శ్లోకము - 73

శ్లో. భూదారతాముదవహద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవ కిమతః సుమతే లభస్వ ।
కేదారమాకలిత ముక్తి మహౌషధీనాం
పాదారవిందభజనం పరమేశ్వరస్య ॥

## అనువాద పద్యము

శా॥ ఏ పాదమ్ముల క్షేత్రమందమల ముక్త్యైకౌషధుల్ పుట్టునో,
శ్రీ పృథ్వుల్ తన భార్యలైన హరి దంష్ట్రీరూపమున్ దాల్చె దా
నే పాదమ్ముల జూడ - నట్టి శివసర్వేశాంఘ్రి పదమ్ములం
దాపేక్షాయుత బుద్ధి నిల్పి సుమతీ, ఆరాధనల్ సల్పుమా !

## టీక

హేసుమతే = ఓ సద్బుద్ధీ ! యదపేక్షయా = దేనియపేక్షచేత, శ్రీభూదారేవ = లక్ష్మియు భూమియు భార్యలుగాగల మహావిష్ణువే, భూదారతాం = వరాహరూపమును, ఉదవహత్ = తాల్చెనో, కిం = ఇది సుప్రసిద్ధమే కద ! అతః = కనుక, ఆకలిత = అపేక్షితములైన, ముక్తి = సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యముక్తులనియెడు, మహౌషధీనాం = గొప్పమూలికలకు, కేదారం = పంటపొలమైన, పరమేశ్వరస్య = మహాదేవుని యొక్క, పాదారవిందభజనం =పాదకమల సేవను, లభస్వ = పొందుము.

## తాత్పర్యము

ఓ సుబుద్ధీ! మహావిష్ణువు సయితము శివుని పాదసందర్శనమునకై వరాహ రూపమెత్తి పలుశ్రమలకోర్చినాడు. నీవుగూడా అట్టి శివపాదభజనచేయుము. పంటనేలయందు ఓషధులు ఫలించునట్లు దానివలన సమస్తముక్తులు లభించును.

## వివరణము

ధర్మవిచికిత్స, కర్మవిచికిత్స వచ్చినప్పుడు (అంటే - ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో తేల్చుకోలేకపోయినప్పుడు)

భగవద్గీతలో -

**శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరోజనః**

**సయత్ప్రమాణం కురుతేలోకస్తదనువర్తతే'** - అని,

ఉపనిషత్తులో -

**'అథయదితే కర్మ విచికిత్సావావృత్త చికిత్సావాస్యాత్...**

**యథాతే తేషు వర్తేథాః'** - అనీ

పరిష్కారం చెప్పబడుతుంది. వీటి రెంటి అర్థం ఒక్కటే - 'ధర్మపరులు, ఉత్తములు అయిన వారు ధర్మ విచికిత్స వచ్చినపుడు ఏం చేస్తారో దాన్నే ప్రమాణంగా తీసుకుని ఇతరులు కూడా చెయ్యాలని ఈ రెంటి యొక్క సారాంశం (నేను వ్రాసిన తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లి చివరి మంత్రవివరణ చదివితే ఈ విషయపరంగా చాలా వివరాలు తెలుస్తాయి - వివరణ కర్త.

త్రిమూర్తులలో ఒకడు, స్థితికారుడు, పోషకకారుడు, దేవదేవుడు అయిన విష్ణుమూర్తిని ప్రమాణంగా తీసుకుంటే - ఆ విష్ణుమూర్తి తాను భక్తిని ముక్తిని పొందడం విషయంలో ఏం చేశాడో మనమూ దాన్ని ఆచరించి తరించాలి.

శివుని పాదాలను చూసి తరించాలని విష్ణుమూర్తి వరాహరూపమెత్తి ఎన్నో శ్రమలు పడడానిక్కూడా వెనుకాడలేదు. కాబట్టి - ఆ విష్ణుమూర్తిని

మనం గూడా అనుసరించి శివపాదాలనుభజించాలి. అవి సామాన్యమైన పాదాలే అనుకోకూడదు. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య ముక్తులనే దివ్య ఔషధాలకు పంట పొలం లాంటివి అని గుర్తుండాలి. అందుకే భూదేవిని, శ్రీదేవిని భార్యలుగా కలిగిన మహావిష్ణువుగూడా ఆ పాదాలను దర్శించి తరించడానికి వరాహరూపము ఎత్తాడు. మనం ఇంక ఆలోచించవలసిన పనిలేదు. ఆ విష్ణుమూర్తిలాగా కష్టపడి ఫలాన్ని పొంది తరించాలి. అని శంకరుల సలహా.

## సంస్కృత శ్లోకము - 74

**శ్లో. ఆశాపాశ క్లేశ దుర్వాసనాది**
**భేదోద్యుక్తై ర్దివ్యగంధై రమందైః ।**
**ఆశాశాటీకస్య పాదారవిందం**
**చేతః పేటీం వాసితాం మే తనోతు ॥**

## అనువాద పద్యము

***శా॥ ఆశాపాశ వినాశమున్, మరియు క్లేశాపూర్ణ దుర్వాసనా***
***నాశమ్మున్ కలుగంగ జేయ ఘనమౌ నానార్థ గంధమ్ములన్***
***వాసమ్మొందగ – నాదు చిత్తమను దివ్యంబైన పేటీర మం***
***దాశావల్కలధారియౌ శివుని పాదాబ్జమ్ములన్నిల్పెదన్.***

## టీక

ఆశాశాటీకస్య = దిగంబరుడైన యీశ్వరుని యొక్కపాదారవిందం = పాదపద్మము, మే = నాయొక్క చేతఃపేటీం = చిత్తమనుపెట్టెను, ఆశాపాశ = పాశమువలె బంధకమైన యాశయు, క్లేశ = పంచక్లేశములనెడి, దుర్వాసనాది = చెడ్డసంస్కారము (దుర్గంధము)లను, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః = ప్రవృత్తములైన, అమందైః = కొలదిగాని, దివ్యగంధైః = దివ్యమైన పరిమళములచేత, వాసితాం = సువాసనగలదానిగా, తనోతు = చేయుగాక.

## తాత్పర్యము

దిగంబరుడగు పరమేశ్వరుని యొక్క పాదపద్మము నా మనఃపేటికయందు గల ఆశాపాశములు, పంచక్లేశములు మొదలగు దుర్వాసనల నడంచి దివ్యమైన సువాసనలతో నింపుగాక!

## వివరణము

పాయసం ఎంత మధురంగా రుచిగా వున్నా అది ఉన్న పాత్ర మకిలిగా వుంటే ఆ పాయసం త్రాగినందువల్ల వచ్చేది అనారోగ్యమే కాని ఆనందం కాదు. అలాగే హృదయం నిండా దుష్ట సంస్కార దుర్వాసనలు, ఆశాపాశాది క్లేశాలు నిండివుంటే మునీశ్వరులకైనా ముక్తిరాదు. ముందు ప్రక్షాళన కావలసినవి ఇవి గాని బాహ్యాంగ శుద్ధి కాదు. ఈ దుష్ట సంస్కార దుర్వాసనలను సమూలంగా పోగొట్టి సుసంస్కార సువాసనలతో హృదయం నింపబడాలంటే - ఆ హృదయంలో ఆ దుర్వాసనలను పోగొట్టగల సామర్థ్యం ఉన్న పవిత్రమైన పరిమళాలను వెదజల్లే వస్తువేదైనా వుంచాలి. శంకరులు శ్రీఘ్రమే ఆచరణ యోగ్యమైన ఒక చక్కని సలహా ఇస్తున్నారు.

హృదయమనే పెట్టెలో దిక్కులే వస్త్రాలుగా గలిగిన పరమేశ్వరుని యొక్క పాదారవిందాన్ని ఎడబాయకుండా ఉండేటట్లు చూడమంటున్నారు. శివపాద పద్మం నుండి వచ్చే పవిత్ర పరిమళాలు దుష్ట సంస్కార దుర్వాసనలను దూరం చేసి ప్రక్షాళన చేస్తాయి. దిక్కులే వస్త్రాలైన పరమేశ్వరుని యొక్క పాదపరిమళాలు గూడా దిక్కులదాకా విస్తరించగల సామర్థ్యాన్ని కలిగి వుంటాయి గదా ! అందువల్ల హృదయపేటిక ఎంత పెద్దదైనా - దుష్ట సంస్కార దుర్వాసనలు ఎంత దట్టంగా, దిట్టంగా, కట్టుదిట్టంగా - విస్తరించి వున్నా ఏమీ ఫర్వాలేదు శివపాదపద్మ పరిమళాలు వాటిని ప్రక్షాళన చెయ్యగలవు - అనే అంతరార్థాన్ని గూడా గ్రహించాలి.

## సంస్కృత శ్లోకము - 75

శ్లో. కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞమనఘం ధ్రువలక్షణాఢ్యమ్ ।
చేతస్తురంగమధిరుహ్యా చర స్మరారే
నేతః సమస్తజగతాం వృషభాధిరూఢ ॥

## అనువాద పద్యము

*చం॥ సరస విచిత్రరీతులుగ సాగెడి వేగము గల్గి మానవాం
తరము లెఱుంగునట్టి శుభదాయకమౌ ధ్రువలక్షణమ్ములున్
పరమగు నాదు చిత్త హయవాహన మెక్కి వడిన్ చరింపుమా
స్మరహర ! సర్వలోకపతి ! సందియ మేలకొ ! నందివాహనా !*

## టీక

వృషభాధిరూఢ = నందివాహనమెక్కువాడా ! సమస్తజగతాం = ఎల్లలోకములకును, నేతః = నాయకుడా ! స్మరారే = కామవైరీ, కల్యాణినం = శుభలక్షణములుగలదియు, సరసచిత్రగతిం = సరసముగా జిత్రములైన నడకలు గలదియు, సవేగం = వేగముతోగూడినదియు, సర్వేంగితజ్ఞం = అందఱి యింగితమ్ములు నెఱిగినదియు, అనఘం = నిర్దుష్టమైనదియు, ధ్రువలక్షణాఢ్యం = స్థిరమైన చిహ్నములు గలదియునగు, చేతస్తురంగం = (నా) చిత్తమను గుఱ్ఱమును, ఆరుహ్యా = ఎక్కి చర = సంచరింపుము.

## తాత్పర్యము

ఓవృషభవాహనా! బాణవేగమునబోవుచు, చిత్రగతులు గలిగి, కల్యాణియై, ధ్రువలక్షణములుగల్గి, పరేంగితమెరింగి వర్తించు నా మనస్సను గుఱ్ఱమునెక్కి హాయిగా స్వారీచేయుము.

## వివరణము

ఎప్పుడూ అందరూ దేవుణ్ణి ఏదో కావాలని కోరి పొందేవారే గాని దేవునికి పనికొచ్చేదేమన్నా ఇస్తే బావుంటుందనే ఆలోచన సాధారణంగా రాదు. అయితే ఆయనకు మనమిచ్చేపాటి వాళ్ళమా ? అయినా 'విశ్వసామ్రాజ్య సార్వభౌముడైన ఆయనకు ఇవ్వగలిగేది మనదగ్గర ఏముంటుంది ?' అని గూడా అనుకుంటాం. కాని, శంకర భగవత్పాదులు ధైర్యం చేసి ఎంతో భక్తితో, వినయంతో, చనవుతో శివుణ్ణి అడిగి తాను ఇచ్చేదాన్ని స్వీకరించేట్లుగా ఒప్పించారు. ఆయన అభ్యర్థనని చదవండి మీకే తెలుస్తుంది.

విశ్వేశ్వరా ! అవడానికి నువ్వు విశ్వసామ్రాజ్యాధినేతవే ! విశ్వంలో ఎక్కడికైనా, ఎప్పుడైనా ఆలస్యం లేకుండా వెంట వెంటనే వెళ్ళాలంటే ఎలా వెళ్ళగలవయ్యా 'ఎద్దువున్నది గదా' అంటే అదేం ఎద్దయ్యా ఎప్పటి కాలం నాటిది ఆ ఎద్దు ? ముసలిదైపోలేదూ ? అదేం నిన్ను ఎక్కించుకుని త్రిప్పుతుందయ్యా ? ఇదిగో చిన్నవాడినైనా నేను చెప్పేమాట విను. నువ్వు ఆ ఎద్దు గురించి ఇంక మరచిపో ! అసలు ఎద్దు వాహనమేమిటయ్యా ? విష్ణువులాంటి సాటివాళ్ళను చూసైనా నేర్చుకో ! ఎద్దుకంటె గుఱ్ఱం వెయ్యి విధాల నయం గదా ! దాన్ని మించి పరుగెత్తే సాధుమృగం ఏది చెప్పు. అయితే 'దాన్నెక్కడ తెద్దాం' అని ఎదురు ప్రశ్నవేయవద్దు. నీకు ఇవ్వడానికి నా దగ్గఱ సిద్ధంగా వుంది. అదే నా 'మనస్సు' అనే గుఱ్ఱం. దీన్నెక్కి నీవు వెంట వెంటనే వెళ్ళాల్సిన ప్రదేశాలకు వెళ్ళి పనులు చక్కబెట్టుకో !

పంచకళ్యాణి వంటి మంచి జాతి గుఱ్ఱానికి ఐదు శుభలక్షణాలుంటాయి. ముఖం, గుండె, వీపు, ఇరు పార్శ్వాలు – ఈ ఐదుమంచి చిహ్నాలు కలిగి వుండాలి తెలుసా ! అంటే – నా మనస్సు గ్గూడా మంగళకర లక్షణాలైన – మంచిని వినడం, మంచిని చూడటం, మంచివి తినడం, మంచి వాటిని స్పృశించడం, మంచి వాటిని ఆఘ్రాణించడం లాంటి సల్లక్షణాలు – కలిగిన

పంచ జ్ఞానేంద్రియాలున్నాయి. గుఱ్ఱానికి యజమాని మనస్సు తెలిసి వుండాలి గదా అని అంటావేమో - ఒక్క నువ్వేమిటి అందరి మనస్సులు తెలిసి నడుచుకుంటుంది. నువ్వంటే ఎంతో భక్తి, గౌరవము గూడా కలిగినది. నువ్వు చెప్పినట్లల్లా వింటుంది. గుఱ్ఱం బాగా పరుగెట్టాలి కదా అంటావేమో - నా మనస్సు గుఱ్ఱం కన్న వేగంగా, గాలి కన్నా కూడా వేగంగా పరుగెడుతుంది. ఫలాని చోటుకు వెళ్ళాలి అని నువ్వు సంకల్పించడం ఆలస్యం - తక్షణంలోనే అక్కడుంటుంది. 'ధ్రువం' అనే మంచి సుడి వుండి, గుఱ్ఱం దోషరహితంగా వుండాలి కదా అని అంటావేమో - నా మనస్సు పాపరహితమై శుభలక్షణాలను కలిగి వున్నది. (నీ పరమైన భక్తి విషయంలో) మంచి స్థైర్యము, విశ్వాసము, పట్టుదల గలిగినదే ! మరి ఇంకెందుకాలస్యం ? గుఱ్ఱాని కుండాల్సిన శుభలక్షణాలకన్న మిన్నగా లక్షణాలున్న నా మనస్సునే గుఱ్ఱంగా స్వీకరించి నీ పనులన్నీ వేగవంతంగా చక్కబెట్టుకో ! అంటే - 'వదలకుండా నిత్యం నా మనస్సులోనే నువ్వు విహరించు' అని అర్థం.

## సంస్కృత శ్లోకము - 76

శ్లో. భక్తిర్మహేశపదపుష్కరమావసంతీ
కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్ ।
సంపూరితో భవతి యస్య మనస్తటాక
స్తజ్జన్మసస్యమఖిలం సఫలం చ నాన్యత్ ॥

## అనువాద పద్యము

మ॥ పరమేశాంఘ్రి విహాయసాంతరమునన్ వాసమ్ము గావింప గం
ధరమై, హర్షపువర్షమున్ కురియగా ధన్యాత్మ సంసేవ - యం
తరమైనట్టి మనస్సరస్సు పరిపూతమ్మౌను, తజ్జీవితాం
తర జన్మమ్మను సస్యమంత ఫలవంతమ్మౌందు, కాదన్యమున్.

## టీక

భక్తిః = సేవ, మహేశపదపుష్కరం = ఈశ్వరపాదరూపమైన యాకాశమున, ఆవసంతీ = స్థిరముగానున్నదై, కాదంబినీన = మేఘమాలవలె పరితోషవర్షం = ఆనందవృష్టిని, కురుతే = కలిగించుచున్నది, (తేన = ఆ వర్షము చేత) యస్య = ఏ పురుషునియొక్క, మనస్తటాకః = మనస్సను చెఱువు, సంపూరితః = నిండింపబడినది, భవతి = అగునో, తజ్జన్మసస్యం = వాని జన్మమనుపైరు, అఖిలం = నిశ్శేషముగా, సఫలం = ఫలవంతమైనది. (అగును), తదితరంచ = అదిగాక తక్కినదిమాత్రము, న = (సఫలము) కాదు.

## తాత్పర్యము

భక్తి - మేఘమాలికవలె మహాదేవుని పాదపద్మమను గగనమునందు వ్యాపించినదియై యానందవర్షము కురియును. అట్టి ఆవర్షమునకు ఏ పురుషుని మానస సరోవరమంతయు నిండునో వానిజన్మమనుసస్యమే సఫలమైనది యగునుగాని తక్కినదికాదు.

## వివరణము

భగవత్పరమైన భక్తిని శంకరులు ఈ శ్లోకంలో ఒక మేఘంతో పోల్చి వర్ణించారు.

భక్తి అనే మేఘం ఈశ్వర పాదమనే ఆకాశమునందే విహారం చెయ్యాలిట! అటువంటి భక్తిమేఘం వల్ల ఆనందమనే వర్షం కురిసి మనస్సనే సరస్సు నిండినప్పుడే జన్మ అనే పంట పండుతుంది గాని ఇతర విధానాల వల్ల కానే కాదు అంటున్నారు. అంటే - మనస్సంతా భగవత్పరమైన భక్తివల్ల పొందే ఆనందం నిండాలి, జీవితం పండాలి అని అర్థం.

## సంస్కృత శ్లోకము - 77

శ్లో. బుద్ధిః స్థిరా భవితు మీశ్వరపాదపద్మ
సక్తా వధూర్విరహిణీవ సదా స్మరంతీ ।
సద్భావనా స్మరణ దర్శన కీర్తనాది
సంమోహీతేవ శివమంత్రజపేన వింతే ॥

## అనువాద పద్యము

చం॥ అనవరతమ్ము నీదుచరణాబ్జములందలి సక్తి చేత నా
మనసు సదా స్మరించి 'శివ' మంత్రము, మోహము నొంది నీదు పా
వన పదపద్మయుగ్మమున -భర్తృవియోగసతీ విధమ్ము, కీ
ర్తనమును, ధ్యాన సంస్మరణ, దర్శన భాగ్య విచారమందులే !

## టీక

హే ఈశ్వర = నిగ్రహానుగ్రహసమర్థుడవైన ఓ దేవా ! విరహిణీ = భర్తృవియోగమును పొందిన, వధూరివ = భార్యవలె, పాదపద్మసక్తా = (మీ) పాదకమలములయం దాసక్తి కలిగినది గనుకనే, సదా = ఎల్లప్పుడును, స్మరంతీ = తలచుచున్న, బుద్ధిః = అంతఃకరణవృత్తి, శివమంత్ర సేవ = 'శివ' అను మీ నామమంత్రము యొక్క జపము చేత, సంమోహితైవ = మోహపడి నదియే యగుచు, స్థిరా = స్థైర్యము గలిగినది, భవితుం = అగుటకు, సత్ = సత్యమైన మీ పాదపద్మము యొక్క భావనా = ధ్యానము, స్మరణ = స్మరణము, దర్శన = దర్శనము, కీర్తన = కీర్తనము, ఆది = మున్నగు వానిగూర్చి, వింతే = విచారపడుచున్నది.

## తాత్పర్యము

శివా! నాబుద్ధి భర్తృవియోగమును పొందిన భార్యవలె నిరంతరము ధ్యానముచేయుచు, శివమంత్రము జపించుచు మోహమునొందినదై- మీ

పాదధ్యాన, స్మరణ, సందర్శన, కీర్తన, పూజనాదులనుగూర్చి విచారించుచున్నది. దీని నుద్ధరింపుము.

## వివరణము

భర్తకుదూరమై విరహవేదనతో సతమతమయే భార్యతో - పూర్తిగా శివునియందు నిరంతర ఆసక్తి కలిగిన తన బుద్ధిని పోల్చి - శివభక్తి ఎలా వుండాలో సూచిస్తున్నారు.

దూరమైన భర్తనే కలవరిస్తూ, బాహ్య ప్రపంచాన్ని పూర్తిగా విస్మరిస్తూ, ఒక మాట, ఒక పలుకు, ఒక చూపు, ఒక తలపు ఏమీ లేకుండా నిరంతరం భర్తమీదనే, భర్త సమాగం మీదనే దృష్టి వుండి చూడ్డానికి ఒక పిచ్చిదాని వలె దుఃఖిస్తూ, వేదనపడుతూ వుండే భర్తృవిరహిణిలాగా బుద్ధి శివుని మీదనే లగ్నమై, శివనామాన్నే స్మరిస్తూ, శివనామాన్నే కలవరిస్తూ, ఇతర ప్రపంచంతో సంబంధం లేనట్లుగా - శివపాదదర్శనానికి, శివపాద పూజకు, సంకీర్తనానికి తపిస్తోంది. ఇంక ఆలస్యం చేస్తే పిచ్చి ముదిరి పోయి ఏమవుతుందోననిపిస్తోంది. వెంటనే వచ్చి దానిని ఉద్ధరించు - అని శంకరులు శివుణ్ణి కోరుకుంటున్నారు. అంటే బుద్ధిని ప్రియురాలిగా స్వీకరించి దాని వేదనను పోగొట్టి జన్మను చరితార్థం చెయ్యి అని అర్థం.

భగవంతునిపై విరహం కూడా పరాకాష్ఠ భక్తిని సూచిస్తుంది. రాధ, మీరా, గోపికలు శ్రీకృష్ణ చైతన్య ప్రభువు, రామకృష్ణ పరమహంస మొదలైన వారందరూ ఈ కోవకు చెందినవారే !

## సంస్కృత శ్లోకము - 78

శ్లో. సదుపచారవిధిష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితామ్ ।
మమ సముద్ధర బుద్ధి మిమాం ప్రభో
వరగుణేన నవోఢవధూమివ ॥

## అనువాద పద్యము

మ॥ తమపాదమ్ముల సేవయందు నతియుక్తంబైన భావమ్ముతో
తమకున్ పూర్తి విధేయమౌ, విమల చిత్తమ్ముండి మీ యందునన్
తమితో నున్న మదీయ బుద్ధియను నూత్నమ్మౌవధూటిన్, ప్రభో
సమరీతిన్ కరుణింపుమా వరగుణాజన్యోద్ధతిన్ జేయుమా !

## టీక

ప్రభో = సమర్థుడవైన పరమేశ్వరా ! సత్ = సత్యమైన మీ పాదపద్మముయొక్క, ఉపచారవిధిషు = పూజావిధానములయందు, అనుబోధితాం = క్రమముగా సుశిక్షితమైనదియు, సవినయాం = విధేయమైనదియు, సుహృదం = శుద్ధమైనమనస్సు గలదియు, సదుపాశ్రితాం = మంచి యాశ్రయణము గలదియునగు, మమ = నాయొక్క, ఇమాం బుద్ధిం = ఈ బుద్ధిని, వరగుణేన = శ్రేష్ఠమైన గుణము నుపదేశించుట చేత, నవోఢ వధూమివ = క్రొత్తగాపెండ్లాడిన భార్యను వలె, సముద్ధర = ఉద్ధరింపుము

## తాత్పర్యము

జగత్ప్రభూ! మీపాదపూజయందు సుశిక్షితమై, వినయముతోగూడిన నాబుద్ధికి - ఉపచారముచేయుటయందు సుశిక్షితురాలును, వినయవంతురాలు నగు క్రొత్తగా పెండ్లిచేసికొనిన భార్యకునుపోలె - నుపదేశించి యుద్ధరింపుము.

## వివరణము

బుద్ధిని క్రొత్త పెళ్ళికూతురుతో పోల్చి భక్తి తత్త్వాన్ని వివరిస్తున్నారు. వరునికి వుండవలసిన కళ్యాణగుణాలున్న నిన్ను - ఇతర ప్రేరణాలు నిర్బంధాలు లేకుండా ఉత్తమ వధూలక్షణాలున్నా బుద్ధి - స్వయంగా వరించింది. ఈ బుద్ధి వధువు - వినయము, ఉపచారసేవాభిలాష, సహజమైన సిగ్గు, నిర్మల హృదయము వున్న సద్గుణ సంపన్నురాలు. ఈ క్రొత్తవధువుకు చెప్పవలసినవి

చెప్పేవిధంగా చెప్పి, బెరుకుతనం పోగొట్టి, ఉద్ధరించి నన్ను ధన్యుణ్ణి చెయ్యి - అంటున్నారు. అంటే - తన బుద్ధితో కాపురం చెయ్యడానికి శివుణ్ణి ఒప్పిస్తున్నారన్నమాట !

## సంస్కృత శ్లోకము - 79

శ్లో. నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమస్త్వత్క్రమః
శంభో తేన కథం కఠోరయమరాడ్వక్షః కవాటక్షతిః ।
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మే మనశ్చింతయ
త్యేతల్లోచనగోచరం కురు విభో హస్తేన సంవాహయే ॥

## అనువాద పద్యము

సీ॥ ప్రమథేశ ! నీపదక్రమ మనవరతమ్ము
యోగీశ్వరుల యొక్క యుల్లమనెడి
పద్మదళములందు పయనింపగన్ తగు
అట్టినీదు మృదులమైన పాద
మతికఠోరమైన యమధర్మజుని యొక్క
తలుపు బోలెదు రొమ్ముదన్నెననిన
నాదు చిత్తము నీదు స్వాదుపాదము గూర్చి
చింతపడుచునుండె సేవజేయ

గీ॥ అయ్యో! నీ పాద యుగళమ్ము ననువునిల్పి
కనుల ముందఱ కన్పింప గరుణగల్గి
చూపుమా విభో ! వానిని సుహృదయముగన్
పట్టి సేవింతు భక్తితో బాధతీర.

## టీక

హేశంభో = ఓయీశ్వరుడా ! త్వత్క్రమః = మీ పాద విన్యాసము, నిత్యం = ఎల్లప్పుడును, యోగిమనః = యోగీశ్వరుల యొక్క మనస్సనియెడు,

సరోజ = పద్మముయొక్క దళ = రేకులతో గూడ, సంచార = కూడి తిరుగుటయందు, క్షమః = సమర్థమైనది. తేన = అట్టిమృదువైన మీ పాదముతో, కఠోర = మిక్కిలి కఠినమైన, యమరాట్ = యమధర్మరాజు యొక్క, వక్షః కవాట = తలుపువంటి ఱొమ్ము యొక్క క్షతిః = ఛేదనము (తన్నుట), కథం = ఎట్లు? అత్యంతం = మిక్కిలి, మృదులం = మార్దవము గలిగిన, త్వదంఘ్రియుగళం = మీ పాదయుగ్మమును గూర్చి, మే = నా యొక్క మనః = మనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హా = అయ్యో ! ఏతత్ = ఈ పాదయుగ్మమును, లోచనగోచరం = కన్నులకగుపడుదానిగా, కురు = చేయుము. హస్తేన = చేతితో, సంవాహయే = పట్టి యొత్తెదను.

## తాత్పర్యము

చంద్రశేఖరా! మునీశ్వరుల మనఃపద్మములందు సంచరింపదగిన మీ మృదుపాదములతో నా కఠోరమైన యా యమునిఱొమ్ము ఎట్లు తన్నితివి ? అయ్యో! నామనస్సునకు మిక్కిలి విచారము గలుగుచున్నది. నా కన్నుల కగుపడునట్లు చేయుము. నా చేతులతో మీ పాదము లొత్తి సేవచేసెదను.

## వివరణము

భగవంతుని చూడంగానే భక్తి కలుగుతుంది. ఆ తర్వాత ఆ భగవంతుని పాదసేవ చేసినప్పుడు ముక్తి కలుగుతుంది. అంటే భగవంతుని ముఖం - భక్తిని, పాదాలు ముక్తిని కలుగచేస్తాయన్నమాట ! అందుకే ఎక్కువ మంది భక్తులు భగవంతుని పాదాలకే ప్రాముఖ్యాన్నిస్తారు. అందుకే శంకరులు గురుపాదుకాస్తోత్రం వ్రాశారు. శ్రీవిద్యలో కూడా 'పాదుకాంతదీక్ష' ప్రసక్తి వుంటుంది. శ్రీమద్రామాయణంలో గూడా 'పాదుకాపట్టాభిషేక ఘట్టం' ఆధ్యాత్మిక రహస్య విషయాలతో ప్రాముఖ్యాన్ని కలిగి వుంటుంది. (నేను వ్రాసిన పాదుకాపట్టాభిషేకం పుస్తకం చదవండి - వివరణ కర్త). గుహుడు శ్రీరాముని పాదాలను నీళ్ళతో కడిగే భాగ్యాన్ని చిత్రంగా దక్కించుకున్నాడు. శంకర

భగవత్పాదులుగూడా శివునితో చిత్రమైన సంభాషణచేసి ఆ అవకాశాన్ని దక్కించుకునేందుకు ఈ శ్లోకం ద్వారా ప్రయత్నించారేమో ననిపిస్తుంది.

శివా ! నిన్ను నిరంతరం యోగులు మనస్సులలో ధ్యానిస్తూ వుంటారు. అప్పుడు నువ్వు వారి హృదయ కమలాలకు సంబంధించిన రేకులపై సంచరించాల్సి వస్తుంది. ఇది నీకు నిత్యమూ తప్పనిసరిపనే కదా ! సహజంగానే నీ పాదాలు మృదువుగా వుంటాయి. యోగుల హృదయ పద్మాల రేకులపై నిత్యము నడువవలసి రావడంతో అవి మరింత సుకుమారంగాను, సుతిమెత్తగాను తయారై వుంటాయి. అటువంటి సుతిమెత్తని పాదాలతో బండరాయి లాంటి, తలుపు రెక్కలాంటి కఠినమైన యముని ఎదురు రొమ్మును ఎలా తన్నావయ్యా? అమ్మో ! దీన్ని తలుచుకుంటేనే నాకు కడుపు తరుక్కుపోతోంది. మనస్సు చివుక్కుమంటోంది. హృదయం ద్రవించి పోతోంది. ఏదీ ఆ పాదాలను ఒక్కసారి నా ముందు పెట్టు. చేతులతో మెత్తగా పట్టుకుని వత్తుతాను' అని - పాద సంసేవనా భాగ్యాన్ని దక్కించుకునే ప్రయత్నం చేసి తరించారు.

## సంస్కృత శ్లోకము - 80

శ్లో. ఏష్యత్యేష జనిం మనో౽స్య కఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురా౽భ్యాసితః ।
నో చేద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ ॥

## అనువాద పద్యము

సీ॥ పుట్టనుండెడు నాదు గట్టి మనసునందు
తిరుగాడ వలెనంచు గరుణ గల్గి
మృదువైన నీ యొక్క పద సరోజమ్ముల
నద్రుల దిరుగ నభ్యాస పఱచి

పుట్టుటకు మునుపె పూర్తిగా నా యొక్క
క్షేమరక్షణము చేసితివి నీవు
కాని యెడల నీవు నీ నటనమునకు
రమణీయ కుసుమతల్పములు వీడి,

గీ॥ అమల గృహముల మధ్య భాగములు వీడి,
దివ్య సుందరమైన వేదికలు వీడి,
ఇట్టి కమనీయమౌవాని నెన్నొ వీడి
ఏల చేతువు నాట్యము ఱాలపైన.

## టీక

హేశంభో = ఓ శంకరా ! ఏషః = వీడు, జనిం = ఉత్పత్తిని, (జన్మని) ఏష్యతి = పొందబోవుచున్నాడు. అస్య = వీనియొక్క, మనః = మనస్సు, కఠినం = కఠోరమైనది. తస్మిన్ = దానియందు, అటాని = సంచరింపవలసిన వాడను, ఇతి = అని, మద్రక్షాయై = నాసంరక్షణము కొఱకు, కోమలపదన్యాసః = మృదువైనయడుగులు వెట్టుట, గిరిసీమ్ని = పర్వత ప్రదేశమందు, పురా = (నేను పుట్టుక) మునుపు, అభ్యాసితః = అలవాటు చేయబడినది, నోచేత్ = అట్లుకాదేని, దివ్యగృహాంతరేషు = రమ్యమైన గృహములయొక్క మధ్య ప్రదేశములును, సుమనస్తల్పేషు = పూవులపాన్పులును, వేద్యాదిషు = అరుగులు మొదలగునవియు, ప్రాయః = బాహుళ్యముగా, సత్సు = ఉండగా, శిలాతలేషు = ఱాతినేలలయందు, తవ = నీకు, నటనం = నాట్యము, కిమర్థం = ఎందుకొఱకు ?

## తాత్పర్యము

శివా! నీవు నన్ను గూర్చి ఈ పురుషుడు భూమిలో పుట్టబోవును. వీని మనస్సు మిక్కిలి కఠినముగానుండును. అప్పుడు నాకు దానియందు సంచరింపవలసివచ్చును అని ఆలోచించి నా రక్షణమునకై నేను పుట్టకపూర్వమే

కఠినమైన కొండల మీద నీ కోమలపాదములతో నడచుట కలవాటు చేసితివి. కానిచో మేడలు మిద్దెలు పూలపాన్పులు, మంచిమంచి అరుగులు ఉండగా నీకేల ఈ రాళ్ళమీద నాట్యము చేయవలసివచ్చినది?

## వివరణము

క్రిందటి శ్లోకంలో శివుని పాదాలు సుకుమారంగా సుతిమెత్తగా వుంటాయని చెప్పిన శంకరులు అటువంటి సుతిమెత్తని పాదాలైనా గూడా రాళ్ళమీద అప్పలమీద ఎందుకు నాట్యం చెయ్యవలసి వచ్చిందో చాలా చిత్రంగా ఈ శ్లోకంలో చెప్తున్నారు - శంకరుల మాటలు వినండి.

ఓ పరమేశ్వరా ! 'కొంతకాలానికి కలియుగం వచ్చినపుడు వీడొకడు 'కాలడి'లో జన్మిస్తాడనీ, కఠినమైన నిర్ణయాలు ఎన్నో వీడు తీసుకోవలసి వస్తుందనీ (మాతృప్రేమ ఉన్నా తల్లిని వదిలివెళ్ళడం, ఇంద్రియ సుఖాలను వదిలి సంన్యసించడం, అభిమానానికి తావివ్వకుండా గురువును ఆశ్రయించడం మొదలైనవి). అందుకు కావలసిన కఠినమైన మనస్సు వీడికి వుండి తీరుతుందని - అటువంటి మనస్సు నందు సంచరించాల్సిన అవసరం కూడా రావచ్చనీ నీకు ముందే తెలుసునా ?" లేకపోతే - మిద్దెల్లోను, పాలరాతి సౌధాల్లోను, పూలపాన్పుల మీద సంచరించాల్సిన నువ్వు - వాటిని వదిలి, రాళ్ళ మీద అప్పల మీద కొండల్లోను - గుట్టల్లోను నాట్యం చేసి నీ పాదాలకు కర్కశత్వాన్ని ధృఢత్వాన్ని అలవాటు చేసుకోవలసిన అవసరం దేనికి ? నువ్వెంత దయాసముద్రుడివయ్యా ! నాపై నీ కెంతటి కరుణయ్యా ! ఎప్పుడో పుట్టబోయే నాకోసం, నా సంరక్షణ కోసం ముందునుంచే నీ పాదాలను ఎన్ని కష్టాలను ఓర్చుకునేట్లు అలవాటు చేశావయ్యా ! తండ్రీ ! నీ ప్రేమరమ్యం. నా జన్మ ధన్యం' (ఈ శ్లోకంలో శివుని అనుగ్రహం తన మీద ఎంతటిదో గూడా పరోక్షంగా చెప్పినట్లైంది.

## సంస్కృత శ్లోకము - 81

శ్లో. కంచిత్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః ।
కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్స ముక్తః ఖలు ॥

## అనువాద పద్యము

సీ॥ కొంత కాలము నీదు కోమలాంఘ్రి యుగము
నునువుగా నర్చనమ్మాచరించి
కొంతకాలము నీదు చింతనమ్మును సల్పి
ధ్యాన సమాధుల నాచరించి
స్వల్ప కాలము నీదు చరితమ్మును వినుచు
తక్కుకాలము నీదు దర్శనమ్ము
కొంత కాలము నిన్ను కొనియాడుచు గడిపి
హస్తాంజలులను నీ కందజేసి

గీ॥ ముదముతోడను నీయందు హృదయముంచి
ఇట్టి స్థితియం దెవడు చరియించుచుండు
అతడు జీవించియున్నవాడగుచుగూడ.
ముక్తినందును నిజముగా యుక్తవిధిని.

## టీక

హే ఉమామహేశ = పార్వతీ ప్రాణవల్లభుడవైన ఓమహాదేవా ! కంచిత్కాలం = కొంతసేపు, భవతః = నీయొక్క, పాదారవిందార్చనైః = కమలములవంటి పాదములపూజల తోడను, కంచిత్ = కొంతసేపు, ధ్యానసమాధిభిశ్చ = నిరంతరధ్యానము యొక్క నియమములతోడను, కంచిత్ = కొంతసేపు, నతిభిః = నమస్కారములతోడను, కంచిత్ = కొంతసేపు,

కథాకర్ణనైః = చరిత్రలు వినుటతోడను, కంచిత్ = కొంతసేపు, అవేక్షణైశ్చ = దర్శనములతోడను, కంచిత్ = కొంతసేపు, నుతిభిః = స్తోత్రముల తోను గూడి, ముదా = సంతోషముతో, త్వదర్పితమనాః = నీయందు నిలుపబడిన మనస్సుగలవాడై, ఈదృశీం = ఇట్టి, దశాం = స్థితిని, యః = ఏ పురుషుడు, ప్రాప్నోతి = పొందుచున్నాడో, సః = వాడు, జీవన్ = జీవించియున్నవాడగుచునే, ముక్తఃఖలు = మోక్షమును పొందినవాడగును గదా!

## తాత్పర్యము

ఉమానాథా! ఒకప్పుడు మీపాదపూజలు, వేరొకప్పుడు మీ ధ్యానములు ఇంకొకప్పుడు మీ పాదవందనములు, మరొకప్పుడు మీ కథలు వినుట, కొన్నివేళల మీ దర్శనము చేయుచు సంతోషము నొందువాడు జీవన్ముక్తుడగును.

## వివరణము

జీవన్ముక్తులవాలంటే ఏం చెయ్యాలో ఈ శ్లోకంలో చెప్తున్నారు. 'కాలక్షేపోనకర్తవ్యం కర్తవ్యం హరికీర్తనమ్' - అన్నట్లు కాలాన్ని వృథా చేసుకోకుండా సద్వినియోగపరచుకోవాలి. ప్రాపంచిక విషయాలు చర్చించుకునేందుకు, ఇంద్రియ సుఖాలనుభవించేందుకు, వ్యర్థ ప్రసంగాలకు, స్పర్ధవాదాలకు, నినాదాలకు, వ్యర్థపరచే కాలాన్ని సద్వినియోగ పరచుకోవాలి. వ్యక్తిగత, కుటుంబపరమైన బాధ్యతలు నిర్వర్తించడానికి, వృత్తి ధర్మాన్ని నిర్వర్తించడానికిపోగా మిగిలిన కాలాన్నంతా భగవత్సంబంధ విషయాలకై - కొంతకాలం పూజకు, కొంత కాలం స్తుతులకు, మరి కొంత కాలం ప్రాణాయామ ధ్యానాదులకు కేటాయించాలి. నిర్లక్ష్యము, వైముఖ్యము, రాకుండా త్రికరణాలైన మనోవాక్కాయాలను వినియోగించి ఎవరు ఇలా ఆనందంతో జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ వుంటారో వాళ్లు జీవించి యుండి కూడా ముక్తులే' అని శంకర భగవత్పాదులు ఈ శ్లోకంలో నిర్ధారిస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 82

శ్లో. బాణత్వం వృషభత్వమర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపం దధౌ ।
త్వత్పాదే నయనార్పణం చ కృతవాం స్త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతరః స ఏవ హి న చేత్కో వా తదన్యోఽధికః

## అనువాద పద్యము

సీ॥ నవ్యబాణమ్మౌచు దివ్య వృషభమౌచు
అర్థదేహమున యర్ధాంగి యౌచు
మంచి మిత్రుండౌచు, మద్దెలవాడౌచూ
చరణమున్గనగ సూకరమునౌచు
ఈ విధమ్ముగ విష్ణు విన్నిరూపులు దాల్చి
దేనికై యిట్లయ్యె తాను నట్టి
నీ పాద పూజలో నేత్రార్పణము జేసి
భవదీయ శారీర భాగమయ్యె !

గీ॥ ఆవిధమ్ముగ జేసిన అచ్యుతుండు
పరమ పూజ్యులు బ్రహ్మాదివరుల చేత
పూజ్యతరుదుగనయ్యె ఓ భూతనాథ !
అట్లు కాదేని అధికుడౌ అన్యుడెవడు ?

## టీక

ఆర్యాపతే = ఓపార్వతీపతీ ! హి = ఏ కారణమువలన, హరిః = విష్ణుమూర్తి, బాణత్వం = (నీకు) బాణమగుటయు, వృషభత్వం = (నీయొక్క) నందివాహన మగుటయు, అర్ధవపుషా = సగముశరీరముతో, భార్యాత్వం = (నీ) భార్యయగుటయు, ఘోణిత్వం = (నీపాదదర్శనమునకై) వరాహమగుటయు, సఖితా = (మోహినీరూపముతో) మిత్రమగుటయు, మృదంగవహతాచ =

(తాండవమప్పుడు) మద్దెలగాడగుటయు, ఇత్యాదిరూపం = ఈ మొదలగు నాకారమును, దధౌ = ధరించెనో, త్వత్పాదే = నీ పాదమునందు, నయనార్పణంచ = (కమలములు పూజించునప్పుడు వెయ్యి పూర్తి చెయ్యాలని) నేత్రమును సమర్పించుటయు, కృతవాన్ = చేసినవాడయ్యెనో, చ = ఇంతియకాక, త్వద్దేహభాగః = నీ దేహమందొక్క భాగము గలవాడు నయ్యెనో (అందువలన), సేవ = ఆ విష్ణువే, పూజ్యాత్ = పూజ్యులైన బ్రహ్మాదులకన్న, పూజ్యతరః = ఎక్కువగా బూజింపదగినవాడు, నోచేత్ = అటుల కాదేని, తదన్యః = ఆ విష్ణువుదక్క మఱియొక్కడు, అధికః = ఎక్కువవాడు, కోవా = ఎవ్వడు ?

## తాత్పర్యము

ఓ పార్వతీశ్వరా ! త్రిపుర సంహారకాలమందు విష్ణువు నీకు బాణమయ్యెను. వృషభరూపమైన నీకు వాహనముగా నుండెను. ఆర్యారూపముతో నీ యర్ధాంగమున భార్యయై యొప్పారె. నీ పాద సందర్శనకై వరాహరూప మెత్తెను. జగన్మోహినీరూపమున నీవాల్లభ్యము పొందెను. నీ తాండవ సమయమున మద్దెల వాయించెను. తననేత్రమును నీ పాదములకడ నర్పించెను. మీ యనుగ్రహమునకు పాత్రుడై మీ యర్ధాంగ సంగియగుటను బట్టియే కదా బ్రహ్మాదులందఱికంటె పూజ్యతరుడయ్యెను. కానిచో నంతవా డింకెవ్వడైనగలడా ? (కనుక బ్రహ్మాదులు పూజ్యులు, విష్ణువు పూజ్యతరుడు, నీవు పూజ్యతముడవు అని భావము)

## వివరణము

స్థితికారుడు, పోషకకారుడు - త్రిమూర్తులలో ఒకడు అయిన మహావిష్ణువంతటివాడు శివపాద దర్శనానికై చేసిన ఒక ప్రయత్నం గురించి 73వ శ్లోకంలో చెప్పారు. ఇప్పుడు ఆ శ్రీమహావిష్ణువే ఇంకా ఎన్నెన్ని ప్రయత్నాలు చేసి శివుణ్ణి మెప్పించి దేవతలందరిలోను పూజ్యతరుడయ్యాడో చెప్తున్నారు.

విష్ణుమూర్తి - త్రిపురాసుర సంహారకాలంలో శివుని విల్లుకు బాణంలాగా

మారాడు. వృషభమై శివునికి వాహనమయాడు, ఆర్యా రూపంతో శివుని సగం శరీరంగా భార్య అయాడు, పాద దర్శనానికి వరాహమయాడు, జగన్మోహినీరూపంలో శివుని మోహానికి గురి అయాడు. శివుడు తాండవ నృత్యం చేస్తున్నపుడు మద్దెల వాయించాడు. శివునికి సహస్ర కమలార్చన చేస్తున్నపుడు ఒక కమలం తగ్గితే తన నేత్రాన్నే కమలంగా శివునకు సమర్పించాడు. ఇన్ని విధాలుగా శివుని అనుగ్రహం పొందడానికి ప్రయత్నించి చివరకు శివానుగ్రహానికి పాత్రుడై బ్రహ్మాది దేవతలందరి కంటె పూజ్యతరుడయ్యాడు. ఇలా అనుకోవడం తప్పైతే ఆ విష్ణువు తప్ప బ్రహ్మాదుల్లో అధికుడెవరుగలరు? అని అంటున్నారు శంకరులు. దీన్ని బట్టి బ్రహ్మాదులు పూజ్యులని, విష్ణువు పూజ్యతరుడని, శివుడు పూజ్యతముడని అర్థం చేసుకోవలసి వుంటుందని అనుకోవచ్చును.

## సంస్కృత శ్లోకము - 83

శ్లో. జననమృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశః సంశయో నాస్తి తత్ర ।
అజనిమమృతరూపం సాంబమీశం భజంతే
య ఇహ పరమసౌఖ్యం తే హి ధన్యా లభంతే ॥

## అనువాద పద్యము

సీ॥ చావు పుట్టుకలతో సంబంధ మున్నట్టి
దేవతా గణముల సేవచేత
సుఖము లేశమ్మైన చూడగన్ కలుగదు
అనుటలో సందేహ మసలులేదు
అజనితుండు మరియు నమృత రూపమువాడు
ఆర్యాసతిని గూడునట్టివాడు

సర్వలోకములకు సంధాన కర్తయౌ
మృత్యుంజయాఖ్యుడౌ మృదుని నిత్య
గీ॥ మెట్టివారలు మనసులో నిహమునందు
యుంచు నప్పుడే సేవించుచుందురట్టి
వారు నిజముగ ధన్యులై పరమసౌఖ్య
మనెడు మోక్ష సాయుజ్యమ్ము నందురయ్య.

## టీక

జననమృతియుతానాం = చావుపుట్టుకలతోగూడిన, దేవతానాం = దేవతలయొక్క, సేవయా = భజనములచేత, సుఖలేశః = సుఖము లేశమైనను (విషయ సుఖమైనను), నభవతి = కలుగదు. తత్ర = అక్కడ, సంశయః = సందేహము, నాస్తి = లేదు, యే = ఏ పురుషులు, అజనిం = జననము లేని వాడును, అమృతరూపం = మరణరహితమైన రూపము గలవాడును, సాంబం = శక్తితోగూడినవాడును, ఈశం = శివుని, ఇహ = ఈ శరీరమునందుండగనే, భజంతే = సేవించుచున్నారో, తే = వారు, ధన్యాః = కృతార్థులై, పరమసౌఖ్యం = మోక్షానందమును, లభంతే = పొందుదురు.

## తాత్పర్యము

ఇతర దేవతలందఱు జనన మరణములు గలవారు. అట్టివారిని సేవించువారికి విషయానందమైనను తృప్తిగా గలుగదు. జనన మరణములు లేని పార్వతీ సమేత పరమేశ్వరుని శరీరవంతులై యుండగనే సేవించువారు కృతార్థులై మోక్షానందమును పొందుదురు.

## వివరణము

ఏ ఏ పనులకు ఎవరెవరి దగ్గఱకు వెళ్తే పనులు సక్రమంగా జరిగి చివరకు ఫలం చేకూరుతుందో ముందు తెలుసుకోడం అవసరం. దర్జీవాడి దగ్గరకు వెళ్ళి బట్టలు వుతికి పెట్టమంటే వాడు బట్టల్ని కాదు ముందు మనల్ని

ఉతుకుతాడు (అందం కావాలంటే 'బ్యూటీ క్లినిక్'కు వెళ్ళాలి గాని 'బైండింగ్ షాపు'కు వెళ్ళకూడదు) అలాగే మనం జనన మరణాలకు అతీతమైన శాశ్వతానందాన్ని అంటే మోక్షానందాన్ని పొందాలంటే – ఆ జనన మరణాలను జయించిన వారెవరైనా వుంటే- అంటే జనన మరణాలు ఎవరికి వుండవో లేదా పని చేయవో వారి దగ్గఱకు వెళ్ళాలి. దిక్పాలకుమని చెప్పుకున్న ఇంద్రాదిదేవతలు, సృష్టికర్త అయిన బ్రహ్మతో సహా ఇతర దేవతామూర్తులందరూ ప్రళయకాలం ఆసన్నంకాగానే కాలవశులు కావాల్సిందే ! జనన మరణ క్లేశాలు పొందాల్సిందే ! వాళ్ళకి విషయానందమే తృప్తిగా వుండదు. ఇంక వాళ్ళు, శాశ్వతానందాన్నేం పొందగలరు, ఇవ్వగలరు ? కానీ ప్రళయంలో కూడా సాక్షీభూతుడుగా నిలిచేది ఒక్క సదాశివుడే !

సదాశివునికి జననం లేదు మరణం లేదు. జననమే ఉంటే తల్లిదండ్రులుండేవారు. మరణమే వుంటే విషం మ్రింగేవాడు కాదు. యమధర్మరాజును బొమ్ముపై తన్ని మార్కండేయుణ్ణి కాపాడకలిగేవాడూ కాదు. ఎప్పుడూ 'ఉండటమే' ఆయన 'కీలక లక్షణము'. ఈ లక్షణం మరియే ఇతర దేవతలకీ లేదు. ఆయనలోంచి ఈ విశ్వం యావత్తూ వస్తూ, నిలుస్తూ చివరకు ఆయన లోకే లీనమై పోతూ వుంటుంది. ఈ మూడు ప్రక్రియలు ఆయన యందు జరుగుతూ వుంటే – ఆయన ఆ మూడింటికీ సాక్షీ భూతుడుగానే నేపథ్యంలో వుంటాడు. అందుకే ఆయన సదాశివుడు. 'అంటే ఎప్పుడూ మంగళకరంగా మనగలిగేవాడు.' ఇటువంటి లక్షణం గలవారిని ఆశ్రయిస్తే, 'శాశ్వతతత్వం' అంటే ఏమిటో, జనన మరణాతీతమైన స్థితి అంటే ఏమిటో, మోక్షానందమంటే ఏమిటో– తెలిసి ఇహలోకంలో శరీరంతో ఉన్నపుడే వాటిని పొందవచ్చు గాని – జన్మిస్తూ మరణిస్తూ కాలవశులైపోయే ఇతర దేవతల్ని ఆశ్రయిస్తే ప్రయోజనం ఏమొస్తుంది – అంటున్నారు శంకరులు.

## సంస్కృత శ్లోకము - 84

శ్లో. శివ తవ పరిచర్యాసంవిధానాయ గౌర్యా
భవ మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే ।
సకలభువనబంధో సచ్చిదానందసింధో
సదయ హృదయగేహే సర్వదా సంవసత్వమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ సకల శుభప్రదా ! సర్వలోకేశ్వరా !
శాశ్వతా ! శంకరా ! సదయభావ !
సచ్చిదానంద ప్రసాదార్ణవా ! శివా !
సకల భువన బంధు సాంబమూర్తి !
పర్వతాత్మజయైన పార్వతితో నున్న
పరమేశ్వరా ! ప్రభో ! వామదేవ !
మీ సమీపము నుండి మిమ్ము సేవించుటకు
సకల సద్గుణరాశి శాంతమూర్తి

గీ॥ అయిన నా బుద్ధి యనెడి కన్యామణి నిక
దానమిచ్చెద నీవు సద్దానిగొనుచు
నా హృదయ గృహమందున నాట్యమాడి
సేవసుఖమంది సతము వసింపు మీశ !

## టీక

శివ= ఓ శుభప్రదుడా ! భవ = ఓ సర్వోత్పాదకుడా ! సకల భువనబంధో = సమస్తలోకములకు బంధువైనవాడా ! సచ్చిదానంద సింధో = సచ్చిదానందములకు సముద్రుడైనవాడా ! సదయ = దయావంతుడా ! గౌర్యా = పార్వతీదేవితోగూడ, తవ = నీ యొక్క పరిచర్యాసన్నిధానాయ= సేవించుటకై సమీపమందుండుట కొఱకు, మమ = నాయొక్క గుణధుర్యాం =

సకలగుణములను వహించిన, బుద్ధికన్యాం = బుద్ధియనుకన్యకను, ప్రదాస్యే = దానము చేసెదను, త్వం = నీవు, హృదయగేహే = (నా) హృదయమనుగృహ మందు, సర్వదా = ఎల్లపుడును, సంవస = సుఖముగా నివసింపుము.

## తాత్పర్యము

శివా ! సమస్త సద్గుణములు గల నాబుద్ధి కన్యను నీకిత్తును. అది గౌరిని గూడి నీకు నిరంతరము సత్సపర్యలు చేయగలదు. నా హృదయసీమ యందు గృహస్థుడవై సుఖముగా వసింపుము.

## వివరణము

కైలాసంలో వున్న శివుణ్ణి ఊహించుకుని, ఎక్కడెక్కడి దేవాలయాలకు వెళ్ళి, ఆ దేవాలయాల్లోని విగ్రహాల్లో శివుణ్ణి ఊహించుకుని, ధ్యానంలో శివుణ్ణి ఊహించుకుని భజించడం కంటె ఎక్కడికీ కదలకుండా, ఒక్క చోటనే స్థిరంగా ఉండి ఆ శివుణ్ణి సేవించడానికి వీలుందా అని శంకరులు ఆలోచించారు.

ఒక గృహస్థుకు బాగా నచ్చిన కుర్రవాడొకడున్నాడు. ఆ కుర్రవాడు అన్ని విధాలా యోగ్యుడు. యువకుడు, సాధువు. నిత్య సంతోషి. జ్ఞానవంతుడు, ధనవంతుడు, ఆశిష్ఠుడు, ద్రఢిష్ఠుడు, బలిష్ఠుడు. ఎలా అయినా ఆ కుర్రవాడు ఎప్పుడూ తన ఇంట్లోనే తన వద్దనే ఉంటే బాగుండుననుకున్నాడు. అంతే ! ఒకే ఒక ఉపాయంతో ఆ కుర్రవాణ్ణి తన వద్దనే, తన ఇంట్లోనే ఉండేట్లు చేసుకోగలిగాడు. తన దగ్గఱ ఆ కుర్రవాడికి అన్ని విషయాల్లోను, అన్ని విధాలా సరిపోయే కూతురు ఉన్నది. వెంటనే ఆ కూతుర్ని ఆ కుఱ్ఱవానికిచ్చి ఇల్లరికపుటల్లునిగా తెచ్చుకున్నాడా గృహస్థు.

సరిగ్గా ఇలాగే శంకర భగవత్పాదులు గూడా శివుణ్ణి తన దగ్గటే తనలోనే శాశ్వతంగా ఉండిపోయే విధంగా చేసుకోగలిగారు. 'అయితే శంకరులకు పెళ్లీ కాలేదు పిల్లలెక్కడున్నారు – శివునికి కట్టబెట్టడానికి ?' అని అనుమానం రావచ్చు. ఆయన అంతకంటె ఇంకా విశేషమైన పద్ధతిలో శివుణ్ణి పొందగలిగారు.

మేధస్సులో శంకరుని మించిన వారెవరున్నారు ? అంటే అంతటి బుద్ధి నైశిత్యం ఎవరికి వుంటుంది ? అంతటి తన 'బుద్ధి' అనే కూతుర్ని శివునికిచ్చి పెళ్ళి చేయడానికి శివునితో ఒప్పందం చేసుకున్నారు. ఒప్పందం చేసుకోబోయే ముందు ఎన్ని అడ్డంకులు అవరోధాలు దాటాల్సి వచ్చిందో ! అయితే అవన్నీ తొలగి చివరకు కథ సుఖాంతం అయిందనుకోండి.

ఇంతకీ పెళ్ళికి ముందు శివునికి శంకరులకు మధ్య జరిగిన సంభాషణ మీకూ వినాలని వుందా ? అయితే వినండి –

'ఇంతకు పూర్వమే పెళ్ళైన వాణ్ణి. పైగా ఇద్దరితో పెళ్ళైంది. ఆ ఇద్దరూ ఉండగా ఎలాగయ్యా' అన్నాడు శివుడు.

'ఎలాగూ ఒకరు కాకుండా ఇద్దరు వచ్చారు కాబట్టి మూడోదానికి అభ్యంతరం ఉండకూడదు' – అన్నారు శంకరులు.

"భలేవాడివయ్యా అయితే – ఇల్లరికం అంటున్నావు – ఇంతకు పూర్వమే చేసుకున్న వారిద్దరికీ అన్యాయం చేసి, వాళ్ళని వదిలి మీ ఇంటికి రమ్మంటున్నావ్, ఇదే మన్నా నీకు న్యాయమనిపిస్తోందా ?"

"అబ్బెబ్బే ! వాళ్ళిద్దరినీ వదిలేసి మా ఇంటికి రమ్మనడంలేదు వాళ్ళిద్దర్ని కూడా తీసుకుని మా ఇంటికి వచ్చెయ్యమంటున్నాను. మా అమ్మాయి, చెప్పుకో కూడదు గాని చాలా బుద్ధిమంతురాలు. సుగుణాలరాశి. వినయ సంపన్నురాలు. మీబోటి పెద్దలంటే ఎంత గౌరవమో, భక్తో చెప్పలేను. మీ ముగ్గురే కాదు – మీ ఇతర కుటుంబ సభ్యులు (గణపతి, కుమారస్వామి) అంతా వచ్చినా ఏమీ విసుక్కోకుండా, అందరికి సపర్యలుచేసి సేవించుకుంటుంది. మీకాభయం అక్కరలేదు. కాపరాల్లో కలతలు వస్తాయేమోనిన మీరేమాత్రం భయపడాల్సిన పనిలేదు. నేను నమ్మకంగా చెప్తున్నాను. నా మాట నమ్మండి!"

"అయితే ఇంతకీ పెళ్ళిచేసుకోబోయే ముందు ఆ అమ్మాయిని ఒకసారి చూడొచ్చా ?' అవునూ, ఇంతకీ మీ అమ్మాయి పేరేమంటున్నావ్ ?"

"బుద్ధిమంతురాలని ముందే చెప్పాను గదండీ ! అలా అవడానికే ఆ అమ్మాయికి నేను 'బుద్ధిదేవి' అని పేరు పెట్టుకున్నాను. " అహో! అలాగా బాగానే వుంది వ్యవహారం ! ఇంతకీ మీ ఇల్లెక్కడ ?"

"ఎంతో దూరం లేదండీ – మీరు ఏ బండీ కూడా ఎక్కిరావల్సినపనిలేదు. నా హృదయమే ఆ ఇల్లు. నా బుద్ధి అనేకన్యను పెళ్ళిచేసుకుని నా హృదయమనే ఈ ఇంట్లోనే మీ యావత్కుటుంబం సంతోషంగా, ఆనందంగా మా అమ్మాయి బుద్ధి చేసే సపర్యలు పొందుతూ ఎంతకాలమైనా స్వేచ్ఛగా, నిస్సంకోచంగా, సంతోషంగా, ఆనందంగా వుండండి."

"ఏమో అనుకున్నాను చాలా గట్టివాడవయ్యా ! సరే! అలాగే కానీ' అన్నాడు శివుడు.

శంకరుల మేధస్సే మేధస్సు. మొత్తానికి శివుడంతటి వాణ్ణి ఇల్లరికపుటల్లునిగా చేసుకుని నిత్యం తన హృదయంలోనే ఆయన సాన్నిధ్యాన్ని అనుభవిస్తూ సేవించుకున్నారు శంకరులు. ఇదీ కథ.

**సంస్కృత శ్లోకము - 85**

శ్లో. జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ
న చ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః ।
అశన కుసుమ భూషా వస్త్ర ముఖ్యాం సపర్యాం
కథయ కథమహం తే కల్పయానీందుమౌళే ॥

**అనువాద పద్యము**

సీ॥ *పుష్పములను గాని భూషణములు గాని*
*చక్కని అశన వస్త్రములు గాని*
*ఇట్టి ముఖ్యమ్ము లౌనట్టి సపర్యల*
*నెట్టి విధమున చేబట్టగలను ?*

విషభోజనమ్మును విధుభూషణమునీయ
నీరధిని మథింప నేను తగను
బుసలుగొట్టు భుజగ భూషణమ్ములనీయ
తిమిరలోకమును భేదింపలేను
గీ॥ గట్టి గజచర్మ వస్త్రమ్ము గట్టు నీకు
అడవిలోన మృగములు వేటాడుటకును
నేను నేర్పుగల కిరాతుడైన గాను
ఎట్లు పూజింతు నిన్ననే నీశ ! చెపుమ.

## టీక

ఇందుమౌళే = చంద్రుని శిరస్సునందు ధరించినవాడా ! తే = నీకు, అశన = ఆహారము, కుసుమ = పుష్పము, భూషా =భూషణము, వస్త్ర = వస్త్రమును, ముఖ్యాం = ప్రధానములుగా గలిగిన, సపర్యాం = పూజోపచారమును, కథం = ఎట్లుగా కల్పయాని = కలిగించెదను ? కథయ = చెప్పుము. అహం = నేను, జలధి = సముద్రమును, మథన = తరుచుటకు, దక్షః = చాలినవాడను, నైవ = కాను, పాతాళ· పాతాళలోకమును, భేదీ = భేదించువాడను, నచ = కాను, వన = అడవియందు, మృగయాయాం = వేటాడుట యందు, ప్రవీణః = నేర్పుగల, లుబ్ధః = బోయవాడను, నైవ = కాను.

## తాత్పర్యము

చంద్రశేఖరా ! నీకిష్టమైన కాలకూటాహారముగాని, పుష్పమువలె శిరోభూషణముగ చంద్రునిగాని యిచ్చుటకు నేను సముద్రము మథింపగల వాడను గాను. నీ కిష్టమైన భుజగభూషణము కల్పించుటకు పాతాళమును భేదింపలేను. గజచర్మ వస్త్ర మిచ్చుటకు అడవులలో వేటాడు బోయను కాలేను. ఇంక నిన్నెట్లు పూజింపగలను ?

## వివరణము

దేవతాపూజకు ఉపచారాలెన్నో కావాల్సి వుంటాయి. షోడశోపచార పూజ అయితే పదహారు రకాల ఉపచారాలు చెయ్యాల్సి వుంటుంది. ఆ పదహారింటిలో అతిముఖ్యమైనవిగా అనుకుంటే కనీసం వస్త్రాభరణం, ఆహారం (నైవేద్యం), పుష్పము ఈ మూడింటినైనా సమర్పించగలిగి వుండాలి. శివపూజ విషయం అయితే - మరికొన్ని చిక్కులున్నాయి. ఆయనకు తగ్గహోదాలో ఉపచారాలు చెయ్యగలమోలేదో ఆలోచించుకోవాలి. శంకరులు ఈ విషయంలో ముందే ఆలోచించి సందేహపడినట్లు చెప్తున్నారు ఈ శ్లోకంలో.

శివుడంతటి వానికి వస్త్రాన్ని సమర్పించాలంటే - మనం సాధారణంగా కట్టుకునే నూలుబట్టలు, పట్టుబట్టలు నప్పుతాయా ? ఆయన గజ చర్మాన్నో, పులిచర్మాన్నో గాని కట్టడు. అవి తేవాలంటే ముందు వేటాడటం నేర్చుకుని దానిలో ప్రావీణ్యం సంపాదించి, అరణ్యాల్లోకి వెళ్ళి, ఏ ఏనుగునో ఏ పులినో చంపి వాటి చర్మం ఒలిచి పట్టుకురావాలి. ఇది తన వల్ల అయే పనేనా ?

ఆభరణాన్ని దేన్నైనా ఇద్దామంటే శివునికి నాగాభరణాలంటేనే ఇష్టం. వాటిని తేవాలంటే పాతాళంలోని నాగలోకానికి వెళ్ళాలి. ఈ పని మాత్రం తను చేయగలడా ?

ఆహారం ఇవ్వాలంటే - మనం తినేపప్పు, కూరా, పచ్చడి, పిండి వంట భోజనం ఏం బాగుంటుంది ? ఆయన పన్నాకు హోదాకు తగ్గట్లు అమృతాన్ని భోజనంగా పెట్టాలి. ఆ అమృతాన్ని సాధించాలంటే సముద్రాన్ని మథించాలి. అదేమన్నా సామాన్య విషయమా ? అంతటి శక్తి సామర్థ్యాలు తనకెక్కడివి ?

పోనీ, పుష్పాన్ని సమర్పిద్దామనుకుంటే - కనీసం కల్పవృక్ష కుసుమాలైనా వుండాలి గదా ! వాటిని సాధించాలన్నా సముద్ర మథనం చెయ్యాల్సిందే గదా!

కాబట్టి, శివునికి తగ్గట్టుగా వుండే వస్త్రం, ఆభరణం, ఆహారం, పుష్పాలను సమర్పించగలిగే సామర్థ్యం తనకు లేదని ఒప్పుకుంటూ ఏదో యథాశక్తి ధ్యాన,

ఆవాహనాది షోడశోపచారపూజను మాత్రమే ప్రస్తుతానికి చేయగలనని (నువ్వు కనుక నీకు సరిపోయేవిధంగా షోడశోపచారాలను సమర్పించగల సామర్థ్యాన్ని నాకిస్తే నీకు తగ్గట్లుగానే అన్నింటినీ సమర్పించగలననే భావం కూడా 'ప్రస్తుతాని'కి అన్న పదంలో ఉన్నది). ముందే సంకల్పం చెప్పుకుని నిత్యం శివపూజ చేసేవారుట.

## సంస్కృత శ్లోకము - 86

శ్లో. పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం న చ వా కిటిత్వమపి న ప్రాప్తం మయా దుర్లభమ్ ।
జానే మస్తకమంఘ్రిపల్లవముమాజానే న తేఽహం విభో
న జ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా ॥

## అనువాద పద్యము

సీ॥ పార్వతీ వల్లభా ! పశుపతీ శంకరా !
అమలమౌ నీ పూజకన్ని ద్రవ్యములు
బహుళమ్ముగా కూర్పబడినప్పటికి గూడ
ఏ విధమ్ముగజేతు సేవనీకు
పరమేశ నీయొక్క పాదపల్లవమును
దివ్యశిరస్సును తెలియనైతి
పొందగాలేనట్టి పోత్రీ మరాళ రూ
పములు నా చేత ప్రాప్తములు గావు

గీ॥ అట్టి రూపమ్ములను దాల్చినట్టి సకల
సృష్టికారుడైన విధాత చేత గాని,
స్థితికారుడౌ విష్ణువు చేతగాని
దర్శనము కానిదేగదా తత్త్వమెదియొ ?

## టీక

ఉమాజానే = పార్వతీదేవిని భార్యగా గలవాడా ! పూజాద్రవ్య = పూజించుటకు గావలసిన వస్తువులయొక్క, సమృద్ధయః = అతిశయములు, విరచితాః = సమకూర్చబడినవి. పూజాం = పూజను, కథం = ఎట్లుగా, కుర్మహే = చేయుదుము ? దుర్లభం = పొందశక్యము గాని, పక్షిత్వం = హంసపక్షిరూప మగుటయు, నచవా = లేనిచో, కిటిత్వమపి = వరాహరూప మగుట యైనను, మయా = నాచేత, నప్రాప్తం = పొందబడలేదు. అహం = నేను, తే = నీయొక్క మస్తకం = శిరస్సును, అఘ్రిపల్లవం = చిగురువంటి పాదమును, నజానే = ఎఱుగను. విభో = సర్వవ్యాపకుడా ! తద్రూపిణా = హంసకిటిరూపములు బొందిన, పితామహేన = బ్రహ్మదేవుని చేతను, హరిణా = విష్ణుమూర్తిచేతను, తత్వేన = యథార్థముగా, నజ్ఞాతంహి = తెలియబడలేదు గదా !

## తాత్పర్యము

పార్వతీ వల్లభా ! పూజాద్రవ్యములు విశేషముగా నున్నను నిన్ను పూజించు టెట్లు ? నీ శిరస్సు తెలియదు. నీ పాదములు తెలియవు. హంసవరాహ రూపములు ధరించి నిన్ను తెలిసికొన యత్నించిన బ్రహ్మవిష్ణువులే తెలిసికొనలేకపోయిరి గదా !

## వివరణము

క్రిందటి శ్లోకంలో 'యథాశక్తి ధ్యాన ఆవాహనాది షోడశోపచారపూజాం, కరిష్యే' అని సంకల్పించి పూజచేయగలనని శంకరులు చెప్పారు. సరే అలాగే తన శక్తికి తగ్గట్లు పూజా ద్రవ్యాలను సంపాదించి, తీరా పూజ ప్రారంభించబోయే ముందు శంకరులకు ఒక అనుమానం వచ్చింది. పూజలందుకునే దేవతను నఖశిఖ పర్యంతం చూస్తూ – అంగపూజ చేసి ప్రారంభించాలి గదా ! మరి అలా చూడాలనుకున్నపుడు శివుని శిరస్సును పాదాన్ని గూడా చూడగలగాలి

గదా ! అవి రెండూ ఎక్కడా కనబడటం లేదుట ! శివుని దేహం యొక్క ఆద్యంతాలను అంటే శిరస్సు, పాదాలను చూడాలంటే బ్రహ్మలాగా హంసరూపం ఎత్తాలి. విష్ణుమూర్తిలాగా వరాహరూపం ధరించాలి. అలాంటి రూపాలను నేను పొందలేనివాడను గదా ! అయినప్పటికీ హంసరూపం ధరించినా- బ్రహ్మగాని, వరహరూపం ధరించినా – విష్ణువు గానీ నీ శిరస్సూ, పాదాలను చూడలేకపోయారు గదా ! ఆ రూపాలను ఎత్తి గూడా ఏం లాభం? – అంటున్నారు శంకరులు. అంటే – 'బ్రహ్మ, విష్ణువు లాంటి వాళ్ళే నీ తలను పాదాలను తెలుసుకోలేకపోయినప్పుడు వాళ్ళ ముందు అతి సామాన్యుడనైన నేను వాటిని చూసి పూజించగలనా ?" అని అర్థం.

విశ్వమంతా నిండి విశ్వమే తన ఆకృతిగా కలిగిన శివునికి నిజంగా అంగపూజ చెయ్యాలంటే సాధ్యమయే విషయం కాదని తాత్పర్యం.

## సంస్కృత శ్లోకము - 87

శ్లో. ఆశనం గరళం ఫణీ కలాపో
వసనం చర్మ చ వాహనం మహోక్షః ।
మమ దాస్యసి కిం కిమస్తి శంభో
తవ పాదాంబుజభక్తి మేవ దేహి ॥

## అనువాద పద్యము

**సీ॥ అశనము కాలకూటవిష మాభరణమ్మురగమ్ము, నింకపై**
**వసనము హస్తిచర్మ, మికవాహన మొక్క వృషమ్ముగాగ**
**పశుపతి ! నాకునీయగల వస్తువు నీదరి యేమియుండె, సాం**
**బశివ ! భవత్పదాబ్జ పరభక్తిని మాత్రమె నాకు నీయుమా**

## టీక

శంభో = ఓ శంకరా ! తవ = నీకు, అశనం = భోజనము, గరళం = విషము, కలాపః = భూషణము, ఫణీ = పాము. వసనం = వస్త్రము, చర్మ =

ఏనుగుతోలు వాహనంచ = వాహనమును, మహోక్షః = ముసలియెద్దు, కిం = ఏమి, దాస్యసి = ఇచ్చెదవు ? మమ = నాకుగావలసినది, కిం = ఏమి, అస్తి = ఉన్నది ? తవ = నీయొక్క, పాదాంబుజ = పాదపద్మములయందు, భక్తిమేవ = భక్తిమాత్రమే, దేహి = ఇమ్ము.

## తాత్పర్యము

నీలకంఠా ! నీవు భుజించునది విషము. అలంకరించుకొనునది పాము. కట్టుబట్ట ఏనుగుతోలు. వాహనము ఎద్దు. నీవేమి నాకు యిచ్చెదవు? నీ పాద భక్తి యొక్కటే చాలు, అది ఇమ్ము.

## వివరణము

దేన్నైనా ఇవ్వగల సామర్థ్యం ఉండే దేవుడే ప్రసన్నుడై వరం కోరుకోమంటే – సగటు మానవుడు ఇంద్రియ సుఖాలనే కోరుకుంటాడు.

కాని, సాధారణంగా మానవుడికి కావలసిన కనీస అవసరాలు మూడే. అవే – కూడు, గుడ్డ, గూడు అంటే – ఆహారం, వస్త్రం, నివాసం. అయితే – ఇవికాక ఇంకా ఇస్తాను కోరుకోమని ఎవరన్నా అడిగితే – విలువైన నగలు, వడిగాపోయేందుకు వాహనం కూడా కోరుకుంటారనుకుంటే – సాక్షాత్తూ శివుడే – సాక్షాత్తు శంకర భగవత్పాదుల్నే అలా అడిగితే ఏం కోరుకుంటారో ఈ శ్లోకం ద్వారా తెలుపుతున్నారు.

ఎవరైనా తినడానికి పెట్టమని అడిగినా, మనం ఏదైనా తింటున్నపుడు ఎవరైన వచ్చినా – మనం ఏది తింటామో లేదా ఏది తింటున్నామో అదే రకమైన దాన్ని పెడతాం – అంతేగదా! మరి శివుణ్ణే అడిగితే ఆయన ఏం పెడతాడు – ఆయన తిన్నది 'విషం' కాబట్టి మనకూ అదే పెడతాడు. మరైతే అడుగుదామా వద్దా ? 'బాబోయ్ వద్దు' అనే అంటాం గదా ! అందుకనే శంకరులు కూడా నీ ఆహారం నాకు ఒద్దు – అన్నారు.

ఎవరైనా కట్టుకోడానికి బట్ట అడిగితే లేదా ఇంకొకరికి మనమే బట్టలు

పెడదామనుకున్నా మనం కట్టుకునే నేత లేదా టెర్లిన్ లేదా పట్టుబట్టల లాంటివే వారికీ ఇస్తాం - అంతేగదా ! మరి శివుణ్ణే అడిగితే ఆయన ఏం ఇస్తాడు. ఆయన కట్టుకునే లాంటివే ఇస్తాడు. ఆయన కట్టుకునేది గజచర్మం. కాబట్టి మనకూ అదేవిధమైంది ఇస్తాడు. తీసుకుంటామా ? తీసుకోలేం గదా! అందుకే శంకరులు కూడా నువ్వు ఇచ్చే వస్త్రం నా కొద్దు - అన్నారు.

ఎవరైనా తలదాచుకోడానికి ఆశ్రయం అడిగితే మనం నివసించే గృహంలోని ఏం అరుగునో గదినో ఇస్తాం అంతేగదా ! మరి శివుణ్ణి అడిగితే - ఆయన వుండేది వల్లకాడు కాబట్టి అక్కడికే వచ్చి తనతో పాటు ఉండమంటాడు - అందుకే శంకరులు శివుడు ఆశ్రయమిచ్చే వల్లకాడు వద్దన్నారు.

పైన చెప్పిన కనీస అవసరాలు కాకుండా ఆభరణాలను బహుమతిగా ఇవ్వదలచుకుంటే మనం ధరించేలాంటివాటినే అవతల వాళ్ళకూ ఇస్తాం. మరి శివుడైతే తాను ఆభరణాలుగా ధరించేవి పాములుగాబట్టి, పాముల్నే పెట్టుకోమని ఇస్తాడు. అందుకే శంకరులు ఆయనిచ్చే ఆభరణాలను కూడా వద్దన్నారు.

అల్లుడికి వాహనం కొన్నిద్దామనుకున్నామనుకోండి. ఏం చేస్తాం ! అన్నీ తిన్నగా వున్న సైకిలో, స్కూటరో, కారో, విమానమో ఏదో ఒకటి మనతాహతును బట్టి ఇస్తాం గదా ! మరి శివుడైతే ఏమిస్తాడు ? కావాలిస్తే తన ఎద్దు వాహనాన్ని వాడుకోమంటాడు లేదా అల్లాంటి ముసలి ఎద్దునే మరొకదాన్నిస్తాడు. దాని కంటే నడిచి వెళ్ళడమే సుఖం కదా అని - శంకరులు దీన్నీ వద్దన్నారు.

అయితే - ఇలా వంకలు పెట్టుకుంటూ ఇచ్చేవేమీ వదువద్దు అంటూంటే మరి ఆ శివుని దగ్గర ఇచ్చేందుకు ఏముంటుంది ? మనకు నచ్చేవి ఏవీ వుండవు. ఆయనిచ్చేవి అలానే వుంటాయి మరి. అందుకనే శంకరులు అటువంటి వాటిని దేన్నీ కోరకుండా సూటిగా తనకు కావల్సింది ఏదో అదే అడిగారు. ఏమిటది ? శివుని పాదారవిందాలపై ఎడబాటు లేని భక్తిని తనకు

అనుగ్రహించమన్నారు. దాన్ని ఇవ్వడానికి శివునికి అభ్యంతరం ఏమీ వుండదు గదా!

'మాకు ఇవ్వతగ్గవి నీ దగ్గర ఏమీ వుండవులే – అయినా నువ్వు మాకు ఏమిస్తావులే' అన్నట్లు పైకి ఏదోశివుణ్ణి కించపరచినట్లుగా వుంటుంది ఈ శ్లోకం. కాని శంకరులు అడిగింది సామాన్యమైంది కాదు. శివుని పాదాలపై భక్తిని అడిగారు. అది కూడా ఎడబాటు లేని భక్తి. ఆ పాదాలు సామాన్యమైనవా? సకల సౌభాగ్య నిధులు. ఈశ్వర సంబంధమైనదే 'ఐశ్వర్యం' ఐశ్వర్యం అంటే – డబ్బు, నగలు, వాహనాలు వస్త్రాలే కాదు ఏది వుంటే ఇంక అడగాల్సిన అవసరం ఏదీ వుండదో అది – దాన్నే ఈశ్వరానుగ్రహం అంటారు. అందుకే ఎవరినైనా దీవించేటప్పుడు సాధారణంగా 'ఆయురారోగ్య ఐశ్వర్యమస్తు'! (ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లు) అనే దీవిస్తారు అంతే గాని – 'ఆయురారోగ్య ధనకనక ప్రాప్తిరస్తు అని దీవించరు. శివుని అనుగ్రహమే వుంటే ఇంకా కావాల్సిందేముంది ? ఏదైనా అడిగితే అదొక్కటే వస్తుంది. తీరా ఆ వచ్చింది మనకు కలసి వచ్చేది కావచ్చు కలసి రాకపోయేది కావచ్చు. ఎందుకంటే అది మనం ఇలా జరుగుతుందని తెలియక కోరినది. అలాకాక అనుగ్రహమే వుంటే ఎప్పుడు మనకు ఏవి అవసరమో శుభమో అవే మనకు సంప్రాప్త మవుతాయి.

కాబట్టి, మనం గూడా శివుణ్ణి అలాంటి అనుగ్రహాన్ని పొందగలిగే శివపాదపరమైన భక్తినే కోరుకోవాలని ఈ శ్లోకంలో శంకరులు సూచిస్తున్నారు. అయినా నిజమైన భక్తులు, ముక్తులు, యోగులు ప్రాపంచిక సంబంధమైనవేమీ ఎప్పుడూ కోరుకోరు అని గూడా ఈ శ్లోకాన్ని బట్టి తెలుసుకోవాలి.

అసలైన మరొక విషయం ఈ శ్లోకంలో అంతరార్థంగా ఇమిడి వుంది.

మనం ఏది తింటే మరణిస్తామో దాన్ని ఆయన మనకు దూరం చేసి తాను మ్రింగి తన వద్దనే కంఠంలో ఉంచుకున్నాడు. అంటే – అది ఇంక బయటకు వచ్చి మన ప్రాణాలు తీయలేదు. ఆయనే కనుక ఆ సాగరమథన వేళలో పుట్టిన గరళాన్ని తాను స్వీకరించకుండా వుంటే మనమే కాదు ఇంద్ర,

బ్రహ్మాది దేవతలు, యక్షరాక్షస కిన్నెరాది జాతులతో వున్న ఈసమస్త విశ్వం దాని మహోగ్రజ్వాలలకు మాడి బూడిదై పోయి వుండేది.

మనం వేటిని చూడంగానే భయకంపితులమౌతామో అటువంటి పాముల్ని తనకు ఆభరణాలుగా చేసుకుని మనకు అభయాన్ని ప్రసాదించాడు. అంటే - ఆయన వద్దఉన్న నాగుపాము మనకు అభయానికి గుర్తు.

మనం చూస్తున్నపుడు జుగుప్సగా, అసహ్యంగా కనబడేవాని లాంటి ఏనుగు చర్మాన్ని ఆయన తనకు వస్త్రంగా చేసుకున్నాడు. అంటే ప్రపంచంలోని జుగుప్సను, అసహ్యాన్ని తానుంచుకుని మనకు నాజూకైన చీని చీనాంబరాలను ఇచ్చి అనుభవించమన్నాడు.

మనం ఎక్కడకు వెళ్ళదానికి ఇష్టపడమో అలాంటి వల్లకాటి (శ్మశానం) వద్ద తాను నివసిస్తూ మనల్ని గ్రామాల్లోను, పట్టణాల్లోను, నగరాల్లోను బ్రతకమన్నాడు. అంతేకాదు ఆ శ్మశానికి వచ్చే ప్రతి జీవిని కొంతకాలం తన పొట్టలో పెట్టుకుని రక్షించి మళ్ళీ పునరుజ్జీవితుణ్ణి చేస్తున్నాడు. **"అసలు ఇటువంటి భగవంతుడు ఒకడున్నాడని తెలియకుండానే మనం బ్రతుకులు వెళ్ళమారుస్తున్నాము. ఇది మరీ విచారించ తగ్గవిషయం."**

## సంస్కృత శ్లోకము - 88

శ్లో. యదా కృతాంభోనిధిసేతు బంధనః
కరస్థలాధః కృతపర్వతాధిపః ।
భవాని తే లంఘిత పద్మ సంభవ
స్తదా శివార్చా స్తవ భావనక్షమః ॥

## అనువాద పద్యము

*చం॥ వననిధిపైన మార్గముగ వారధి కట్టిననాడు దివ్య పూ
జనమును, వింధ్యగర్వమును చంపగనాయరచేతి దానికిం
దణచిననాడు భావనము, నబ్జభవాతిశయమ్ము గల్గ కీ
ర్తనమును నీకు జేయగల దక్షుడనౌదుగదా మహేశ్వరా !*

## టీక

శివ = ఓ సాంబమూర్తీ ! యదా =ఎప్పుడు, కృత = చేయబడిన, అంభోనిధి =సముద్రమందు, సేతుబంధనః = వారధినిర్మాణము గలవాడను, కరస్థల = అణచేతితో, అధఃకృత = దిగువకణచబడిన, పర్వతాధిపః =వింధ్యపర్వతముగలవాడను, లంఘిత = అతిశయంపబడిన, పద్మసంభవ = బ్రహ్మదేవుడు గలవాడను, (అగుదునో) తదా = అప్పుడు, తే = నీయొక్క అర్చా = పూజయందును, స్తవ =స్తోత్రమందును, భావన = ధ్యానమందును, క్షమః = సమర్థుడను, భవాని= అగుదును.

## తాత్పర్యము

శివా ! సముద్రమునకు వంతెన గట్టిన శ్రీరాముడును, అరచేతితో వింధ్యను నేలకడచిన అగస్త్యుడును, బ్రహ్మదేవుని కన్న నెక్కువవాడను నేనగుదు నేని నీ పూజాస్తోత్ర ధ్యానములు చేయుటకు సమర్థుడనుగా నుందును.

## వివరణము

శివుడంతవానికి పూజచెయ్యగలిగే స్తోమత ఉండాలంటే సముద్రానికి వారధి గట్టిన శ్రీరామచంద్రుడంతవాడవాలిట. సముద్రానికి వారధి కట్టగలగడం సామాన్య విషయం కాదు. ఈ పనిచేసిన మొట్టమొదటి వాడు శ్రీరాముడే. అందుకే శ్రీరాముని చేతకు అంత ప్రాముఖ్యం. శ్రీరాముడు శివభక్తుడైన రావణుని వధించిన తరువాత హిందూదేశపు దక్షిణ భాగంలో ఉన్న సముద్ర తీరానికి వచ్చి ముందుగా శివప్రతిష్ఠ చేసి శివునిపై గల తన అత్యంతమైన భక్తిని చాటుకున్నాడు. (దుష్టత్వాన్ని నిర్మూలించడం కోసం రావణుణ్ణి చంపాల్సి వచ్చింది కాని, రావణుని శివభక్తిని వ్యతిరేకించి కాదని గూడా ఈ శ్లోకం తెలియచేస్తుంది.)

శివుడంతవానిని స్తుతించాలంటే తాను అగస్త్యుడంతవాడవాలిట. "ఓరేయ్! అబ్బీ ! నీతో కొంచెం పని వుంది. కిందకు రా!" అంటే వెంటనే –

ఆకాశాన్నంటే ఎత్తుకెదిగిన వింధ్య పర్వత రాజు – 'చిత్తం' అంటూ అగస్త్యుని పాదాల వద్దకు చాపచుట్టలా పడిపోయాట్ట ! అదీ అగస్త్యుని మాట విలువ. (రావణుని సంహరించడంలో ఒక రోజు శ్రీరాముడు కొంచెం నిరుత్సాహంతో వుంటే – అప్పుడు అగస్త్యుడు వచ్చి శ్రీరాముని వంశకర్త అయిన సూర్యునికి సంబంధించిన స్తోత్రాన్ని ఉపదేశిస్తాడు. ఆపైన శ్రీరాముడు రెట్టించిన ఉత్సాహంతో రావణుణ్ణి వధిస్తాడు. అగస్త్యుడు ఉపదేశించిన "తతోయుద్ధ పరిశ్రాంతం సమరేచింతయాస్థితం..." అనే 'ఆదిత్యహృదయం' – స్తోత్రాన్ని ప్రతిరోజు సూర్యోదయ సమయంలో చదువుకుంటే శక్తి, ఉత్సాహం, తేజస్సు, సామర్థ్యము, చక్కని ఆరోగ్యము కూడా వస్తాయి. అగస్త్యుడు ఉపదేశించిన ఈ స్తోత్రానికి అంతటి శక్తి వున్నది. కాబట్టే – శంకరులు శివుణ్ణి స్తుతించాలంటే – అగస్త్యుడంతటి వాడవాలి – అన్నారు అనేది కూడా ఈ శ్లోకం సూచిస్తుంది.

శివుడంత వానిని ధ్యానించాలంటే బ్రహ్మంతవాడవాలిట ! నారాయణుని నాభిలోంచి పుట్టిన పద్మంలోంచి బ్రహ్మ ఉద్భవించాడు. ఆ పద్మంలో వుండగా బ్రహ్మకు అనుమానం వచ్చిందట. ఏమిటి నేను ఇక్కడకు ఎలా వచ్చాను అని. ఆ పద్మనాళం గుండా క్రిందకు వెళ్ళి ధ్యాననిమగ్నుడైతే నారాయణుడు దర్శనమిచ్చి వాత్సల్యంతో వరం కోరుకోమంటాడు. ప్రపంచంలో మొట్టమొదటగా ఇలా ధ్యానం అనేది చేసినవాడు బ్రహ్మ. ఆ ధ్యానానికి సాక్షాత్తు నారాయణుడే ప్రసన్నుడయాడు. బ్రహ్మ చేసిన ఆ ధ్యానానికి అంతటి శక్తి ఉంటుందని చెప్పడానికి – శివుణ్ణి ఎవరైనా ధ్యానం చేయాలంటే బ్రహ్మంతవాడవాలని ఈ శ్లోకంలో శంకరులు సూచించారు.

మనం గూడా త్రికరణ శుద్ధిగా శివుణ్ణి – పూజ – స్తుతి – ధ్యానాలతో ఆరాధిస్తే – ఈ శ్లోకంలో చెప్పిన శ్రీరాముడు, అగస్త్యుడు, బ్రహ్మంత వాళ్లం కాగలమనే సూచన గూడా ఈ శ్లోకంలో వుంది.

## సంస్కృత శ్లోకము - 89

శ్లో. నతిభిర్నుతిభిస్త్వమీశ పూజా
విధిభిర్ధ్యానసమాధిభిర్న తుష్టః ।
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి ॥

గీ॥ నతులును, ధ్యానముల్, తమకు నచ్చెడి రీతి శుభార్చనావిధుల్,
నుతుల్, సమాధులున్, మరి ధనుస్సులు, రోకటి పోట్లు, రాళ్ళతో
మతి ముదమందనీకు, తమ మానస మందున మిక్కుటమ్ముగా
నతుకుచు ప్రీతి గొల్ప తగినట్టిది చెప్పిన నట్లు చేసెదన్.

### టీక

ఈశః = ఓ ఈశ్వరుడా ! త్వం = నీవు, నతిభిః= నమస్కారముల చేతను, నుతిభిః = స్తోత్రముల చేతను, పూజావిధిభిః = పూజావిధానముల చేతను, ధ్యానసమాధిభిః = ధ్యానసమాధుల చేతను, ధనుషా = వింటి దెబ్బలచేతను, ముసలేన = రోకలిపోట్లచేతను, అశ్మభిర్వా = ఱాళ్లు రువ్వుటచేతనువలె, తుష్టః = సంతోషించినవాడవు, న = కావు, తే = నీకు, ప్రీతికరం = (పైరెంటిలో) ప్రియమైనది, వద = చెప్పుము, తథా = అట్లు, కరోమి = చేయుదును.

### తాత్పర్యము

ఈశ్వరా ! నమస్కారములు, స్తోత్రములు, పూజలు, ధ్యానములు, సమాధులు మొదలగు వానితో తృప్తిపడక, వింటిదెబ్బలు, రోకటిపోట్లు, రాళ్ళు రువ్వుట మొదలగువానితో పరమప్రీతి నొందితివని పురాణగాథలు వింటిని. ఇందు నీకేది ప్రియమో చెప్పుము. ఆ విధముగానే చేసెదను.

## వివరణము

సామ దాన భేద దండోపాయాలున్నట్లే - భక్తిలో గూడా వివిధ రకాలున్నాయని శంకరులు ఈ శ్లోకం ద్వారా కొన్ని పురాణ గాథలను తెలియ చేస్తున్నారు. సాత్త్వికమైన పూజలు, స్తుతులు, ధ్యానాలు ఒకరకమైతే - రోకటి పోట్లతో, రాళ్ళు రువ్వడంతో, వింటి దెబ్బలతో కూడా భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకోవడం రెండోరకం. ఇదెక్కడి భక్తి 'చాలా విడ్డూరంగా ఉందే' అని ముక్కుమీద వ్రేలు వేసుకోనక్కరలేదు. అలా చేసిన వాళ్ళున్నారు. అలా చేసి శివుని మెప్పు గూడా పొంది, పైగా అలా చేసినందుకు ప్రతిగా పెద్ద ప్రతిఫలాన్ని గూడా సంపాదించిన వారున్నారు.

'శివుణ్ణి మెప్పించి పాశుపతాస్త్రం సంపాదించు అదిముందు ముందు నీకు చాలా అవసరం అవుతుంది' అని - శ్రీకృష్ణుడు అర్జునిడికి సలహాఇచ్చి ప్రేరేపిస్తాడు. అప్పుడు అర్జునుడు శివుని గూర్చి తపస్సు చేస్తాడు. పాశుపతాస్త్రం సామాన్యమైంది కాదు. ఆటంబాబు, హైడ్రోజన్ బాంబు లాంటిది. తొందరపడి దీన్ని ఉపయోగించకూడదు. (తొందరపడి ఆటంబాబును ఉపయోగిస్తే 1945లో ఏం జరిగిందో మనందరకు తెలుసు. హీరోషిమా, నాగసాకి పట్టణాలు మొత్తం ధ్వంసమయాయి. ఇప్పటికీ దాని ప్రబావం అక్కడ వుందంటారు) దాన్ని ఎంతో అవసరమైతేనే తప్ప, అదిగూడా సమస్త మానవాళికి రక్షణ జరుగుతుందంటేనే ఉపయోగించాలి. అందుకని దీన్ని స్వీకరించడానికి అర్జునుడు తగిన వాడా కాదా అని తెలుసుకునేందుకు శివుడు అతణ్ణి పరీక్షిద్దామనుకున్నాడు.

శివుడు కిరాతరూపం దాల్చి - తపస్సు చేస్తున్న అర్జునుణ్ణి ఏదో విధంగా కయ్యంలోకి దింపాడు. ఆ కయ్యంలో అర్జునుడు తన బాణాలన్నీ వృథా చేసుకున్నాడు. విల్లు కూడా విరిగిపోయింది. ఆ విరిగిన వింటితో కిరాతరూపంలో వున్న శివుణ్ణి తలపై మోదాడు. అదీ పని చెయ్యకపోతే రాళ్ళు రువ్వాడు. అవీ వ్యర్థమయాయి. బలంగా పిడికిటి పోట్లు ఉపయోగించాడు. వాటివల్ల కూడా పని జరగలేదు. అప్పుడు ఇక చివరకు పాలు పోక ఇద్దరూ

ముఖాముఖీ బాహాబాహీ కలియపడ్డారు. అప్పుడు అర్జునుని ధైర్య సాహసాలకి, బలానికి మెచ్చి, కిరాతరూపాన్ని వదిలి స్వస్వరూపంతో ప్రత్యక్షమై పాశుపతాస్త్రాన్నిచ్చి - ఎలాంటి సమయాల్లో మాత్రమే దాన్ని వాడాలో చెప్పి ఆశీర్వదిస్తాడు. ఇదీ కథ.

ఈ కథలోని విషయాలనే - శంకరులు గమ్మత్తుగా ఈ శ్లోకంలో ఉటంకించారు. "చెప్పు శివా ! మామూలుగా అందరు భక్తులు చేసే సాత్త్వికమైన పూజలు, స్తోత్రాలు, ధ్యానాలు చేస్తే నువ్వు ఇష్టపడతావా ? లేకపోతే అర్జునుడిలా రోకటి పోట్లు, రాళ్ళు రువ్వడాలు, తలబ్రద్దలు కొట్టడాలు చెయ్యమంటావా? నీ ఇష్టం - నువ్వెలా చెప్పితే అలా చెయ్యడానికి నేను సిద్ధం. ఎలా చేసినా నువ్వు ప్రత్యక్షమై ప్రసన్నుడవు కావడమే నాకు ముఖ్యం" అంటున్నారు. ఈ శ్లోకం - కోపంతో, ప్రణయ కోపంతో, ద్వేషంతో, పగతో గూడా భగవంతుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవచ్చని తెలుపుతోంది. అలా చేసుకోవచ్చని భాగవతం కూడా చెప్తోంది. జయ-విజయులైన హిరణ్యాక్ష-హిరణ్యకశిపులు, రావణ-కుంభకర్ణ, శిశుపాల- దంతవక్త్రాదులు అలాచేసే దేవుడికి దగ్గరయారు కూడా !

## సంస్కృత శ్లోకము - 90

శ్లో. వచసా చరితం వదామి శంభో
రహముద్యోగవిధాసు తేఽప్రసక్తః ।
మనసాఽఽకృతి మీశ్వరస్య సేవే
శిరసా చైవ సదా శివం నమామి ॥

## అనువాద పద్యము

సీ॥ నీ యుద్యోగ విధానముల్ తెలియరానే రావు నాకున్ విభో
నీ యత్యద్భుతమైన దివ్యకథలన్ నే వాక్కుతో పల్కుచున్
నీ యొక్కాకృతి నాదు మానసములో నే ధ్యానమున్ చేయుచున్
నీ యొక్కాంఘ్రుల చెంత శీర్షమిడి నే నీకేనతుల్ చేసెదన్.

## టీక

అహం = నేను, తే = నీ యొక్క, ఉద్యోగ = ఉన్నత యోగముల యొక్క, విధాసు = విధానములయందు, అప్రసక్తః = పరిచయము లేనివాడను, వచసా = వాక్కుచేత, శంభోః = సుఖస్వరూపుడవగు, తే = నీయొక్క చరితం =చరిత్రమును, వదామి = చెప్పుచున్నాను. మనసా = మనస్సు చేత, ఈశ్వరస్య = ఈశ్వరుడవైన, తవ = నీ యొక్క, ఆకృతిం = ఆకారమును, సేవే = సేవించుచున్నాను. శిరసా = శిరస్సుచేత, సదాశివం = నిత్యసుఖ స్వరూపుడవైన, త్వామేవ = నిన్నే, నమామిచ = నమస్కరించుచున్నాను.

## తాత్పర్యము

శివా ! ఉత్తమ శివయోగముల పరిచయము లేదు. మనస్సు స్థిరముగా నిలువదు. కనుక వాక్కుతో మీ చరిత్రలు పల్కుచు, మనస్సున మీయాకృతి ధ్యానించుచు శిరస్సుతో మీ పాదపద్మములకు నమస్కరించుచు శక్తివంచన లేక సేవించెదను.

## వివరణము

88వ శ్లోకంలో చెప్పిన శ్రీరాముడు, అగస్త్యుడు, బ్రహ్మ వంటి వారు చేసినట్లు – పూజ, స్తోత్రం, ధ్యానం చెయ్యలేకపోవచ్చును గాని, యథాశక్తి – నాకున్నంతలో, నాకు తెలిసినంతలో, నా నిష్ఠ కుదిరినంతలో నీకు వాటిని చేయగలను. వాక్కుద్వారా నిన్ను నీ చరిత్రను స్తుతిస్తాను. నోటిద్వారా నీ కథాచరిత్రలను గానం చేస్తాను. మనసారా నిన్ను ధ్యానిస్తాను. శిరస్సు వంచి నీకు పాదాభివందనం చేసి మ్రొక్కుతాను. నువ్వు నన్ను తక్కువ చేసి చూడకుండా త్రికరణ శుద్ధిగా నేను చేసే మనోవాక్కాయపూజను అంగీకరించి అనుగ్రహించు అని ఎంతో వినయంగా ఈ శ్లోకంలో శంకరులు భక్తి ప్రపత్తులతో శివుణ్ణి అర్థిస్తున్నారు.

## సంస్కృత శ్లోకము - 91

శ్లో. ఆద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్ ।
సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం
భావే ముక్తేర్భాజనం రాజమౌళే ॥

## అనువాద పద్యము

మ. సదయా ! నీ దయచే హృదాద్యభరితాజ్ఞానమ్ము నిర్మూలమై
హృదయగ్రంథి విభేదమున్ జఱుపు సౌహృద్భావనా జ్ఞానమే
ఉదయంబయ్యె, శుభప్రదమ్మవుచు, మోక్షోపాయమైనట్టి నీ
పదపద్మంబుల గొల్తు నేను మదిలో బాలేందుచూడామణీ !

## టీక

రాజమౌళే = ఓ చంద్రశేఖరా ! త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహము వలన, హృద్గతా = హృదయము నంటియున్న, ఆద్యా = మొట్టమొదటిదియగు, అవిద్యా = అజ్ఞానము, నిర్గతా = తొలగిపోయినది. ఆసీత్ = అయ్యెను. యా = ఏజ్ఞానము, హృత్ = హృదయగ్రంథిని హరించునదియో, (సా = ఆ) విద్యా = జ్ఞానము, హృద్యా= హృదయమున ప్రవేశించిన దయ్యెను. శ్రీకరం = సంపత్కరమ్మును, ముక్తేః = మోక్షమునకు, భాజనం = ఆధారమైనదియునగు, త్వత్పదాబ్జం = నీ పాదపద్మమును, భావే = మనస్సునందు, నిత్యం = ఎప్పుడును, సేవే = ధ్యానించుచున్నాను.

## తాత్పర్యము

చంద్రశేఖరా ! నీ దయవలన నాయజ్ఞానము తొలగిపోయి సుజ్ఞానము కలిగినది. సంపత్కరము మోక్షప్రదమగు నీ పాదయుగ్మమును సేవించెదను.

## వివరణము

భగవద్గీతలో చివరిదైన మోక్ష సంన్యాస యోగంలో అర్జునుడు చిట్టచివరకు-

**శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధ్వా త్వత్ప్రసాదాన్మయాచ్యుత**
**స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ.**

(నీ అనుగ్రహం వలన మోహం నశించి, స్మృతిని మళ్ళీ పొందాను. స్థిరత్వం చేకూరింది. సందేహాలు పోయాయి. నువ్వు చెప్పినట్లే చేస్తాను) - అని అంటాడు. అలాగే ఈ శివానందలహరీ స్తోత్రం చివర చివరకు వస్తుంటే శంకర భగవత్పాదులు గూడా పూర్తిగా అట్లాంటి అర్థమే వచ్చే విధంగా ఈ 91వ శ్లోకంలో -

"ఇన్నాళ్ళుగా చేసిన సాధనలవలన, నీ అనుగ్రహం వలన నా అదృష్టం పండి, ఎన్నో రోజులనుండి హృదయమంతానిండిఉండి, హృదయగ్రంథిని హరించినట్టి అజ్ఞానం పూర్తిగా తొలగిపోయింది. ప్రస్తుతం హృదయం నిండా విద్యాగంధమే నిండి వుంది. మంగళకరము, మోక్షప్రదమూ అయిన నీ పాదపద్మాన్నే నిత్యం సేవిస్తాను" అన్నారు.

(హృదయగ్రంథి విభేదనం జరిగితే వచ్చే శుభపరిణామాలను -

**శ్లో. భిద్యంతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః**
**క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే -**

అనే శ్లోకంలో చెబుతారు. (హృదయగ్రంథి విభేదనం జరిగితే - సర్వసంశయాలు తీరి వైరుధ్యంగా, వైవిధ్యంగా వుండే వాటి మధ్య సమన్వయము కుదురుతుంది. కర్మబంధాలు అన్నీ నశిస్తాయి. స్థూల - సూక్ష్మ; బ్రహ్మాండ - పిండాండ సమన్వయ దృష్టి ఏర్పడుతుంది - అని ఈ శ్లోకార్థం)

అయితే - 'శంకర భగవత్పాదుల హృదయంలో ఇంతకు ముందు వరకు అజ్ఞానం నిండి వున్నదా?' అనే అనుమానం రాకూడదు. ఈ శివానందలహరిని

అర్థం చేసుకుని చదువుతూ, చదువుతూ వుంటే చివర చివరకు వచ్చేటప్పటికి హృదయగ్రంథి విభేదనం జరిగి పైన తెల్పిన శుభపరిణామాలు మనకు చేకూరుతాయి అని - పాఠకులకు శంకరుల ఉపదేశం అన్నమాట !

## సంస్కృత శ్లోకము - 92

శ్లో. దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్య దుఃఖ దురహంకృతి దుర్వచాంసి ।
సారం త్వదీయచరితం నితరాం పిబంతం
గౌరీశ మామిహసముద్ధర సత్కటాక్షైః ॥

## అనువాద పద్యము

మ. పరమేష్ఠీలిఖితార్థమైన దురిత ప్రారబ్ధ జన్యంబులౌ
దురహంకారము, దుఃఖమున్ పరుషమౌ దుర్భాషణాభ్యాసమున్
దురదృష్టమ్మును నీ కటాక్ష కృపచే దూరంబయెన్ నీ సుధా
చరితమ్మున్ తమి గ్రోలు నన్నిపుడె యీశా ! యుద్ధరింపన్ గదే !

## టీక

గౌరీశ = ఓ పార్వతీ వల్లభా ! దురక్షరాణి= బ్రహ్మలలాటమందు వ్రాసిన దుష్టలిపిసూచకములను, దురితాని = పాపకర్మముచేత గలిగినవియు, దౌర్భాగ్య = దురదృష్టము, దుఃఖ = దుఃఖము, దురహంకృతి = దుష్టములగు దేహాదులయందు 'అహం' అనుఅభిమానమును, దుర్వచాంసి = పరుష భాషణమును, సత్కటాక్షైః = నీకడకంటి చూపులచేత, దూరీకృతాని = దూరముగాబోగొట్టబడినవి. సారం = సారమైన, త్వదీయచరితం = నీచరిత్రను, నితరాం = మిక్కిలి, పిబంతం = క్రోలుచున్న (వినుచున్న), మాం = నన్ను, ఇహ = ఈ జన్మమందు, సముద్ధర = ఉద్ధరింపుము.

## తాత్పర్యము

గౌరీనాథా ! నుదుటవ్రాసిన బ్రహ్మవ్రాతకు సూచకములగు సమస్త దుఃఖములు నీ కటాక్షము వలన పోయినవి. నీ సార చరిత్రములనే విను నన్ను ఈ జన్మము నుండి తరింప జేయుము.

## వివరణము

ఇంతకు ముందు శ్లోకంలో చెప్పినట్లుగానే ఈ శ్లోకంలో గూడా శివునికి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నారు.

ప్రతి జీవిని బ్రహ్మ సృష్టించి భూమ్మీదకు పంపే ముందు ఆ జీవి భావి జీవితమెలావుంటుందో నొసటి మీద సూక్ష్మంగా వ్రాసి పంపుతాడట. జీవి పూర్వజన్మలో చేసిన పాప పుణ్యఫలితాల కనుగుణంగా ఆ వ్రాత వుంటుందిట. ప్రతి జీవి ఏవో లాభాలు నష్టాలు అదృష్టాలు దురదృష్టాలు, సుఖదుఃఖాలు ఇలా ఎన్నో పూర్వకర్మఫలాలను ప్రస్తుత జన్మలో అనుభవిస్తాడుట. శివుని అనుగ్రహం వలన శంకరులకు అటువంటి పూర్వజన్మ తాలూకు దురదృష్ట, దుఃఖాలన్నీ తొలగిపోయాయిట. ఇంక ఈ జన్మలో శివస్తోత్ర, సంకీర్తన, పూజనాదులు చేసి, శివచరిత్రలు, కథలే వింటారుట. అందుకు ప్రతి ఫలంగా - వచ్చే జన్మకు కర్మ మిగలకుండా క్షాళనమై ఈ జన్మలో వుండగానే తరింపచెయ్యమని ప్రార్థిస్తున్నారు. అంటే - తాను తరించడానికి ఏం చెయ్యదలచుకున్నారో చెప్పారు. అలా చెయ్యడం మనకూ నచ్చితే మనమూ అలా చేసి తరించవచ్చని సూచన అన్నమాట ! అంతేకాని మీరు ఇలా నేను చేసినట్లు చెయ్యండని తన సిద్ధాంతాలను మనమీద రుద్దడం కాదు. పెద్దవాళ్ళలాగే సలహా ఇస్తారు. 'విశ్వదాభిరామ వినురవేమ' అని వేమన తనకు తనే చెప్పుకున్నాడు గాని, 'వినురజీవ' అని మనకు చెప్పలేదు.

## సంస్కృత శ్లోకము - 93

శ్లో. సోమకలాధరమౌళౌ
కోమలఘనకంధరే మహామహసి ।
స్వామిని గిరిజానాథే
మామకహృదయం నిరంతరం రమతామ్ ॥

## అనువాద పద్యము

*గీ॥ శిరమునందున శశిరేఖ, కరము వెలిగి*
*మృదుల జలధర గ్రీవమ్ము మేనగల్గు*
*సోమశంకర శివ పరంజ్యోతి యందు*
*నెల్లపుడు నా మనసు రమియించు గాక !*

## టీక

మామకహృదయం = నా మనస్సు, సోమకళాధరమౌళౌ = శిరస్సున చంద్రకళ ధరించినట్టియు, కోమల = కోమలమైన, ఘన = మేఘము వంటి, కంధరే = మెడగలిగినట్టియు, స్వామిని = సర్వనియామకమైనట్టియు, గిరిజానాథే = పార్వతీపతిరూపమైన, మహామహసి = మహాజ్యోతి యందు, నిరంతరం = ఎల్లప్పుడును, రమతాం = క్రీడించుగాక.

## తాత్పర్యము

పార్వతీ పరమేశ్వర రూపముతో వెలుగుచున్న పరంజ్యోతి స్వరూపమైన పరబ్రహ్మమునందు నా చిత్త మెప్పుడును విహరించు గాక !

## వివరణము

పూజలందుకోవాలన్నా, స్తుతులందుకోవాలన్నా, ధ్యానింపబడాలన్నా, ఏదేవతలైనా నామరూపాలతో వుండాలి. ఆత్మ దేహంగా రూపుకట్టుకుంటే మనం ఆ జీవిని చూడగలం. మాట్లాడగలం, స్పృశించి ఆనందించగలం.

ఆత్మ ఆత్మలాగానే వుంటే ఇలా చెయ్యడానికి కుదరదు. మనం చేసే పూజలు, చెప్పే స్తోత్రాలు, చేసే ధ్యానాలు వాస్తవానికి ఆ నామరూపాల ద్వారా మాత్రమే నిర్గుణ తాత్వానికి చెందుతాయి. మనం చూసే దేవతా విగ్రహాలన్నీ అంతే !

లోక వ్యవహారాల్లో కూడా ఒక వ్యక్తి యొక్క నామరూపాల ద్వారానే ఆ వ్యక్తితో మనకుండే లావాదేవీలు పరిష్కరించుకుంటాం. సత్యము, ధర్మము, పితృవాక్యపరిపాలన, ఏకపత్నీవ్రతం - మొదలైన కీలక లక్షణాలన్నీ ఒక రూపం కట్టుకుని ఒక పేరుతో పిలవబడితే ఆ పేరు 'శ్రీరాము'డౌతుంది. ఆ విగ్రహం శ్రీరాముని రూపమౌతుంది. అంటే శ్రీరాముని విగ్రహం చూడంగానే ఆ లక్షణాలన్నీ గుర్తుకు రావాలన్నమాట ! విగ్రహారాధనలోని అంతరార్థం ఇదే ! (నాస్తికుడు కూడా తన భార్యాపిల్లల ఫోటోలను పర్సులో పెట్టుకుతిరుగుతాడు. ఇది కూడా విగ్రహారాధనే కదా! ఒక రాజకీయ పార్టీవాడు ఒక జెండా పెట్టుకుంటాడు. ఆ జెండాను గౌరవించడం ఆరాధించడం విగ్రహారాధన క్రిందకు రాదా ! అని విమర్శించుకుని విగ్రహారాధన అంతరార్థాన్ని గ్రహించాలి).

ప్రస్తుత శ్లోకంలో నిర్గుణుడైన శివుణ్ణి గుణమయమైన, నామరూపాత్మక మైన జ్యోతి స్వరూపంగా వర్ణించారు. ఆరూపం - "శిరస్సు పైన ఒక చంద్రరేఖను, మనోహరమైన కోమలమైన మేఘం లాంటి కంఠాన్ని కలిగి, నియంతృత్వ ఠీవితో వుండే పార్వతీపతి రూపంతో మహా తేజస్సంపన్నంగా" వుంటుందిట. ఆ తేజస్సు నందే తన హృదయం రమించి నిత్యానందము అనుభవించు గాక ! - అని అంటున్నారు శంకరులు. మనకిష్టమైతే మన హృదయాలు కూడా అలా రమించి నిత్యానందాన్ని పొందవచ్చునని సూచన చేస్తున్నారన్నమాట !

## సంస్కృత శ్లోకము - 94

శ్లో. సా రసనా తే నయనే
తావేవ కరౌ స ఏవ కృతకృత్యః ।
యా యే యౌ యో భర్గం
వదతీ క్షేతే సదాఽర్చతః స్మరతి ॥

## అనువాద పద్యము

చం॥ అనవరతమ్ము 'భర్గ' 'శివ' యంచును పల్కెడి నాల్క నాల్కగున్
అనవరతమ్ము నిర్మల శివాకృతి చూచెడి కన్ను కన్నగున్,
అనవరతమ్ము భక్తిని శివార్చన చేసెడి చేయిచేయగున్,
అనవరతమ్ముగా శివుని ధ్యానము చేసెడి వాడె ధన్యుడౌ.

## టీక

యా = ఏ నాలుక, భర్గం = పరమశివుని బోధించు 'భర్గ' శబ్దమును, వదతి = పలుకుచుండునో, యే = ఏ కన్నులు, భర్గం = శివుని, ఈక్షతే = చూచుచుండునో, యౌ = ఏ చేతులు, భర్గం = శివుని, సదా = ఎల్లప్పుడును, అర్చతః = పూజించుచుండునో, యః = ఏ భక్తుడు, భర్గం = శివుని, స్మరతి = తలంచుచుండునో, సా = అదియే, రసనా = నాలుక, తే = అవియే, నయనే = కన్నులు, తావేవ = అవియే, కరౌ = చేతులు, స ఏవ = వాడే, కృతకృత్యః = కృతార్థుడు.

## తాత్పర్యము

సదా ఈశ్వర నామ ముచ్చరించు నాలుకయే నాలుక. ఈశ్వరుని చూచుకన్నులే కన్నులు. ఈశ్వరుని పూజించు చేతులే చేతులు. ఈశ్వరుని నిరంతరం ధ్యానించు భక్తుడే భక్తుడు. అతడే ధన్యుడు.

## వివరణము

పుట్టినప్పటినుంచి మనకు నాలుక వున్నా భగవంతుడు దాన్ని ఎందుకిచ్చాడో అందుకు వినియోగపడినప్పుడే అది నిజమైన నాలుక అవుతుందట. 'భర్గ' నామాన్ని ఉచ్చరించడం ప్రారంభించినప్పటినుండి మాంసఖండంలాగావున్న నాలుక మహిమాన్వితమై సార్థకమైన నాలుక ఔతుందిట' అలాగే భర్గుని చూస్తూ వుండే కళ్ళే సార్థకమైన కళ్ళు ఔతాయిట ! చూడనంత వరకూ అవి నీలి గోళాలే ! భర్గుని పూజించటం ప్రారంభించిన తరువాత చేతులు అసలైన సార్థకమైన చేతులు అవుతాయిట ! అంతవరకు అవి వెదురు ముక్కలే. భర్గుని స్మరించే జీవుడే కృతార్థుడైన జీవిట. పోతనగారు గూడా భాగవతంలో సరిగ్గా ఇలాగే – 'కమలాక్షు నర్చించు కరములు, కరములు, – శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ' అన్నారు. అంటే – శంకరాచార్యుల వారి బాణీని పోతనామాత్యుడు అనుసరించారన్నమాట ! ఈ శివానందలహరి చదువుకోకపోతే ఈ విధంగా పోతనే మొదట చెప్పినట్లనుకుంటారు. (అయితే ఇలా చెప్పడం నచ్చి శంకరులపై గౌరవంతో సరిగ్గా అలాగే పోతనగారు కూడా వ్రాసి వుండవచ్చు – అది వేరే సంగతి). పై సీస పద్యపాదాల్లో మొదటి కరాలు వట్టి తోలు చేతులైతే, రెండో కరాలు సార్థకమైన చేతులు. అలాగే – మొదటి జిహ్వ మాంసఖండం అయితే, రెండో జిహ్వ సార్థకమైన జిహ్వ ఇలాగే ఈ పద్యంలో మిగిలినవన్నీ అర్థం చేసుకోవాలి.

శివునికి ఇతర నామాలెన్ని వున్నా 'భర్గః' అనే పదాన్ని శంకరులు ఈ శ్లోకంలో వాడడంలో కూడా ఔచిత్యం వుంది. 'భర్గః' అనే పదాన్ని భః + గః – అని విడదీస్తే, – భః – వెలుగును సూచిస్తే, గః – గమనాన్ని అంటే చైతన్యాన్ని సూచిస్తుంది. దీనిని బట్టి 'భర్గః' అంటే 'చైతన్యవంతమైన వెలుగు' లేదా 'చలించే వెలుగురూపం' అని అర్థం. 'భర్గః' అని నాలుక ఉచ్చరించినపుడు ఆ నాలుక చైతన్యవంతమైన వెలుగుతో సమన్వయాన్ని కలిగి వుండి, లోవెలుగు

ఆ నాలుక ద్వారా బయటకు వ్యక్తమౌతుంది. అలాగే - భర్గుని కళ్ళు చూస్తున్నపుడు - భర్గుని చేతులతో అర్చిస్తున్నపుడు, జీవి ఆ భర్గుని స్మరించినపుడు ఆ జీవి గూడా చైతన్యవంతమైన వెలుగు అవుతాడు - అని సమన్వయించు కోవాలి.

## సంస్కృత శ్లోకము - 95

శ్లో. అతిమృదులౌ మమ చరణా
వతి కఠినం తే మనో భవానీశ ।
ఇతి విచికిత్సాం సంత్యజ
శివ కథామాసీద్గిరౌ తథా ప్రవేశః ॥

## అనువాద పద్యము

చం॥ అతి మృదులమ్ము నా పదములట్టివి గల్గుచు నెట్లు సంచరిం
తతి కఠినంపు వీని మనసందున యంచును సంశయించుచున్
సతమతమౌట వీడు మతిసాంద్ర కఠోరతరమ్ములైన ప
ర్వతమున గౌరి చేరి యతిరమ్యముగా తమ రేల ఆడిరో ?

## టీక

శివ = ఓ మంగళ స్వరూపుడా ! భవానీపతే = ఓ పార్వతీపతీ! మమ = నా యొక్క చరణౌ = పాదములు, అతిమృదులౌ = మిగులకోమలమైనవి, తే= నీయొక్క మనః = మనస్సు, అతికఠినం = మిక్కిలి కఠినమైనది, ఇతి = అని, విచికిత్సాం = సంశయమును, సంత్యజ = విడువుము. తథా = అట్టి, గిరౌ = పర్వతము మీద, ప్రవేశః = సంచారము, కథం = ఎట్లు, ఆసీత్ = అయ్యెను ?

## తాత్పర్యము

భూత నాథా ! నీ భక్తుని మనస్సతికఠినము, కోమలమైన నా పాదములతో దానియందు సంచరించుటెట్లని సంశయ మక్కఱలేదు. ఎంతో కఠోరముగా నుండు పర్వతముమీద గౌరీసమేతులై మీరు సంచరించుటలేదా?

## వివరణము

శంకరులు శివుణ్ణి ఈ శ్లోకంలో నిలదీస్తున్నారు. నువ్వేదో నీ పాదాలు చాలా మృదువుగా వుంటాయని - నా హృదయం చాలా కఠినంగా వుంటుంది కాబట్టి అటువంటి కఠినమైన హృదయంలో విహరించడం నా వల్లకాదని ఏదో వంక చెప్పితప్పించుకునే ప్రయత్నం చెయ్యొద్దు. నా హృదయంకంటె కఠినంగాను కర్కశంగాను ఉండే పర్వతాల రాళ్ళపైన గుట్టలపైన గౌరిని వెంట వేసుకుని నువ్వు ఆ పాదాలతోనే ఉత్సాహంగా తిరిగే సంగతి నాకేమిటి లోకంలో అందరికీ తెలుసు. కాబట్టి అలాంటి సాకులు చెప్పి తప్పించుకుని నన్ను వదిలించుకోకుండా - వచ్చి నా హృదయంలో విహరించు' - అని శంకరులు కాస్త గట్టిగానే శివుణ్ణి నిలదీశారు ఈ శ్లోకంలో.

## సంస్కృత శ్లోకము - 96

శ్లో. ధైర్యాంకుశేన నిభృతం
రభసాదాకృష్య భక్తిశృంఖలయా ।
పురహర చరణాలానే
హృదయమదేభం బధాన చిద్యంత్రైః॥

## అనువాద పద్యము

గీ॥ ప్రథిత ! ధృత్యంకుశముతోడ త్వరితముగను
నా హృదయమను మదవారణమును నీవు
భక్తి శృంఖలమున నీదు పాదమనెడి
స్తంభమునకు నీ చిజ్ఞాన బంధనముల
తిరుగకుండగ కట్టుమా త్రిపురదమన !

## టీక

పురహర = త్రిపురములు జయించినవాడా ! హృదయమదేభం = (నా) మనస్సను మదపుటేనుగును, ధైర్యాంకుశేన = ధైర్యమనెడి యంకుశముతో,

రభసాత్ = వేగమువలన, ఆకృష్య = వశపఱచుకొని, భక్తిశృంఖలయా = భక్తియనుగొలుసుతో, చరణాలానే = మీపాదమను ఏనుగు కట్రాడునందు, చిద్యంత్రైః = ఈశ్వరమహిమాజ్ఞానంబు లనెడి యంత్రములతో, నిభృతం = కదలకుండ, బధాన = బంధింపుము.

## తాత్పర్యము

నా మనస్సను మదపుటేనుగును ధైర్యాంకుశమున ఒంచి నీ పాదమను కట్టుకంబము నందు భక్తియను గొలుసుతో గట్టిగా కట్టివేయుము.

## వివరణము

ముప్పతిప్పలు పెట్టే మనస్సును అదుపులో పెట్టుకోవాలంటే ఈ శ్లోకంలో ఒక ఉపాయం చెప్తున్నారు.

మనస్సును చెప్పుచేతల్లో పెట్టుకోలేకుండా వున్నాను. దాన్ని ఎదుర్కొనే ధైర్యంలేదు. ఎందుకంటే అది ఒక మద మెక్కిన ఏనుగులాగా ఇష్టం వచ్చినట్లు తిరుగుతూ నానాహంగామా చేస్తోంది. ఎలా దీన్ని వశంలో పెట్టుకోగలగడం అని గాభరాపడక్కరలేదు. మామూలు మదగజం అయితే ఏంచేస్తాం ? అది బొందలో పడటానికి అడవిలోనే ఒక పెద్ద గొయ్యి త్రవ్వి, దాని మీద పల్చని వెదురుతడికలులాంటివి వుంచి, దానిపై ఆకులు తీగలు కొమ్మలుకప్పి ఆ ఏనుగును అటువైపుగా వచ్చేట్టుగా చేసి అది గొయ్యిలో పడేట్టు చేసుకోవాలి. అటుపైన దానికి ఇనుప గొలుసులు కట్టి అంకుశంతో నియంత్రిస్తూ కదలకుండా చేసి ఒక పెద్ద చెట్టుకు కట్టి వశంలో పెట్టుకోవాలి.

మనస్సు గూడా మదపుటేనుగులాగా విషయాలు అనే అరణ్యంలో ఎప్పుడూ తిరుగుతూ ఉంటుంది కాబట్టి - దాన్ని మనం బుద్ధి అనే బోను ద్వారా ఆకర్షించాలి. భగవద్విషయాలు సంపూర్ణంగా తెలిసిన బుద్ధి అయితే మనస్సును నియంత్రించ గల ఉపాయం చెప్పకలదు. అందుకని భగవత్సంబంధ మైన జ్ఞానాన్ని బాగా పెంపొందించుకోవాలి. ఇక్కడ బుద్ధిని బోనులాగా

మనోమదగజాన్ని ఆకర్షించేలా చెయ్యాలన్నమాట ! దృఢమైన భక్తిని ఇనుప సంకెళ్ళుగా ఉపయోగించాలి. (భక్తిని బాగా పెంపొందించుకుంటే గాని సంకెళ్ళు దృఢపడవు) అప్పుడు మనోగజాన్ని నియంత్రించగలమనే ధైర్యం కలుగుతుంది. ఈ ధైర్యాన్నే అంకుశం లాగా ఉపయోగించి పూర్తిగా మనం చెప్పినట్లు వినేట్లు చేసుకోవాలి. అయినా అది తిరగబడుతూ ఉండచ్చు. అందుకని చెట్టు మ్రానులాంటి ఒక గట్టిగుంజకు దాన్నిస్థిరంగా పడివుండేట్లు కట్టాలి. పరమేశ్వరుని పాదాలనే ఆ గట్టి గుంజగా ఉపయోగిస్తే ఆ మనస్సనే మదగజాన్ని తప్పకుండా మన వశంలో పెట్టుకోవచ్చు. అందుకని పరమేశ్వరుని పాదసేవనం చేస్తూ గుంజను దృఢపరచి, మనస్సు అనే మదగజాన్ని నియంత్రించుకోవాలి. అంటే – 'ఎప్పటికైనా మనమనస్సును పరమేశ్వర పాదాలకు శరణు జొచ్చేలా చెయ్యాలి. ఆ మనస్సును చెప్పుచేతల్లో పెట్టుకోవాలంటే అదొక్కటే మార్గం' అని శంకరులు సలహా ఇస్తున్నారన్నమాట.

## సంస్కృత శ్లోకము - 97

శ్లో. ప్రచరత్యభితః ప్రగల్భవృత్త్యా
మదవానేష మనఃకరీ గరీయాన్ ।
పరిగృహ్య నయేన భక్తిరజ్జ్వా
పరమ స్థాణు పదం దృఢం నయాముమ్ ॥

## అనువాద పద్యము

సీ॥ ఈ నామానసమత్తవారణము దానిష్టమ్ముగా పోవుచున్
'నానాతిప్పలు' పెట్టుచున్ తిరుగగన్ నానాప్రదేశంబులన్
దీనిన్ గట్టుము భక్తిశృంఖలమునన్ దివ్యానుభావమ్ముతో
దానిన్ చేకొని గట్టి స్థాణుపదమందన్ జేయుమా శంకరా !

## టీక

పరమ = అపరిచ్ఛిన్న స్వరూపుడా ! మదవాన్ = మదముగలిగిన,

గరీయాన్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనఃకరీ = మనస్సను ఏనుగు ప్రగల్భవృత్త్యా = ఆపరానిగమనముతో, అభితః = అంతటను, ప్రచరతి = సంచరించుచున్నది, అముం = దీనిని, భక్తిరజ్వా = భక్తియనుత్రాడుతో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణు = స్థిరమయిన, పదం = స్థానమును, దృఢం = మరలతిరిగిరాకుండ, నయ = పొందింపుము.

## తాత్పర్యము

శంకరా ! నా మనస్సను మదగజము పట్టుటకు వీలులేక పలువంకల పరుగులెత్తుచున్నది. దీనిని భక్తియను త్రాటితో కట్టి, స్థిరమైన బ్రహ్మపదమున జేర్పుము.

## వివరణము

మనస్సును నియంత్రించుకోడానికి క్రిందటి శ్లోకంలో చెప్పిన ఉపాయాన్నే ఈ శ్లోకంలో కూడా చెప్పారు గాని – ఇక్కడ మన ప్రయత్నానికి స్వస్తి చెప్పి పూర్తిగా భగవంతునికే బాధ్యత అప్ప చెప్పమంటున్నారు.

సాధారణంగా ఒక పనిని సాధించడానికి ముందు అన్ని విధాలా మనం ప్రయత్నం చేస్తాము. అయినా అవకపోతే 'నావలన అవడం లేదు భగవంతుడా ఇంక నువ్వే నన్ను రక్షించాలి' అని పూర్తిగా శరణాగతులమవుతాము. ద్రౌపది గూడా అలాచేస్తేనే కృష్ణుడు అక్షయ వస్త్రాలను అనుగ్రహించాడు కదా ! భగవద్గీతలో కూడా కృష్ణుడు చిట్ట చివరకు చెయ్యాల్సిందేదో అర్జునునితో–

**శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః**–అన్నాడు.

అంటే – ధర్మాధర్మనిర్ణయం తనకు వదిలి, మనం చెయ్యాల్సిన పనులన్నీ చేస్తూ తనకు పూర్తిగా శరణాగతులను కమ్మన్నాడు. అలా పూర్తిగా మనం శరణాగతులమైతే, తప్పకుండా మన యోగక్షేమాల విషయం తాను

చూసుకుంటానని బాధ్యతాయుతంగా వాగ్దానం చేశాడన్నమాట.

శంకర భగవత్పాదులు కూడా చిట్టచివరకు ఇదే ఉపాయం చెప్తున్నారు. ఎందుకొచ్చిన వృథా ప్రయత్నాలు గాని, ఒక్క పని చెయ్యండి - భక్తిని దృఢపరచుకొని పూర్తిగా పరమేశ్వర పాదాలకు శరణాగతులవండి. మీ మనస్సు సంగతి ఆయన చూసుకుంటారు - అని తేల్చి చెప్పేశారు ఈ శ్లోకంలో. ఆలా అయినప్పుడే మనకు స్థిరమైన బ్రహ్మపదం దక్కేది అని కూడా సూచించారు.

## సంస్కృత శ్లోకము - 98

శ్లో. సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిః సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యామ్ ।
ఉద్యద్భూషావిశేషా ముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కల్యాణీం దేవ గౌరీప్రియ మమ కవితాకన్యకాం త్వం గృహాణ ॥

## అనువాద పద్యము

సీ॥ ఉన్నతాలంకారయుత మృదుపదములు
సాధు వృత్తములను జక్క గలిగి
సౌవర్ణమై యొప్పి సజ్జనతతిచేత
బహు విధమ్ముల మెప్పు బడయుచుండి
సరస గుణములతోసల్లక్ష్యమును గల్గి
సర్వలక్షణయుక్త సార మౌచు
ఉద్యదలంకార సద్యో విశేషమై
వినయ విధేయత విపులమౌచు

గీ॥ అర్థరేఖాయుత ముగను అలరుచుండు
సకల శుభములు గలిగిన సగుణమూర్తి
యైన నా కవితాకన్య నాదరమున
స్వీకరింపుము గౌరీశ ! శివ ! గిరీశ !

## టీక

గౌరీప్రియ = గౌరీదేవి ప్రియురాలుగాగల, దేవా = మహాదేవా! సర్వ = సమస్తమైన, అలంకార = ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగు అలంకారములతోడను (భూషణములతోడను), యుక్తాం = కూడినదియు, సరళ = మృదువైన, లేక, సుబోధమైన (మందమగు) పద = శబ్దములతో (నడకలతో), యుతాం = కూడినదియు, సాధువృత్తాం = సలక్షణమైన ఆర్యావృత్తము మొదలగువృత్తములు గలదియు (మంచినడతగలదియు), సువర్ణాం = పరుషములుగాని అక్షరములుగలదియు (చక్కనిరూపముగలదియు), సద్భిః = కావ్యలక్షణము (శరీరలక్షణము) దెలిసిన పెద్దలచేత, సంస్తూయమానాం = కొనియాడబడు చున్నదియు, సరసగుణయుతాం = శృంగారాదిరసములు మాధుర్యాదిగుణములు వీనితో గూడినదియు(భర్తకిష్టంబగు గుణములతో గూడినదియు), లక్షితాం = ప్రతిపాద్యవస్తువుగలదియు (వరింపదగినదిగా నెన్నబడినదియు), లక్షణాఢ్యాం = సర్వలక్షణముల నొప్పునదియు, ఉద్యత్ = ఎక్కువగా ప్రకాశించుచున్న, భూషావిశేషాం = అలంకారవిశేషముగలదియు (సుశీలత్వముగలదియు), ఉపగత = తెలియబడిన, వినయాం = (కవియొక్క) వినయముగలదియు (పొందబడిన నమ్రతగలదియు), ద్యోతమాన = స్పష్టముగా స్ఫురించుచున్న, అర్థరేఖాం = అర్థములపరం పరగలదియు (భాగ్యరేఖగలదియు), కల్యాణీం = అర్థపుష్టిగాభాషించునదియు నగు, మమ = నాయొక్క, కవితాకన్యకాం = కవితయనుకన్యకను, త్వం = నీవు, గృహాణ = స్వీకరింపుము.

## తాత్పర్యము

దేవా ! నాకవితాకన్య కన్యకాలక్షణముగల్గి కళ్యాణమునకు దగియున్నది. సర్వాలంకారములు, సరళపదములు, సాధువృత్తము, సువర్ణము, సరసగుణములు వేయేల సర్వలక్షణములు గలిగి ప్రకాశించుచున్న నాకవితాకన్యను పరిగ్రహింపుము.

## వివరణము

శివానందలహరిలో దాదాపు చివరి శ్లోకం ఇది. ఈశ్లోకంలో ఈ శివానందలహరి కృతిని భగవంతుడైన శివునికే అర్పించుకుంటున్నారు. సాధారణంగా కవులు తమ కావ్యాలను ఒకరికి అంకితం ఇస్తూ వుంటారు. కావ్యరచన చేసిన వారిని 'కృతికర్త' అనీ, కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నవారిని 'కృతిభర్త' అనీ అంటారు.

శంకరభగవత్పాదులు ఈ శివానందలహరి కృతిని తన కన్న కూతురితో పోల్చుకుని, శివునికి ఆ కన్యకామణిని భార్యగా సమర్పించుకుంటూ కన్యాదానం చేస్తున్నారు.

ఈ కృతి కన్య ఆకృతి చాలా బావుంటుందిట. 'ఆకృతి బాగుంటే చాలా' అని అడుగుతాడేమోనని ఆ కవితా కన్యను తను ఎలా పెంచిందీ - ఆమె ఎలాంటి సల్లక్షణాలు కలిగినదీ ఈ శ్లోకంలో చెప్తున్నారు. కన్యపరంగాను - కవితాపరంగానూ కూడా సరిపోయే విశేషణాలతో చెప్తున్నారు.

**1) సర్వాలంకార యుక్తాం -**

కన్యాపరంగా - కన్యాదానం చేసేటప్పుడు వంటి మీద నగలు (అలంకార, ఆభరణాలు) పెట్టి కన్యాదానం చెయ్యాలి. అలా చెయ్యడాన్నే 'సాలంకృత కన్యాదానం' అంటారు. అప్పుడు ఆ కన్యవంటిపై వున్న నగల్ని కాపరానికి పంపేటప్పుడు ఇచ్చి తీరాలి. అందుకనే మిగిలిన సమయాల్లో ముచ్చటకు ఆడంబరానికి ఎన్నోరకాల నగలు ఎక్కువగా పెట్టినా కన్యాదాన సమయంలో మాత్రం అవన్నీతీసి తాము ముందు కాపరానికి పంపేటప్పుడు ఇచ్చి పంపబోయే నగలే వుంచుతారు. మొగపెళ్ళివారి తాలూకు ఆడవాళ్ళు ఈ విషయంలో చాలా గుర్తుపెట్టుకునే ధోరణిలో వ్యవహరిస్తారు గూడా ! కాబట్టి 'సర్వాలంకార యుక్తాం' అంటే - అన్ని రకాల అలంకారాలు ఆభరణాలతోను ఉన్నది' అని అర్థం.

కవితాపరంగా అయితే - కవిత్వంలో విషయాన్ని చిత్రంగా చెబుతారు. ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, రూపకము మొదలైన అలంకారాలతో చెప్తారు. కాబట్టి 'ఈ కవిత అటువంటి అలంకారాలతో వున్నది' అని అర్థం.

**2. సరళపదయుతాం -**

కన్యాపరంగా -ఈ కన్యపాదాలు చిగురుటాకుల్లాగా - మెత్తగా, కోమలంగా వుంటాయి. ఆ పాదాలలో ఆమె నడక, నడతగూడా చాలా ఆహ్లాదకరంగా చూడముచ్చటగాను, తిన్నగాను వుంటుంది - అని అర్థం. కవితాపరంగా - కవిత్వంలో వాడే పదాల (మాటలు) వాక్యాలు మొదలైనవి చాలా తేలిగ్గా, చదువుతోంటే ఆనందాన్ని కలుగచేసే శబ్దాలనిచ్చేవిగా వుంటాయి అని అర్థం.

**3. సాధువృత్తాం -**

కన్యాపరంగా - ఈ కన్య చాలా సాధువైంది. మెత్తని సాత్త్విక స్వభావం కలది. ప్రవర్తన వంక పెట్టలేనిది. కోణాలుతేరిన శరీర ఆకారం కాకుండా గుండ్రంగా వంపులు తిరిగే శరీర ఆకార నిర్మాణం కలిగి వున్నది - అని అర్థం.

కవితా పరంగా - కవిత్వాన్ని తెలుగులోఅయితే పద్యాలలోను, సంస్కృతంలోఅయితే శ్లోకాలలోను వ్రాస్తారు. అవి తెలుగులోఅయితే చంపకమాల, ఉత్పలమాల, మత్తేభము. శార్దూలము మొదలైన పద్యాల్లోను - సంస్కృతంలో అయితే శిఖరిణీ, మందాక్రాంతం, శార్దూలం, ఆర్యా మొదలైన శ్లోకాల్లోనూ, వ్రాస్తారు. ఇవన్నీ వేరు వేరు ఛందస్సులలో ఉంటాయి. అందువల్ల ఒక్కొక్క పద్యం గాని, శ్లోకం గాని చదువుతున్నపుడు ఒక్కొక్కరకమైన నడకను (బాణీని) గలిగి వుంటుంది. ఆ బాణీ తీరు చాలా మనోహరంగా వుంటుంది అని అర్థం. ఈశివానందలహరిలో అన్ని రకాల ఛందస్సులు కలిగిన శ్లోకాలు ఉన్నాయి - అని కూడా అర్థం (సౌందర్యలహరిలో అన్నీ శిఖరిణీ వృత్తాల శ్లోకాలే).

**4. సువర్ణాం -**

కన్యాపరంగా - ఈ కన్య వంటిరంగు (లేదా వన్నె) పసిమి. అంటే తప్త కాంచన వర్ణం లేదా దబ్బపండు రంగు కాంతులు విరజిమ్ముతూ చాలా ఆకర్షణీయంగా, ఆదరణీయంగా వుంటుంది. ఉత్తమ వర్ణంలో జన్మించింది కూడా ! - అని అర్థం.

కవితాపరంగా - ఈ కవిత్వంలో వాడిన అక్షర సముదాయమంతా శుభాన్ని సూచించే విధంగానే సందర్భించబడి (రచింపబడి లేదా కూర్చబడి) ఉంటుంది ఎక్కడా వ్యర్థాక్షరం, అశుభసూచకమైన అక్షరం అట్లాంటి అక్షరాలతో విదర్భం చేయబడే రచన (దుష్ట ఉద్దేశ్యంతో వ్రాయబడింది) కాదు అని అర్థం.

**5. సద్భిః సంస్తూయమానం -**

కన్యాపరంగా - సాముద్రిక శాస్త్రవేత్తలు, సౌందర్య, సౌశీల్య విజ్ఞత కలిగిన వారి చేత చక్కగా కొనియాడబడినది - అని అర్థం.

కవితాపరంగా - పండితుల చేత, విమర్శకుల చేత చక్కగా ప్రశంసించ బడినది అని అర్థం.

**6. సరసగుణయుతాం -**

కన్యాపరంగా - సమయసందర్భాలు తెలుసుకుని అందుకుతగ్గట్టుగా సరస సల్లాపాలతో, ప్రణయ కోపాలతో, గారాముగా, మనస్సుకు హత్తుకు పోయే విధంగా విజ్ఞతతోమసలుకునే సరసురాలు, సుగుణాల రాశి - అని అర్థం.

కవితాపరంగా - ఈ కవిత శృంగారాది నవరసాలతో హృదయాన్ని ద్రవింపచేసే విధంగా సరసంగా వుంటుందని, కావ్యం నిండా మాధుర్యాది గుణాలుంటాయని అర్థం.

**7. లక్షితాం -**

కన్యాపరంగా - సాముద్రిక శాస్త్రానికి సరిపోయేవిధమైన మంచి లక్షణాలు కలది - అని అర్థం.

కవితాపరంగా - మంచి కావ్యలక్షణాలు, (శిల్పము, అర్థము, శబ్దము, శైలి మొదలైనవి) కలది అని అర్థం.

**8. లక్షణాఢ్యాం -**

కన్యాపరంగా - సల్లక్షణాలుకలవారు ఎంచుకునే విధంగా ఉండేది - అని అర్థం.

కవితాపరంగా - దీనిలో చక్కని విషయాలు ప్రతిపాదింపబడ్డాయి, ఈ కావ్యం చదివి తీరాలి అని సత్కవులు, పండితులు ఒక - లక్ష్యాన్ని పెట్టుకునే విధంగా వ్రాయబడింది - అని అర్థం.

**9. ఉద్యద్భూషా విశేషాం -**

కన్యాపరంగా - చూడంగానే మంచి పవిత్రమైన భావాలు కలిగే విధంగాను - ఆదరంగా ఉండే అలంకారాల శోభను కలిగినది - అని అర్థం.

కవితాపరంగా - కావ్యం చదువుతున్న కొలదీ క్రొత్త క్రొత్త భావాలు, అర్థాలు ద్యోతకమయేవిశేషమైన అలంకారాల శోభతో వుండేది - అని అర్థం.

**10. ఉపగత వినయాం -**

కన్యాపరంగా - ఎంతో కష్టపడి విశ్లేషించి విమర్శించి నిర్ణయం తీసుకోవాల్సిన అవసరం లేకుండా - చూడంగానే చాలా వినయ విధేయతా సంపన్నురాలు - అని తెలిసే విధంగా వుండేది.

కవితాపరంగా - ఎవర్నీ విమర్శించకుండా, చదవంగానే, ఎవరి హృదయానికీ బాధ కలగని రీతిలో, ఆలోచించకుండా వెంటనే ఆస్వాదించడానికి వీలుగా ఉండేది అని అర్థం.

**11. ద్యోతమానార్థ రేఖాం -**

కన్యాపరంగా - హస్తాల్లోనూ, అరికాళ్ళలోను సుస్పష్టంగా కనబడే భాగ్యరేఖా చిహ్నాలు కలిగినది - అని అర్థం. (ఈ కన్యను పెళ్ళి చేసుకుంటే నీకు బాగా కలిసి వస్తుంది అని అర్థం)

కవితాపరంగా - కావ్యంలో వాడిన పదాలకు చాలా ప్రముఖమైన అర్థాలు - అంతరార్థాలు కలిగే విధంగా వ్రాయబడింది - అని అర్థం.

**12. కళ్యాణీ -**

కన్యాపరంగా - మీ ఇంటికి రాంగానే మీకూ, మీ కుటుంబ సభ్యులందరికి శుభపరంపరలు చేకూర్చేది అని అర్థం.

కవితాపరంగా - ఈ కావ్యం శుభాన్ని చేకూర్చి, జీవితాలను చక్కదిద్ది, మోక్షాన్ని కూడా కలుగజేసే విధంగా వ్రాయబడినది - అని అర్థం.

ఇటువంటి ద్వాదశ సద్గుణ సంశోభిత అయిన నా కవితాకన్యను నీకు పాణిగ్రహణార్థం సమర్పించుకుంటున్నాను. నాపై దయతో నువ్వు అంగీకరించి ఈ కావ్యానికి కృతి భర్తగా నన్ను కృతార్థుణ్ణి చెయ్యి - అని శంకర భగవత్పాదులు శివుణ్ణి ప్రార్థించారు.

**సంస్కృత శ్లోకము - 99**

శ్లో. ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్యజలధే
గతౌ తిర్యగ్రూపం తవ పదశిరోదర్శనధియా ।
హరిబ్రహ్మాణౌ తౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామిన్కథయ మమ వేద్యోఽసి పురతః ॥

**అనువాద పద్యము**

సీ॥ భవదీయ పద శిరోభాగమ్ములను జూడ
దలచి తిర్యగ్రూపములను గల్గి
వాసుదేవుందును బ్రహ్మదేవుందును
క్ష్మాంబరములలోన సంచరించి
సతతమ్ము శ్రమబొంది సతమతమై తాము
పాటు పడిన గూడ ఫలములేదు

హే శివా !పరమేశ ! హేదయాసముద్ర !
స్వామి ! శంభో ! విభో ! సాంబమూర్తి !
గే॥ ఆవిధమ్ముగ జేయంగ న్యాయమగునె
హరివిధాతల కందని పరమశివుడ !
నేను చూడంగ నర్హుడనైన విధము
విశదపరచుము దయతోడ విపులముగను.

## టీక

పరమశివ = సకలదేవతా సార్వభౌముడైన శివా ! కారుణ్యజలధే = కరుణాసముద్రుడా ! తవ = నీయొక్క పదశిరోదర్శనధియా = పాదములను, శిరస్సునుగనుగొననలయునను బుద్ధితో, తిర్య గ్రూపం = తిర్యగ్జంతువు (పంది, హంస) ల రూపమును, గతౌ = పొందిన, తౌ = ఆ, హరి బ్రహ్మాణౌ = విష్ణుమూర్తియు, బ్రహ్మదేవుడును, దివి = ఆకాశమందును, భువి = భూమియందును, చరంతౌ = సంచరించుచున్న వారలై, శ్రమయుతౌ = ఆయాసముతో గూడినవారలు, (స్యాతాం = అయిరి.) శంభో = సుఖప్రదుడా! స్వామిన్ = సర్వలోకాధినాథా ! మమ = నాయొక్క పురతః = ముందరను, వేద్యః = కనుగొనదగినవాడవు, కథం = ఎట్లుగా, అసి = అగుదువు? కథయ = చెప్పుము. ఇదం = ఇది, తే = నీకు, యుక్తంవా = తగునా ?

## తాత్పర్యము

మీ పాద దర్శనమునకై వరాహరూపము తాల్చి శ్రీహరియు, శిరోదర్శనమునకై హంసరూపము దాల్చి బ్రహ్మయు భూమ్యంతరిక్షములం దంతట తిరిగి ఫలము నందలేకపోయిరి. ఇప్పుడు నాయెదుట ప్రసన్నులై నాకెట్లు తెలియనగుదురో సెలవిండు.

## వివరణము

ఈ శ్లోకంలో శివుణ్ణి 'పరమశివ'! అని 'కారుణ్యజలధే' – అని రెండు

విశేషణాలతో సంబోధించారు. హరిబ్రహ్మలకు సైతం ఎంత శ్రమపడినా దర్శన మివ్వని శివుడు తనకు ఎదురుగా ప్రత్యక్షమైనందుకు, 'శివ' అని గూడా కాకుండా 'పరమశివ' (శివతరాయచ - నమకమ్) అనీ, 'కరుణ కలిగినవాడా!' అని కాకుండా 'కరుణాసముద్రుడా' అనీ సంబోధించారు. ఈ సంబోధనలు ఆయన పొందిన ఆనందాన్ని, సంతృప్తినీ, పారవశ్యాన్ని తెలియజేస్తాయి. అంటే, శివానందలహరి పూర్తి అవడానికి ఒక శ్లోకం ముందుగానే ఆయనకు శివదర్శనం జరిగిందన్న మాట ! ఇదీ ఈ శివానందలహరి రిస్తోత్రమాహాత్మ్యం. రచించిన వారికేకాదు చదివిన వారికి, విన్నవారికి, చెప్పిన వారికి గూడా ఈ ఫలం దక్కుతుంది. దీన్నే 'సద్యఃఫలం' అంటారు. అమ్మవారికి కూడా వ్యాసులవారు శ్రీలలితాసహస్ర నామ స్తోత్రంలో 'క్షిప్రప్రసాదినీ' అనే నామం చెప్పారు. అంటే - ఈ ఆది దంపతులు ఇద్దరూ అలాంటి వారే అని అర్థం.

శివుని పాదాలను చూడ్డానికి హరి వరాహరూపమెత్తి పాతాళందాకా కూడ చొచ్చుకుంటూ వెళ్ళాడు. అయినా ఫలితం దక్కలేదు. అలాగే బ్రహ్మగూడా శివుని శిరస్సును చూడ్డానికి హంసరూపం ఎత్తి ఆకాశం అంతా గాలించినా ఫలితం దక్కలేదు. 'వ్రతం చెడ్డా ఫలం దక్కనట్లు - లక్ష్యాన్ని సాధించడం కోసం హరిబ్రహ్మలిద్దరూ తిర్యగ్జంతురూపాలను ధరించడానికి కూడా వెనుకాడకపోయినప్పటికీ, అలసట, శ్రమే తప్ప దర్శనం దక్కలేదు. కాని, ఇక్కడే కదలకుండా వుండి, నీ పద ధ్యానం చేస్తున్న నాకు- దర్శన మిచ్చే వాడవు ఎలా అవుతున్నావో నాకు అర్థం కావడం లేదు. దీన్ని నా యోగ్యత అనుకోను. కేవలం నా మీద వుండే నీ వాత్సల్యం మాత్రమే ! పెద్ద మహర్షులకు బ్రహ్మాదులకు చిక్కని కృష్ణుడు యశోదకు చిక్కలేదా, ఉన్నతాధికారులు, పెద్దవారి పట్ల కంటె కూడా నీకు నీ భక్తులయందే మక్కువ ఎక్కువ. నీవు శంకరుడవే కాదు. (శంకర) భక్తవశంకరుడవు - అని శివుణ్ణి ప్రస్తుతించారు (ఈ 'భక్తవశంకర' సంబోధనలో సాయుజ్యముక్తి సూత్రప్రాయంగా సూచింపబడింది.)

## సంస్కృత శ్లోకము - 100

శ్లో. స్తోత్రేణాలమహం ప్రవచ్మి న మృషా దేవా విరించాదయః
స్తుత్యానాం గణనాప్రసంగసమయే త్వామగ్రగణ్యం విదుః ।
మాహాత్మ్యా గ్రవిచారణప్రకరణే ధానాతుష స్తోమవ
ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలం శంభో భవత్సేవకాః ॥

## అనువాద పద్యము

సీ॥ భవదీయభక్తులౌ బ్రహ్మ సురాదులు
స్తోత్రార్హులను లెక్క చూచువేళ
శంభో !మహాదేవ ! శంకరా ! శివ ! విభో !
ప్రథమునిగన్ నిన్నె వలచినారు
సారమ్మునంత తూర్పారబెట్టు సరణి
సామర్థ్యమాహాత్మ్య చర్చవేళ
గట్టితనములేని పొట్టుబోయెడు భంగి
తాము చెదిరిపోయి స్వామి నిన్నె

గీ॥ ఉత్తమోత్తమ గుణముతో యుక్తమైన
ధాన్యఫలముగ తెలిసిరి దర్శనమున
వట్టి స్తోత్రమ్ము లివి గావు పార్వతీశ !
చెప్పనన్నృతమ్ము నీ యొక్క గొప్ప కొఱకు.

## టీక

శంభో = సుఖకారణమైనవాడా! భవత్సేవకాః = నీభక్తులయిన, విరించాదయః = బ్రహ్మాదులగు, దేవాః = దేవతలు, స్తుత్యానాం = స్తుతింపదగిన వాలరయొక్క, గణనాప్రసంగసమయే = లెక్క నుగుణించిచర్చించునప్పుడు, త్వాం = నిన్ను, అగ్రగణ్యం = మొదటగణింపదగినవానిగా, విదుః = తెలిసి కొనుచున్నారు. మాహాత్మ్య = సృష్టిస్థితిలయసామర్థ్యమునుగూర్చిన, అగ్రవిచారణ

= మొదటిచర్చను, ప్రకరణే = చేయునప్పుడును, ధానాతుషస్తోమవత్ = సారములేని ధాన్యమునందలిపొట్టంతయుంబోలె, ధూతాః = కదలిపోయిన వారలై, త్వాం = నిన్ను, ఉత్తమోత్తమఫలం = మిగుల సారమైన ధాన్యముగా, విదుః = తెలిసికొనుచున్నారు. స్తోత్రేణ = స్తుతిచేత, అలం = చాలును, అహం = నేను, మృషా = అసత్యము, నప్రవచ్మి = చెప్పను.

## తాత్పర్యము

దేవా ! బ్రహ్మాదులగు ముప్పది మూడు కోట్ల దేవతలును స్తోత్రార్హులను లెక్కించునప్పుడు నిన్ను మొట్టమొదటివానినిగా లెక్కించుచున్నారు. సృష్టిస్థితి లయరూపమైన మాహాత్మ్యమును గుఱించి చర్చించునప్పుడు ధాన్యపురాశి యెగురబట్టునపుడు పొట్టు అంతయు దూరముగా పోవునట్లు తామందఱు దూరమైపోయి సారమైన ధాన్యమువలె నిన్నుత్తమోత్తమునిగా గనుగొనుచున్నారు. ఇది వట్టి స్తుతిపాఠము గాదు. నేను చెప్పినదంతయు నిజముగా యిసుమంతయు నసత్యము గాదు.

## వివరణము

ఈ చివరి శ్లోకంలో ఒక విషయాన్ని నిర్ధారించి చెప్పడం జరిగింది. లోకంలో పూజించతగినవారెవరని లెక్కించే ప్రస్తావన వచ్చినపుడు- బ్రహ్మాదిదేవతలు శివునికి అగ్రస్థానమిచ్చి, అగ్రతాంబూలం ఇవ్వాలనే నిర్ణయానికి వచ్చారుట. మహాత్మ్యమును గురించి చర్చకు వచ్చినపుడు గూడా అలాగే నిర్ణయించాల్సి వచ్చిందిట. వాళ్ళు ధాన్యాన్ని తూర్పారపెడుతున్నపుడు - తాలు, తప్ప, పొల్లులాగా మిగతాదేవతలందరూ కొట్టుకుపోయార్ట. శివుడొక్కడే నికరంగా అసలైన నిండు ధాన్యం లాగా నిలబడ్డాడుట. అందువల్లనే శివుణ్ణి బ్రహ్మాది దేవతలందరూ ఉత్తమోత్తమునిగా నిర్ణయించారు. 'ఇలా నేను చెప్పడం నిన్ను పొగిడేందుకు కాదు. నే చెప్పేదంతా పచ్చి నిజం. దీంట్లో ఇసుమంత కూడా అసత్యం లేదు - అని ఈ శివానందలహరి స్తోత్రాన్ని ముగించారు.

పోతన గారు కూడా 'చేతులారంగ శివుని పూజించడేని నోరు నొవ్వంగహరి కీర్తినుడువడేని ..... కలుగనేటికి తల్లుల కడుపుచేటు' – అన్నారు.

హరికీర్తనం, హరపూజనం తప్పకుండా దురితాలను దూరం చేస్తాయి. సుకృతాలను ఫలింపచేస్తాయి – అని తెలుసుకుని – హరి హర భేదం చూడకుండా మన కీర్తన, అర్చన కొనసాగాలి. అవే మనకు భక్తిని, ముక్తిని కలుగచేస్తాయి. శుభాన్ని కలుగచేసి ఆయుష్షును పెంచుతాయి. అందుకే సంధ్యావందనంలో గూడా –

**'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే**
**శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః**
**యథాశివమయోవిష్ణు : ఏవం విష్ణుమయశ్శివః**
**యథాంతరం నపశ్యామి తథామే స్వస్తిరాయుషి'**

అని చెప్పడం జరిగిందని గుర్తు పెట్టుకోవాలి. 'పంచాయతనపూజ' అంటే – 'శివవిష్ణు రవి గణేశాంబిక'లను పూజిస్తే మరీ మంచిది. శంకరులు కూడా ఈ పద్ధతిని ప్రవేశపెట్టి తప్పుత్రోవలు, వెఱ్ఱిత్రోవలు పడుతున్న హిందూ జాతిని ఒక త్రాటి మీద నిలిపారు. మేధస్సులో శంకరాచార్యుల వారిని మించినవారు ఇంతవరకు పుట్టలేదు. ముందు పుట్టరు కూడా ! కాబట్టి, అట్టి మేధా సంపన్నులను ఆశ్రయించి, వారి మాటలను విశ్వసించి, అనుసరించి, ఆచరించి తరిద్దాం !!

శివార్పణమస్తు

'సమస్త సన్మంగళాని భవంతు'.

# అకారాది శ్లోక సంఖ్యాను క్రమణిక